# ఇంటా బయటా

## రవీంద్రనాథ ఠాకూర్






అనువాదకులు

శోభనాదేవి

వైకుంఠరావు

విశ్వభారతి పజనీ

చెన్నపురి

# ఇంటా బయటా

## విమల చెప్పిన కథ

మా అమ్మ ముఖాన ఉండే కుంకం బొట్టూ, ఆమె కట్టుకుంటూ ఉండే పేరంచు చీరా, నిండు ప్రేమతో నావైపు చూస్తూ ఉండే ఆమె కళ్లూ, ఈ వాళ నాకు జ్ఞప్తికి వస్తూ ఉన్నవి. ఇవన్నీ నాకు ప్రాతఃకాలపు అరుణరేఖ వంటివి. నా జీవన యాత్ర ప్రారంభం అవుతూ ఉంటే నాకు తోడుగా ఉండామని నాతో కలిసి బయలుదేరినట్టున్నవి. కాని మధ్య దారిలో జరిగిన దేమిటి? కారుమబ్బు అన్ని వైపులా కమ్మి ఒక్క పిసరైనా వెలుతురు లేకుండా చేసిందా ఏమిటి? చేయలేదు! ఆ వెలుతురు ఉషాదేవి ఒక పుణ్యముహూర్తాన నాకు చేసిన దానము. దురదృష్టంవల్ల అది ఒకప్పుడు కనబడక పోవచ్చును గాని ఎన్నటికీ అది నాకు లేకుండా ఎవరు చేయగలరు?

అందంగా ఉండటం అంటే తెల్లగా ఉండటం అని మన దేశస్థుల అభిప్రాయం, గాని మనకు వెలుతురు నిచ్చే ఆకాశానికి మాత్రం నీలివర్ణం. మా అమ్మది కూడా ఆ వర్ణమే. ఆమె ముఖంలో ఒక మోస్తరు పుణ్యదీప్తి ఉండేది; రూపవతులమని గర్వపడుతూ ఉండేవాళ్లందరికీ సిగ్గుపుట్టేది మా అమ్మనుచూస్తే, అటువంటిది అందం ఆమెది!

తర్కంచేసి ఏపనీ చేయదు; మంచిదా చెడ్డదా అని ఆలోచించి పనిచేయదు. అది కేవలం సంగీతంవంటిది. ఆ సంగీతం నాలో కూడా లేదూ? నిశ్చయంగా ఉన్నది. జీవితమంతా ఒకస్తోత్రగానంగా చేసి ఈశ్వరుని ముందర పాడడం అనే దానికి ఏమైనా విలువ ఉంటే నాజీవితం సార్థకం కాకపోదు. ఆ స్తోత్రగానం నాలో ప్రారంభం అయిందనే లెక్కవేసుకో వచ్చును.

ప్రొద్దున్నే లేచి అతి జాగ్రత్తగా వెళ్లి నాభర్త పాద ధూళి* తీసి కళ్లను అద్దుకొనే దానను. అటువంటప్పుడు నా కుంకంబొట్టు నక్షత్రంలాగు మెరుస్తుఉండేది అని నాకు అనిపించేది. నేను ఆలాగు చేస్తూ ఉన్నప్పుడు ఒకనాడు ఆయనకు హఠాత్తుగా తెలివివచ్చి లేచి కూర్చొని నవ్వుతూ అన్నారు—" "ఏమిటది విమలా, ఏమిటి చేస్తున్నావు?" నాకు ఆవాళ వేసిన సిగ్గు ఎన్నటికీ మరిచిపోను. దొంగతనంగా పుణ్యం సంపాదించడానికి ప్రయత్నం చేస్తున్నానని కాబోలు ఆయన అనుకున్నారు. కాని పుణ్యానికీ దానికీ సంబంధం లేదు. అది నా నారీహృదయము. పూజే దాని ధర్మము, దాని ఆనందము, దాని ప్రేమ.

మా అత్త వారింటివిఅన్నీ పూర్వాచారాలు. వాళ్ల లాంఛనాలు కొన్ని మొగలాయీలనాటివి. వాళ్ల ఆచా-

*పెద్దవాళ్ల పాదధూళి తీసుకోవడం బంగాళా దేశంలో సర్వసాధారణంగా అందరూ చేస్తారు.

శాలు మనువూ పరాశరుడూ చెప్పినవి. నాభర్తవి మాత్రము అన్నీ పూర్తిగా కొత్త పద్ధతులు. పద్ధతి ప్రకారం చదివి పరీక్ష ప్యాసుకావడం ఇంతకు ముందు ఆఇంట్లో ఎప్పుడూ జరగ లేదు. ఆయన ఎమ్. ఏ. కూడా ప్యాసు అయినారు. ఆయన ఇద్దరు అన్నలూ తాగుడువల్ల చిన్నవయస్సులోనే చనిపోయి-నారు. వాళ్లకు పిల్లలెవరూ లేరు. నాభర్తకు తాగుడు గాని మరే వ్యసనంగాని లేదు. వాళ్ల వంశంలో ఇటువంటి నియ-మము ఎక్కడా లేకపోవడంచేత ఆయన మోస్తరు ఎవరికీ నచ్చింది కాదు. నిష్కళంకంగా ఉండడం డబ్బులేనివాళ్లకు అందం. కళంకానికి ప్రశస్తమైన స్థలం నక్షత్రాలలో దొరకదు, చంద్రుడిలో ఉంటుంది.

మా అత్తమామలు చనిపోయి చాలా కాలం అయింది. మా మామగారి తల్లి ఆ ఇంటికి పెద్ద. ఈయనంటే నాయనమ్మ గారికి ప్రాణం. అందుచేతనే ఆచారాలకు విరుద్ధంగా ఈయన నడవగలిగేవారు. నాకు చదువు చెపుతూ ఎప్పుడూ నాకు జట్టుగా ఉండడానికి మిస్ గిల్బీని కుదిర్చినప్పుడు ఇంట గాని బయట గాని తిట్టని నోరు లేదు. ఎంతయినా, నాయనమ్మగారికి ముద్దు గనుక, ఈయన పట్టినపట్టు వదలకుండా కూర్చో గలి-గారు.

ఆ రోజులలో ఈయన బి. ఏ. ప్యాసయి ఎమ్. ఏ. చదువుతుండే వారు. కాలేజీలో చదవడానికి కలకత్తాలో

ఉండవలసి వచ్చింది. ఎప్పుడో తప్ప, రోజుకు ఒక్కొక్క ఉత్తరం వ్రాస్తు ఉండేవారు. ఉత్తరాలలో ఉండేమాటలు చాలా తక్కువ, అవైనా మామూలు మాటలే; గాని ఆ గుండ్రని పెద్దపెద్ద అక్షరాలు అతి ప్రేమతో నా వైపు చూస్తున్నవా అనిపించేది.

ఆ ఉత్తరాలన్నీ ఒక చందనంపెట్టెలో పెట్టి పూలతోటలోనుంచి పువ్వులు తెచ్చి, ఆ పెట్టె నింపుతూ ఉండేదానను. అరుణరాగంలో చంద్రుడు అదృశ్యంఅయిపోయినట్టు, అప్పుడు నా చిన్ననాటి కథలలోని రాజపుత్రుడు అదృశ్యం అయిపోయినాడు. వాస్తవమయిన రాజపుత్రుడు ఆనాడు వచ్చి నా హృదయ సింహాసనంమీద కూర్చున్నాడు. నేను ఆయన రాణిని, చివరకు ఆయన దగ్గిర నేను కూర్చోగలిగాను. అంతకంటే సంతోషానికి కారణం మరి ఒకటున్నది. అదేమిటి అంటే, ఆయన పాదాల దగ్గిర నాకు నా యథార్థ స్థానం దొరకడం.

నేను ఇంగ్లీషు చదువుకోవడంచేత ఈ కాలపు సంఘంతో సంబంధం ఏర్పడ్డది, ఈ కాలపు భాష అలవాటు అయిపోయింది అప్పటి స్థితి ఈ కొత్త మాటలతో వ్రాస్తూ ఉంటే నామట్టుకునాకే కల్పితం అనిపిస్తూ ఉంది. నేను ఈ కొత్త పద్ధతులకు అలవాటు పడకపోతే అప్పుడు నాకుండే భావాలు ఏవీ కవిత్వం అనిపించకపోను—నేను వ్రాసేది పద్యము కాకపోను, గద్యే అవును. స్త్రీనై పుట్టడం ఏలాగునైతే నా

చేతిలోని పని కాదో, అలాగునే స్త్రీనైన తరువాత ప్రేమనూ భక్తినీ కలిపి ఒకటిగా చేయకుండా ఉండడం నాకు చేతనైన పని కాదు. అలాగు చేయడమే ఆడవాళ్లకు సహజం— అందులో అతిశయోక్తీ కావ్యసౌందర్యమూ ఏమైనా ఉన్నవా లేవా అని ఆలోచించ నవసరం లేదు.

కాని బాల్యంలోనుంచి యౌవనంలోకి వచ్చీరాక ముందే కొత్త యుగంలో వచ్చి పడ్డాను. నిశ్వాసమంత సులభంగా చేయవలసిన విషయంలోకూడా ఈరోజులలో గొప్ప ఉపదేశాలు కావలసివస్తూ ఉన్నవి. వితంతువుల బ్రహ్మచర్యాన్నీ, స్త్రీల పాతివ్రత్యాన్నీ పొగుడుతూ, పద్యాలూ, పాటలూ పాడుతూ, దీక్షలు తీసుకొని ఉపదేశాలు ఇచ్చేవాళ్లు ఈ నాటి పురుషులలో చాలామంది ఉన్నారు. దీనిని బట్టి, మన జీవితంలో సత్యానికీ సౌందర్యానికీ ఎటువంటి ఎడబాటు కలిగిందో బోధ పడుతుంది. సుందరమయినది అని దేనినైనా పట్టుకొని కూర్చోవడంవల్ల ఒకప్పుడు దానిలో ఉండే సత్యం తిరిగి దానిలోకి తీసుకు రాగలమూ? ఆడవాళ్ల మనస్సులన్నీ ఒక్క అచ్చులో పోసినవని నేను అనుకో లేదు, గాని మా అమ్మలో ఉండేది భక్తిఅంటే ఉత్సాహం—అది నాలో కూడా ఉండేది అని మాత్రం నేను నమ్మే దానను. అదే నాకు సహజమయినది ఆ సంగతి ఇప్పుడు స్పష్టంగా బోధపడుతూ ఉన్నది. అది పైనుంచి వచ్చినది కాదు, పైనుంచి వచ్చినది సహజం కానేరదు కదా!

అయితే, తనను పూజచేయడానికి నాకు అవకాశం ఇచ్చేవారు కారు ఆయన. అదే అతనిలో ఉండే గొప్ప. అర్థ పిశాచులైన పండాలు పూజకోసమని మనను పీడిస్తారు. వాళ్లు పూజకు అర్హులు కాకపోవడం ఒక్కటే దీనికి కారణం. ఈ లోకంలో తుచ్ఛులైన పురుషులే, స్త్రీల పూజను తమకుండే హక్కులలో ఒకహక్కుగా కోరుతారు. దానివల్ల పూజచేసిన వాళ్లకు గౌరవమా, పూజ అందుకున్న వాళ్లకు గౌరవమా?

అయినా, అంత సేవ నేనంటే! నౌకర్లూ, దాసీలూ, బట్టలూ, ఆభరణాలూ, ఇంకేవో లెక్కలేని వస్తువులూ ఇచ్చి ఆయన ప్రేమ, గట్లుకొట్టి పారుతున్న ఒక గొప్ప ప్రవాహంలాగు నావైపు వచ్చింది. ఆయనముందర ఆత్మసమర్పణ చేసుకుందామన్నా ఇవన్నీ ఏమైనా ఎడం ఇస్తేనా? పుచ్చుకోవడానికి అవకాశం కంటే ఇవ్వడానికి అవకాశం నాకు మిక్కిలి అవసరమయినది. ప్రేమ బైరాగి వంటిది. రోడ్డు పక్కనున్న మట్టి జాగాలో తనపువ్వులను కోటానుకోట్లు విసర్జిస్తుంటుంది, డ్రాయింగురూములలోని పూలదానలలో తన ఐశ్వర్యాన్ని పైకి రానివ్వదు.

మా అత్తవారింటి పాత పద్ధతులు నా పెనిమిటి పూర్తిగా తోసిపారేయలేకపోయినారు. రోజూ మధ్యాహ్నం, ఎప్పుడుపడితేఅప్పుడు, ఏమీ అడ్డు లేకుండా, మేము కలుసుకోవడానికి వీలు అయేది కాదు. ఆయన లోపలికి వచ్చే

వేళ. నాకు సరిగా తెలుసును, ముందు అనుకోకుండా గడిబిడ గడిబిడగా కలుసుకోవడం ఎప్పుడూ అయేది కాదు. ఛందస్సూ, యతిప్రాసల ద్వారా పద్యంలోని భావం ఏవిధంగా నడుస్తూ ఉంటుందో, ఆవిధంగా, అన్ని నియమాల ద్వారా మేము కలుసుకోవడం జరిగేది. ఇంటి పనులన్నీ తెమిలిన తరువాత స్నానంచేసి జాగ్రత్తగా సిగవేసుకొని, బొట్టుపెట్టుకొని, చీర కట్టుకొని, నాలుగు వైపులా చెదిరి ఉన్న మనస్సును, ఆయన వచ్చేవేళకు, కూడదీసి ఒక బంగారు పళ్లెంలో పెట్టి అతిశ్రద్ధతో నివేదన చేసేదానను. దొరికిన వేళ అతి స్వల్పం గాని ఆ స్వల్పమే అనంతం అనిపించేది.

స్త్రీపురుషులకు ఒకరిమీద ఒకరికి ఉండే అధికారం సమానం. అందుచేతనే ప్రేమ విషయంలో కూడా ఇద్దరూ సమానులే అని నాభర్త అంటూఉండేవారు. దీని గురించి నేను ఎన్నడూ ఆయనతో వాదించ దలచుకో లేదు, గాని భక్తివల్ల సమానత్వానికి భంగం కలగదని మాత్రం నాకు నమ్మకం ఉండేది. భక్తి మనను మీదికి తీసుకొనివెళ్లి మరీ సమానం చేస్తుంది. అందుచేత ఆ ఆనందం శాశ్వతంగా ఉంటుంది, రెండు రోజులలో నిస్సారమైన వస్తువు అయిపోదు. భక్తి చేసే పూజ హారతి వంటిది. ఆ కాంతి మనము పూజచేసేవారిమీద పడ్డట్టే పూజచేసే మనమీదకూడా పడుతుంది. స్త్రీల ప్రేమ పూజ చేయడంవల్లనే పూజింపదగినది అవుతుందని ఇప్పుడు నాకు స్పష్టంగా తెలుస్తూఉంది.

నా ప్రియతముడు నాపూజ కోరకపోవడం చాలా గొప్ప సంగతి, గాని ఆయన పూజ అంగీకరించి ఉంటేనే నాకు మేలు అవును. ఆయన నన్ను ముస్తాబుచేసి ప్రేమించారు, చదువు చెప్పించి ప్రేమించారు, అడిగినదంతా ఇచ్చి ప్రేమిం-చారు, అడగకపోయినా ఇచ్చి ప్రేమించారు, రాత్రింబగళ్లు రెప్ప వేసేపాటి ఖాళీ అయినా లేకుండా ప్రేమించారు. ఆయన పడ్డ తాపత్రయమూ, ఆయన విడిచిన నిట్టూర్పులూ, నాకు తెలియక పోలేదు. నందనవనంలో పుట్టిన పారిజాతమా అన్నట్టు నా సమస్తదేహాన్ని ప్రేమించారు. నామనస్సునూ, నా స్వభావాన్నీ, కేవలం అదృష్టంవల్ల దొరికినవి అన్నట్టు ప్రేమించారు. దానివల్ల నాలో ఒక గర్వం పుట్టింది. నాలో గొప్పఉండబట్టే ఆయన నా ద్వారందగ్గిరికి వచ్చి నిలుచున్నారని నమ్మకం పుట్టింది. అలాగు, రాణిలాగు సింహాసనంమీద కూర్చొని పాలిస్తూ ఉంటే, అహంకారం మరింత అధికం అవుతూ ఉంటుంది, ఎప్పటికీ తృప్తి కలగదు. పురుషులను వశపరచుకొనే శక్తి మా చేతుల్లో ఉన్నది అని అనుకోవడం స్త్రీల యొక్క సుఖానికా, స్త్రీల యొక్క శుభానికా? ఏదీ లేదు. గర్వాన్ని భక్తి ప్రవాహంలో కొట్టుకు పోనివ్వకంవల్లనే వాళ్లు మోక్షం పొందుతారు. శంకరుడు భిక్షుని వేషంతోనే వచ్చి అన్నపూర్ణాదేవి ద్వారందగ్గిర నిలుచున్నాడు; ఆభిక్షుని రుద్రతేజస్సు ఆమె భరించ గలిగితే శివుని కోసం తపస్సు చేయవలసిన అవసరం రాకపోను.

నా భాగ్యం చూచి ఎంత మందికి ఈర్ష్య కలిగి ఆ ఈర్ష్య జ్వాలవై మండిందో నాకు ఈవాళ జ్ఞాపకం వస్తూ ఉంది. నాకు దొరికినది నా అర్హత వల్ల కాదు. అదృష్టంవల్ల దొరికిన దానిని మనము భాయపరుచుకోవాలంటే చాలా కాలంవరకూ చెల్లించ వలసినది ప్రతిరోజూ చెల్లిస్తూ ... ఇవ్వడము అయితే ఇస్తాడు గాని భగవంతుడు, పుచ్చుకోవడం మన గుణాలే. దొరకినవి కూడా దక్కక పోవడం మన కర్మం అనుకో వలసినదే !

పెళ్లి కాని కూతుళ్లుండే తండ్రులు ఎంతో మంది నా భాగ్యం చూచి దుఃఖించారు. "ఆమెకున్న రూపేమిటి!" "ఉన్న గుణాలేమిటి" "ఆమె ఈ ఇంటికి తగిన కోడలేనా" అని ఈలాగు నానారకాల ప్రశ్నలు ఇంటింటా, ఊరూరా పుట్టినవి. మా అత్తగారూ, అత్తగారి అత్తగారూ కూడా చక్కదనానికి పేరుపడ్డవాళ్లు. అందానికి మా ఇద్దరు తోటికోడళ్లతో సమానులు లేరు. వీళ్లిద్దరి అదృష్టం వంకర కావడం చూచి నాయనమ్మగారు తన మూడో మనమడికి అందంచూచి పెళ్లి చేయనని నిశ్చయించుకున్నది. కేవలం మంచి లక్షణాల సహాయంవల్లనే నేను ఈ ఇంటికి వచ్చాను:—మరి వివిధమైన యోగ్యతా లేదు నాకు.

స్త్రీలకు జరగవలసిన సన్మానం మా ఇంట్లో ఎవరికీ జరగలేదనే చెప్పవచ్చును. కాని రాజభోగంతో నిండిఉన్న మా ఇంటికి మామూలే అది. కన్నీరు కనబడకుండా ఇంటినిండా

సారాపొంగు; దుఃఖమూ, ఏడ్పూ వినబడకుండా భోగం వాళ్ల గజ్జల శబ్దము;—అయినప్పటికీ మా ఇంటి రాణీలందరూ గొప్పఇంటివాళ్లమన్న అభిమానం మాత్రమే పట్టుకొని అంతా ములిగిపోయినా తల మాత్రం ములగకుండా గడుపుతు వచ్చారు. నా భర్తకు మాత్రం కల్లూ, సారా ఏదీ అభ్యాసం లేదు; స్త్రీల దేహాలను అమ్మే దుకాణాలకు వెళ్లి తన మాను-షత్వం ధారపోసేయలేదు ఆయన. దీనికి కారణం నాలో ఉండే గుణాలా? చంచల స్వభావంగల పురుషుల మనస్సులు వశ-పరచుకొనే మంత్రాలు నాకేవీ భగవంతుడు నేర్పలేదే! అది కేవలం నా అదృష్టం, అంతకు మించి మరేమీ లేదు. ఆ పాడుదైవానికి మాతోటకోడళ్ల మీద దృష్టి లేక పోయింది. అందుచేతనే వాళ్ల గతి అలాగయిపోయింది; సంధ్య అయీ కాకముందే వాళ్ల భోగం పూర్తిఅయిపోయింది, వాళ్ల ఉత్సవం తుదముట్టింది. వాళ్ల రూపూ, యౌవనమూ, నాట్యసభలో వెలుగుతున్న దీపాలలాగు, తెల్లవార్లూ ఆ అంతఃపురంలో వెలుగుతుండెను. సంగీతం అన్నమాట ఎక్కడా వినబడలేదు, ఉన్నదంతా దీపాల మంటే.

నాభర్త మొగతనం లేనివాడని ఇద్దరు వదినగార్లూ నిరసనగా చూస్తున్నట్టు నటిస్తుండే వారు. ఇంత పేరుపడ్డ వంశాన్ని ఆడదాని చేతులో వదిలేయడమూ! ఆడదాని పైట చెంగు తెరచాప చేసి ఇంత గొప్ప సంసారనావను నడిపించడ-మూ! ప్రతి మాటలో ఒక పోటు ఉండేటట్టుగా మాట

లాడుతుండేవారు మాతోటికోడళ్లు. మోసంచేసిచేసి నాభర్త మనస్సును స్వాధీనంచేసేసుకున్నానట. "అంతా వేషం, అంతా కృత్రిమం, ఎంత సిగ్గులేని వాళ్లే ఈ కాలపు దొరసా-నులు!" అని అంటూఉండేవారు. ఇప్పటి ఫ్యాషన్‌గా నన్ను ముస్తాబుచేయించేవారు ఆయన. కొత్తకొత్త రంగుల జాకెట్లూ, షెమీజులూ, చీరలూ, పరికిణీలూ చూచి లోలోపున మండి-పోతూ ఉండేవారు. "ఉండేది రూపుకాదు, వేషం. ఒంటిని బట్టల దుకాణం చేసేసుకుంది, సిగ్గులేదు" అని అనేవారు.

ఆయనకు అంతా తెలుస్తూనే ఉండేది. కాని ఆడవా-ళ్లంటే ఆయనకు అతి దయ. వాళ్లమీద కోపగించవద్దని మాటిమాటికీ నాతో చెపుతూఉండే వారు. 'ఆడవాళ్ల మన-స్సులు వంకర, అతి చిన్నవి' అని నేను ఒకనాడు అన్నాను, జ్ఞాపకం ఉంది. 'అవును చిన్నవే చీనాదేశపు స్త్రీలపాదాల-లాగు. వాటిలాగే వంకరగా కూడా ఉంటాయి' అని ఆయన జవాబు చెప్పారు. మన సంఘం అంతా కలిసి నాలుగు వైపులనుంచీ నొక్కి మన స్త్రీల మనస్సులను చిన్నవిగానూ వంకరవిగానూ చేసేస్తున్నది. భాగ్యదేవత వాళ్ల జీవ-నాలతో జూదమాడుతున్నది. వీళ్ల బ్రతుకుల కాధారం ఆజూదం—వాళ్ల చేతులలో ఏమున్నది?

మాతోటికోడళ్లు ఏది కావలసినా మరిదిగారి దగ్గర-నుంచి తెచ్చుకోగలిగేవారు. వాళ్లు అడిగేది ఇవ్వకూడినదా

కూడనిదా అని ఎన్నడూ ఆలోచనైనా లేకుండా ఈయన ఇచ్చేసేవారు. అందుకని వాళ్లకు కృతజ్ఞతైనా లేక పోవడం చూస్తే నా ఒళ్లు మండుకుపోయేది. పెద్దతోటికోడలికి జపాలూ, తపాలూ, వ్రతాలూ, ఉపవాసాలూ, వీట్లతోనే రోజులు గడచిపోయేవి. ఆవిడ మహా సాత్వికురాలు—వైరాగ్యమంతా నోటిమాటలో కర్చుఅయిపోయేది, మనస్సులోకోసం ఒక పీసంతంతయినా మిగిలేదికాదు. నాకు వినబడేటట్టు ప్రతి రోజూ అంటూ ఉండేది—వాళ్ల అన్న చెప్పాడట, హై కోర్టులో దావాపెడితే ఆమెకు ఎంతో వస్తుందట—ఇంకేమి-టేమిటో అన్నది, ఆపాడు కబుర్లన్నీ ఇప్పుడు ఎందుకు? ఎన్నటికీ ఆమెకు ఎటువంటి జవాబూ ఇవ్వవని ఆయనకు నేను మాట ఇచ్చాను. అందుచేత లోపుల మంట నాకు మరీ విస్తారం అయింది, సహించి ఊరుకోవడం అసాధ్యం అయిపోయింది. మంచిగా ఉండడం అనే దానికి ఒక హద్దు ఉన్నది, అది దాటి వెలితే గౌరవానికి భంగంకలగకపోదు అని అనిపించేది. "రాజశాసనము గాని లోకాచారం గాని వదినగారి హక్కొన్ని లేవు. కాని, 'నా భర్తది కావడంచేత నాదే' అని ఒకప్పుడు అనుకున్నటువంటి సంపద కోసమని ముష్టిదానిలాగు ఒకరిని ఆశ్రయించి అడుగుకోవడం అనేది చాలాకష్టమైన సంగతి. దానిమీద ఇరకా కృతజ్ఞత కనపరచమనడమా? దెబ్బలు తిని పైగా కట్నం ఇచ్చుకున్నట్టే!" అని నాభర్త అనేవారు. నిజం చెప్పేదా? కొంచెం కఠినంగా ఉండగలిగిన పౌరుషం

ఆయనకుఉంటే బాగాఉండును, అని నాకూ చాలాసార్లు అనిపించింది.

మా రెండో తోటికోడలిది ఇంకొక ధోరణి. ఆమె వయస్సు తక్కువే. సాత్త్వికురాలననే నటనేమీ లేదు ఆమెకు. మాట్లాడితే హాస్యమూ, నవ్వూ. యౌవనంలో ఉండే దాసీలు కొంత మంది ఉండేవారు ఆమెదగ్గిర ; వాళ్ల సంగతీ-వ్యవహారమూ ఏమీ బాగుండేది కాదు. కాని అభ్యంతర పెట్టేవారు ఎవరూ ఉండేవారు కారు; ఎందుకు అంటే—ఆ ఇంటి మోస్తరే అంత. నాభర్త నిష్కళంకుడుగా ఉండేవారు కదూ, ఆ నా సౌభాగ్యం చూచి ఓర్వలేకపోయేదని నా ఉద్దేశం. ఆయన వచ్చిపోయే దారిలో నానారకాల వలలూ పన్ని ఉంచేది. ఆయన మాట అనుకుంటే మధ్యమధ్య నామనస్సులో భయం పుట్టేది, గాని ఆమాట ఒప్పుకోడానికి సిగ్గు వేస్తుంది. అక్కడి గాలిఅంతా ధూళితో నిండిఉండేది, అటువంటిచోట ఎంత పరిశుభ్రమైన వస్తువైనా శుభ్రమైన దనిపించదు.

రెండో తోటికోడలు చక్కని పిండివంటలు తనచేతితో తానే చేసి అతి ప్రేమతో మరిదిగారిని అప్పుడప్పుడు విందుకు పిలిచేది. ఏదైనా మిష పెట్టి ఆయన తప్పించుకుంటే బాగా ఉండును అని నాకు అనిపించేది. మంచి బుద్ధి కాని వాళ్లకు అప్పుడప్పుడు ఈలాగు బుద్ధి చెప్పాలి. కాని ఆయన

ప్రతిమారూ నవ్వుముఖం పెట్టుకొని వస్తాను అనేసరికి నాకు అదొక మోస్తరు—అది నాతప్పే, ఒప్పుకుంటాను; గాని ఏమి-చేయగలము, మనస్సు మనము చెప్పినట్టు వింటుందీ? ఇంతకూ మొగవాళ్ల మనస్సులు చంచలమయినవి కదా! అటువంటప్పుడు వేయి ఉపతరగనులు ఉన్నా ఏదో మిషమీద ముందుగా వెళ్లి చిన్నతోటికోడలి గదిలో కూర్చొనేదానను. నవ్వుతూ ఆమె అనేది—శబాష్! అవుదువే! చిన్న రాణి కళ్లన్నీ తప్పించుకొని రావడం ఎవరి తరం? అతి కఠినమైన పారా కదూ! మేమూ చేస్తూ'ండే వాళ్లము, గాని ఇంత జాగ్రత్తగా పట్టి ఉంచడం నేర్చుకోలేకపోయినాము.



నాభర్తను వాళ్ల దుఃఖమే కనబడేది గాని వాళ్ల తప్పులు కనబడేవి కావు. "పోనీ అలానే అనుకుందాము, తప్పంతా సంఘానిదే; అయితే మాత్రం అంత దయ కనబరచడానికి అవసర మేమిటి వచ్చింది? కొంచెం కష్టం వచ్చినంత మాత్రాన ఏమి అయిపోయింది?" అని అనేదానను. కాని ఆయనతో ఎవరు చాలగలరు! వాదించేవారు కారు, ఒక చిరి నవ్వు నవ్వి మాట్లాడక ఊరుకుండేవారు. నాలోపల నేను భరిస్తూఉండే సూదిపోట్లు ఆయనకు తెలియక పోలేదు అనుకుంటాను. నాకు కోపం నిజంగా సంఘం మీదా కాదూ, ఇంకెవరి మీదా కాదూ, అది పూర్తిగా—చెప్పను, చెప్పను, నాకోపం ఎవరిమీదనో అది చెప్పను.

"నీలో తప్పులు పట్టేవాళ్లకు నిజంగా అవి తప్పులనే తోచినట్టయితే అంత కోపం ఉండకపోను" అని ఒకనాడు అన్నారు.

"అయితే అన్యాయంగా నామీద కోపం ఎందుకు?"

"అన్యాయమని ఏలాగు చెప్పగలము? ఈర్ష్యలో కొంత నిజమున్నది. ప్రపంచంలో ఏకొంచెం సుఖమున్నదో, అది అందరికీ దొరకడం న్యాయం అని దాని అర్థం."

"దానికని భగవంతుడితో పెబ్బలాడాలి, కావాలంటే, నాతో ఎందుకూ?"

"దేవుడు కనబడడు గనుక, చేతికి దొరకడు గనుక."

"అయితే కావలసినది తీసుకోవచ్చునే, మీరూ నేనూ వద్దని ఎన్నడూ అనలేదే! చీరెలు కట్టుకోమనండి, జోళ్లూ మేజోళ్లూ తొడుక్కోమనండి, జాకెట్లు వేసుకోమనండి, వస్తు-వులు పెట్టుకో మనండి—ఎవరూ అభ్యంతర పెట్టలేదే! దొరసాని దగ్గిర చదువుకోవాలంటే అది కూడా ఇంట్లోనే ఉంది. వితంతు వివాహం చేసుకోవాలంటే, విద్యాసాగర్ లాగు సప్తసముద్రాలూ దాటే శక్తి మీకు ఉండవే, ఉంది!"

"అదే ఉన్న చిక్కు, మనము కోరుతూ ఉన్నదానిని ఎవరైనా తీసుకు వచ్చి మనచేతిలో పెట్టినా అది పుచ్చుకొనే మార్గం మనకు తెలియాలి కదా, పుచ్చుకొనేశక్తి మనకు ఉండాలి కదా!"

"అందుచేతనే కాబోలు, తనకు లేనిది మంచిది కాదు అంటూ'ండడం, ఇంకెవరికైనా దొరికితే లోపున మండి చావడం!"

"తాను కోరినది సంపాదించుకోలేనివాళ్లు ఆవిధంగా మనస్సును తృప్తి పరుచుకుంటూఉంటారు."

"ఏమినండి, ఆడవాళ్ల మనుస్సులు అతి చిన్నవి. వాళ్లు నిజం ఎప్పుడూ ఒప్పుకోరు, దొంగమాటలతో తప్పించుకుంటారు."

"దాని అర్థం ఏమిటంటే— ఉండతగినవి వాళ్లకు ఏవీ లేవు అని"

ఈవిధంగా ఇంట్లో ఆడవాళ్ల వంకరబుద్ధులన్నిటికీ ఏదో ఒక సమ్‌జాయిషీ ఇస్తూఉండేవారు. నాకు కోపంవచ్చేది. మన సంఘం ఏలాగు ఉండడంవల్ల స్త్రీల బుద్ధి ఏవిధంగా మారుతుంది అనే విషయం గురించి వాదనచేసి ఏమీ ప్రయోజనం లేదు ఇంట్లో నాలుగు వైపులా, నేను ఏదారిని వెళ్లినా గుచ్చుకొనేటట్టు, దారి పొడుగునా ముళ్లు దోసి ఉంచేది మా తోటికోడలు. ప్రొద్దస్తమానమూ వంకర మాటలు, ఎత్తి పొడవడం, నోట ఒక మాట కడుపులో ఒక మాట—ఇదంతా సహించి ఊరుకోవడం ఉంటూఉండగా, పైగా వాళ్లంటే దయా? నాతరం కాదు బాబు, మరి నేను ఊరుకోలేను.

అది విని ఆయన ఊరుకోలేదు. "నీకు ఎక్కడైనా ఆమాత్రం బాధ కలిగేసరికి దయ మాట జ్ఞాపకం వస్తుందే; వాళ్లకు సంఘం ఇటునుంచీ అటునుంచీ బల్లేలతో పొడుస్తూ ఉన్నా దయచూపించ వలసినంతది ఏదీ నీకు కనబడదేమి? ఆకలికడుపుతో ఉండేవాడే కదూ వీపుమీంద కొరడా దెబ్బలు కూడా భరించాలి ?" అని అన్నారు.

"అవును నా మనస్సు చిన్నదే. అందరూ మంచివాళ్లే, నేను ఒక్కర్తినే తప్పు! మీకేమీ తెలియదు, ఎప్పుడైనా ఇంట్లో ఉండవలసి వస్తే కదూ తెలియడానికి?" అని కోపంతో అన్నాను. అంటూ ఇంట్లో జరిగినది ముఖ్యంగా ఒక సంగతి చెప్పబోయేసరికి "చంద్రనాథ్ బాబుగారు వచ్చి చాలా సేపటిబట్టి బయట కూర్చున్నారు" అని అంటూ లేచి వెళి పోయినారు.

ఒక మూల ఏడుస్తూ కూర్చున్నాను. ఆయన దృష్టికి అంత చిన్న అయిపోయిన తరవాత ఏలాగు బ్రతికి ఉండగలను. నాకే అదృష్టం వంకరయిఉంటే నేను ఎంతమాత్రం వాళ్ల లాగు కానుఅని చూపించే మార్గం లేదు.

అందం కనపరచుకోడానికి తగిన అవకాశం భగవంతుడు ఆడవాళ్లకు ఇచ్చినట్టయితే వాళ్ల బడాయి అంతకంటే తక్కువ పనులకు దిగదు. వాళ్లు డబ్బుద్వారా కొంచెమూ, అలంకారాల ద్వారా.కొంచెమూ బడాయి వెళ్లబుచ్చి కొంత ముక్తిని పొంద

వచ్చును, గాని జమీందార్ల ఇళ్లల్లో వాటికి అట్టే అర్థం లేదు, అనగా వాటివల్ల అట్టే తృప్తి కలుగదు. కనుక నాకు ఇంకొక మోస్తరు గర్వం ఉండేది. అదేమిటీ అంటే, నేను ఒక మహా పతివ్రతను అని అనుకోవడం. దీనిద్వారా నాభర్తను కూడా "మీగిపోయినాను" అని పించాలని నాకు చాలా ఉండేది. గాని ఇంట్లో జరిగిన ఏ దెబ్బలాటగురించో మాట్లాడదామని వెళ్లే-సరికి ప్రతిమారూ ముఖం చిన్నపుచ్చుకొని చక్కా పోవడం అవుతూఉండేది. అది నన్ను మరింత బాధించేది. తగిన పని చేసి తిరిగీ ఆయనను చిన్నపుచ్చాలని బుద్ధి పుట్టేది—ఆయన ఆలాగు చేస్తూఉండడం లోపున మంచి ఉండబట్టికాదు, "మంచితనం" కోసమని. ఈపనులు చేసేవారు తమకోసమనిచేయరు పైవాళ్లను మరిపించడానికి చేస్తారు.

నన్ను ఘోషాలోనుంచి బయటికి తీసుకువద్దామని నాభర్తగారికి చాలా కోరిక ఉండేది. బయటనున్న ప్రపంచంతో నాకేమిటి అవసరమని నేనొకనాడు ఆయనతో అన్నాను.

"ప్రపంచానికి నీతో అవసరం ఉండవచ్చును" అన్నారు ఆయన.

"ఇన్నాళ్లూ ప్రపంచానికి జరిగింది గాని ఇక ముందు జరగదేమో? నేను లేను కదా అని ఉరిపెట్టుకు చచ్చిపోతుందా ఏమిటి?"

"చస్తే చావనీ, దానికోసమని నేను బెంగపెట్టుకు కూర్చోలేదు. నా మాట అనుకుంటున్నాను, నేను"

"నిజంగానే? మిమ్మల్ని ఏలాగు కలుపుతారు అందులో?"

ఏమీ జబాబు చెప్పకుండా నవ్వుముఖంతో కూర్చున్నారు. ఆయన మోస్తరు నాకు తెలుసును. అందుచేత "ఆలాగు మాట్లాడకుండా కూర్చోని తప్పించుకుందామంటే వీల్లేదు, ఆ మాటేదో పూర్తిగా చెప్పి మరీ వెళ్లాలి, తెలుసునా!" అని అన్నాను.

"నోటిమాటలతో పూర్తిగా చెప్పేయగలిగినవే ఉంటవా అన్ని మాటలూ? బ్రతికిఉన్నన్నాళ్లూ మాటలతో చెపుతూఉన్నా పూర్తికానివి అనేకంగా ఉంటవి" అని ఆయనన్నారు.

"గూఢార్థాలు మానేసి స్పష్టంగా విప్పి చెప్పండి," అని అన్నాను.

"బయట ప్రపంచంలో, అన్నిటిమధ్యా నీవు నాదానివి కావలెను, నేను నీవాడను కావలెను. మన సంబంధము అక్కడ స్థిరపడలేదు, అదే తరవాయి ఉన్నది.'

"ఇంట్లోపల జరిగిన ఇచ్చిపుచ్చుకోడాలలో ఏమిటి లోటయింది?"

"ఇక్కడ నీ కళ్లూ, నీ ముక్కూ, చెవులూ, నోరూ— అన్నిటినీ ఆవరించుకొని నాలుగు వైపులా నేనే ఉన్నాను. నీకు

కావలసిన దేవరో అదీ తెలియదు, నీకు ఇప్పుడు దొరికిన దేవరో అదీ తెలియదు."

"ప్రశస్తంగా తెలుసును."

"తెలుసునని అనుకుంటున్నావు గాని తెలుసునో లేదో అదీ తెలియదు."

"ఇటువంటి మాటలు మీరు అంటూఉంటే విని ఊరుకో లేను సుమండీ."

"అందుచేతనే ఏమీ అనాలని నాకుండదు."

"మీరు మాట్లాడకుండా నోరుకట్టుకొని కూర్చుంటే మరీ కష్టంగా ఉంటుంది."

"అందుచేతనే నాకు ఇటువంటి బుద్ధి—నేను ఏమీ అనా అనను, అనకుండా ఊరూకోను. బయటనున్న ప్రపంచం మధ్యకు వచ్చి నీచుట్టూకు నువ్వే అంతా చూసుకొని కావలసినది తీసుకో. కేవలం ఇంటి సంసారమే చూసుకుంటూ మనము కల్పించుకున్న ఈ శూన్యంమధ్య యావజ్జీవమూ నువ్వూ ఉండలేవు, నేనూ ఉండలేను. దానికోసమని చేయబడ్డ వాళ్లము కాము మనము. బయిటనున్న వాస్తవ ప్రపంచం మధ్యను మనము కలుసుకొని మన బాంధవ్యం స్థిరపరుచుకుంటే అప్పుడే మనప్రేమ సార్థక మవుతుంది."

"మీకు ఇంకా స్థిరపడవలసినది ఉంది గాబోలు. నాకు మాత్రం ఏమీ తరవాయి లేదు."

"సరే నాకే అనుకో, ఆ శాస్త్ర పూర్తి చేసుకోడానికి నువ్వు ఎందుకు తోడ్పడ కూడదు?"

ఈ మాటే అనేక మోస్తర్లుగా మాటిమాటికీ వచ్చేది. "చాపల పులుసంటే సరదాపడే తిండిపోతు చాపలు తీసుకు వచ్చి, కత్తి పీటతో తరిగి, సాతాళించి, తన రుచికి తగినట్టు గరమ్ మసాలా వేసి తయారు చేస్తాడు. చాపలంటే దయగల వాడు వాటిని తీసుకు వచ్చి, ఇత్తడి గిన్నెలో వండి, వెండి గిన్నెలో పెట్టుకొని తినడానికి కూర్చోడు. స్వేచ్ఛగా ఏ ఏటిలోనో, ఏ చెరువులోనో ఉంచే వశపరుచుకుంటాడు; ఆలాగు వశపరుచుకోలేనప్పుడు గట్టుమీద కూర్చొని చూస్తుంటాడు. ఇంటికి తిరిగివచ్చి 'కోరినది దొరకలేదు. గాని నాసుఖం కోసమని దేనినీ ముక్కలు చేసి నాశనం చేయ లేదు!' అని సంతోషిస్తాడు. కోరేది పూర్తిగా దొరికితే అన్నిటికంటే ఉత్తమము, ఆలాగు దొరకనప్పుడు పూర్తిగా వదులుకోవడమే మంచిది.

ఆ మాటలు నాకు ఎంత మాత్రం నచ్చేవి కావు, గాని బయటికి రాకపోవడానికి అదికాదు కారణం. అప్పటికి నాయనమ్మ గారు ఇంకా బ్రతికి ఉన్నారు. ఆమెతో చెప్పకుండానే ఇరవై యో శతాబ్దం వస్తువులతో ఇంటిని నింపేసారు— నింపడం అంటే నూటికి నూరు పాళ్లేగాదు, పైగా మరి ఇరవై పాళ్లు. జమీందారుల ఇంటి కోడలు, పరదా పక్కకు లాగేసి, అంతఃపురంలోనుంచి పైకి వచ్చినా ఆమె సహించి ఊరుకొని

ఉండును. ఆపనికూడా త్వరలోనే జరుగుతుందని ఆమెకు తెలుసును. గాని ఏమి మహా అవసరం వచ్చిందని ఆమెను బాధ కలుగజేయాలి అనినాకు అనిపించేది. ఆడవాళ్లు పంజరములోని పక్షులని పుస్తకాలలో చదివాను. అందరిమాటా నాకు తెలి-యదు, గాని నా పంజరంలో ఉన్నది మాత్రం మూడులోకాల్లో ఇముడ్చుద్దామన్నా ఇమడదు. ఇప్పుడు ఏమి అనిపించినా, అప్పుడుమాత్రం అలాగు అనిపించేది, దానికేమీ సందేహం-లేదు.

నామీద నాయనమ్మకు ఉండే ప్రేమకు మూలకారణం ఏమిటంటే, ఆమెకు ఒక నమ్మకం ఉండేది—నేను పుట్టిన లగ్న బలంచేత నాకుఅచ్చిన గుణాలు నాభర్తగారిని పట్టి ఉంచాయి అని. మొగవాళ్ల మనస్సులు ఎప్పుడూ కిందకే వెళుతూఉంటవి, పాపంవైపు. మాతాతోటికోడళ్లు ఎంతో అందమైనవాళ్లు, అయినా మొగుళ్లను ఇంటిపట్టున ఉంచగలిగారా? ఆ మొగుళ్ల గతి ఏమయింది? పాపజ్వాలలో పడి మండి భస్మం అయిపోయినారు. ఎవ్వరూ వాళ్లను రక్షించ లేక పోయినారే! అటువంటి పురుషులను మింగేస్తూఉండే నరకాగ్ని నేనే అణగ-దొక్కానుఅని నాయనమ్మ నమ్మకం. అందుచేతనే నన్ను కడు-పులో పెట్టుకొని పెంచేది. నాకు ఏమాత్రం జబ్బు చేసినా అతి గాభరాపడేది. దొరల దుకాణాలలో కొని ఏవేవో కొత్తరకం బట్టలు తెచ్చేవారు. ఆయన వాటితో నన్ను ముస్తాబు చేసేవారు. ఇదంతా నాయనమ్మకు ఏమీ ఇష్టం

ఉండేది . కాదు. అయినా కోపం తెచ్చుకోవనికి బదులుగా అనేక విధాల మనస్సును సంతోష పెట్టుకుంటూ ఉండేది.— "మొగవాళ్లకు అటువంటి సరదాలు కొన్ని ఉండకమానవు. నాకు చికాకుగానే ఉండవచ్చు, అధికంగా డబ్బూపాడు కావచ్చు. దానంతటికీ వాణ్ణి అని లాభంలేదు. కేవలం తనను తాను నాశనంచేసుకోకుండా ఉంటే అంతే చాలును. ఇంత-కూ, నా నిఖిలేశ్ తనపెళ్లాన్ని ముస్తాబుచేస్తూఉండబట్టిగాని, లేకపోతే ఇంకెవరిని ముస్తాబు చేయడానికి బయలుదేరి ఉండునో!" అని అనుకుండేది. అందుచేత నాకు కొత్తబట్టలు వచ్చినప్పుడల్లా అవి పట్టుకొని మనమణ్ణి పిలిచి సరదా పడుతూ ఎంతో హాస్యం చేసేది. చివరకు మంచిచెడ్డల గురించి ఆమెకున్న అభిప్రాయాలే మారిపోయినవి. కలికాలంధర్మాన ఆఖరుకు ఏదశ వచ్చిందంటే, నేను రోజూ సాయంకాలం ఒక ఇంగ్లీషు పుస్తకం చదివి, కథ చెపితేనే గాని నాయనమ్మకు తోచేదికాదు.

నాయనమ్మ కాలం చేసిన తరువాత మేమిద్దరమూ కల-కత్తా వెళ్లి ఉండాలని ఆయనకు కోరిక పుట్టింది. నాకు మాత్రం ఏమీ ఇష్టం లేకపోయింది. ఇది మా అత్తవారి ఇల్లు, నాభర్తా నాయనమ్మగారూ అన్ని బాధలకూ ఓర్చి ఎంతో కష్టంమీద ఇంత కాలమూ దానిని కాపాడుకు వచ్చారు. ఫ్రాచీ అంతా తోసేసి కలకత్తా పారిపోతే నాకు తప్పకుండా శాపం

తగులుతుంది. ఇది నాకు మాటిమాటికి తడుతూ ఉండేది. నాయనమ్మగారి శూన్య-ఆసనం నావైపు చూస్తూఉండేది—ఆ సాధ్వీమణి ఎనిమిదేళ్లప్పుడు ఈఇంటికి వచ్చింది. దెబ్బైతొమ్మిదో ఏట చచ్చిపోయింది. సుఖపడ్డ జీవము కాదు ఆమెది. దుర్దైవం బాణంమీదబాణం అనేకం వేసింది ఆమె హృదయం మీద. కాని దెబ్బదెబ్బకీ మరింత అధికంగా అమృతం ఊరేది ఆమె జీవనంలో నుంచి. మా మహా సంసారమంతా ఆమె కంటినుండి కారిన పుణ్యధారల చేతనే పవిత్రమయింది. ఇదంతా వదిలిపెట్టి వెళ్లి, కలకత్తాలో ఆ ధూళిలో, ఆ పొగలో, ఆ చెత్తలో ఏమిటి చేసేది. ?

ఇద్దరు వదినగారల చేతిలో ఈ సంసారమంతా విడిచి పెట్టి వెళితే వాళ్ల మనస్సులకు కొంత శాంతికలుగుతుందని నాభర్తగారి ఉద్దేశం. కలకత్తా వెళ్లి ఉంటే మాజీవితము కూడా కొమ్మలువేసి చిగురుపెట్టడానికి కొంత అనుకూలంగా ఉంటుందని ఆయన అనుకున్నారు. వాళ్లు ఇన్నాళ్లూ నన్ను అమిత బాధ పెట్టారు, ఆయనసౌఖ్యంఅంటే చూడలేకపోయే వాళ్లు. అటువంటి వాళ్లకా చివరకు ఈ ఉపకారం ?

ఇది మా రాజభవనం, మా భోగమంతా ఇక్కడనే. మా ప్రజా, మా మనుష్యులూ, ఆశ్రితులూ, మా బంధువులూ, అతిథులూ, ఈ చుట్టు పక్కల వాళ్లే. కలకత్తాలో మేముఎవరమో మాకే తెలియదు, పైవాళ్లకేమి తెలుస్తుంది?

మా మానసస్నానాలు ఇక్కడే, మా ఐశ్వర్యానికి పీఠం ఇదీ, దాని సంపూర్ణ స్వరూపం కనబడేది ఇక్కడనే. ఇవన్నీ వాళ్ల చేతిలో విడిచిపెట్టి, సీత వనవాసానికి వెళిపోయినట్టుగా వెళిపోనా ? వాళ్లు వెనకనుండి నవ్వుతూ ఉండరూ ? వాళ్లకు నాభర్త దాక్షిణ్యం బోధపడుతుందీ, వాళ్లు దానికి అర్హులే ?

తరవాత ఇంటికి తిరిగి వచ్చినప్పుడు నా పదవి మళ్లా నాకుదొరుకుతుందీ ? "ఆపదవి నీకేమి ప్రయోజనం ?" అని అన్నారు ఆయన. "దానికంటే చాలా విలువగలవి ప్రపంచంలో ఎన్ని లేవు ?"

మొగవాళ్లకు ఈసంగతులన్నీ తిన్నఁగా బోధపడవు. ఇంటిసంసారంలో ఉండవలసివాటిగురించి వాళ్లకు ఏమి తెలుసును ? వాళ్ల బస ఇంటి-బయట. ఇంట్లోమాత్రం ఆడ వాళ్లు చెప్పినట్లు నడుచుకోవడం బుద్ధిగలమాట.

అన్నిటికంటే ముఖ్యమైన సంగతి ఏమిటంటే, పౌరుషం అంటూ ఒకటి ఉండాలి. చిన్ననాటినుండీ శత్రువులయిన వాళ్ల చేతిలో అంతా విడిచిపెట్టి వెళిపోవడంకంటే చేతకానిపని మరి ఒకటి లేదు. నాభర్త దానికి ఒప్పుకున్నా, నేను ఒప్పుకోని-వ్వలేను— ఒప్పుకోనివ్వడం నా సతీత్వానికి లోటు అనినాలో నేను అనుకున్నాను.

బలవంతాన నన్ను ఎందుకు కలకత్తా తీసుకు వెళ్లారు కారు ? ఎందుకో నాకు తెలుసును. ఉంది కదా అని బలం

ప్రయోగించవలసిన మనిషి కారు ఆయన. ''ఆడదానను గనుక మొగుడు చెప్పేది చేస్తూ ఉండాలి' అనుకొని నేను చెప్పేదంతా నువ్వు చేస్తూ ఉంటే చూచి నేను సహించలేను. ఇంత క్రూరుణ్ణి కదా అని దుఃఖం వస్తుంది. ఎంతకాలమయినా కనిపెట్టుకొని ఉంటాను, నీదీ నాదీ ఒక్క మోస్తరు మనస్సు అవుతుందేమో అని. అయితే మంచిదే, కాకపోతే మట్టుకు ఉపాయం లేదు.' అని ఆయన అనుకుండేవారు.

కొంచెంకొంచెం కలుపుతూ గాని, కొట్టేస్తూ గాని రాత్రిని పగలుగానో లేక పగటిని రాత్రిగానో చేయవలెనంటే, ఎన్ని యుగాలైనా చాలునూ ? కాని సూర్యుడు చేసే పని ఏమిటి ? చూస్తూఉండగా ఉదయించేస్తాడు, రెప్పపాటులో చీకటి మాయమయిపోతుంది—అనంత కాలం పట్టవలసిన పని ఒక్కక్షణంలో అయిపోతుంది.

బంగాళా దేశంలోకి స్వదేశీ యుగం వచ్చి పడ్డది ఒక-నాడు. అది ఏలాగు వచ్చిందో ఎవరికీ స్పష్టంగా తెలియదు. ఈ యుగాన్ని ముందు యుగంతో కలుపుతూ మధ్యను ఉండ-వలసిన క్రమం కనబడలేదు. అందుచేతనే గట్లుకొట్టేసి పారుతూ ఉన్న పెద్ద ప్రవాహంలాగు అకస్మాత్తుగా వచ్చి ఒక రెప్ప-పాటులో బుద్ధీ భయమూ రెండింటినీ తోసుకొని పోయింది. జరిగిన. దేమిటో, జరగబోయేదేమిటో ఆలోచించడానికైనా వ్యవధి దొరకలేదు.

ఊళ్లోకి పెళ్లికొడుకు వస్తున్నాడు, సానాయి వినబడు-తూంది, దూరంనుంచి దీపాల వెలుతురు కనబడుతూవుంది. అటువంటప్పుడు ఆడవాళ్లందరూ, ఏలాగు ఉన్నవాళ్లు ఆలాగు, పరిగెత్తివచ్చి వరండాలమీాదా, డాబాల మీాదా, కిటికీలలోనూ, ద్వారాల దగ్గిరా, చూస్తూ నిల్చుంటారు. అప్పుడు మరి అడ్డూ ఆపూ ఉండదు. ఆలాగునే దేశమంతటకీ వరుడైనవాడు వస్తు-న్నట్టు సానాయి ఆవాళ వినబడినప్పుడు ఆడవాళ్లు ఇంటి పనులు చేసుకుంటూ కూర్చోగలరా? కేకలువేసుకుంటూ శంఖాలు ఊదుకుంటూ కిటికీల దగ్గిరా, గుమ్మాల దగ్గిరా, ఎక్కడ ఆమాత్రం సందు కనబడితే అక్కడ, మెడలు చాచుకొని తొంగితొంగి చూస్తూ నిలబడ్డారు.

నవయుగానికి ఉన్మాదంవల్ల ఒక విధమైన కుంకుమ వర్ణం వచ్చింది. ఆ రంగే నామనస్సుకూ, దృష్టికీ, నా ఆశకూ, ఇచ్ఛకూ పట్టింది. చుట్టూ గీకలు గీసి దడిపెట్టి ఆలోపునున్నదే నా ప్రపంచమూ, నా జీవనసర్వస్వమూ అని అనుకొనేదానను. దానిలోనే నా ధర్మకర్మ ఆకాంక్షలూ, నా సాధనమూ. దానిలో-నుండేదానిని ప్రతిరోజూ చక్కజూచుకొని ముస్తాబు చేసు-కుంటూ కాలంగడిపే దానను. ఆ రోజునైనా చుట్టూఉన్న ఆవరణ విరిగి పడిపోలేదు. ఆకంచెపైకి ఎక్కి నిలుచొనే సరికి దూరంనుంచి ఒక చిత్రమైన పిలుపు వినబడ్డది—దాని అర్థ-మేమో స్పష్టంగా బోధపడలేదు, గాని మనస్సులో మాత్రం ఒక విధనమైన ఆందోళన పుట్టింది.

మనము ఉపయోగించే వస్తువులన్నీ మన దేశంలోనే తయారు కావలెనని నానా విధాల ప్రయత్నాలు నాభర్త కాలేజీలో చదువుకుంటూ ఉన్నప్పటినుండీ చేస్తూ ఉండేవారు. మా జిల్లాలో ఈతచెట్లు అనేకం. యంత్రసహాయం వల్ల వాటి రసమంతా ఒకచోట కూడబెట్టి చీనీ చేయిస్తే బాగుంటుందని ఆలోచించి చాలా కాలం ఆ ప్రయత్నమే చేశారు. చివరకు కనిపెట్టిన యంత్రం చాలా చక్కనిదని విన్నాను. అయితే నేమి—మనకు అది ఇచ్చిన రసంకంటే అది పీల్చిన రూపాయిలు చాలా విస్తార్ణం అట! అందుచేత అట్టేరోజులు సాగింది కాదు ఆపని. నానారకాల తనిఖీ చేయించి క్రొత్తక్రొత్త మోస్తరు పంటలన్నీ పండించేవారు. ఆ పనిఅంతా అతి ఆశ్చర్యంగా ఉండేది. దానికంటే ఆశ్చర్యం ఏమిటీ అంటే, అది మింగే రూపాయిలు. మన దేశంలో పెద్దపెద్ద ఫ్యాక్టరీలు సాధ్యం కాకపోవడానికి మూల కారణం బ్యాంకులు లేకపోవడం అని ఆయనకు తోచింది. ఆ రోజులలో నాకు 'పొలిటికల్ ఇకానమీ' చెపుతూఉండేవారు. అందులో తప్పేమీ లేదు. కాని మన జనసామాన్యంలో రూపాయిలు కూడబెట్టుకొనే కోరికా, అభ్యాసమూ పుట్టించాలని ఆయనకు బుద్ధి పుట్టి, ఒక చిన్న బ్యాంకు పెట్టించారు. బ్యాంకులో రూపాయిలు దాచుకుందామని ఊళ్లోవాళ్లకు గొప్ప ఉత్సాహం కలిగింది; దానికి కారణం ఏమిటంటే, అక్కడ దొరికే వడ్డీ చాల అధికం. పెద్ద వడ్డీ దొరకడం మూలానే ప్రజల ఉత్సాహం జాస్తీ అయింది. కాని

ఇదే కష్టంఅయి చివరకు బ్యాంకును ముంచేసింది. ఈకాండ అంతా చూచి వారి ఎస్టేటులో ఉన్న పెద్దపెద్ద ఉద్యోగస్థులందరూ చాలా చికాకు పడ్డారు, చాలా గాబరాపడ్డారు; శత్రుపక్షంవాళ్లు హాస్యంచేశారు, వెక్కిరించారు. నాకు వినబడేటట్టుగా మా పెద్దతోటికోడలు ఒకనాడు అన్నది, "జడ్జీగారికి దరఖాస్తుపెడితే, ఏనాటినుంచో పేరుపడి వస్తూఉన్న మా మర్యాదా, మా డబ్బూ, ఆ పిచ్చివాడిచేతిలోనుంచి తీసుకొని కాపాడే ఉపాయం కనబడకపోదని మా పినతండ్రికొడుకు అన్నాడు—అతను పేరుపడ్డ పెద్ద వకీలు."

ఆ పరివారంఅంతటిలో చికాకుపడనివారు నాయనమ్మగారు ఒక్కరే. "మీరంతా కలిసి వాణ్ణి ఎందుకు అల్లరి పెట్టేస్తున్నారు?" అంటూ అనేక సార్లు నన్ను పిలిచి చివాట్లు పెట్టింది. "డబ్బు మాట ఆలోచిస్తున్నావా ఏమిటి? నేను ఈ ఇంటికి వచ్చాక ఎస్టేటు రిసీవరు చేతిలోకి వెళ్లడం మూడు సార్లు చూచాను. మొగవాళ్లు, ఏమిటి, ఆడ వాళ్లు మోస్తరా? దూబరా ఖర్చు చేయడమే వాళ్లకు చేతనయినది, వాళ్ల స్వభావమే దూబరా! ఇంకా నీ అదృష్టం బాగుందే అమ్మాయి, డబ్బుతోపాటు తనను కూడా దూబరా చేసుకోవడం లేదు నీ మొగుడు! దుఃఖం ఎప్పుడూ అనుభవించకపోవడంచేత నీకు ఆమాట బోధపడకుండా ఉన్నది."

నా భర్తగారి దానాల పట్టీ చాలా పెద్దది. బట్టలు నేసే యంత్రం అనీ, ధాన్యంమర అనీ, ఇటువంటి కొత్త ప్రయత్నం

ఏది ఎవరు చేసినా, మరి ఇక ఎంత ఇచ్చినా ప్రయోజనం లేదు అనేటంతవరకూ, దానికి ఏదో ఒక విధమయిన సహాయం చేయడం మానేవారు కారు ఆయన. కలకత్తానుంచి శ్రీ జగన్నాథం వెళ్లే స్టీమరు-కంపెనీ ఒకటి, దొరల కంపెనీకి పోటీగా, లేచింది. ఒక్క స్టీమరయినా తేలలేదు ఇంకా నీళ్లలో, నా భర్తగారి గవర్నమెంటు ప్రామిసరీ నోట్లు మాత్రం అనే-కంగా మునిగాయి.

సందీప్ బాబు దేశంకోసం అంటూ అనేక రాకాల వంకలు పెట్టి ఆయనవద్దనుంచి సొమ్ము పిండేసేవాడు; నాకు చాలా చిరాకు వేసేది. వార్తాపత్రిక పెడతాననీ, దేశ-మంతా తిరిగి "స్వదేశీ" ప్రచారం చేస్తాననీ, డాక్టర్ సలహా ప్రకారం తాను కొన్నాళ్లు ఉదకమండలం వెళ్లి ఉంటాననీ, ఏమీ ఆలోచించకుండా అడిగినంతా ఆయన ఇచ్చేసేవారు. ఇవన్నీ కాక అతని మామూలు ఖర్చులు ప్రతి నెలా ఉండనే ఉండేవి. వీటి అన్నిటిలో ఆయన మతమూ సందీప్ బాబు మతమూ ఒకటా అంటే, అదీ లేదు—ఇది అన్నిటికంటే ఆశ్చర్యమయిన సంగతి. గనులలో ఉండే విలువగల వస్తువు-లన్నీ పైకి తీయలేకపోవడం దేశంయొక్క దారిద్ర్యం. ఆలా-గునే, దేశంలో ఉండే ఆత్మను తవ్వి అందులో దాగిఉన్న శక్తిని పైకితీసి, స్వీకరించకపోవడం అంతకంటే దారిద్ర్యం అని ఆయన అన్నారు. వాళ్లంతా మిమ్ముల్ని మోసపుస్తున్నారని ఒకనాడు

కోపంవచ్చి ఆయనతో అన్నాను. "నాలో గుణము లేక-పోయినా డబ్బు ఇచ్చి గుణంలో వంతుదారుణ్ణి అవుతున్నాను. —ఆవిధంగా మోసపుచ్చి నేను లాభం పొందుతున్నాను" అని నవ్వుతూ ఆయన జబాబు చెప్పారు.

ఈ పూర్వయుగ వృత్తాంతం కొంత చెప్పవలసివచ్చింది. లేకపోతే నవయుగ నాటకం స్పష్టంగా బోధపడదు.

ఈ నవయుగం అనే తుపాను నాలోకి రాగానే నాదగ్గిర ఉండే విదేశీబట్టలన్నీ తగలబెట్టేస్తానని నా భర్తతో చెప్పాను. "నీకు ఇష్టంలేనన్నాళ్లు వాడడం మానేయి" అని ఆయన అన్నారు.

"ఏమిటి మీారనేది? 'ఇష్టంలేనన్నాళ్లు' ఏమిటి! బ్రతికి-ఉన్నంత కాలమూను!"

"మరీ మంచి మాటే! బ్రతికిఉన్నంత కాలమూ వాడడం మానేయి. దానికని ఇంత సందడి చేస్తూ తగలబెట్టడం ఎందుకు?"

"ఆలాగు అడ్డుపెడతారెందుకు?"

"కొత్తది ఏదైనా నిర్మించడంలో నీ శక్తిఅంతా వినియోగించు. దేనినయినప్పటికీ అనవసరంగా విరగకొట్టి పారేయకు. అటువంటి ఉద్రేకంలో చిల్లిగవ్వంతయినా వృథాఖర్చు చేయకు."

"అటువంటి ఉద్రేకంవల్లనే నిర్మించే శక్తి కలుగుతుంది."

"ఇంటికి నిప్పుముట్టిస్తేనే గాని ఇంట్లోకి వెలుతురు రాదు అన్నట్టుఉంది నువ్వు అనేది. దీపం వెలిగించడానికి ఎన్ని తంటాలు పడమన్నా పడతాను, గాని సులువుగా అయిపోతుం-దని ఇంటికి నిప్పుముట్టించేదామంటే మట్టుకు నేను ఒప్పుకో-లేను. నువ్వు చేస్తాననే పని చూడడానికి మహా డాబుగా కనబడుతుంది, గాని నిజాన్నిబట్టి చూస్తే మాత్రం ఉత్త బలహీనత."

ఇంకా అన్నారు "నేను చెప్పేది ఈవాళ నీకు నచ్చడం లేదు, అది నాకు బోధపడుతూ ఉంది. గాని నేను ఒక్క మాట చెపుతాను కొంచెం యోచించి చూడు. తల్లి తన ఆభరణాలు పెట్టి తన పిల్లలలో ప్రతి పిల్లను ముస్తాబు చేసి-నట్టుగా భూదేవి ప్రతి దేశాన్నీ తన అలంకారాలతో ముస్తాబు చేస్తుంది—అలాగు చేసే రోజు వచ్చింది. ప్రతివాళ్ల ఉద్దే-శాలూ భావాలూ, పద్ధతులూ, తిండీ, ముస్తాబూ, అన్నీ కూడా భూదేవి కోరికను అనుసరించి ఉంటాయి. ఈ యుగం ప్రతిజాతియొక్క సౌభాగ్యం కోసమనీ వచ్చిన యుగం అని నా నమ్మకం. అటువంటి సౌభాగ్యాన్ని స్వీకరించక పోవడం వీరుల లక్షణం కాదు."

తరువాత ఒక గొప్ప చిక్కు వచ్చిపడ్డది. మిస్ గిల్బీ కొత్తగా మా ఇంటికి వచ్చినప్పుడు పెద్ద గోల్‌మాల్ అయింది. కొన్నాళ్లకు పాత అయిపోయి అందరూ మరిచిపోయినారు,

ఆనూటా అడుగున పడిపోయింది. ఇప్పుడు తిరిగి అంతా కెలికి పైకి తీశారు. మిస్ గిల్బీ ఇంగ్లీషుమనిషా బంగాలీమనిషా అన్న ప్రశ్న చాలాకాలంకిందటనే మరిచిపోయినాను, గాని ఇప్పుడు అది రోజూ జ్ఞాపకం వస్తూఉండేది. మిస్ గిల్బీని పంపించేయాలని ఆయనతో అన్నాను. ఆయన ఏమీ అనకుండా ఊరుకున్నారు. ఆవాళ నా నోటికి వచ్చిందంతా అన్నేశాను. ఆయన ముఖం వాడి పోయింది. బయిటికి వెళిపోయినారు. నేను మనస్ఫూర్తిగా ఏడ్చేశాను ఒక్కమారు. మనస్సు కొంచెం మెత్తనయింది. రాత్రి ఆయనవచ్చి అన్నారు "చూడు, మిస్ గిల్బీ ఇంగ్లీషుఆవిడ గనుక ఆమె మనిషి అన్నమాటే మరిచిపోయి ఏదో ఒకమనోభావాన్ని చూచినట్టుగా చూడమంటే నాతరంకాదు. ఇన్నాళ్లనాటి స్నేహాన్ని తోసేసి ఆమెను మరిచిపోయి, ఆమె జాతీ, పేరూ, జ్ఞాపకంతెచ్చుకొని, లేని విరోధం కల్పించుకుంటావా! నీమీాద ఆమెకు ఎంతప్రేమో మరిచిపోయినావేమో!"

నాకు కొంచెం సిగ్గువేసింది, అభిమానంతో అన్నాను, "పోనీ ఉండ నివ్వండి, ఆమెను పంపేయమని ఎవరు అన్నారు మీాతో?"

మిస్ గిల్బీని పంపలేదు. ఆమె ఒకనాడు చర్చికి వెళుతూ ఉంటే మా దూరపు బంధువుడు, ఒక కుర్రవాడు, ఆమెను రాయి పుచ్చుకుకొట్టి అవమర్యాదా చేశాడు. నా భర్త

ఆ కుర్రవాణ్ణి ఎన్నాళ్లనుంచో పోషిస్తున్నారు, ఇప్పుడు అతనిని ఇంట్లోనుంచి పొమ్మన్నారు. అందుకని పెద్ద గోల-పుట్టింది. ఆకుర్రవాడు చెప్పినదంతా అందరూ నమ్మారు. మిస్ గిల్బీ అతనిని అవమర్యాదా చేసి పైగా అతనిమీద కల్పించి చెపుతూఉన్నదని అందరూ అన్నారు. నిజమే అయిఉంటుం-దని నాకూ అనిపించింది, ఏమోగాని. ఆకుర్రవాడికి తల్లి లేదు. అతని పినతండ్రి కొడుకు వచ్చి నా కాళ్లు పట్టుకున్నాడు. నేను అతని పక్షముయి చాలా ప్రయత్నంచేశాను, చాలా వాదిం-చాను, గాని ఏమీ లాభం లేకపోయింది.

ఆవాళ నా భర్త చేసిన పని ఎవరూ క్షమించ లేక పోయినారు. నేనూ క్షమించ లేదు. మనస్సులో నేను ఆయ-నను నిందించాను కూడాను. ఈమారు మిస్‌గిల్బీ తనంతట తానే వెళిపోయిం. వెళిపోయేముందర ఆమె కళ్లవెంట నీళ్లు వచ్చాయి, అయినా నా మనస్సు మాత్రం ఏమీ కరగలేదు. పాపం, ఉత్త ధర్మానికి వాడి కూటిలో మన్నుపోసేసి మరీ వెళిపోయిందమ్మా! ఇక ఆపిల్లడేమిటి! స్వదేశీ అంటే స్నానం పానం ఏమైనా ఉండేదా! మిస్‌గిల్బీని తనగుర్రపు-బండీలో స్టేషనుకు తీసుకువెళ్లి స్వయంగా తానే రైలు ఎక్కించి వచ్చారు.

అది చూస్తే, గొప్పకి మరీ చేస్తున్నారు అనిపించింది నాకు. ఈ సంగతే మరికొన్ని వన్నెలూ చిన్నెలూ కలిపి పేప-ర్లలో ఎక్కించారు—తగిన శాస్తి అయింది అనుకున్నాను.

ఇంతకు ముందు నాకు ఆయనమీద చాలా సార్లు కోపం వచ్చింది. గాని ఎన్నడూ ఆయనంటే సిగ్గు పుట్టలేదు. ఇప్పుడు సిగ్గుపడవలసికూడా వచ్చింది. నరేన్ అపరాధం చేశాడో చేయలేదో నాకు తెలియదు — విచారణచేసి ఆ సంగతి స్థిరపరచడం సిగ్గులేనివాళ్లు చేయవలసినపని. ఏ ఉద్దేశం మనస్సులో పెట్టుకొని ఆ కుర్రవాడు దొరసానిని పరాభవించ గలిగాడో ఆ ఉద్దేశాన్ని అణిచేయడం నాకు ఎంతమాత్రం ఇష్టం లేదు. ఎన్ని విధాల తంటాలు పడ్డా నా భర్తకు ఆసంగతి బోధపడకపోవడానికి కారణం, ఆయనకు పౌరుషం లేక పోవడమే. అందుచేతనే నాకు సిగ్గువేసింది.

అంతే కాదు. నేను ఓడి పోయినాను కదా అని కడుపులో పుట్టరాని దుఃఖం పుట్టింది. నా ఉద్రేకం కేవలం నన్నే దగ్ధం చేసింది గాని ఆయనలో మాత్రం ఎటువంటి కదలికా పుట్టించలేదు. ఇది నా సతీత్వానికి కలిగిన పరాభవం.

స్వదేశీ అంటే నాభర్తకు నమ్మకమా లేక ఆయన స్వదేశీకి విరుద్ధమా అన్న ప్రశ్న కాదు ఇప్పుడు. 'వందే మాతరం' మంత్రం ఆయన శిరసావహించ లేరట, "దేశానికి సేవ చేయడానికి సిద్ధంగా ఉన్నాను గాని పూజ మాత్రం చేయలేను; పూజచేయ వలసినది దేశంకంటే చాలా పైది.; దేశాన్ని పూజచేయడం అంటే దేశంయొక్క నాశనం కోరడం అన్నమాట," అని ఆయన అన్నారు.

ఆ రోజులలో సందీప్ బాబు స్వదేశీ ప్రచారానికని తన దండును తోడ్పుకొని మా ఊరు వచ్చాడు. మధ్యాహ్నం మా నాటకశాలల్లో సభ. ఆడవాళ్లమంతా బాల్కనీమీద ఒక పక్కను చిక్కటడకలు వేసుకొని కూర్చున్నాము. వందే-మాతరం శబ్దం సింహనాదంలాగు వినబడుతూఉంది; క్రమ క్రమంగా దగ్గిరికి వస్తూఉంది; ఆవేశంఎత్తి నా ఒంట్లో ఒక విధమైన కంపం పుట్టింది.

తొలకరి వర్షాలు పడడంతోనే ఎండిపోయిన ఏటి-లోకి ఎర్రని వరదలువచ్చి పడ్డట్టుగా కాషాయివస్త్రాలు ధరించి, జేగురురంగు పగిడీలు చుట్టుకొని, చెప్పుజోళ్లు లేకుండా ఉత్త కాళ్లతో ఒక బాలకుల దళం మా పెద్ద అంగణంలో హఠా-త్తుగా వచ్చిపడ్డది. సందీప్ బాబును ఒక పెద్ద కుర్చీమీద కూర్చోబెట్టి పదిపన్నెండుగురు కుర్రవాళ్లు ఆ కుర్చీని భుజం-మీద ఎక్కించుకొని, ఆ జనంమధ్యనుంచి మోసుకుతెచ్చారు. వందే మాతరం! వందే మాతరం!! వందే మాతరం!!! ఆకాశమంతా బద్దలయి ముక్కలుచెక్కలయి పడిపోతుందా అనిపించింది.

సందీప్ బాబు ఫోటో ఇంతకు ముందే చూచాను. చూచినప్పుడు బాగున్నట్టు అనిపించింది అని చెప్పలేను. అందు చేత, వికారంగా ఉందనీ కాదు నేననేది—ముఖంలో కావలసి నంత అందం ఉన్నట్టే తోచింది, గాని ఎంత కాంతిఉన్నా కలితీ

ఉన్నట్టు కనబడ్డది; ఆ ఆకారమూ, ఆ కళ్లూ, ఆ పెదవుల్లూ చూస్తే మంచిబంగారం కాదు అనిపించింది.

అందుచేత నా భర్త, ఎటువంటి ఆలోచనా లేకుండా, అతను అడగినదంతా ఇచ్చేస్తూ ఉంటే నాకు కష్టం అనిపించేది. వృథాఖర్చు చేస్తే చూచి ఊరుకో గలిగి ఉందును. కాని స్నేహితుడు అయిఉండికూడా నా భర్తను మోసపుస్తూఉండే వాడు. అతని తరహా యోగులమోస్తరూ కాదు, సామాన్య సంసార్లమోస్తరూ కాదు. అతను పక్కా బాబు! భోగము అంటే సరదా పోలేదు.—ఇటువంటివి నానా రకాల ఊహాలు నా మనస్సుకు తట్టాయి ఆవాళ; ఇప్పుడు అవన్నీ జ్ఞాపకం వస్తూ ఉన్నవి. గాని ఏమి ప్రయోజనం ఇప్పుడు, అవి అలాగు ఉండనీ.

సందీప్ బాబు ఉపన్యాసం ప్రారంభించాడు. ఆ మహా సభలో ఉండేవాళ్ల మనస్సులన్నీ చంచలమయిపోయి, గట్లు కొట్టేసి పారుతూఉన్న మహానదిలోలాగు, అతని వాక్ప్రవాహంలో కొట్టుకుపోతూ ఉన్నప్పుడు, అతని ముఖం చూచాను. ముఖం అంటే అదీ ముఖం! సాయంకాలమయ్యి సూర్యుడు కిందికి దిగాడు. కిరణాలు డాబాకిందనుంచి వచ్చి హఠాత్తుగా అతని ముఖంనిండా పడి అతనిని తేజోమూర్తిని చేశాయి. అప్పుడు "ఇతను స్వర్గలోకంనుంచి వచ్చిన మనుష్యుడు" అని ఆ దేవేంద్రుడు స్వయంగా వచ్చి అందరు స్త్రీపురుషులఎదుటా చాటిస్తున్నాడా అనిపించింది. అతను ఆడే

మాటలు తుపానుగాలిలాగు తెరతెరలుగా వచ్చి ఒక్కొక్క ఊపు ఊపేశేవి. అతని సహసానికి అంతం కనబడలేదు. నా కళ్ల-ముందర ఏచిన్న చిక్కుతడకముక్క అడ్డుఉండెను. ఆకాస్తా నేను సహించలేకపోయినాను. నామట్టుకు నాకే తెలియకుండా ఎప్పుడు ఆ చిక్కు పక్కకు తోసేసి, ముఖం పైకి పెట్టి, అతని ముఖం వైపు చూడడం ప్రారంభించానో, అదికూడా నాకు జ్ఞాపకంరాకుండా ఉన్నది. నావైపు చూచేపాటి వ్యవధి ఆసభ అంతటిలోనూ ఒకడికైనా చిక్కలేదు. ఒక్కమారు మాత్రం నక్షత్రాలలాంటి, సందీప్‌బాబు రెండుకళ్లూ నామీాద పడ్డవి. గాని నాబంటిమీాద తెలివి లేదు. నేను అప్పుడు రాజుగారి ఇంటికోడలనా? కాను. బంగాళాదేశంలో ఉన్న స్త్రీలందరికీ ప్రతినిధిని—ఏకప్రతినిధిని. అతను బంగాళా దేశానికి వీరుడు. సూర్యకిరణాలు వచ్చి అతని ముఖంమీాద పడుతూ ఉన్నట్టు-గానే దేశంలోఉన్న నారీ మణుల హృదయానురాగరసంతో చేసిన అభిషేకం అతనికి అందాలి. అప్పుడే అతని రణయాత్ర సఫలం అవుతుంది.

నావైపు ఆయన చూచినప్పటినుండీ ఆయన మాటలు మరింత తీవ్రమయిన జ్వాలలుగా మండడం ఆరంభించాయి. అది నాకూ స్పష్టంగా కనబడ్డది. ఇంద్రుని గుర్రం కళ్లాలకు మరి లొంగిందికాదు—మెరుపు మీాద మెరుపు, పిడుగుమీాద పిడుగు! నా కళ్ల అగ్నిశిఖలవల్ల పుట్టిన నిప్పే ఇదంతా అని

నా మనస్సులో ఏదో చెపుతూ ఉండెను. స్త్రీ అంటే కేవలం లక్ష్మేకాదు, సరస్వతి కూడా కదా!

ఆవాళ ఒక అపూర్వమైన ఆనందంతో ఇంటికి తిరిగి వచ్చాను. నాలో ఒక కొత్త గర్వం పుట్టింది. లోపున ఒక అగ్నితూపాను పుట్టి నన్ను ఒక మూలనుండి మరి ఒక మూలకు ఈడ్చుకు పోయింది. గ్రీక్ వీరాంగనలలాగు నా పొడుగు జుట్టుఅంతా కత్తిరించి ఈవీరుని ధనస్సుకు నారి చేదామని కోరికపుట్టింది. లోపునఉండే మనస్సుకూ పైనుండే వస్తువులకూ సంబంధం ఉన్నట్టయితే ఆవాళ నా మెడలోని • కంటా, నా హారమూ, నా జాజీబందులూ ఉల్కావృష్టిలాగు ఆ సభ మధ్యను రాలిఉండును. ఏదో ఒక గొప్ప త్యాగం చేస్తేనే గాని సహించ శక్యముకాని ఉత్సాహావేగం అది.

ఆవాళ సాయంకాలం నా భర్త ఇంటికి వచ్చాక నాకు ఒక భయం పట్టుకుంది. ఆవాళ ఉపన్యాసంవల్ల నా మనస్సులో పుట్టిన రాగంతో కలియని మాటలేమైనా అంటారా? ఆయన సత్యప్రియత్వానికి ఎక్కడైనా దెబ్బతగలడంవల్ల వక్త చెప్పినదానికి విరుద్ధంగా ఏమైనా అంటారా? అంటే మాత్రం ఊరుకోను, తప్పకుండా అవమానపరిచి ఉందును.

కాని, ఆయన నాతో ఏమీ అనలేదు. అదీ నాకు బాగుండ లేదు. "సందీప్ అన్నమాటలు విని నాకు తెలివి వచ్చింది.. ఈ విషయములన్నిటిలో అనేక సంవత్సరాలబట్టీ

నాకుండే భ్రమ పోయింది."—అని ఆయన అనవలసిఉండెను. ఆయన బలవంతాన నోరు కట్టుకొని కూర్చున్నారు. ఉత్సాహం ఎక్కడ వెల్లడయిపోతుందో అని అతి జాగ్రత్తగా ఉన్నారు అనిపించింది.

"సందీప్ బాబు ఇంకా ఇక్కడ ఎన్నాళ్లు ఉంటారు ?" అని అడిగాను

"రేపుప్రొద్దున్నే రంగపూర్ వెళ్ళి పోతాడు."

"రేపు ప్రొద్దున్నే ?"

"అవును, రేపు అతని లెక్చరుకి అక్కడ ఏర్పాటు చేశారు."

కొంచెంసేపు ఊరుకొని అన్నాను— "ఏవిధంగానైనా రేపు ఉండిపోవడానికి వీలు లేదు కాబోలు ?"

"సాధ్యం కాదు అనుకుంటాను—అయినా, ఎందుకో చెప్పు, విందాం ?"

"అతన్ని విందుకుపిలిచి నేనే స్వయంగా దగ్గిరఉండి అతిథిసత్కారం చేదామని చాలా కోరికగా ఉన్నది." ఆమాట విని నా భర్త ఆశ్చర్యపడ్డారు. ఇంతకుముందు ఎన్నో సార్లు లన స్నేహితులను విందుకుపిలిచి నన్ను దగ్గిర ఉండమని ఎంతో కోరారు. నేను ఎంతమాత్రం ఇష్టపడ లేదు.

ఆయన నావైపు రెప్పవెయ్యకుండా అదొక చిత్రంగా చూచారు—దాని అర్థం నాకు బాగా బోధపడలేదు. హఠా-

త్తుగా. లోపున ఒక విధమైన సిగ్గు పుట్టి అన్నాను—"వద్దు వద్దు, ఎందుకు లెండి."

"ఏమిా, ఎందుకు ఏమిటి? సందీప్‌తో చెపుతాను—ఏవిధంగానైనా వీలైతే ఉంటాడు."

వీలుఅయింది.

నిజం చెపుతాను. ఒక అద్భుతమైన రూపు ఈశ్వరుడు నాకు ఎందుకు ఇచ్చాడు కాదు అని అనిపించింది ఆవాళ. ఎవరి మనస్సూ వశపరుచుకుందామని కాదు నేను కోరేది; రూపు ఒక గౌరవనీయమైన వస్తువు అని. ఈ శుభదినంనాడు దేశంలో యావన్మంది పురుషులూ ఒక్కమాటు జగద్ధాత్రిని దేశంలో-ఉన్న స్త్రీలలో చూడాలి. అయితే ఏమిటీ—పైరూపు లేకపోతే వాళ్ల కళ్లు లోపునున్న దేవిని కనిపెట్ట లేవు. మేలుకొనిఉన్న ఆ దేశశక్తిని సందీప్ బాబు నాలో చూచి పోల్చుకోగలడూ? లేక, ఈమె ఎవరో సామాన్య స్త్రీ, తన స్నేహితుని భార్య కదా అను కుంటాడా?

ఆవాళ ఉదయమే లేచి తలరుద్దుకొని నా పెద్దజుట్టు అంతా ఒక ఎర్రని రిబ్బన్‌తో చక్కగా కట్టాను—జుట్టు తడిగా ఉండడంచేత సిగవేసుకోడానికి వీలుఅయింది కాదు. తెల్లని మెడ్రాస్ జరీచీర ఒకటి కట్టుకున్నాను, పొట్టిచేతుల జరీజాకెట్ తొడుగుకున్నాను.

చాలా మితమయిన ముస్తాబు, అంతకంటే తక్కువ ఏలాగు, అనుకున్నాను. అటువంటి సమయంలో మా చిన్న తోటికోడలు వచ్చి నన్ను చూచింది. తలదగ్గిర నుంచి పాదాల-దాకా పరిక్షచేసింది. తరవాత పెదవులు రెండూ విరుచుకొని చిరినవ్వు నవ్వింది. "ఏమి అక్కా, నవ్వుతున్నా వేమి?" అని నేను అడిగాను.

"నీ ముస్తాబు చూస్తున్నాను."

"ఇదీ ముస్తాబేనా?"

మరిఒక మారు ఆ దొంగనవ్వు నవ్వి అన్నది—"ఏమీ భయంలేదమ్మా ఛోటారాణి బాగానే ఉంది! కాని ఆ దొరల దుకాణంలో కొన్న ఒదులుమెడజాకెట్ మాత్రం వేసి కొంటివా అంటే, బహు ప్రశస్తంగా ఉంటుంది, ఏ-మీ లోటు ఉండదు, దానితో ముస్తాబు సంపూర్తి అయిపోతుంది."

అంటూ, ఒక్క నోరూ కళ్లే కాకుండా, తలనుండి పాదాలదాకా ఒళ్లంతా కదిలించి, గదిలోనుంచి బయటికి వెళిపోయింది. నాకు మహా కోపం వచ్చింది. అన్నీ విప్పి పారేసి, రోజూ కట్టుకొనే బట్టలు కట్టుకుందామని బుద్ధి పుట్టింది. గాని ఆ కోరిక నెరవేర లేదు—ఎందుకు నెరవేర్చలేక పోయినానో నాకు బోధ పడలేదు, గాని నాలో నేను అను-కున్నాను—మంచిబట్టలు కట్టుకొని మర్యాదాకు తగిన ముస్తాబు

లేకుండా సందీప్ బాబు ఎదుటకు వస్తే నా భర్తకు కోపం వస్తుంది. స్త్రీ సంఘానికి లక్ష్మి కదా!"

సందీప్ బాబు భోజనానికి కూర్చున్న తరువాత అగపడ దాము, మొట్టమొదటి మాటు కలుసుకోనేటప్పుడు ఉండే సిగ్గు ఆ వడ్డించడం హడావిడిలో చాలాభాగం తగ్గిపోతుంది అని అనుకున్నాను. అయితే ఆవాళ వంట ఆలస్యం అవుతూ ఉంది; అప్పుడే సుమారు ఒంటి ఘంట అయింది. అందుచేత, మాట్లా-డుతూ ఉండవచ్చును రమ్మని నాకు కబురు పంపించారు. గదిలోకి వెళ్లి మొదటి మాటు అతని ముఖం చూడడానికి చాలా సిగ్గు వేసింది. అది ఏలాగో సాధించి మనస్సు బిగబెట్టుకొని బల-వంతాన అన్నాను—"మీ భోజనం ఈవాళ చాలా ఆలస్యం అయిపోయింది."

ఏమీ సంకోచం లేకుండా, నా పక్కనుండే కుర్చీమీదికి వచ్చి అన్నాడు, ఆయన—"అన్నం ఏమో రోజూ ఏదోఒక మోస్తరుగా దొరుకుతుంది, గాని అన్నపూర్ణ మాత్రం లోపునే ఉంటుంది. ఇప్పుడు అన్నపూర్ణాదేవి వచ్చింది గనుక అన్నం, కావాలంటే, వెనకకు ఉండనివ్వండి." అతని లెక్చర్‌లో ఎటు-వంటి జోరో పనులలోకూడా అటువంటి జోరే— కొంచ-మయినా సంకోచం లేదు. ఎక్కడికి వెళ్లినా అతి శీఘ్రంగా అతని ఆసనం అతను తీసుకుంటాడు—అదే అతని అభ్యాసం. ఎవరు ఏమనుకుంటారో అనే ఆలోచన అతనికి లేదు. బాగా

దగ్గిరికివచ్చి కూర్చోడం అతనికి ఒక విధంగా స్వాభావిక మైన హక్కు; గనుక అందులో తప్పుఎంచినవాళ్లదే దోషం.

సందీప్ బాబు నన్ను ఒక పూర్వకాలపు మనిషి అనుకొని, ఒక జడ పదార్థంతో సమానంగా చూస్తాడేమో అని నాకు చాలా భయంగా ఉండెను. చరచరమని మాటలాడడం గాని, అతనికి ఆశ్చర్యం పుట్టించే జబాబులు ఇవ్వడం గాని నాకు చేతనయింది కాదు. నొచ్చుకున్నాను. పిలిచినంత మాత్రాన ఎందుకు ఈలాగు అతని ఎదుటకు వచ్చేశాను అని అనేక విధాల నాలో నేను నింపించుకున్నాను.

ఏదో ఒక విధంగా భోజనం అయిపోవడంలో తొందరతొందరగా వెళిపోబోయినాను. అతను లేచి, ద్వారం దగ్గిరికి వచ్చి, మొదటి మోస్తరుగానే, ఏసంకోచమూ లేకుండా, నాదారికి అడ్డుగా నిలుచొని అన్నాడు. "నన్ను తిండి పోతుక్రింద లెక్కవేయకండి, భోజనంఆశమీాద నేను ఇక్కడికి రాలేదు, మీారు పిలిచారు అని వచ్చాను. భోజనం కాగానే ఈలాగు పారిపోయినట్టయితే అతిథిని మోసపుచ్చినట్టే."

ఈ మాటలన్నీ అతి చనువుగానూ, సాఫుగానూ అనకపోతే అపస్వరంతో పాడిన పాటలాగే ఉండును. ఇంతకూ అతను నా భర్తగారి స్నేహితుడు, నేను అతనికి వదినగారి మోస్తరు. నాలో నేను కొట్లాడుకుంటూ సందీప్ బాబు కనపరచిన చుట్టరికానికి తగిన స్నేహం ఏరూపంగా వెళ్లడి

చేయగలను అని అనుకుంటూ ఉంటే నా తొట్రుపాటు చూచి నా భర్తన్నారు—"పోనీ అయితే, భోజనం చేయగానే వస్తావా?"

"వెళితేమాత్రం మాటఇచ్చి మరీ వెళ్లండి," అన్నాడు సందీప్‌బాబు. నవ్వుతూ నేను అన్నాను—"ఇప్పుడే వస్తు-న్నాను."

"మిమ్మల్ని ఎందుకు నమ్మలేదో చెపుతాను వినండి. నిఖిలేశ్ పెళ్లి అయి ఇప్పటికి తొమ్మిదేళ్లు అయింది. ఈ తొమ్మిది సంవత్సరాలూ మీరు నన్ను తప్పించుకువచ్చారు. ఇంకొక తొమ్మిది సంవత్సరాలు ఈలాగు చేశారా అంటే నాకు మరి చూడడం ప్రాప్తించదు."

నేనూ కొంచెం బాంధవ్యం కనపరచడం ప్రారంభిస్తూ మెల్లి మెల్లిగా అన్నాను—"అయితేమాత్రం ఎందుకు చూడడం కాకూడదు?"

"చిన్నవయస్సులోనే చచ్చిపోతానని నా జాతకంలో ఉన్నది. మా అన్నా, మా నాన్నా, ఎవరూకూడా ముప్పై ఏళ్లు దాటి వెళ్లలేదు. ఇదిగో, నాకు అప్పుడే ఇరవైఏడేళ్లు నిండి-పోయినవి.

ఆ మాట నాకు బాణంలాగు తగులుతుందని అతనికి తెలుసును. ఆలాగునే తగిలిందికూడాను. అతిమధురస్వరంతో అన్నాను—"దేశంలోఉండే యావన్మందిఆశీర్వాదమూ ఉంటూ

. అతనికి ఎప్పుడు గొప్ప అన్నరోగం పుట్టిందో ఆమాటల-న్నీ వచ్చాయి. ఏడు మాసాలనుంచి ఎటువంటి భరించశక్యం-కాని బాధ పడుతున్నాడో అది విన్నాను. ఏలోప్యాథిక్ వైద్యమూ మొదలయిన నానాప్రకాల ఉపద్రవాలు దాటివచ్చి చివరకు ఆయుర్వేదంవల్లనే ఎటువంటిఫలం పొందాడో ఆ వర్ణనంతా చేసి నవ్వుతూ అన్నాడు—"భగవంతుడు ఎంతచిత్రంగా చేస్తాడో చూడండి, చివరకు నాకు వచ్చే రోగాలుకూడా స్వదేశీమాత్రలతోనే గాని వెళ్లనంటాయి."

ఇంతసేపటివరకూ ఊరుకొని నా భర్త ఇప్పుడు అన్నారు—"అయినా, ఈ విదేశీ ఔషధాల కీనాలు నిన్ను వదలవు. నీ నరువాలో మూడు అరలనింకా—"

"అది ఏమిటో తెలుసునా! ప్యాసివ్ పాలిసీ. ప్యాసివ్ పాలిసీ ప్రయోజనంనుంచి వచ్చినవాళ్లు కాదు, అధునిక శాసనాలు వాళ్లను తీసుకువచ్చి మన నెత్తిమీద పెట్టాయి—మన డబ్బు తినడము, పైగా మనను కొట్టడము, వాళ్లు చేసే పని."

నా భర్తకు అతిశయోక్తి అంటే కోపము. గాని ఎటువంటి అలంకారమయినా అతిశయోక్తే కదా మరి! "అలంకారాలు దేవుడు సృష్టించినవి కావు, మనుష్యులు కల్పించినవి. చెట్లూ చేమలూ, పశువులూ పక్షులూ, మొదటినుంచి చివరదాకా అంతా నిజమే చెపుతుంటాయి; పాపం, వాటికి అబద్ధమాడడం

చేతకానే కాదు,'' అని, ఆడిన అబద్ధం ఏదో కప్పుదామని ఎప్పుడో అన్నాను. "ఈ విషయంలో మనుష్యులు గొప్ప పశువులకంటె, పురుషులకంటె స్త్రీలు గొప్ప. నగలు పెట్టుకొని ముస్తాబు కావడం ఆడవాళ్లకు ఏలాగు తగినదో, అబద్ధాలు ఆడడంకూడా అలాగే.''

గదిలోనుంచి బయటికి వచ్చి చూదునూ, చిన్నతోటి-కోడలు కిటికీతలుపు కటకటాలు ఎత్తిపట్టుకొని వరండామీద నిలుచొనిఉన్నది. "నువ్వు ఇక్కడేమిటి చేస్తున్నావు?" అని అన్నాను. "దొంగతనంగా వింటున్నాను,'' అని తకీమని జబాబు చెప్పింది.

భోజనంచేసి తిరిగివచ్చాను సందీప్ బాబు మృదు-స్వరంతో అడిగాడు—"మీ భోజనమేమీ ఈవాళ సరిగా కాలేనట్టు ఉన్నదే?''

అనేసరికి నాకు అతి సిగ్గువేసింది. రావడంలో తొందర కాస్త విస్తారం అయిపోయింది. మర్యాదగా కనబడాలంటె మరికొంచెంసేపు లోపలనేఉండి రావలసింది. ఆవాళ తినడం కంటె తినకపోవడమే జాస్తీఅయిపోయింది; ఏమాత్రం లెక్క-వేసిచూచినా అది తెలిసిఉండును. కాని అదంతా ఎవరయినా లెక్కవేస్తూఉండవచ్చునని నాకు తట్టలేదు.

నేను సిగ్గుపడడం చూచి ఉంటాడు సందీప్‌బాబు. ఆమాట అనుకొని మరింత సిగ్గుపడ్డాను. అదిచూచి అతను

అన్నాడు—"అడివిలో ఉండే లేడిలాగు, పారిపోదామనే మీ ప్రయత్నమంతా. అంత కష్టంగా ఉన్నా అన్నమాట తప్పకుండా రావడం మీరు నాకు ఒక గొప్ప బహుమతి ఇచ్చినట్టు భావించుకుంటాను."

ఆ మాటకు సరిఅయినజవాబుఏదీ ఇవ్వలేకపోయినాను. ముఖం ఎర్రగా చేసుకొని ఉంటాను; ఒళ్లంతా చెమటపట్టి-పోయి సోఫామీద ఒకమూల చతికిలబడిపోయినాను.

మూర్తీభవించిన నారీశక్తిలాగు ఎటువంటిసంకోచమూ లేకుండా అతి ఠీవిగా సందీప్‌బాబుముందరికి వచ్చి, కేవలం అతనికి దర్శనంఇవ్వడమే అతనికి కనకాభిషేకం చేయించడం అనిపించుదామని చాలా ఊహించాను. అది ఇంత వరకు కొంచెమయినా నెరవేరలేదు.

సందీప్‌బాబు కోరి మరీ వాదన ప్రారంభించాడు నా భర్తతో. వాదనలోనే తన తెలివితేటలు వాడిఅయిన కత్తిలాగు మెరుస్తవని అతనికి బాగా తెలుసును. వాదనకు అవకాశం దొరికితే, నేను దగ్గరఉంటేమాత్రం, ఎటువంటి చిన్నమాటయినా పట్టుకొనేవాడు—అది నేను అనేకసార్లు కనిపెట్టాను.

'వందేమాతరం' మంత్రంగురించి నా భర్త అభిప్రాయం అతనికి తెలుసును. అది మనస్సులో పెట్టుకొని సందీప్‌బాబు

అన్నాడు, "దేశాభిమానంతో సంబంధించిన పనులలో కల్ప-నాశక్తికి ఏమాత్రం స్థలమూ ఇవ్వనంటావా ఏమిటి నిఖిల్?"

"ఏమాత్రమూ ఇవ్వనను, అంతా ఇవ్వనంటాను. దేశం అనే దానిని దాని నిజరూపంతో చూడాలి, చూచి అందరికీ తెలియచేయాలి, ఇదీ నా కోరిక. ఇటువంటి గొప్ప వస్తువిషయంలో మనస్సును భ్రమలో పెట్టడానికి మంత్రాలు ఉపయోగించడంఅంటే నాకు భయంవేస్తుంది, సిగ్గువేస్తుంది."

"నువ్వు దేనిని మాయామంత్రం అంటున్నావో దానినే నేను సత్యం అంటున్నాను. నా దేశం నిజంగా దేవత అని నేను నమ్ముతాను నేను దేశనారాయణుని ఉపాసకుడను. భగవంతుని విశ్వరూపం మనుష్యులద్వారా ఏలాగు వెల్లడి అవుతుందో అలాగే దేశంద్వారాకూడా అవుతుంది."

"అది నువ్వు నిజంగా నమ్మినట్టయితే నీ మతం ప్రకారం మనిషికీ మనిషికీ భేదం లేదు, కాబట్టి దేశానికీ దేశానికీ కూడా ఎటువంటి భేదమూ ఉండకూడదు."

"అది నిజమే గాని నాకున్న శక్తి చాలా అల్పం, అందు-చేత నా దేశాన్ని ఒక్కదానినే పూజిస్తూ, ఆ పూజద్వారా దేశనారాయణున్ని పూజిస్తాను."

"పూజచేయవద్దని నేను అనలేదు, గాని ఇతర దేశాలలో ఉన్న నారాయణునియందు ఇంతద్వేషం కనబరిచి మీ పూజ ఏలాగు సఫలంచేసుకుంటారు?"

ఉన్న విలువైనదానిని నిర్మూలంచేసినవాణ్ణి కానూ? దొంగతనం చేయలేకపోవడం బుద్ధి ఉపయోగించడంవల్లనా, తర్కం చేయడం వల్లనా, లేక స్వాభిమానం ఉండడంవల్లనా?" అని అన్నారు నా భర్త.

నేను కోపం మరి పట్టలేక అన్నాను—"ఇంగ్లాండూ, జర్మనీ, రష్యా, ఫ్రాన్సూ మొదలయినదేశాల చరిత్రలు ఏమిటి? ఎవరిలాభంకోసం వారు చేసిన చోరీలకథలూ, దొంగలకథలూ కావా! ఆ దేశస్థులు మర్యాదస్థులని అన-లేదూ అందరూ?"

"దానికి జబాబుదారీ వాళ్లదే. అందుకు ప్రాచీ ఎప్పటికీ తప్పిపోదు. వాళ్లు చెల్లించవలసిన పినాల్టీ ఇప్పటికీ చెల్లిస్తూనే ఉన్నారు. దేశచరిత్రలు ఇంకా ముగిసిపోలేదు కదా!"

"మంచి మాటే—మేమూ అలాగే చెల్లిస్తాము," అన్నాడు సందీప్‌బాబు. "ముందు చోరీమాల్‌తో ఇల్లు నింపుకొని తరవాత సావకాశంగా సంవత్సరాలపట్టున చెల్లించ-వలసిన పినాల్టీ చెల్లిస్తాము. గాని ఒక్కమాట అడుగుతాను చెప్పు, వాళ్లు ఇప్పటికీ ఋణంచెల్లిస్తున్నారన్నావే, అది ఏదీ? ఎక్కడా చెల్లించడం కనబడదే?"

"రోమ్ నగరం తాను చేసిన పాపాలకని ప్రాయశ్చిత్తం చేస్తూ ఉండేటప్పుడూ ఆ సంగతి ఎవరూ పోల్చుకోలేకపోయినారు, మితిలేని ఐశ్వర్యం దానిది అప్పుడు. మర్యాదస్థులు చేసే ఈ

మహాపాతకాలకి అయే ప్రాయశ్చిత్తం ఎప్పుడు ప్రారంభం అవుతుందో, అది పైనుంచి కనబడదు. గాని ఒక్కసంగతి కనబడడం లేదూ?—వాళ్ల *పొలిటికల్ బ్యాగ్స్ నిండా ఉన్న అబద్ధాలూ, మోసమూ, విశ్వాసఘాతకత్వమూ, గూఢచారి-వ్యవహారాలూ, † ప్రెస్టిజ్ నిలుపుకోవడమూ, స్వలాభంకోసం న్యాయమూ, సత్యమూ ధారపోసేయడమూ, మొదలయిన పాపాలభారం తక్కువకాదు అని తెలుస్తూ ఉండడం లేదూ? ఇవన్నీ వాళ్ల గుండెలలోని రక్తాన్ని రోజురోజుకీ పీల్చేయడం లేదూ? సత్యాన్ని దేశంకంటె గొప్పదానిగా మన్నించనివాడు దేశాన్నిమాత్రం మన్నిస్తాడూ? నేను అన్నాను, చూస్తూ ఉండు."



నా భర్త పైవాళ్లతో వాదనచేయడం నేను ఎప్పుడూ చూడలేదు. నాతో అనేక సంగ్యాయాలు చేశారు, గాని నామీద ఆయనకు అతిదయ, గనుక నన్ను నీగకొట్టడమంటే ఆయనకు బహు బాధగా ఉంటుంది. ఈవాళ చూచాను. ఆయన శక్తి.

ఆయన చెప్పినది నామనస్సు ఎంతమాత్రం ఒప్పుకోకుండా ఉంది. 'దానికి తగిన జవాబు ఉన్నది, ,గాని నాకు నిలుచున్న పాటున తట్టకుండా ఉన్నది,' అని అనుకున్నాను. వచ్చిన

---

* పొలిటికల్ బ్యాగ్స్ : Political Bags: రాజకీయవ్యవహార సంబంధమైన సంచులు.

† ప్రెస్టిజ్ : Prestige: ప్రతిష్ఠ.

చిక్కు ఏమిటంటే దేనినైనా 'ధర్మం గనుక అంగీకరించ-వలసింది,' అని చెప్తూఉంటే, 'అయినా అంగీకరించను,' అని అనలేము. ధర్మాన్నయినా 'అంతదాకా' మన్నించకూడదు అనిచెప్పడం సులభమైన పనికాదు. ఆ వాదనకు తగిన జవాబు కాగితంమీద వ్రాసి సందీప్ చేతికి ఇద్దామని నిశ్చయించు-కున్నాను. అందుకని గదిలోకి వెళుతూనే ఆవాళ జరిగిన వాదనంతా నోటుబుక్కులో వ్రాసి ఉంచాను

మధ్య ఒకమాటు నావైపు చూచి సందీప్ బాబు "మీ-రేమిటంటారు?" అన్నాడు.

"సూక్ష్మవాదన నాకిష్టంలేదు," అన్నాను. చెప్పమంటే మొత్తంమీద నా ఉద్దేశం ఏమిటో చెపుతాను వినండి——"నేను మనుష్యస్వభావంగలను. నాకు వాంఛ ఉన్నది. ప్రపం-చంలో మంచివి ఏవేవి ఉన్నవో అవన్నీ నా దేశంకోసం నాకు కావలెను. నాకు కావలసినదానిని బలవంతాన తీసుకుంటాను. నాకు కోపం ఉన్నది. దేశంకోసం కోపగిస్తాను. అవసరం ఉంటే దేశంకోసం దేనినైనా ముక్కముక్కలుచేస్తాను, గుండపిండి చేస్తాను. ఇన్నాళ్ళనుంచి మనుష్యత్వం అవమానించినవాళ్ళమీద పగతీర్చుకుంటాను. నాకు మోహం ఉన్నది, దేశాన్ని చూచి వ్యామోహపడతాను. దేశంయొక్క ప్రత్యక్షమూర్తి ఒకటి నాకు కావలెను: దానిని నేను 'అమ్మా' అని పిలుస్తాను, 'దుర్గా' అని పిలుస్తాను; ఆమెకు పశువులను బలిఇచ్చి భూమిని

రక్తంతో నింపుతాను — నేను మనుష్యమాత్రుడాలను, నేను దేవతను కాను."

సందీప్‌బాబు "హుర్రా, హుర్రా!" అని కేకలువేస్తూ చేతులుఎత్తుకొని కుర్చీమీదనుంచి లేచాడు. ఆ ప్రత్తక్షణం తప్పుదిద్దుకొని "వందేమాతరం, వందేమాతరం!" అన్నాడు.

నా భర్తమనస్సులో ఒక గొప్ప బాధ పుట్టింది. ఆ బాధ ఆయన ముఖాన ఒక మేఘంలాగు కప్పుకువచ్చింది. మెల్లి మెల్లిగా అన్నారు — "నేనూ దేవతను కాను, మనుష్యుణ్ణే. అందుచేతనే నేను అలా అంటున్నాను. నాలో ఉన్న చెడుగు నేను ఎంతమాత్రం నాదేశానికి ఇవ్వను, ఎంతమాత్రం ఇవ్వను, ఎంతమాత్రం ఇవ్వను."

"చూడు, నిఖిల్, 'సత్యం' అనేది ఆడవాళ్లలో ప్రాణంతో ఏకమయి ఒక సహజదార్ఢ్యం అవుతుంది. మనలో ఉన్న సత్యానికి కళలేదు, రసంలేదు, ప్రాణంలేదు. మనలో ఉన్న సత్యం సత్యంకాదు, యుక్తి. స్త్రీ హృదయం ఒక పద్మం. సత్యం రూపంధరించి దానిమీద కూర్చొని ప్రకాశిస్తుంటుంది. ఆ సత్యం మనలో ఉన్న యుక్తిలాగు రూపంలేనివస్తువు కాదు. అందుచేతనే స్త్రీలకు క్రూరంగాఉండడం తెలుసును. పురుషులకు తెలియదు. ధర్మబుద్ధి పురుషుణ్ణి కట్టివేసేస్తూఉంది, బలహీనుణ్ణి చేసేస్తూఉంది. స్త్రీ సునాయాసంగా దేనినైనా నాశనంచేసేయగలదు; పురుషుడుకూడా చేయగలడు, గాని

అతి ఆలోచనవల్ల తనను తానే భయపెట్టుకుంటాడు. . ఆడది ఒక తుపానుమోస్తరుగా వచ్చిపడి అన్యాయం చేసేయగలదు. అతిమనోహరంగా కనబడుతుంది ఆ అన్యాయం. మొగవాడు చేసే అన్యాయం అసహ్యంగా కనబడుతుంది. ఎందుచేతనంటే మొగవాళ్లను ఒకపక్కనుంచి న్యాయబుద్ధి పీడిస్తూఉంటుంది. ఇదుగో, ఇదే చెపుతున్నాను, జ్ఞాపకం ఉంచుకో నిఖిల్, మన దేశాన్ని ఇప్పుడు మనస్త్రీలే రక్షిస్తారు. ధర్మమా అధర్మమా అని విచారించవలసినరోజులు కావు ఇవి. ఎటువంటి ఆలో-చనా లేకుండా క్రూరకృత్యాలు చేయవలెను ఇప్పుడు, అన్యాయం చేయవలెను. మన స్త్రీలచేత పాపానికి రక్తచందనం పూయించి పూజచేయించవలెను. ఆ మహాపురుషు డెవడో పాడిన పాట జ్ఞాపకం లేదూ నిఖిల్ ?—

సుందరీ రావే దుష్కృతీ !

సుందరీ, భవదీయ చుంబన

వహ్నిత ప్తస్వాదు మదిరను

పొందుగా నా రక్తనాళము

లందు పడి ప్రవహింప నిమ్మో,

సుందరీ !

చెలఁగనీ నీ యశుభశంఖ

ధ్వానములు నలు దిక్కు లదలఁగ

## ఇంటా బయటా

మలినమగు నీచెడు కళంకము
అలముకొననీ నా లలాటము.

సుందరీ !

సిగ్గుమాలిన కారు కలుషపు
పంకమును నా యురము నిండా
ఎగ్గులను చిత్రింపఁ బూయుము
పాపినీ ప్రళయంకరీ,

సుందరీ !

నవ్వుతూ నాశనం చేయలేని ధర్మబుద్ధి ఇవ్వాళ నాశనం అయిపోనుగాక !

ఈ మాటలు అంటూ నేలమీద రెండు మార్లు తన్నాడు. ఎన్నాళ్లబట్టో నిద్రపోతూఉన్న ధూళి తివాసీలో-నుంచి లేచింది. దేశదేశాలలో యుగయుగాలనుండి మహా మన్ననతో వస్తూఉన్న వాటినన్నిటినీ అతి స్వల్పంగా చూస్తూ సందీప్‌బాబు మెడ వంకచేసి ఠీవిగా ఎదుట నిలబడేసరికి నా ఒళ్లు పులకరించింది.

పెద్ద గర్జనతో మళ్లా ప్రారంభించాడు, "ఇల్లు తగలబెట్టి ప్రపంచానికి వెలుతురు నిచ్చే ఆ మనోహరమైన అగ్ని దేవతవు నీవే అని నాకు ఈవాళ స్పష్టమయింది. అంతా నాశనం చేయగలిగే శక్తి మాకు దయచేయి. మేము చేయబోయే అన్యాయం మనోహరం చేయి"

ఈ చివర నాలుగుమాటలూ ఎవరితో అన్నాడో అది నాకు సరిగా బోధపడలేదు. అతను వందేమాతరం అంటూ పూజచేస్తున్న దేవత కావచ్చును, లేదా, మూర్తీభవించి తన ముందర కూర్చున్న దేశశక్తి, నారీశక్తి, కావచ్చును.

అదే ధోరణిలో ఇంకా మాట్లాడిఉండునని అనుకుంటాను. అప్పుడు నాభర్త లేచి అతని భుజంమీద చెయ్యివేసి మెల్లిగా అన్నారు — "సందీప్! చంద్రనాథబాబు వచ్చారు."

ఉలిక్కిపడి వెనుకకు తిరిగి చూచాను. సౌమ్యమూర్తి, వృద్ధుడొకడు లోపలికి పోనా వద్దా అని ఆలోచిస్తూ ద్వారం దగ్గర నిలుచున్నాడు. అతని ముఖం అస్తమిస్తూఉన్న సూర్యబింబంలాగు అతి సాధువుగా ఉన్నది. నా భర్త నావద్దకి వచ్చి నాతో అన్నారు, "ఈయన నా మాష్టరుగారు, ఈయన సంగతే నీతో చాలాసార్లు అంటూవచ్చాను. ఆయనకు నమస్కారం చేయి."

ఆయనపాదధూళి తీసుకొని నమస్కారం చేశాను. "ఈశ్వరుడు నిన్ను శాశ్వతకాలం కాపాడును గాక," అని. ఆయన ఆశీర్వదించాడు. అప్పుడు ఆ ఆశీర్వాదం నాకు నిజంగా అవసరమే!

# నిఖిల్ చెప్పిన కథ

దేవుడు నాకు ఏమిటి ఇస్తే అది పుచ్చుకొని సహించి ఊరుకో గలనని ఒకప్పుడు నాకు చాలా నమ్మకం ఉండేది. ఇంత వరకు అది పరీక్షకు రాలేదు, గాని ఆ పరీక్షఅయే సమయం ఇప్పుడు వచ్చిందనుకుంటాను.

నా బలం ఎంతటిదో కనుక్కుందామని, నాలో నేను అనేకరకాల దుఃఖాలూ, అనేక కష్టాలూ వచ్చినట్టు ఊహిస్తుండే వాడను. ఒకమాటు నిరుపేదనయిపోయినట్టు అనుకున్నాను ఇంకొకమాటు జైలులో పడ్డట్టు, ఒకమాటు నలుగురూ కలిసి, నన్ను పరాభవించినట్టు, ఒకమాటు నేను చచ్చిపోయినట్టు, ఆఖరుకు ఒకనాడు విమల చచ్చిపోయినట్టుకూడా ఊహించే ప్రయత్నం చేశాను. ఇవన్నీ కూడా ఈశ్వరునికి నమస్కారం చేసి శిరసావహించగలనని అనేవాడను—ఆ అన్నది నిజంగా నమ్మే అనేవాడను.

ఒకటిమాత్రం ఎన్నడూ ఊహించనైనా లేదు. ఆ ఒక్కమాటా ఈరోజు ఉదయంనుంచి కూర్చొని ఆలోచిస్తు-న్నాను. ఇదికూడా సహించగలనూ?

నా మనస్సులోపల ఎక్కడో ఒకచోట ఒక చిన్న ముల్లు గుచ్చుకున్నది. అది చాలా బాధపెడుతున్నది. పనిపాటలు

చేసుకుంటున్నానే గాని లోపున బాధమాత్రం విశ్రామంలేకుండా ఉంటూనేఉంది. పడుకొని నిద్రపోతున్నప్పుడు, అన్నీ మరిచిపోయినా ఈ ఒక్కటిమాత్రం లోపునుంచి పొడుస్తూ ఉంటుంది. ప్రొద్దున్న లేస్తూనే చూదును—ఏదీ, ఎప్పుడూ ఉండే లావణ్యమంతా పగటికి ఏదీ ఇప్పుడు? ఎక్కడికి పారి-పోయింది? ఏమిటిది, జరిగినదేమిటి కదా? ఈ నలుపు దేనిది? నా నిండుచంద్రుణ్ణి కప్పడానికి ఎక్కడనుంచి వచ్చింది ఈనీడ?

నామనస్సు అతి సున్నితంఅయిపోయింది, ఎప్పుడూ అతి మెలుకువగా ఉంటున్నది. పూర్వ మెప్పుడో ఒకనాడు దుఃఖం సుఖంవేషంతో నా మనస్సులో దూరి అప్పటినుండీ అక్కడ బసచేసుకొని కూర్చున్నది. దాని అసత్యమంతా ఇప్పుడు నా హృదయాన్ని పీడిస్తున్నది. సిగ్గూ, దుఃఖానికీ ఉండమరుగు పోతున్నది. దగ్గిరపడిపోయి ముసుగు ముందుకు లాగుకోబోయి మరీసులభంగా బయలుపడిపోతూఉన్నవి. మన-స్సంతా కల్మషయంఅయిపోయింది. చూడకూడనిదానినీ చూడవలెనని ఇష్టంలేనిదానినీ ప్రొద్దస్తమానం చూడడం అవుతూఉంది.

నేను చాలాకాలంనుంచి ఐశ్వర్యంఅనే శూన్యంలో ముష్టెత్తుకొనేవాడిలాగు కూర్చున్నాను. ఇన్నాళ్లబట్టీ దాచి-పెట్టిఉంచిన నా దురదృష్టమూ, నాజీవనానికి కలిగినమోసమూ, ఇప్పుడు నేనాడేప్రతిమాటలోనూ, చూచేప్రతిచూపులోనూ,

ప్రతిరోజూ, ప్రతిక్షణమూ, బయలుపెట్టవలసిన రోజులు వచ్చాయేమిటి? నా యౌవనంలో నేను మాయకు ఒప్పివ్వడం తొమ్మిదిసంవత్సరాలుమాత్రమే. కాని సత్యం దానిని వడ్డీతో-సహా, జాలిఅన్నమాట లేకుండా నాలో జీవం ఉన్నంత-కాలమూ వసూలుచేస్తూఉంటుంది. ఋణంచెల్లించే శక్తి పూర్తిగా పోయినవాడినెత్తిమీదనే పడుతుంది, అన్నిటికంటే గొప్ప రుణం చెల్లించేభారం. అయినా, నా దీక్ష నేను వదలను— సత్యానిదే జయమవునుగాక!

మా మరదలు'మినూ'మొగుడు, 'గోపాల్', తన కూతురు పెళ్లిలో నా సహాయం కావలెనని నిన్న నాదగ్గిరికి వచ్చాడు. నా గదిసామానూ నా ఇంటిముస్తాబూ చూచి నాకున్నంత సుఖం ఈలోకంలో ఇంకెవరికీ లేదనుకున్నాడు. "మీనూతో చెప్పు గోపాల్, నేను ఆమెను చూడడానికి రేపు వస్తానని; వచ్చి అక్కడే భోజనంచేస్తాను," అని అన్నాను. మినూ తన హృదయంలోనున్న అమృతంతో ఆబీదఇంటిని స్వర్గంచేసి ఉంచింది. ఆమె వండినది తినివద్దామని నా ప్రాణం ఈవాళ కొట్టుకుపోతూఉంది. ఈవాళ ఆమెను ఒకమారైనా చూచి రావలెను. ఆహా, ఏమిటి ఆమె ఇల్లు! చివరకు ఆ ఇంటి లేమికూడా ఇంటికి అలంకారమయిఉంది.

బలవంతాన పౌరుషం నిలబెట్టుకోవడంవల్ల ఏమిలాభం? దానికంటే బుద్ధివంచుకొని నాలో ఏదో లోపంఉన్నది అని ఒప్పేసుకుంటే మంచిది. ఆడవాళ్లు మొగవాళ్లలో ముఖ్యంగా

ఇష్టపడేది జోరు. అది బహుశా నాలో లేనే లేదు.. కాని జోరు అనగా చేతులు విసరడమా! జోరు అనగా దేనినైన-ప్పటికీ నిస్సంకోచంగా కాళ్లకింద వేసి నుమ్మేయడమా?...కాని అనుబంధాలన్నీ ఇవ్వడెందుకు! దెబ్బలాడి యోగ్యత సంపా-దించలేను కదా వరైనా! నేను అయోగ్యుణ్ణి, ముమ్మాటికీ అయోగ్యుణ్ణి, అయోగ్యుణ్ణి, అయోగ్యుణ్ణి!

పోనీ, అయోగ్యుణ్ణిఅయితే నేమి! ప్రేమ అయోగ్యుడి పతనమయినా వృథాకానివ్వదే! యోగ్యత నిచ్చి సఫలం-చేస్తుంది. యోగ్యులకు దొరకేవి ప్రపంచంలో అనేక మంచి-వస్తువులు ఉన్నవి. అయోగ్యులకోసమని దేవుడు సృజించినది ప్రేమ ఒక్కటే!

బయటికి రావాలసింది అని విమలతో ఒకనాడు అన్నాను —విమల ఉండిపోయింది ఎప్పుడూ ఇంట్లోనే, కేవలం ఇంటితయారీ విమల. చిన్న జాగాలో, చిన్నచిన్న పనులు చేస్తూ ఇంటివ్యవహా-రాలన్నిటికీ తయారయింది. విమల నాకు రోజూ కనపరిచే ఆదరణ ఆమె హృదయంలోనుంచి ఊరివస్తూవున్న ప్రేమా, లేక మ్యునిసిపాల్టీవారు ఆవిరియంత్రసహాయంవల్ల మీదికి పంపుచేసి, లెక్కప్రకారం రోజూ అందరికీ పంచిపెడుతున్న కొళాయి నీళ్లవలె, సంఘం విమలద్వారా నాకు ఇచ్చిన వంతా!

నాకు అర్హత ఉన్నదా? నాకు దొరికిన దానికంటే అనేక రెట్లు కావలెనని కోరానా? లేదు, నాలో ఉన్నది

అన్యాని కాదు, ప్రేమ. అందుచేతనే నేను ఇనపపెట్టెలో పెట్టి తాళం వేసి ఉంచవలసిన వస్తువును కోరలేదు; తనంతట తాను పట్టుపడకపోతే పట్టుపడనిది నేను కోరే వస్తువు. స్మృతీ, సంహితా, మొదలైన సవ్యగ్రంథాల కాగితాలతో చేసిన పువ్వులు ఇంటి అలంకారానికి నేను కోరలేదు. జ్ఞానమూ, భక్తీ, ప్రేమా—వీటితో పూర్ణవికాసం పొందిన విమలను ఈ సృష్టి అంతటి మధ్యా చూడవలెనని నా కోరిక.

అప్పుడు అనుకోని సంగతి ఏమిటంటే, ఎవరినైనా సత్యానికి నిజమైన స్వరూపంతో, అనగా, ముక్తస్వరూపంతో, చూడవలెనంటే, లోకాచారాన్ని బట్టి వాళ్ళమీద మనకుగల అధికారం పూర్తిగా వదులుకోవలెను, అని. ఈ మాట నేను ఎందుకు ఆలోచించలేదో? పురుషునికి స్త్రీమీద ఒక శాశ్వతమైన హక్కు ఉన్నది, అనే గర్వం చేతనా! కాదు, అందుచేత కాదు. ప్రేమలో సంపూర్ణమయిన నమ్మకం ఉండబట్టి.

సత్యం ఏ ఆభరణమూ, ఎటువంటి బట్టలూ, లేకుండా పూర్తిగా దిగంబరి అయి వచ్చినా నేను సహించగలను, అనే అభిమానం నాలో బాగా ఉండేది. ఈవాళ దాని పరీక్ష అవుతూ ఉంది. చావు రానీ బ్రతుకు రానీ ఆ పరీక్షలో మాత్రం తేలిరావలెననే గర్వం ఇప్పటికీ వదలలేదు.

ఒకవిషయంలో ఈనాటివరకూ విమల నన్ను బోధపడుచుకోనే లేదు. జబర్దస్తీ కేవలం దుర్బలుల లక్షణం అని

నానమ్మకం అది విమల తెలుసుకోలేకపోయింది. న్యాయంగా నడుచుకుందామనే ధైర్యం బలహీనుడికి ఉండదు. దుర్బలుడు న్యాయాలోచనవల్ల కలిగే పూచీ తప్పించుకొని అన్యాయం చేసి అయినా అతిత్వరలో ఫలం సంపాదించుకుందామని ఎల్లప్పుడూ ప్రయత్నం చేస్తుంటాడు. ఓర్పు ఉండడం అనేసరికి విమల అతి చికాకు పడిపోయేది. పురుషునిలో దాక్షిణ్యం చూస్తే ఆమెకు సరదా, కోపం చూస్తే కులాసా, అన్యాయం చూస్తే సంతోషం, సాహసం చూస్తే ఉల్లాసం. జడిపించగలిగినవాడే మన్ననకు అర్హుడు, అనే అభిప్రాయంలాంటిదేదో ఆమెకు ఉండేదనుకుంటాను.

బయటికి వచ్చి విమల నాలుగువైపులా స్వేచ్ఛగా చూడగలిగితే ఆమెకు జబర్దస్తీ, దాక్షిణ్యమూ, మొదలైనవాటి మీద ఉండే మోహం పోతుందని అనుకున్నాను. కాని ఆమె దానినుంచి విముక్తురాలు కావడం కష్టం అని ఇప్పుడు తెలుస్తూ ఉంది. చంపుకుతినేవాళ్లను చూస్తే లోలోపున చాలా ఇష్టం ఆమెకు. జీవనంలో ఉండే సాదారుచులన్నిటినీ బాగా మిరపకాయఖారంతో ఘాటుగా చేసి నాలికదగ్గిరనుంచి కడుపులోదాకా మంటపుట్టిస్తేనే గాని, ఆమెకు తృప్తి ఉండేది కాదు. తక్కిన రుచులేవీ మన్నింపదగినవి కావు, ఆమె మతంలో.

ఇవతల, నాదీక్ష ఏమిటంటే ఉద్రేకం కలుగజేసేది ఏదైనా తాగి, మత్తెక్కినవాడిలాగు దేశసేవలోకి ఎంతమాత్రం దిగను

అని. నౌకర్లుచేసే పనులలో ఎటువంటి తప్పున్నా సహించి ఊరుకోగలను, గాని వాళ్లను కొట్టడం తిట్టడం నాచేత కాదు. కోపంవచ్చి ఛటీమని ఏదీ అనడం అన్నా, చెయ్యడం అన్నా, నాకు ఒంట్లో వణుకుపుడుతుంది, మనస్సులో జడుపు పుడుతుంది. ఆ జడుపు బలహీనత అనుకొని విమలకు నేనంటే ఉండే గౌరవం పోయింది. నేను "వందేమాతరం" అని కేకలు వేసుకొంటూ, ఇష్టంవచ్చినదల్లా చేసుకొంటూ, నాలుగు వైపులా తిరగకపోతే నామీద కోపం రావడానికి కారణం ఈ పైచెప్పి-నది ఒక్కటే. ఈవాళ దేశమంతటితోపాటు, కల్లుముంత చేత-పుచ్చుకొని భైరవీచక్రంలో, నేనూ కూర్చోలేదని నామీద అందరికీ కోపం. ఏదో బిరుదుకోసం తంటాలుపడుతున్నాననో, పోలీసువాళ్లకు జడుస్తున్నాననో, మనదేశస్థులు అనుకుం-టున్నారు. అవతల, పోలీసువాళ్లనమ్మకం ఏమిటంటే, నాకు లోపున ఏదో చెడ్డఉద్దేశం ఉన్నది, లేకపోతే పైకి ఇంత మంచిగా ఎందుకుంటాను అని. అయినా నా దారి నేను వదల-లేదు...అవమానపరిచేవాళ్లు నమ్మనివాళ్లు, రెండువైపులా.

దేశంయొక్క నిజస్థితి తెలుసుకొని సేవచేయలేక 'దేవీ' అనీ, 'కాళీమాయీ' అనీ, కేకలువేసి ఉత్సాహం తెచ్చు-కొనేవాళ్లకూ, మనుష్యులను కేవలం మనుష్యులే అనుకుం-టున్నంతసేపు మన్నించలేనివాళ్లకూ, ఏవో సమ్మోహన మంత్రాలు కావలెను, అటువంటివాళ్లందరికీ దేశంకంటే

కేకలూ, గందరగోళమూ, ప్రియమైనవని నా నమ్మకం. ఏదో ఇటువంటి నిషాను ఒకదానిని, సత్యంకంటె పెద్దదానిగా చూచి పూజిస్తూ కూర్చోవడం, మన అస్థిగతదాసత్వంయొక్క లక్షణం. స్వేచ్ఛ అనేసరికి భయం చాలామందికి; స్వేచ్ఛ అనగానే ఏమీ సహాయంలేకుండా, ఆధారంలేని జాగాలో ఉన్నట్టుగా భయంపుడుతుంది; లోపుననుండే బలంఅంతా హరించిపోతుంది. ఏదోఒక భ్రమను కల్పించుకొని దానినో, లేక అధికారి అని ఎవరినో ఏర్పరచి వారినో, లేక ఏ కులపెద్దనో, నెత్తిమీద కూర్చోపెట్టుకోకపోతే మనలోపునున్న జీవుడికి సంచలనం కలగదు. శబ్దాలతోనూ, అలంకారాలతోనూ, ముసుగుపెట్టని సత్యం మనకు నచ్చదన్నాళ్లు, నిషా భ్రమా లేనిదే పనిజరగదన్నాళ్లు, పరాధీనతలేకుండా స్వతంత్రంగా మనదేశాన్ని పాలించుకొనేశక్తి మనకు లేదన్నమాటే. మనము మారనన్నాళ్లు మనము ఏస్థితిలో ఉన్నా, మనస్సులోనుండే భూతాలో లేక బయటనుండే మంత్రగాళ్లో మనను బాధపెట్టకమానరు, మనమీద అధికారం చలాయించకమానరు.

"నీలో అనేకం మంచి గుణాలు ఉండవచ్చును, గాని నీకు కల్పనశక్తిలేదు; అందుచేతనే మాతృభూమియొక్క దివ్యమూర్తిని కళ్ళతో చూడలేకుండా ఉన్నావు," అని నాతో సందీప్ ఆవాళ అన్నాడు. విని విమల ఏమీ అనలేదు; అతనన్నది ఒప్పుకున్నది. నేను దాని కేమీ జబాబుచెప్పలేదు. వాదిస్తేనేగాని గెలవలేనప్పుడు గెలిచినా గెలిచినసుఖం ఉండదు.

నాకు మాలో కనబడ్డది కేవలం అభిప్రాయభేదం కాదు, స్వభావాలలో భేదం. చిన్న ఇళ్లల్లో అయితే ఇటువంటి భేదాలు అక్కట్టే పెద్దవిగా కనబడవు, అందుచేత కలిసిపాడే పాటకు అడ్డు-ఉండదు. ఆభేదమే పెద్ద సంసారాలలో అయితే, అక్కడ పుట్టిన తరంగాలు అతిపెద్దవి గనుక, ఒక్క లయతప్పడంతో సరిపోదు, అసలు పాటే సాగదు.

నాలో కల్పనశక్తి లేదట! అనగా ఏమిటంటే నాలో ఉండేది చమురూ వత్తే గాని, దీపం కాదు అన్నమాట. దానికి నేనదేమిటంటే,—"లేకపోవడం నిజమే, గాని ఆ లేకపోవడం మీలోను. మీరు చెకుముకిరాయివంటి కాంతి సిరస్సులు —ఎంతో కొట్టాలి, చప్పుడు చేయాలి, చేసినా మిణుకుమనకి ఒక్క మిణుకురు రాలుతుంది. అటువంటి మిణుకుర్ల వల్ల మన గర్వం అధికం కావడమే గాని మనకు కనబడడం అర్థం కాదు."

సందీప్ స్వభావంలోనూ అతను కోరే కోరికలలోనూ మోటుతనం, కావలసినంత, కనిపెడుతూ వచ్చాను. దేహ-సుఖాలలో అతనికుండే ఆసక్తి, మత విషయాలలో చాలా మాయలను కల్పించింది, దేశసేవసంబంధంలో బలంప్రయో-గించడమూ మొదలైన దుర్మార్గప్పనులు చేయించింది. అతని స్వభావం ఎంతమోటో, అతనిబుద్ధి అంత సూక్ష్మము. కనుక చేసే పనులన్నిటికీ పెద్దపెద్ద పేర్లు పెట్టి పైకి గొప్పగా కనబడేటట్టు చేసేవాడు. వాంఛలను తృప్తిపరచుకుంటూ

ఉండడం ఆతనికి ఎంత అవసరమో, లోపునఉండే ద్వేషాన్ని పనులలో వెళ్లబుచ్చడంకూడా అంతఅవసరం. డబ్బుకక్కూర్తి సందీప్‌కు చాలాఉందని, ఇదివరలో అనేకసార్లు విమల నాతో చెప్పింది. ఆ సంగతి నాకు బోధపడకపోలేదు. ప్రతిదానిలో బేరమాడుతూ సందీప్‌తో నేను చాలలేను. నన్ను అతను మోసపుచ్చుతున్నాడని అనుకోడానికికూడా సిగ్గు వేసేది. నేను అతనికి డబ్బుసహాయం చేయడం నామట్టుకు నాకే అసహ్యంగా కనబడుతుందేమో అని ఆ విషయమై ఎటువంటితకరారు-పెట్టడమూ ఇష్టంలేకపోయేది. దేశంవిషయంలో సందీప్-మనస్సులోఉండే ఉద్దేశాలు, చాలాభాగం, లోపునఉండే మోటువాంఛల రూపాంతరమని, విమలకు ఇప్పుడు నచ్చజెప్పడం చాలా కష్టం. సందీప్ అంటే విమలకుండే భక్తి చూస్తే నాకు ఏమీ అన బుద్ధివేసేది కాదు. నేను అనే దానిలో ఈర్ష్య ఎంత దూకుతుందో అనిపించేది. నాకు నామనస్సులో కనబడే సందీప్‌ఆకారం నా దుఃఖంయొక్క తీవ్రతాపంవల్ల వంకరటింకరఅయిపోయిన ఆకారం అయిఉం-టుంది. అయినప్పటికీ అటువంటిది మనస్సులోఉంచుకుండే కంటే పైకిచెప్పేయడం మంచిది.

నా మాస్టరు చంద్రనాథ్‌బాబును ఇప్పటికి సుమారు ముప్ఫైఏళ్లబట్టీ చూస్తున్నాను. ఆయనకు నిందఅంటే భయం లేదు, చావుఅంటే భయంలేదు. మాఇంటిలాంటి ఇంట్లో

పుట్టాక ఎటువంటి సదుపదేశాలయినా నన్ను కాపాడి ఉంచలేకపోను. కాని ఆ మహాపురుషుడు, మా మాస్టరు, సత్యమూ, శాంతమూ, పవిత్రతా—వీటితో నిండిఉన్న తన జీవనాన్ని, నా జీవనంలో స్థాపించాడు. నాకు శుభం కలగడానికి కారణం అదే. నేను సాధించగలిగిన మంచిఅంతా ఆమూలంగానే.

ఆవాళ మామాస్టరు నాదగ్గిరికి వచ్చి, "ఇంకా సందీప్ ఇక్కడ ఉండవలసిన అవసరం ఉన్నదా?" అని అన్నాడు.

ఏలాగు ఆ గాలి వచ్చి అతని మనస్సుకు తగిలేదో గాని ఎక్కడ ఏమాత్రం అమంగళం ఉన్నా మా మాస్టరు ఒక్క క్షణంలో పోల్చేసేవాడు. గాబరా పడలసినమనిషి కాదు ఆయన, గాని ఆవాళమాత్రం ఏదో ఒక గొప్ప ఆపద ముందుకు ఉన్నదన్నట్టు జడిశాడు—దానిజాడ అతని కంటపడిఉంటుంది. అతనికి నామీాద ఎంతప్రేమో అది నాకు తెలుసును.

టీ తాగుతున్నప్పుడు సందీప్‌తో అన్నాను, "నువ్వు రంగపూర్ వెళతానన్నావు, వెళ్లవూ? అక్కడ నుంచి నాకు ఉత్తరం వచ్చింది. నేను నిన్ను బలవంతాన ఉంచేస్తున్నానని వాళ్లంతా నన్ను తిడుతున్నారు."

విమల టీపాట్‌లోనుంచి టీ వంపుతూంది, ఒక్క క్షణంలో ఆమెముఖం మారిపోయింది. సందీప్‌వైపు ఒక్క

మారు చూచింది. సందీప్ అన్నాడు, "ఆలోచించి చూచిన కొలదీ, మేము ఇప్పుడు చేస్తూ ఉండేటట్టుగా, నాలుగు వైపులూ తిరిగి స్వదేశీ ప్రచారం చేయడంవల్ల మా శక్తి చాలాభాగం వృథావ్యయం అవుతుంది అనిపిస్తూఉన్నది. అక్కడక్కడ ఒకచోటు కేంద్రంగా ఏర్పరచుకొని పనిచేస్తే శాశ్వతంగానిలిచేపని చాలా చేయవచ్చును అనుకుంటాను."

అంటూ, విమలవైపు తిరిగి, "మీకూ అలాగు అనిపించడం లేదూ?" అని అన్నాడు.

తక్షణం ఏమీ జబాబు చెప్పలేకపోయింది. కొంచెంసేపు ఊరుకొని అన్నది, "నాలుగువైపులా తిరుగుతూనూ చేయవచ్చును, ఒక్కచోట కూర్చుండికూడా చేయవచ్చును—రెండువిధాల చేసినదీ దేశసేవే కావచ్చును. మన స్వభావానికి అనుగుణ్యంగా ఉండేది మనం ఎంచుకోవలెను—మీ మనస్సుకు తృప్తి కలుగజేసేదే మీదారి."

సందీప్ అన్నాడు, "అయితే, నిజం చెపుతాను వినండి. ప్రజలను మత్తెక్కిస్తూ తిరుగుతుండటమే నా పని, అని ఇన్నాళ్లూ అనిపిస్తూఉంది. పొరపాటుకి కారణంకూడా ఉన్నది—నన్ను ఎల్లప్పుడూ నిండుగా ఉంచవలిసిన శక్తిధార నాకు ఇంతకు ముందు ఎక్కడా ఒక్కస్థలంలో దొరకలేదు. అందుచేత దేశదేశాలు తిరిగి, కొత్తకొత్త మనుష్యులను పట్టుకొని, వాళ్ల

మనస్సులలో ఉత్తేజన పుట్టించి, ఆ ఉత్తేజనలోనుంచి నాకు అవసరమైన బలమూ, శక్తీ, తీసుకోవలసివచ్చేది. కాని ఈవాళ మీరే నాకు దేశవాణి ఈ శక్తీ, ఈ కాంతీ ఇంతవరకు నాకు ఏపురుషునిలోనూ కనబడలేదు. నాలో గొప్ప శక్తి ఉన్నదని ఇన్నాళ్లూ నాకు ఒక 'అభిమానం ఉండేది. కాని ఇప్పుడు దేశానికి నాయకుడను అవుదామనే ఆశ వదులుకున్నాను. ఇదే ముఖ్యస్థానం చేసుకొనిఉంటే, మీ ఉత్సాహాగ్ని దేశమంతటా వ్యాపించడానికి ఒకమార్గం కాగలదని నాకు బాగా నమ్మకంకలిగింది...వద్దు వద్దు సిగ్గుపడకండి; ఉత్సాహమూ, సంకోచమూ, ఉత్తవినయమూ—వీటికి చాలా స్థాని మీరుండేస్థానం. మేము తేనెటీగలము, మా తేనెపట్టుకు రాణి, మీరు. మీ చుట్టూ కూర్చొని మాపని మేము చేస్తాము. కాని ఆపనికికావలసిన శక్తి మీరు మాకిచ్చేదే. అందుచేత మీరు వన్నువదిలి దూరం వెళిపోతే ఇల్లులేనివాళ్లం అయిపోతాము, పనిలో ఎటువంటి ఆనందమూ మరి ఉండదు నిస్సంకోచంగా మా ఆరాధన అందుకోండి."

సిగ్గుతోనూ, గర్వంతోనూ, విమలముఖం ఎర్రగా అయిపోయింది. గిన్నెలలో పంచుతుంటే విమలచెయ్యి వణకడం ప్రారంభించింది.

ఇంకొకనాడు చంద్రనాథ్ బాబు వచ్చి అన్నాడు, "మీరిద్దరూ కలిసి డార్జిలింగ్ వెళ్లి కొన్నాళ్లు అక్కడ ఉంటే

బాగుంటుంది. నీముఖం చూస్తే ఒంట్లో బాగులేదని తెలుస్తూ ఉంది. బాగా నిద్రపట్టడం లేదు కదూ?"

"విమలా, డార్జిలింగ్ వెళ్లి ఆ ప్రాంతాలన్నీ తిరిగి వద్దామా?" అని సాయంకాలం విమలతో అన్నాను.

డార్జిలింగ్ వెళ్లి హిమాలయపర్వతాలు చూదామని విమల చాలా సరదాపడుతూఉండేది. కాని ఆవాళమాత్రం "ఇప్పుడెందుకు లెండి," అన్నది.

దేశసేవ వెనకపడుతుందేమో అని అనుమానించింది గాబోలు!

నమ్మకం ఇంకా వదులుకోను, ఎన్నాళ్లయినా కనిపెట్టుకొనిఉంటాను. చిన్నజాగానుంచి పెద్దజాగాకు వెళ్లే దారి కంటకమయం. ఇంటి నాలుగుపరిహద్దులలో ఇంటిఏర్పాట్లమధ్య కాపురండున్న విమల జీవనం, పైప్రపంచంలోకి హఠాత్తుగా రాగానే, అక్కడిఏర్పాట్లమధ్య, తక్షణమే సరుదుకోలేదు. ఇంతకుముందు ఆమె ఎరుగని పైప్రపంచాన్ని బాగా తెలుసుకొని పరిచయం దృఢపరుచుకున్నతరువాత, నా స్థానం ఏదో నిశ్చయంచేసుకుంటాను. ఈ మహాప్రపంచంలో సర్వఏర్పాట్లలోనూ నాకు సరిగాకుదిరిన స్థలం ఎక్కడా దొరకకపోతే అప్పుడు స్థిరపరుస్తాను, 'నేను ఇన్నాళ్లూ పట్టుకొనికూర్చున్నది వట్టి మాయ' అని. ఆ మాయ నాకు అక్కరలేదు. అటువంటిరోజే

వచ్చినట్టయితే నేను వాదనచేయను, దెబ్బలాడను, నెమ్మదిగా సెలవుపుచ్చుకుంటాను.

పశుబలమా! ఎందుకు? సత్యంతో పశుబలం ఎన్నడైనా చాలగలదూ?

నా వంతు వస్తే ఎవరేనా సరి, అని చేతకానివాళ్ళు అంటారు; ఏని, బలంలేనివాళ్ళు నమ్ముతారు. కాని సృష్టి అంతా మనకు బోధిస్తున్నది ఏమిటి!—'ఉన్న బలం అంతా ఉపయోగించి నేను తెచ్చుకోగలిగినదే నిజంగా నాది', అని.

ఈ దేశంలో పుట్టినంతమాత్రాన ఈ దేశం నా అయి-పోదు. నా శక్తి, నా బలమూ, ఉపయోగించి నాదానిగా ఎప్పుడు చేసుకోగలనో అప్పుడే అది నాదవుతుంది.

సంపాదించే అధికారం మనకు ఎప్పుడు స్వాభావికమో, సంపాదించగల వస్తువును కోరడంకూడా అప్పుడే స్వాభా-వికం. '[illegible] లేకుండా ఉండదు, అ[illegible] లేకుండా ఉండదు,' అని చెప్పేది ప్రకృతి కాదు; మనస్సులో పుట్టే కోరికలు బయటనుండే వాటితో తృప్తి పరచుకోవలసిందే. సృష్టిలో లోపలివానికీ బయటవానికీ ఇటువంటి సహకారం ఉన్నదన్నమాట నిజము. ఈ నిజాన్ని అణచివేయాలని చేసే బోధనే మనము నీతిబోధ అంటున్నాము. అందుచేతనే ప్రపంచంలో ఈనాటివరకూ నీతిబోధ ఎవరూ లక్ష్యపెట్టలేదు.

ఈలోకంలో సగంప్రాణాలతో ఉన్నవాళ్లు కొంతమంది ఉన్నారు, వాళ్లు జోరుచేసి ఏదీ తీసుకోలేరు; దేనినీ పట్టుకో-

లేరు ; పట్టుకున్నా అతిసులభంగా పట్టువిడిచేస్తారు. అటువంటి వాళ్లందరూ, పాపం, నీతిబోధతోనే మనస్సు సంతోషపెట్టుకుంటారు. కాని మనసారా కోరుకోగలిగినవాళ్లే సృష్టియొక్క వరపుత్రులు; మనసారా అనుభవించ గలిగినవాళ్లే ఆ వరపుత్రులు; మనస్సులో ఏటువంటి సంకోచమూ లేకుండా ఏ పనినైనా ఎవరుచేయగలరో వాళ్లే ఆ వరపుత్రులు. సృష్టిలో ఉన్న అందమయినవస్తువులూ, విలువగలవీ, అన్నీ వీళ్లకోసమే. వీళ్లే నదులుఈది వస్తారు; గోడలుదుమికి లోపల ప్రవేశిస్తారు; తాళాలుతన్ని తలుపులు విరగకొడతారు; ఉంచుకోదగిన వస్తువులన్నీ బలవంతాన లాగుకొని పారిపోతారు. దీనివల్లనే నిజమైన ఆనందం కలుగుతుంది, దీనివల్లనే తీసుకున్న వస్తువులకు విలువవస్తుంది. సృష్టి అటువంటి దస్యులకే ఆత్మసమర్పణ చేస్తుంది. కోరడంలోనైనా, తీసుకోవడంలోనైనా బలమంటే చాలా ఇష్టం, ప్రకృతికి. అందుచేతనే ప్రకృతి వసంతపుష్పాలతో చేసిన స్వయంవరమాలను సగంప్రాణాలతో ఉన్నబక్కచైన రోగుల ఎండుమెడలలో వేయదు. పెళ్లిబాజాలు వినబడుతున్నవి ; శుభలగ్నం వచ్చిపడుతూఉంది ; మనస్సే చంచలమయిపోతూఉంది. వరుడెవడు? మహోప్పలు వేయించుకొని ఎవడు ముందుగావచ్చి మంటపంలో పీటమీద కూర్చోగలుగుతాడో వాడే పెళ్లికొడుకు. ప్రకృతియొక్క పెళ్లిపందిరిలోకి వరుడెప్పుడూ పిలవకుండానే వస్తాడు.

సిగ్గా! సిగ్గెందుకు? నాకు ఎటువంటి సిగ్గూ లేదు. నాకు కావలసినది అడిగి తీసుకుంటాను; అడగకుండా కూడా తీసుకుంటాను. తీసుకోదగినవస్తువులు సిగ్గుచేత తీసుకోలేనివాళ్లు, తమ దుఃఖాన్ని దాచుకోడానికి, ఆ సిగ్గుకు పెద్దపెద్ద పేర్లు పెడతారు. మనము పుట్టిన ఈ పృథ్వి గట్టిది, గుల్లకాదు, భ్రమకాదు. అక్కడ ఉండేది వాస్తవము, *"రియాలిటీ." పెద్దపెద్ద మాటలతో మోసపుచ్చుకొని సంతలో దొరికిన గట్టిగట్టివస్తువులు ఏవీ ఇంటికి తీసుకురాకుండా, ఒక మూల నుంచి కడుపు మండిపోతూఉన్నా, వట్టిచేతులతో వచ్చేసేవాళ్లు ఇటువంటి ప్రపంచంలో, ఇటువంటి గట్టిజాగామీద, ఎందుకు పుట్టాలో? అంతరిక్షాన ఆకాశకుసుమాలుపూసే కుంజవనంలో కులాసాపురుషులు తమ చిత్తంవచ్చిన మతాలు కల్పించుకొని కాలక్షేపం చేస్తూఉంటే తియ్యనిమాటలు గుచ్చి వాళ్లు ఇష్టపడేపాటలు పాడుతూఉండడం వీళ్లకు తగిన పని. ఆ పని కోసం అప్పుడే జయానాకూడా పుచ్చేసుకొన్నారు. నాకు ఆ తియ్యనిమాటలు అక్కరలేదు; నాకడుపు ఆకాశకుసుమాలతో

* రియాలిటీ: Reality: వాస్తవము.

ఠాకూరుగారు ఇంగ్లీషుపదాలు ఉపయోగించినచోట ఆ పదాలే మేమూ చాలాభాగం ఉంచాము. వారు ఉపయోగించనిదేదీ మేము ఉపయోగించలేదు. ఇంగ్లీషువిమీ తెలియనివారికి సహాయంగా ఉంటుందని ఆ పదాలకు రమారమిసరిపోయే తెలుగుమాటలు పేటికలుగా ఇచ్చాము.

—అనువాదకులు.

నిండను. నేను కోరేదేదో బాగా, మనస్ఫూర్తిగా, కోరుతాను; రెండు చేతులతో పిసుకుతాను; రెండు కాళ్ళతో కుమ్ముతాను; అవి ఒంటినిండా పులుముకుంటాను; కడుపునిండా తింటాను. కోరడానికి సిగ్గుపడను; తీసుకోడానికి సంకోచించను. నీతిసూత్రాలలో ఉపవాసం చేసుకుంటూ, అందరూ విడిచిపెట్టిన మంచంలోని నల్లిలాగు, ఒంట్లో రక్తంలేక ఎండిపోతూన్న వాళ్ళ ఏడుపులూ, తిట్లూ, నా చెవిని పడవు.

దాచడంఅంటే నాకు మహా అసహ్యం—దాచడం పిరికివాళ్ళ లక్షణం. కాని అవసరంవస్తే దాచలేకపోవడంకూడా పిరికితనమే. మీకు కావలసినదానిని చుట్టూ గోడలుకట్టి మీరు దాచుకుంటారు, అందుచేత నాకు కావలసినదానిని నేను కన్నంవేసి తీసుకుంటాను. మీకు వాంఛ ఉండబట్టి, మీకు కావలసినవి మీరు ప్రహరీలమధ్య దాచుకుంటారు, నాకు కోరికఉండబట్టి నేను ప్రహరీలమధ్యనుండి తీసుకుంటాను. మీ యంత్రాలు మీరుఉపయోగిస్తారు, నాతంత్రాలు నేనుఉపయోగిస్తాను. ప్రపంచంలో ఇవే నిగ్గయిన మాటలు. ఇందులోఉన్న నిజమే ప్రపంచంలో గొప్పగొప్ప పనులను నడిపిస్తూఉంది, రాజ్య సామ్రాజ్యాలను నడిపిస్తూ ఉంది. స్వర్గంనుంచి దిగివచ్చిన అవతారపురుషులు ఏవేవో దివ్యవాక్యాలు చెపుతూఉంటారు, వాటిలో నిజమేమీ లేదు. అందుచేతనే ఆ ఉపదేశాలను ఎంతమంది ఎంతపాడుతూఉన్నా, అవన్నీ వెళ్ళి చివరకు బలంలేనివాళ్ళ ఏఇంటిమూలలనో చేరుకుంటాయి. పృథ్వి నేలే బల-

వంశపులు ఆమాట లేవీ లక్ష్యపెట్టరు—ఆ మాటలు మన్నించ-
బోతే ఉండేబలంఅంతా పోతుంది, వాటిలో నిజం లేదు గనుక.
నేను అంటూఉండేదానిలోని నిజం నిస్సంకోచంగా ఎవరు
ఒప్పుకుంటారో, సిగ్గువదిలి దానిని ఎవరు ఆచరణలో పెడతారో,
వాళ్లే కృతార్థులవుతారు—వీరభోజ్యము రాజ్యమంటే ఇదేను.
ఒక్కపక్క ప్రకృతీ, ఇంకొకపక్క అవతారాలూ, రెండు
వైపులా ఈ రెంటిచేతా లాగించుకోడానికి ఒప్పుకున్న అభా-
గ్యుడు సత్యమూ ఎంచుకోలేక, మిథ్యా ఎంచుకోలేక, రెండు
పడవలలో రెండుకాళ్లు పెట్టినవాడిలాగు, నానాబాధలూ పడ-
తాడు. అటువంటివాడు ఉన్నచోట ఉండాలేడూ, ముందుకు
నడవాలేడు, రెంటికీచెడ్డ రేవడిలాగు.

మానవ జీవం అక్కరలేదు అని చీకుపట్టి పుట్టినట్టు ఈ
లోకంలో కొంతమంది మనుష్యులు ఉన్నారు. సూర్యా-
స్తమయమప్పుడు ఆకాశానికిఉండే అందంమోస్తరు అందం,
క్రమక్రమంగా ఆక్రమించుకువస్తూఉన్న మృత్యువుకు ఉన్నది.
జీవనం అక్కరలేదు అనేవాళ్ల మనస్సులు కరిగిపోతాయి, ఆ
అందం చూచి. మన నిఖిలేశ్ ఆజాతిలోవాడే—అతనికి జీవం
లేదనే అనవచ్చును. నాలుగు సంవత్సరాలకిందట అతనితో
ఈ విషయమై పెద్ద వాదన అయింది. "బలంఉపయోగించక-
పోతే మనకు ఏదీ దొరకదు, ఆమాట ఒప్పుకుంటాను,"
అన్నాడు. కాని బలం అంటే ఏమి! ఏటువంటి పనులలో ఉప-

యోగించాలి మనబలం?—అన్న ఆవిషయాలగురించి వాదన. "నేను త్యాగంలో ఉపయోగిస్తాను, నాబలమంతా," అని అన్నాడు, నిఖిల్. "ఉన్నదంతా పాడుచేసుకొని దివాలా-తీదామని నాప్రాణం కొట్టుకుపోతూ ఉంది, అని నీవు అనే దానిఅర్థం," అని అన్నాను నేను.

"అహా, గుడ్డులోఉన్న పక్షి పైగుల్లను పాడుచేదామని గాబరపడుతూఉన్నట్టుగానే. గుల్లనిజమైన వస్తువే గాని పిల్లకోరేది గాలి వెలుతురూ; ఇలా కోరడం చాలా తెలివి తక్కువపని అని కదూ, నీ ఉద్దేశం?" అన్నాడు నిఖిల్.

నిఖిలేశ్ రూపకాలంకారాలు ఉపయోగించి మాటలు ప్రారంభిస్తే, "అవన్నీ ఉత్త మాటలు, వాటిలో ఏమీ నిజం-లేదు," అని అతనికి నచ్చచెప్పడం పరిశ్రమమూ కాదు. పోనీ, ఆ అలంకారాలు పట్టుకొని సుఖంగా కూర్చోవాలంటే అతను కూర్చోనీ. మేము మాంసభక్షకులము, మాకు కోరలు ఉన్నవి, గోళ్లు ఉన్నవి. మేము వెంటపెట్టగలము, పట్టుకొని చీల్చ-గలము. ప్రొద్దున్నతిన్న గడ్డి సాయంకాలందాకా నెమరువేసు-కుంటూ, రోజంతా గడపడం మాచేతకాదు. అందుచేత మీ రూపకాలయుల్లో మా భోజనాలకు ద్వారం కాచికూర్చుంటే మేము ఊరుకోనేలేదు. మీరు అడ్డుగా కూర్చుంటే మేము కన్నంవేస్తాము, లేదా బందిపోటు చేస్తాము. లేకపోతే మేము బ్రతికిఉండలేము.

నేను చెపుతూఉన్న మాటలు విని, "ఇతనిది ఒక కొత్త మతం, ఇతనికి కొత్తధర్మాలలో నమ్మకం," అని అంటారు. ఆలాగు అనడానికి కారణంకూడా ఉన్నది. ఈ లోకంలో సంసారం గడుపుకొనివస్తున్నవాళ్లందరూ చేసేది, నేను అంటూ ఉన్నదే, కాని చెప్పడంమాత్రం వేరు. వాళ్లు ఆచరణలో పెట్టినదే నిజమయిన నీతిపద్ధతి అని వాళ్లకు తెలియదు; నాకు తెలుసును. నావి క్రొత్తనమ్మకాలు కావు, వాటి నిజము ఆచరణమూలంగా సిద్ధాంతమైనవి.

నా పద్ధతులకు, నా దారికి, మూడి ఆడవాళ్లు అతిత్వరగా లోబడిపోతారు. వాళ్ల భవనం మాయభవనం కాదు, గట్టిది, వాస్తవమయినది, ఈ పృథ్వికి, మేఘాలమధ్య కట్టిన గాలిమేడలలో కాదు వాళ్ల నివాసం. స్త్రీలు, మనలాగు, సారంలేని ఖాళీ *ఐడియాలతో చేసిన బెలూన్‌లో ఎక్కి మేఘాలమధ్య సంచారంచేస్తూ కూర్చోరు. నా లోపునా పైనా, మాటలలోనూ భావాలలోనూ, ఒక భయంకరమైన ఇచ్ఛ వాళ్లకు కినబడుతూఉంటుంది. తపస్సులలో ఒళ్లు ఇగరపెట్టేటటువంటిది కాదు ఆ ఇచ్ఛ. ఆలోచనవల్లా, తర్కంవల్లా, మనస్సులో భయం పుట్టించి, మనముఖాన్ని, ముందుకుకాకుండా, వెనకకుతిప్పే మోస్తరు కాదు ఆ ఇచ్ఛ. అదిఒక నిండుప్రవాహం, "వేసేయండి తింటాను" "వేసేయండి తింటాను," అని గర్జన చేసుకుంటూ పరుగెత్తుతుంటుంది. దుర్జయమయిన ఈ ఇచ్ఛ పృథ్వికి ప్రాణమని

* ఐడియా: Idea: భావం.

ఆడవాళ్లు తమ హృదయాలతో గ్రహిస్తారు. ఆ ఇచ్ఛ తననే గాని ఇతరమైనదానినిదేనినీ లక్ష్యపెట్టదు; అందుచేతనే దానికి వెళ్లినదగ్గిరల్లా జయముకలుగుతుంది. స్త్రీలు వాళ్లంతట వాళ్లే వచ్చి, నా ఇచ్ఛాప్రవాహంలో పడి కొట్టుకుపోతూ-ఉండడం, నేను అనేకసార్లు చూచాను—బ్రతుకుతామా చస్తామా అని ఆలోచించనైనా ఆలోచించరు. స్త్రీలను ఈ విధంగా జయించే శక్తే వీరులశక్తి, అనగా, మాయకా-కుండా వాస్తవమయిన ప్రపంచాన్ని జయించగలశక్తి. కోరదగినది ఇంతకంటే గొప్ప ప్రపంచం ఇంకొకటి ఉన్నదని నమ్మేవాళ్లు, వాళ్ల ఇచ్ఛాప్రవాహాన్ని భూమిమీదనుంచి ఆకాశంవైపు, కావాలంటే, తిప్పేయనీ. చూదాము, వాళ్ల*ఫౌంటన్ ఖానా ఎంత-మీదికి ఎగురుతుందో, దానినీళ్లు ఎన్నాళ్లవరకూ ఉంటాయో! ఐడియాలలో విహరించే ఆ సూక్ష్మప్రాణులకోసం పెట్టలేదు స్త్రీలు.

†"ఎఫినిటీ!" ఒక పురుషుణ్ణీ ఒకస్త్రీనీ, ఇద్దరేసిని ప్రత్యేకంగా జతకూర్చి, భగవంతుడు మనసందరినీ ఈ లోకం లోకి పంపాడనీ, అటువంటిసంయోగాలు, మంత్రాలుచదివి-మనము ఏర్పరిచినవాటికంటే చాలాగట్టివనీ, నా పనికి కావల-సివచ్చినప్పుడు, ఇంతకుముందు చెప్తూవచ్చాను. మనుష్యుని-ప్రకృతి తనఇష్టంవచ్చినదానినే చేసుకుంటూఉంటుంది; గాని

* ఫౌంటన్ ఖానా: Fountain: నీళ్ల మీదికి తన్నే కొళాయి.

† ఎఫినిటీ: Affinity: అనుబంధం.

మనుష్యుడు ఒక పెద్ద పేరు పైకిచెప్పి, దానివెనక తన పనులన్నీ దాస్తూఉంటాడు, లేకపోతే సుఖం ఉండదు. ప్రపంచంలో ఇంత మిథ్య ఉండడానికి అదే కారణం. ఒకరితోనే ఎఫినిటీ ఎందుకుండాలి? వేయిమందితో ఎందుకు ఉండకూడదు? ఒక్కరితో ఎఫినిటీకోసం తక్కినవన్నీ వదులుకుంటానని, నాకూ సృష్టికీ ఏమీ రాతకోతలు జరగలేదే! పుట్టిన దగ్గిరనుంచీ అనేక ఎఫినిటీలు నా జీవనంలో నేను చూచాను. దానివల్ల కొత్తది ఇంకొకటి కూడదని ఎక్కడా లేదు. కొత్తది ఒకటి నాకు ఇప్పుడు స్పష్టంగా కనబడుతూఉంది.

తరవాత? తరవాత నేను జయించలేకపోతే చేతకాని చేటపెయ్య నన్నమాట.

# విమల కథ

నా సిగ్గుఅంతా ఎక్కడికి పోయిందో! నా విషయమై నేను ఆలోచించుకోడానికి వ్యవధి ఏమాత్రమూ దొరకలేదు. రాత్రిపగలూ ఒకేమోస్తరుగా, సుడిలోపడి గిరగిర అతివడిగా తిరిగిపోతూఉండడంవల్ల, సిగ్గును నా మనస్సులో దూరడానికి అవకాశం చిక్కలేదు.

మా రెండోతోటికోడలు ఒకనాడు నా ముందరనే, నవ్వుతూ, నా భర్తతో అన్నది—"మీ ఇంట ఇప్పటివరకూ ఎప్పుడూకూడా ఆడవాళ్లు ఏడుస్తుండటం మామూలు. ఇప్పుడు మొగవాళ్లవంతు వచ్చింది. ఇకనుంచి మేము మిమ్మల్ని ఏడిపిస్తాము. నువ్వేమిటి అంటావు, ఛోటారాణీ? నువ్వు రణవేషం వేయనే వేశావు రణరంగిణీ, ఇక బాణాలు జోడుగా వెళ్లనియ్యి పురుషులవైపు!"

ఆలాగు అంటూ, నన్ను మీదినుంచి కిందిదాకా ఒక్కమారు చూచింది. నా ముస్తాబులోనూ, నా చేష్టలలోనూ, ఒక కొత్త వికాసం పుట్టింది. చిన్నతోటికోడలికంటపడనిది అందులో ఒక్కపిసరు లేదు. ఆసంగతి వ్రాయడానికైనా ఈవాళ సిగ్గువేస్తూఉంది, గాని అప్పుడుమాత్రం నాలో ఏవిధమైన సిగ్గూ లేకపోయింది. ఆవాళ ప్రకృతి నాలోపునుంచి తనపని చేస్తూఉన్నది, చేయాలని నేను ఏమీ చేయలేదు.

ఆవాళ కొంచెం విస్తారంగానే ముస్తాబుచేసుకున్నాను, నిజమే. కాని ఎటువంటి ఉద్దేశమూ మనస్సులో పెట్టుకొని చేయలేదు—ఆవాళ నాకు ఒంటిమీద ధ్యాసమే లేదు. ఏముస్తాబు సందీప్‌బాబుకి అన్నిటికంటే ఇష్టమో నేను పోల్చుకోగలిగేదాన్ని. కాని అది ఊహావల్ల పోల్చుకొనేవరకూ ఉండనక్కరలేకపోయేది. సందీప్‌బాబు అందరిముందరా నా ముస్తాబునుగురించి వాదిస్తూఉండేవాడు. నాముందరే నా భర్తతో ఒకనాడు అన్నాడు, "మా రాణిని నేను మొట్టమొదటిమారు చూచిననాడు, ఆ తెల్ల జరీచీర కట్టుకొని, కదలకుండా మెదలకుండా, ఆకుర్చీమీద వచ్చి కూర్చున్నది, నీకు జ్ఞాపకం ఉన్నదీ నిఖిల్? ఆమె కళ్లు రెండూ అలా-గు ఆ అపారంవైపు చూస్తూఉన్నవి, దారితప్పిపోయిననక్షత్రాలలాగు--ఎవరికోసమో వెతుక్కుంటూ, అడుగందని అంధకారంవైపు వేలకొలది సంవత్సరాలబట్టి చూస్తూ ఉన్నవా అనిపించింది; ఆమెలోపునున్న అగ్నిశిఖ బయటికివచ్చి బట్టజరీరూపంగా ఆమెను చుట్టుకొని ఉన్నది. ఆఅగ్నే నాకు కావలెను, ఆకళ్లముందర ప్రత్యక్షంగా కనబడే అగ్ని! రాణీ, ఈ ఒక్క కోరిక మన్నించి, మరొకనాడు ఆ అగ్నిశిఖతో మాకు దర్శనం ఇవ్వరూ!"

ఇప్పటివరకూ పల్లెపక్కను పారుతున్న చిన్న ఏరులాగున్నాను. నా మాటలూ, నా పాటలూ, అదిఒకమోస్తరు ఉండేవి. చడీచప్పుడులేకుండా ఒకనాడు సముద్రపుపోటు వచ్చి నాలోపడ్డది. నా హృదయం పొంగిపోవడం ప్రారంభిం-

చించి, గట్లుకొట్టి ప్రవహించడం ఆరంభించింది. సముద్రపు కెర-టాలభేరీవాయిద్యం నా ప్రవాహంలో పుట్టిన కలకలధ్వనిలో ప్రతిధ్వనించింది. నా లోపున పుట్టిన ధ్వనికి అర్థమేమిటో నాకు ఏమీబోధపడలేదు. అంతకుముందు నాలో ఉండే 'నేను' ఎక్కడికో పారిపోయింది! కెరటాలు కెరటాలుగా పొంగుతూ, హఠాత్తుగా ఆ రూపప్రవాహం నాలోకి ఎక్కడనుంచి వచ్చిందో! సందీప్‌బాబు రెండుకళ్లూ నా అందాన్ని పూజచేయ డానికి వెలిగించిన దీపాలవలె ప్రజ్వలించడం మొదలుపెట్టాయి. నారూపూ, నాశక్తీ, ఎంతఅద్భుతమైనవో సందీప్‌బాబుచూపు-లూ, సందీప్‌బాబుమాటలూ, జేఘంటతో చాటించి, ఆకాశం బద్దలుచేస్తూఉన్నవి. అన్నిశబ్దాలనూ మింగి ఆవాళ నా లోకంలో ప్రవేశించగలిగినది ఆశబ్దం ఒక్కటే.

భగవంతుడు నాకు ఆవాళ ఒకకొత్తజన్మ ఇచ్చాడు. నాకు ఏన్నాళ్లబట్టో అన్యాయంచేసినందుకు అప్పుతీర్చుకున్నాడు. ఎటువంటిఅందమూ లేనిదానను ఒక్కక్షణంలో రూపవతిగా మారిపోయినాను. అతిసామాన్యురాలనైన నాకు, దేశమంతటి-మహిమా నాలోపలనే ప్రత్యక్షానుభవం కలిగింది. 'అందరిలో అతనొకడు', అని మనము అనవలసినమనిషి కాదు సందీప్-బాబు. అతను లక్షోపలక్షల మనుష్యులచిత్తప్రవాహాలకు సంగమస్థానము, ప్రయాగ. అందుచేతనే, ఆవాళ్ల నన్ను అతను రాణి అని పిలిచినప్పుడు, దేశసేవకులు యావన్మందీ వారి స్తవ-ములతో నాకు అభిషేకము చేశారన్నమాట. తరువాత మా-

పెద్దతోటికోడలు లోలోపల ఎంతతిట్టుకున్నా, చిన్నతోటికోడలు పెద్దకేకలువేసుకొని ఎంతఎగతాళిచేసినా, అదేదీ నన్ను అంటనైనా అంటలేకపోయింది. నాకు ప్రపంచంతో ఉండే సంబంధమంతా మారిపోయింది.

దేశమంతటికీ నా అవసరం చాలా ఉన్నదని సందీప్‌బాబు నాకు బోధపరిచాడు. ఆవాళ ఈమాట నమ్మడం నాకు ఏమీ కష్టంఅనిపించలేదు; నాకు అసాధ్యమైనది ఏదీ లేదు; ఏదైనా చేయగలను అనిపించింది. నాలోకి ఒక దివ్యశక్తి వచ్చింది. అది ఇంతకుముందు ఎన్నడూ నాలో నేను చూడలేదు, అది నన్ను మించినది. నాలోకి ఇంత హఠాత్తుగావచ్చిన ఈ భయంకరమైన వడి ఏమిటి అని ఆలోచించడానికైనా నాకు వ్యవధి దొరకలేదు. ఈ శక్తి నాలోనిదేనా! నాది కాదేమో! ఇది బయటిది, దేశమంతటిలోనుంచి వచ్చి నాలో చేరుతున్నది; ఇది సముద్రపుపోటు, పొంగుతున్న గుంట దీనికి జబాబుదారీ కాగలదూ?

దేశంతో సంబంధించిన ప్రతిచిన్నవిషయంలో సందీప్‌బాబు నా సలహా తీసుకుండేవాడు. మొట్టమొదట నేను చాలా సంకోచిస్తూ ఉండేదానను. కాని త్వరలోనే ఆ సంకోచం పోయింది నేను ఏదిచెప్పినా సందీప్‌బాబు ఆశ్చర్యపోయేవాడు. "పురుషులము, మేము, ఉత్త ఆలోచనమాత్రం చేయగలము, గాని మీరు అవగాహన చేసుకోగలరు, మీకు

ఆలోచన అక్కరనేలేదు," అని సందీప్‌బాబు ఒకనాడు అన్నాడు. "స్త్రీలు భగవంతుని మనస్సులోనుంచి పుట్టారు, మొగవాళ్లను సుత్తిదెబ్బలు కొట్టి చేతితో తయారుచేశాడు, దేవుడు" వినగావినగా, నాలో సహజంగా ఒకవిధమైన లోక-జ్ఞానమూ, శక్తీ, ఉన్నవని నాకు నమ్మకంపుట్టింది—అవి ఎంత సహజమంటే ఇన్నాళ్లూ నామట్టుకునాకే తెలిసిందికాదు, అవి నాలో ఉన్నవి అని.

దేశంలో నాలుగువైపులనుంచి సందీప్‌బాబుకు నానా-రకాల విషయాలగురించి ఉత్తరాలు వస్తూఉండేవి. అవి నేనే చదువుతుండేదానను. నా అభిప్రాయం అడగనిదే అతను దేనికీ జబాబుఇచ్చేవాడుకాడు. అప్పుడప్పుడు నా అభిప్రాయమూ అతనిఅభిప్రాయమూ భేదించేవి. వాటిగురించి ఎప్పుడూ వాదన పెట్టేదానను కాను. కాని, రెండురోజులు పోయినతరవాత ప్రొద్దున్న లేస్తూనే, ఏదోఒక జ్యోతి కనబడ్డదన్నట్టుగా, నన్ను పిలిపించి చెప్పేవాడు, "చూశారండి, మీరు ఆవాళ అన్నారు, అదే నిజం సుమండీ, నా వాదమంతా తప్పుయిపోయింది" ఒకొక్కనాడు వచ్చి అనేవాడు, "మీ సలహాప్రకారం ఎందులో చేయలేదో అందులో మోసపోయినాను సుమండీ. దీనిరహస్యం ఏమిటి, నాకు కొంచెం బోధ పరచగలరూ?"

దేశంలో జరుగుతున్నదాని కంతటికీ మూలకారణం సందీప్‌బాబు అనీ, ఆమూలకారణానికి కారణం ఒకసామాన్య

స్త్రీయొక్క సహజబుద్ధి అనీ, నాలోపుట్టిన నమ్మకం బాగా బలపడ్డ. పెద్ద పూచీ వచ్చి నా నెత్తిమీద కూర్చున్నదని ఒక విధమైన ఘనతతో నిండిపోయింది, నా మనస్సంతా.

మా ఆలోచనలలోనూ, మాసలహాలలోనూ, నాభర్తకు ఎటువంటిసంబంధమూ, ఎటువంటిస్థానమూ, ఉండేదికాదు. అన్న, వయస్సురాని తమ్ముణ్ణి ఎంతప్రేమించినా, పనిపాట్లవిషయంలోమాత్రం అతనిమీద ఎటువంటిపూచీ వదలడు. సందీప్‌బాబు నా భర్తఅంటే అటువంటిభావమే కనపరుస్తుండేవాడు. నా భర్త ఈ నానావిషయాలలోనూ కేవలం కుర్రవాడి మోస్తరే అనీ, ఆయన బుద్ధీ, ఆలోచనా, తల్లకిందు అనీ, సందీప్‌బాబు నవ్వుతూ అతివిముద్దుతో అంటూఉండేవాడు. నా భర్తగారి మతంలోనూ, బుద్ధివైపరీత్యంలోనూ, ఒకవిధమైన చక్కనిరసం ఉండేబట్టి సందీప్‌బాబు ఆయనను మరింత విస్తారం ప్రేమతో చూస్తుండేవాడట. ఇంతగొప్పప్రేమ ఉండడంవల్లనే దేశసేవతో సంబంధించిన ఎటువంటి భారమూ, ఆయనమీద వేయకుండా ఆయనకు శలవుఇచ్చేవాడు.

శస్త్రశాస్త్రంలోలాగునే, సృష్టిలోకూడా నొప్పితెలియకుండా చేసే మందులు అనేకంగా ఉన్నవి. మనలోనున్న ముఖ్యమైనభాగాలువ్వైనా కోసితీసివేసినప్పుడు, ఆ మందు ప్రయోగించినట్టయితే, మనకు మరేమీ తెలియదు. చివరకు ఒకనాడు లేచి చూచేసరికి ఎంతపెద్దకన్నం అయిపోయిందో తెలుస్తుంది.

నా జీవనంలో అన్నిటికంటే ముఖ్యమైన అనుబంధం మీద కత్తి నడుస్తూ ఉండేటప్పుడు ఒక తీవ్రమయిన ఆవేగం, వైశంపాయ్యం- చే ఆవిరిలాగు, నా మనస్సును పూర్తిగా కప్పేసింది లోపల జరుగుతున్నది ఎటువంటి ఘోరమో, దేనివల్లనూ, కొంచెమైనా, నాకు తెలియలేదు. ఇదే స్త్రీల స్వభావం గాబోలు, లోపునున్న ఆవేగం ఏదో ఒకవైపు ప్రబలమయి ప్రవహిస్తూ ఉంటే, మిగిలిన వైపు ఏమి జరుగుతున్నదీ తెలియదు. అందుచేతనే స్త్రీ "ప్రళయంకరి" అంటారు. మేము మా అంధప్రకృతితో ప్రళయం పుట్టిస్తాము, బుద్ధిని వినియోగించి కాదు. మేము నదుల వంటివారు; గట్లమధ్య పారుతున్నంతకాలం మాకుండే సమస్తమూ ఇచ్చి పోషిస్తాము; గట్లు కొట్టి పారడం ఆరంభించామా, మాలో ఉన్న దంతా ప్రయోగించి నాశనం చేసేస్తాము.

లోపల ఏదో గొడవ జరుగుతూవుంది. ఆవాళ పైనుంచి కూడా వాన కొంచెంకొంచెం కొడుతూ ఉన్నది.

నేను వచ్చినదగ్గిరనుంచి నిఖిలేశ్ కూర్చుండేగది అంతఃపురాన్నీ వీధినీ కలిపి, రెండుజాతులకూ, అనగా, స్త్రీలకూ-పురుషులకూ, దానికివచ్చే ఒకవిధమైన కొత్తపదార్థముయిపోయింది. బయటనుండి రావడానికి నాకు అధికారం ఉండేది, అంతఃపురంలోనుంచి రావడానికి విమలకు ఎటువంటిఅడ్డూ ఉండే కాదు.

మేము ఈ అధికారంఅంతా ఒక్కమారు ఉపయోగించడానికి బదులుగా, క్రమక్రమంగా హెచ్చుచేసుకుంటూ వస్తే, లోకులు అంతగా ఏమీ అనకపోయివుందురు. కాని గట్టు కొట్టేస్తూనే, నీరు మరీ భయంకరమైనవడితో పారుతుంది. ముందుగదిలో ఎంతజోరుగా సభలు జరుగుతూఉండేవి అంటే, మరిఎటువంటి ఆలోచనకూ మామిత్రులలో దూరడానికి వీలు చిక్కిందికాదు.

ముందుగదిలోకి రాణి వచ్చేసరికి నాకు నా గదిలోనుంచి తెలిసిపోయేది. గాజులు చప్పుడయ్యేవి, లేకపోతే ఏదో ఈడ్చినట్టు అయ్యేది; ఒకప్పుడు గదితలుపు తీసినట్టు, అవసరానికిమిం-

-విన చప్పుడు అయేది; మరిఒకప్పుడు పుస్తకాలబీరువాతలుపు గట్టిగా అంటుకొని రాకపోతే, జోరుచేసి తీస్తున్నట్టు అనుమానించి గదిలోకి వెళ్ళి చూచేవాడను; తలువువైపు వీపుపెట్టి రాణి బీరువాలోనుంచి తదేకధ్యానంగా ఏదోపుస్తకంకోసం వెతుకుతుండేది. "మీకెందుకు, పాపం, ఆ శ్రమే, నాకో చెప్పండి, నేను మీకు కావలసినది తీసిస్తాను," అని అడిగేసరికి, ఉలికిపడి వెనకకు తిరిగి, "వద్దు వద్దు," అనేది. దానినుండి సహజంగా ఇతరప్రసంగాలలోకి మెల్లిగా వెళ్ళేవాళ్ళము.

ఒక లక్ష్మీవారంనాడు వర్షంవేళప్పుడు ఈ పైచెప్పిన శబ్దమేదో విని నా గదిలోనుంచి బయలుదేరాను. దారిలో వరండామీద దర్వాన్ నిలబడిఉన్నాడు. అతనివైపు చూడనైనాచూడకుండా వెళిపోతున్నాను. వాడు నన్ను అడ్డగిస్తూ, "అటు వెళ్ళకండి బాబూ," అన్నాడు.

"వెళ్ళకపోతా? ఏమి?"

"బయటిగదిలో రాణిఅమ్మ ఉన్నారు."

"సరే అయితే, మీ రాణిఅమ్మగారితో చెప్పు, సందీప్‌-బాబు ఒమ్మల్ని చూడడానికి వస్తారు, అని".

"సెలులేదు బాబూ, సెలవు లేదు." బాగా కోపంవచ్చి గట్టిగా అన్నాను, "నా సెలవుఅయింది వెళ్ళి అడిగిరా!"

ఘటీమనిఅనేసరికి దర్వాన్ కొంచెం కంగారుపడ్డాడు. వాణ్ణి ఒకపక్కకు తోసేసి నేను గదివైపు వెళుతున్నాను. నేనూ

రమారమి తలుపుదగ్గిరికి వచ్చేశాను, వాడు చేయవలసినపని వాడూ చేదామని గాబోలు, వెనుకనుంచి పరుగెత్తివచ్చి నా చెయ్యిపట్టుకున్నాడు. పట్టుకొని, "లోపుకు వెళ్లకూడదు బాబూ," అన్నాడు.

"ఏమిటీ! నాఇంటిమీద చెయ్యేమి!" వాడి చెయ్యి నులిపిపట్టుకొని గట్టిగా ఒక లెంపకాయ వేశాను. ఆ సమయంలో రాణి పైకివచ్చి చూచింది, దర్వాన్ నన్ను అవమానపరచ బోతున్నాడు.

అప్పుడు చూచాను ఆమె విగ్రహం! అది నే నెన్నటికీ మరవను. ఆమె రూపవతి అని మొట్టమొదట కనిపెట్టినవాడను నేనే. మనదేశంలో ఆమెవైపు చూచినైనా చూచారు. సన్నంగా పొడవుగా ఉండేది; మన రూపరసజ్ఞులు ఆమెను చూచి, బహుశా, "పొడవుగా తాటిచెట్టులాగు," అని వెక్కిరిస్తూ అంటారేమో. పొడవైన ఆ ఆకారంచూస్తే కళ్లు మరిచిపో-యేవాడను. కిందనుండి పైకి లేస్తూఉన్న ప్రాణధార అనిపించేది; సృష్టికర్త హృదయగహ్వరంలో. పుట్టి మీదికి అతివడిగా ఎగురుతున్నది అనిపించేది. ఆమెది నలుపువర్ణం, గాని ఆ నలుపు, ఉక్కుకత్తికిఉండే నలుపు. ఏమి తేజస్సు! ఏమి వాడి! ఆ తేజస్సు ఆమెకళ్లల్లోనూ ముఖంలోనూ ఆవాళ వికసిస్తూఉన్నది. రాణి గుమ్మంమీద నిలబడి వేలితో చూపిస్తూ "నన్ కూ పో," అన్నది.

"మీరు కోప్పడకండి, మావదిన్నిప్పుడు నేనే వెళ్ళిపో-
తాను," అన్నాను.

"మీరు వెళ్ళకండి, లోపలకు రండి," అని [illegible]తో రాణి అన్నది.

అది ఒక్కసారికి కాదు, ఇక్క. లోపలకు వచ్చేను, [illegible] తీసి విసురుకుంటూ కుర్చీమీద కూర్చున్నాను చిన్నక్కా. తమ్ముళ్ళకు ఒకటి తీసి [illegible] ఏదో వ్రాసి, నౌకరును పిలిచి, "ఇది తీసుకువెళ్ళు మహారాజుగారికి ఇచ్చిరా," అన్నది.

అప్పుడు నేను అన్నాను, "[illegible] మీరు [illegible]—సహించలేక [illegible] వాడికి ఒక్క దెబ్బ కొట్టాను."

"మంచిపని చేశావు," అన్నది రాణి.

"కాని, వాడిదేమీ తప్పులేదేమో, పాపం! వాడి-కిచ్చిన పని వాడు చేశాడు."

అంతటిలో నిఖిల్ గదిలోకి వచ్చాడు. నేను తొందర తొందరగా కుర్చీమీదనుంచి లేచి, కిటికీదగ్గిరికి వెళ్ళి, ముఖం అటువైపుపెట్టుకొని నిలబడ్డాను.

"ఈవాళ మన దర్వాన్, నన్కు, సందీప్‌బాబును అవమానపరిచాడు," అని నిఖిల్‌తో అన్నది, రాణి.

"ఏమీ?" అని ఆశ్చర్యపడుతూ అతి అమాయకంగా నిఖిల్ అడిగాడు. నేను మరి ఊరుకోలేకపోయినాను. ముఖం

ఇట్టుతిప్పి కదలకుండా మెదలకుండా నిఖిల్ వైపు చూచాను. 'నేను సత్యవంతుడను, అని సాధువుకు ఉండే బడాయి పెళ్లాముదగ్గిర సాగదు—పెళ్లామే గట్టిదయితే,' అని నాలో నేను అనుకున్నాను.

రాణి చెప్పింది, "సందీప్‌బాబు ఈ గదిలోకి వస్తూఉంటే అడ్డుగా వచ్చి, శెలవులేదు వెళ్లకూడదు అన్నాడట."

"ఎవరిసెలవులేదు!" అని అడిగాడు నిఖిల్.

"అది నేనుఏలాగు చెప్పగలను ?" అన్నది రాణి— కోపంవల్లా, దుఃఖంవల్లా, ఆమెకళ్లవెంట నీళ్లు బొదబొద కారిపోతున్నవి.

నిఖిల్ దర్‌వాన్‌ని పిలిపించాడు. "నాతప్పులేదు మహాప్రభూ, శెలవుప్రకారం చేశాను," అని దర్‌వాన్ అన్నాడు.

"ఎవరిసెలవు?"

"పెద్దరాణిఅమ్మా, రెండోరాణిఅమ్మా నన్ను పిలిపించి చెప్పారు."

ఒక్కఘడియ అందరమూ ఊరుకున్నాము.

దర్‌వాన్ వెళుతూనే, "నాన్‌కూను మానిపించేయాలి," అని రాణి అన్నది.

నిఖిల్ మాటాడలేదు. అతనిన్యాయబుద్ధి అటువంటి పనికి అడ్డుచెపుతూఉంది—ఆ అడ్డుకు మరి అంతంలేదు కదూ!

గొప్ప చిక్కు వచ్చిపడ్డది. రాణి ఊరుకుండే మనిషి కాదే! నాన్‌కూను పనిలోనుంచి తీయించేయాలి, తోటికో-డళ్లమీద ఆమె పగ తీరాలి.

నిఖిల్ ఏమీ అనకుండా ఊరుకున్నాడు. రాణికళ్లల్లో-నుంచి అగ్నివర్షం కురిసేస్తూఉంది. నిఖిల్ మంచితనం చూస్తే ఆమెకుండే అసహ్యం ఇంతా అంతా కాదు.

నిఖిల్ ఒక్కమాట అనలేదు; లేచి గదిలోనుంచి వెళిపోయినాడు.

మర్నాడు ఆ దర్‌వాన్ మరి కనబడలేదు. కనుక్కోగా తెలిసింది, నిఖిల్ వాడికి ఇంకొక పనిఇచ్చి పైఊరికి పంపేశా-డని. దర్‌వాన్‌జీకి కలిగిననష్టం ఏమిటంటే, జీతం కొంచెం హెచ్చుకావడం.

దీనివల్ల తెరలవెనక పుట్టిన తుపానుసంగతి పైచిహ్నాల మూలంగా కొంత బోధపరుచుకున్నాను. నిఖిల్ ఉత్త పిచ్చి పుల్లయ్య, సత్యకాలం మనిషి; అతనిలాంటి వాడు ఈపృథ్వి మీద ఇంకొక్కడు లేడు—ఘడియఘడియకూ ఈమాట జ్ఞాపకం వస్తూఉండేది.

దీనిఫలం ఏమిటంటే, అప్పటినుండి కొన్నాళ్లవరకు, రాణి రోజూ ముందు గదిలోకి వచ్చి, నాకోసం కబురు పంపి, బాతాఖాని చేయడం ప్రారంభించింది—ఏదోపనిఉండి కలుసు-కున్నట్టు కనబడాలని గాని, కాకతాలీయంగా కలుసుకున్నా-మన్నట్టు కనబడాలని గాని, ఏమీ ప్రయత్నించలేదు.

ఈ విధంగా లోపునున్న భావాలు క్రమక్రమంగా పైకి వచ్చి ఆకారం ధరించడం ప్రారంభించాయి. అస్పష్టంగా ఉండేది క్రమక్రమంగా స్పష్టంకావడం ప్రారంభించింది. 'గొప్ప ఇంటి కోడలు, ఆమె; నక్షత్రలోకం ఆమె నివాసస్థానం, మనకందనిది' అని అనిపించేది బైటవాళ్లకు. 'అక్కడికి వెళ్లడానికి ఏర్పడ్డదారి ఏదీలేదు.'

అటువంటి దారిలేని శూన్యంలో బయలుదేరి ఆ అన్యోన్య ఆకర్షణా, స్నేహమూ, లోకాచారాలు వేసిన పరదాలను ఒకటి తరువాత ఒకటిని, తెలిసీతెలియకుండా, ఎత్తేస్తూ, చిట్టచివరకు ఒకనాడు ఎప్పుడో, దిగంబరమైన ప్రకృతిమధ్యకు వచ్చి చేరుకుంటాయి. ఇది సత్యం చేస్తూఉన్న ఒక ఆశ్చర్యమయిన పని; ఇదే దాని విజయయాత్ర.

సత్యంకాక మరేమిటి! స్త్రీపురుషులకు అన్యోన్యంగా ఉండే ఆకర్షణ వాస్తవమయినవస్తువు. రోడ్డుమీదనున్న ధూళి అలుసు మొదలుపెట్టి ఆకాశంమీదనున్న నక్షత్రాలవరకూ, ప్రపంచంలోఉండే వస్తుపుంజంఅంతా దానిపక్షమే. మనుష్యుడు దానిని ఎన్నోమూటలకింద దాచి ఉంచాలని ప్రయత్నిస్తాడు, అనేకరకాల విధినిషేధాలు కల్పించి, వాటితో దాన్నికట్టి, ఒక ఇంటిసామానుగా చేసి ఉంచుదామని ప్రయత్నిస్తాడు. సూర్యలోకం కరిగించి దానితో అల్లుడికోసం వాచీగొలుసు చేయిద్దామనే ప్రయత్నం ఎటువంటిదో, అదీ అటువంటిదే.

చిట్టచివరకు ఒకనాడు వస్తువులలో ఉండేప్రాణం ఒక్క కేక వేసేసరికి, మనలో ఇన్నాళ్లూ నిద్రపోతూఉన్న వాస్తవం లేచి, మనుష్యుడు చుట్టూపెట్టిన మాటలన్నిటినీ ఒక్కనిమి-షంలో గుండపిండిచేసి, తన నిజమయిన స్థానానికి వచ్చి నిలు-చుంటుంది. అప్పుడు మననీతులూ, నియమాలూ, నమ్మకాలూ, ఏవైనా ఆపగలవూ దానిని! అప్పుడు ఎన్నితిట్లు వినబడతాయి, ఏమికేకలు వినబడతాయి! కాని అదంతా నోటిమాటలతో తుపానును ఎదిరించినట్టే! అయితే తుపాను ఏమిచేస్తుంది? ఏమీ జబాబు చెప్పదు. తన పని తానుచేసుకుంటూ ఉంటుంది —కనబడేప్రతివస్తువునూ ఝాడించి మరీ పోతుంది—అది నిజమైనవస్తువు, వాస్తవము అంటే అదే.

సత్యం తన ఆకారాన్ని నా కళ్లముందర బయలు పరుస్తూఉంటే చూడడానికి నాకు చాలా సరదాగా ఉన్నది. ఎంతసిగ్గు, ఎంతభయం, ఎంతసంకోచం—అవేవీ లేకపోతే అందులో రసమే లేదు. ఆకాళ్లు కదిలిస్తూ ఉండడమూ; ఉండుండి ముఖంతిప్పడమూ అతిఇంపుగా ఉంటాయి. అది కేవలం ఇతరులనే మోసపుచ్చదు, తననుతానుకూడా మోస-పుచ్చుకుంటుంది. నిజము మిథ్యతో పోట్లాడినప్పుడు, మోసమే దానిప్రధాన అస్త్రము. శత్రుపక్షంవాళ్లు దాన్ని స్థూలమయిన వస్తువు అని తిట్టి, దానికి సిగ్గుపుట్టిస్తారు. అందుచేత అది ఎక్కడైనా దాగొనిఉండాలి, లేదా మాయవేషం వేసుకొని తిరుగుతుండాలి. అప్పుడు దానికిఉండే అవస్థ ఎటువంటిది

అంటే, అది ఉన్నసంగతి నిర్భయంగా చెప్పలేదు—"నేను నిజాన్ని, అందుచేత స్థూలమైన దానను; నేను రక్తమాంసాలతో తయారయినదానను; నేను ప్రవృత్తిని; నేను ఆకలిని, సిగ్గు నాదగ్గిరికి రాదు; నాకు దయలేదు. వర్ష ధారలకి కొండమీది-నుంచి రాయి దొర్లివచ్చి లోక-ఆలయ శిఖరంమీద పడినప్పుడు, ఎవడు చచ్చాడు ఎవడు బ్రతికాడు అని, ఆలోచించదు—నాదీకూడా అంత నిర్దయ, అంత నిర్లజ్జ," అని జోరుగా చెప్పడానికి సందర్భపడదు.

నాకు అంతా స్పష్టంగా కనబడుతూఉంది. అదిగో పరదా కొట్టుకుంటూఉంది, ఎగిరిపోతుంది ఇక; అదిగో దారిలో యాత్ర సరంజాంఅవుతూఉంది; ప్రళయం వస్తుంది ఇక. అదిగో ఎర్రరిబన్, ముడివేసిన జుట్టులోనుంచి కొంచెం కొంచెం కనబడుతూఉంది—కాలమేఘం, లోపున పుడుతూ ఉన్న కోరికను తెలియజేస్తూ, బయటికి తోస్తున్న నాలికలాగు ఉన్నది, వాంఛచేత ఎర్రగాఉన్నది ఆనాలుక! అదిగో చీరంచు మడతలుమడతలుగా; అదిగో కనబడీకనబడని జాకెట్టు! లోపునున్న తాపం నాకు స్పష్టంగా తగులుతూఉంది. ఈ ప్రయత్నంలో చాలాభాగం పైకి తెలియకుండానే జరుగుతూ ఉంది, అది ఎప్పటికీ పైకిరాదు, చేస్తూఉన్నఆమెకే అది పూర్తిగా తెలియదు.

ఎందుకు తెలియదూ? మనుష్యుడు నిజాన్ని అనేక విధాల కప్పి స్పష్టంగా కనబడకుండా చేసుకున్నాడు—దాన్ని

ఉపయోగించే మార్గం తనచేతులతో తానే పాడుచేసుకున్నాడు. ఆఖరికి ఇప్పుడు నిజంఅంటే సిగ్గుపడిపోతున్నాడు. అందుచేతనే, మనుష్యుడు దానిమీద నానారకాల వస్తువులూ కుప్పలుకుప్పలుగా పెట్టి దాన్ని దాస్తూఉంటే, ఆ మూతలమధ్యనుంచి దొంగతనంగా పైకివచ్చి కొంచెంకొంచెంగా తన పని చేసుకోవలసివస్తూఉంది. అందుచేత అది ఏవైపు వెళుతుందో, ఏమిచేస్తుందో మనకు తెలియదు; ఆఖరుకు ఒకనాడు వచ్చి నెత్తిమీద పడేసరికి దానిఅధికారం, చచ్చినట్లు, ఒప్పుకుంటాము. మనుష్యుడు దానికి దొంగఅని, దయ్యంఅని, చెడ్డపేరు పెట్టి తరిమేయాలని చూస్తున్నాడు; గనుకఅది ఏమిచేస్తున్నదిస్వర్గానికితగిన వేషం వేసుకొని స్వర్గోద్యానంలో దొంగతనంగా ప్రవేశిస్తున్నది. ప్రవేశించి మానవప్రేయసిఅయిన ఆడదానిచెవిలో రహస్యంగా మాటలుచెప్పి, ఆమెకళ్లు విప్పుతున్నది. విప్పి ఆమెచేత పితూరీ చేయిస్తున్నది—తరవాత? తరవాత మరేమిటి? సుఖం రమ్మంటే ఎక్కడ వస్తుంది? వచ్చేదిఒక్కటే, చావు!

నేను వస్తుతంత్రాన్ని. వేషమంతా అవతలపారేస్తే భావాలజైలును విరగగొట్టి, నిజం పైకి, వెలుతురులోకి, వస్తుంది. అందుచేత నామనస్సు ఆనందంతో నిండిపోతూఉంది. నాకు కావలసినది బాగా దగ్గిరికి వస్తూఉంది; దానిని కడుపార అనుభవిస్తాను; దానిని గట్టిగా పట్టుకుంటాను; ఎంతమాత్రం విడవను. మధ్య అడ్డువచ్చినవాటినల్లా విరగగొట్టి, గుండపిండిచేసి

నాలుగువైపులా విరజల్లుతాను, గాలిలో ఎగరపోస్తాను. అదీ ఆనందం ; ఆనందంఅంటే అదేనూ; అదే 'నిజము' చేసే తాండవము. అటుతరవాత, చావూ బ్రతుకూ, మంచీ చెడ్డా, సుఖమూ దుఃఖమూ అన్నీ తుచ్ఛమే, తుచ్ఛమే, తుచ్ఛమే !

మా రాణి కలలలో విహరిస్తూ ఉన్నది, ఎటువైపు వెళుతూ ఉన్నదీ తనకే తెలియకుండా ఉంది. సరియైన సమయం రాకముందు ఆమెకు బోధపరిచి నిద్రపోగొట్టడం నిరపాయమైన సంగతి కాదు. నాకేమీ తెలియనట్టు నటించడమే మంచిది. నేనుభోజనంచేస్తున్నప్పుడు, ఆవాళ, రాణి నావైపు ఒకమోస్తరుగా చూస్తూ నిలబడ్డది. ఆ చూపులకు అర్థమేమిటో పూర్తిగా మరిచిపోయింది. నేను మధ్యనొకమారు ముఖంఎత్తి చూచేసరికి ఆమెముఖం ఎర్రచేసుకొని, కళ్లు అటువైపు తిప్పేసింది. అప్పుడు నేను అన్నాను, "నా భోజనం చూచి మీరు నిశ్చేష్టులయిపోయినారు! అనేకమయినసంగతులు దాచుకుంటానుగాని భోజనమంటే నాకుండే కక్కూర్తి మాటిమాటికీ కనబడిపోతుంది. కాని చూడండి, నావిషయమై నాకే సిగ్గులేనప్పుడు మీకెందుకు సిగ్గు ?"

ఆమె తల వంచుకొని ముఖం మరింత ఎర్రచేసుకొని అనడం ప్రారంభించింది, "లేదు, లేదు ; మీరు—"

నేను అన్నాను, "ఆత్మాశగలమనుష్యులంటే ఆడవాళ్లకు ఇష్టం. మాకు ఆత్మాశ ఉండబట్టే వాళ్లు మామీద

అధికారం సంపాదిస్తారు. నాలో బాగా ఉన్నది, అటువంటి అత్యాశ. అందుచేత ఆడవాళ్ల దగ్గిర బాగా గౌరవం పొంది-పొంది చివరకు ఏ దశలోకి వచ్చానంటే, సిగ్గుఅన్నమాట పోయింది. మీరు ఇష్టంవచ్చినంత ఆశ్చర్యపడండి, తదేక-ధ్యానంగా నావైపు కావలసినంత చూడండి, నాకేమీ భయం లేదు. ఈ ములంకాడలన్నీ, ఒక్కొక్కటి నోట్లో పెట్టుకొని, బాగా నమిలి పిప్పిచేసి మరీ వదులుతాను—అది నా స్వభావం."

ఎవరో కొత్తగా వ్రాసిన ఇంగ్లీషుపుస్తకం ఒకటి, ఈ మ-ధ్యనే నేను చదువుతుంటిని. స్త్రీపురుషులకు ఉండవలసిన సంబం-ధాన్ని గురించి కొన్నికొన్ని నిజమైనసంగతులు అందులో స్పష్టంగా వ్రాసి ఉన్నవి. ఒకనాడు ఆపుస్తకం వాళ్లగదిలో వదిలేసి వెళ్లాను. మరిఒకనాడుమధ్యాహ్నం ఎందుకో ఆ గది-లోకి వెళ్లేటప్పటికి రాణి ఆపుస్తకం పట్టుకొని చదువుతున్నది. నాఅడుగులచప్పుడు వినబడగానే అది అక్కడ పడేసి, దాని-మీద ఇంకొక పుస్తకం పెట్టి లేచి నిలుచున్నది. మీదపెట్టినది లాంగ్ ఫెలో పద్యాల పుస్తకము.

నేను అన్నాను—"పద్యాలు చదవడానికి మీకు సిగ్గెందుకు, మొగవాళ్లకంటే సిగ్గుగాని? మొగవాళ్లము మేము, ఇంజనీర్లు అవుతాము, లాయర్లు అవుతాము, అటు-వంటివి ఏవేవో నానారకాలపనులు చేస్తాము. అందుచేత మేము పద్యాలు చదవాలంటే అర్ధరాత్రప్పుడు తలుపులు

వేసుకొని చదవడం న్యాయము. మీ ఆడవాళ్ల తత్వం మొదటి-నుంచి చివరదాకా కావ్యంతో కలుస్తుంది. మిమ్మల్ని పుట్టించిన సృష్టికర్త ఒక మహాకవి. అతనిపాదాలదగ్గిర కూర్చొనే, జయదేవుడు కవిత్వంచేశాడు.

రాణి ఏమీ—జబాబు చెప్పలేదు; నవ్వుతూ వెళిపోబోయింది. "మీరు వెళ్ళకండి, ఇక్కడే కూర్చొని చదువుకోండి, నేను ఇక్కడ ఒకపుస్తకం వదిలిపెట్టి వెళ్లాను, అది తీసుకొని వెళిపోతాను," అని అన్నాను.

టేబిల్ మీదనుంచి నా పుస్తకం తీసి పట్టుకున్నాను. "కొంపతీసి, ఈపుస్తకం మీ చేతిలో పడ్డదికాదు! నన్ను కొట్ట-డానికి వచ్చిఉందురు," అన్నాను.

"ఏమీ?"

"ఏమా! ఇందులో ఉండేవి పద్యాలుకావు, మనుష్యులు ఆడవలసిన మోటా మాటలు—అతిమోటాగా చెప్పినవి. అవి యుక్తిగా చెప్పినమాటలు కావు, దొంగనాజూకు లేదు, వాటిలో."

"ఈపుస్తకం నిఖిల్ ఒకమాటు చదవవలెనని నా కోరిక."

చికాకు పడ్డట్టుగా ముఖం కొంచెం చిట్లించుకొని రాణిఅడిగింది—"ఆయన చదవడం ఎందుకు?"

నేను అన్నాను, "అతను మొగవాడు, మాదళంలో-వాడు, ఈ స్థూలప్రపంచాన్ని ఒకమాయతో కప్పి మరీ చూడ-

వలెనని ప్రయత్నం, అతనిది; అందుచేతనే అతనితో నాకు పోట్లాట. మీకు తెలియనే తెలుసును—నిఖిల్, మా స్వదేశీ వ్యవహారాలూ లాంగ్ ఫెలో పద్యాలూ, సరిపుచ్చుదామని చూస్తాడు. ప్రతిమాటా ఛందస్సును అనుసరించి, ముద్దుగా నడవాలని అతనిఉద్దేశం; మేము గద్యగదను చేతపుచ్చుకొని తిరిగేవాళ్లము ; ఛందస్సు పాడుచేసేదళం మాది."

రాణి అన్నది—"స్వదేశీకీ ఈపుస్తకానికీ సంబంధం ఏమిటి?"

నేను అన్నాను, "చదివి చూస్తే మీకే తెలుస్తుంది. స్వదేశీలో ఏమిటి, తక్కినవిషయాలలో ఏమిటి,—ప్రతివిషయములోనూ నిఖిల్ ఉత్తకల్పనమాటలనుబట్టి నడుచుకుందామని చూస్తుంటాడు ; మనుష్యునికి స్వాభావికమయినదానితో పోట్లాడుతుంటాడు ; మనుష్యస్వభావాన్ని తిడుతుంటాడు. ఈమాటలన్నిటికంటే ఎంతో పూర్వం తయారైనది కదా, మనుష్యస్వభావం, ఎంతైనా అది ఒప్పుకోనంటాడు. మాటలాట పూర్తిగా చల్లారిపోయినతరవాత, చాలాకాలంవరకూ స్వభావం ఇంకా అలాగే ఉంటుంధని అతనికి తెలియదేమో!"

రాణి కొంచెంసేపు ఊరుకొని, అతిగంభీరభావంతో అడిగింది—"స్వభావంకంటే పెద్దకావాలని ప్రయత్నించడం కూడా మనస్వభావం కాదూ?"

నాలో నేను నవ్వుకొని అనుకున్నాను, "ఆహా, రాణీ! ఇవన్నీ నీమాటలుకావు, నిఖిల్ నేర్పినవి. నీవు మంచి ఆరోగ్య-

వంతురాలవు; స్వభావసిద్ధమయినది నీ తత్వం; నీవు స్వభావ-సారంతో నిగనిగలాడుతున్నావు; స్వభావంలో పుడుతున్న పిలుపు నీకు వినబడీవినబడడంలో నీ రక్తమాంసాలు జబాబు ఇస్తాయి. ఇన్నాళ్లబట్టీ నీచెవిలో ఊదుతున్నమంత్రాలు మరి నిన్ను కట్టిఉంచలేవు. జీవనాగ్ని తాపంవల్ల నీ ఒంట్లోనున్నసమస్తమూ ఉడుకుతున్నది, ఆ సంగతి నేను ఎరగనూ? జ్వరంవచ్చినప్పుడు మీద తడిబట్టవేసి, ఒళ్లు చల్లగాచేసినట్టు, నీతిమాటలు చెప్పి స్వభావాన్ని ఎన్నాళ్లు శాంతపరచగలరు.?"

తరవాత పైకి అన్నాను, "భూమిమీద దుర్బలులసంఖ్య విస్తారం. తమ ప్రాణాలను రక్షించుకోడానికని, వాళ్లు ఇటువంటి మంత్రాలు అందరిచెవులలో ఉపదేశం చేసిచేసి, బలవంతుల మనస్సులుకూడా పాడుచేస్తున్నారు. సహజంగా బలంలేనివాళ్లు ఇతరులస్వభావాలుకూడా తమవాటిలాగే చేదామని ఎప్పుడూ ఉపదేశం చేస్తుంటారు."

రాణి అన్నది, "మా ఆడవాళ్లము దుర్బలలము. దుర్బలుల కుట్రలోనే మేము చేరాలి."

నవ్వుతూ నేను అన్నాను—"మీరు దుర్బలలని ఎవరన్నారు? పురుషుడు మిమ్మల్ని అబలలు అని స్తవంచేసిచేసి, సిగ్గుతెప్పించి, దుర్బలలుగా చేసిఉంచాడు. మీరే బలమయినవాళ్లు అని నా నమ్మకం. మొగవాళ్లు, మంత్రాలతోకట్టిన కోటను పడదోసి, భయంకరమైన రూపంతో మీరు ముక్తిలాభం పొందుతారు. ఆమాట నేను వ్రాసిఇస్తాను, కావాలంటే. పురు-

షులు పైకి పెద్దపెద్దమాటలు చెప్పు[illegible]గుతుంటారు. లోపున చూస్తేమాత్రం వాళ్లవి స్వేచ్ఛల[illegible] ఈ రోజువరకూ పురుషుడు తాను కల్పించిన శాస్త్రంతో తననే బంధించుకొనిఉన్నాడు. పురుషుడు తనలోపునున్న అగ్నిలో స్త్రీని బంగారంగొలుసుగా చేసి, ఆ గొలుసుతో తనను లోపునా బయిటాకూడా కట్టుకున్నాడు. ఈ విధంగా, తానుచేసుకొన్న బోనులో తానే పడే అద్భుతశక్తి, పురుషుడికి లేకపోయినట్టయితే అతనిని ఇప్పుడు కట్టిఉంచడం ఎవరితరం? తాను నిర్మించినబోను పురుషుడికి, అన్నిటికంటే అధికముగా ఆరాధించదగిన, ఒక గొప్ప దేవత అయిఉన్నది. దానికి నానారంగులు వేస్తున్నాడు, నానారకాలముస్తాబు చేస్తున్నాడు, నానా నామధేయాలుపెట్టి పూజచేస్తున్నాడు. కాని మీరో, ఆడవాళ్లో! వాస్తవమయినదాన్ని మనస్ఫూర కోరుతున్నారు; దేహమంతటితోనూ, రక్తమాంసాలతోచేయబడ్డ నిజాన్ని, కోరుతున్నారు. వాస్తవం మీలోనుంచి పుట్టింది. మీరే దాన్ని పోషించి పెంచుతున్నారు.

రాణి చదువుకున్నమనిషి, ఒకంతట వాదన వదలదు. "మీరు అనేదే నిజమయితే పురుషుడికి స్త్రీఅంటే ఇష్టం ఉండదే?" అన్నది.

నేను అన్నాను, "ఆడవాళ్లు ఎరుగుదురు ఆమాట. మోసం మొగవాళ్లకు ఇష్టం, వాళ్లస్వభావం అటువంటిది అని, ఆడవాళ్లకు తెలుసును. అందుచేత ఆడవాళ్లు మొగ-

వాళ్లదగ్గిర మోసం కొంచెం బదులుతెచ్చి, దానితో ముస్తాబు చేసుకొని వాళ్లనే మోసపుచ్చాలని ప్రయత్నిస్తారు. మొగవాళ్లకు భోజనంకంటే ఆగుడే ప్రియమని ఆడ వాళ్లకు తెలుసును. కనుక చేసే ప్రతిపనిలోనూ ఎంతో యుక్తి ఉపయోగించి, కల్లంతలేపువస్తువు అవుదామని ప్రయత్నిస్తారు. వాళ్లదగ్గిరఉండే తినుబడివస్తువులన్నీ సాధ్యమైనంతవరకు దాచేస్తారు. మంత్రాలూ, వేషాలూ, స్త్రీలు తమకోసం కోరరు. వాళ్లు నిజాన్ని నమ్మేవాళ్లు; ఆ ప్రయత్నాలన్నీ మొగవాళ్లకోసమే. కేవలం మరిఒకమార్గం లేకపోబట్టి స్త్రీ మోహినీ అవుతున్నది.”

“ఆమోహం పోగొట్టాలని ప్రయత్నిస్తున్నారెందుకు?” అని రాణి అన్నది.

“స్వాధీనత కావలెను గనుక. దేశానికి స్వాధీనత కావలెను గనుక; స్త్రీపురుషులకుండే సంబంధంలో స్వాధీనత కావలెనుగనుక. దేశం నాకంటికి అత్యంతవాస్తవమయినవస్తువు; అందుచేతనే దానిచుట్టూ నీతివాక్యాలు ధూపంవేసి, అందులోనుంచి దానిని చూడమంటే ఎంతమాత్రం ఒప్పుకోలేను. నేను ఒక వాస్తవమయినవస్తువును. అలాగునే, నాకంటికి మీరూ ఒక వాస్తవమయినవస్తువు. అంచేతనే, మన మధ్య మాయమూ మర్మమూ ఉండకూడదు. మనిషికీమనిషికీ మధ్య కేవలం ఉత్తమాటలు నాలుగుపెట్టి, ఒకరినొకరు బోధపరుచుకోకుండా చేయడం నాకు ఇష్టంలేదు. నిద్రలో నడుస్తూఉన్న మనిషిని చటాలున లేపివేయడం మంచిపనికాదు. కాని నా

స్వభావంలో ఒకవిధమైన జోరు ఉన్నది. నా నడక నెమ్మదైన నడక కాదు. ఆవాళ నేను ఆడిన మాటలవరసా, వాటిలో ఉండే భావమూ, చాలా సాహసమయినవి—నాకు తెలుసును. నాకు తెలుసును, అటువంటిమాటలవల్ల తగిలే మొదటి దెబ్బ భరించడం చాలాకష్టమని. కాని ఆడవాళ్లదగ్గిర సాహసంగల వాడిదే జయం. పురుషుడికి పొగంటే వ్యామోహం. స్త్రీ ఇష్టప- డేది వాస్తవమయిన గట్టివస్తువు. అందుచేతనే మొగవాడు తన లోపునున్న భావాలను ప్రాజచేదామని ఎప్పుడూ పరుగెత్తు- తుంటాడు. ఆడవాళ్లు తమసమస్తమునూ బలవంతుని పాదాల దగ్గిరికి తీసుకువచ్చి సమర్పిస్తారు.

మా సంభాషణ అంతకంతకు జోరెక్కుతూఉంది, అటువంటప్పుడు నిఖిలేశ్ చిన్ననాటి మాస్టరు, చంద్రనాథ్- బాబు, వచ్చి గదిలో నిలుచున్నాడు. పృథ్వి అనే ఈ జాగా మొత్తానికి మంచిదనే చెప్పవచ్చును; ఐతేనేమి, ఈ మాస్టర్లంతా వచ్చి, 'మనము ఇక్కడనుంచి ఇక బస ఎత్తుకొనిపోతే బాగాఉంటుందా?' అనిపించేస్తున్నారు. నిఖిలేశ్ లాంటివాళ్లు ఈ ప్రపంచాన్ని యావజ్జీవమూ స్కూలుగాచేసి ఉంచుదా- మంటారు. వాళ్లు పెద్దవాళ్లవుతూఉన్నా స్కూలుమాత్రం వెనకవెనకనే వస్తూఉంటుంది. సంసారం మొదనుపెడితే అందు- లోకూడా ఆ స్కూలే దూరుతుంది. అంతా విడిచిపెట్టి వెళిపోయినప్పుడు ఈ స్కూలుమాస్టర్నికూడా, సహగమనం ద్వారా, పరలోకం తీసుకువెళ్లడం న్యాయం. ఆవాళ మా

మాటలు అతికులాసాగా జరుగుతూఉన్నప్పుడు, . కేవలం అసందర్భమైన సమయంలో, ఆ మూర్తీభవించినస్కూలు మా గదిలోకివచ్చి హాజరయింది. మనఅందరిస్వభావాలలో ఎక్కడో ఉంటుంది, ఒక చిన్న మూల—ఆ మూల బసచేసుకొని కూర్చుంటాడు, మనలోఉన్న స్కూలుకుర్రవాడు. ఇంతజోరైనవాడనా నేను, ఆఖరికి నేనుకూడా ఉలికి పడ్డాను, అయినను చూడగానే. ఇక మన రాణిమాట చెప్పనక్కరనేలేదు! ఆ ముఖం చూడాలి! ఒక్కక్షణంలో క్లాసుఅందరిలోకీ మంచిదయి, మొదటిబెంచీమీద మొదటిస్థలంలో అతిబుద్ధిగా కూర్చుండేపిల్ల అయిపోయింది. ప్రపంచంలో పరీక్ష ప్యాసుకావడం పూచీ ఉన్నదని, అకస్మాత్తుగా ఆమెకు జ్ఞప్తికి వచ్చినట్టుంది. ప్రపంచంలో ఒకొక్కడు ఉంటాడు, వాడి పని రైల్వేపాయింట్సుమ్యాను పని—ఒకధోరణిలో వెళుతూఉన్న భావాలను, అనవసరంగా, ఒకలైనుమీదనుంచి తప్పించి ఇంకొకలైనుమీద పెట్టడం వాడి పని.

చందనాథ్‌బాబు గదిలోకి వస్తూనే తిరిగి వెళిపోబోయినాడు—"క్షమించండి, నేనూ—"మాట పూర్తికాకుండానే, రాణి ఆయనపాదాలదగ్గిర వంగి ప్రణామంచేసి, "వెళ్లకండి, కూర్చోండి మాస్టరుగారూ," అన్నది. నిలువెడులోతు నీళ్లలో పడిపోయి, సహాయంచేయమని మాస్టరుగారివైపు చెయ్యి చాస్తున్నదా అనిపించింది—ఎంత పిరికి!"

కాదేమో! నేను తప్పుఅర్థం చేసుకొని ఉండవచ్చు. దానిలో కొంతవేషం ఉన్నదేమో! తన విలువ విస్తారంచేసుకుందామని కోరిక ఏమైనా ఉన్నదేమో! లేక దానిఅర్థం, "నన్ను నీవు పూర్తిగా లోబరిచేసుకున్నానని అనుకుంటున్నావు, గాని చంద్రనాథ్ బాబును నీకంటే అనేకరెట్లు అధికం గౌరవంతో చూస్తున్నాను," అని నాతో చెప్పడం అయి ఉంటుందా? గౌరవించాలంటే, గౌరవించు, నేనేమీ అభ్యంతరపెట్టను—మాస్టర్లను తప్పకుండా గౌరవించవలసిందే. నేను మాస్టర్నికాను, గనుక నాకు ఆ దొంగ గౌరవం అక్కరలేదు. నేను చెప్పనే చెప్పాను, అటువంటిభ్రమలతో నాకు కడుపు నిండదు అని—నిద్దవస్తువేదో నేను పోల్చుకోగలను.

చంద్రనాథ్ బాబు స్వదేశీమాట ఎత్తాడు. చెప్పేదేదో ఆ విసురునే అలాగు వెళుతూఉండనీ, ఏమీ జబాబు ఇవ్వవద్దు అని అనుకున్నాను. ముసలి వాళ్లను ఇష్టంవచ్చినంత మాట్లాడ నివ్వడమే మంచిది. అలా మాట్లాడనిస్తే సంసారయంత్రం 'మనము తిప్పేమరవల్లనే నడుస్తూఉంది' అని, అనుకుంటూ ఉంటారు. వాళ్ల మాటలు దాటి చాలాదూరం వెళుతుంది ప్రపంచం అని, పాపం, ఆ ముసలివాళ్లకు తెలియదు. కొంతసేపటివరకూ ఊరుకున్నాను. కాని, ఓర్పు అనేది సందీప్‌చంద్రుడికిఉండే దుర్గుణాలలో ఒకటికాదే. అతని పరమ శత్రువులుకూడా అటువంటినింద ఎన్నడూ అతనినెత్తిమీద వేయరే! "చూడండి, మనము ఎన్నడూ భూమి దున్నలేదు,

ఇప్పుడు పంట మనచేతిలోకి వచ్చిపడాలి అని ఆశిస్తూ కూర్చోవడం—" అంటూ, చంద్రనాథ్ బాబు వాక్యం ఇంకా పూర్తిచేయలేదు, మరి నేను ఊరుకోలేకపోయినాను. అన్నాను, "మేము పంట కోరలేదు 'మా ఫలేషు కదాచన', అని మేము అనేది."

చంద్రనాథ్ బాబు ఆశ్చర్యపడి, "అయితే మీకు ఏమిటి కావాలి?" అని అడిగాడు.

"ముళ్లచెట్లు; మనము ఏమీ చేయ నక్కరలేకుండా వాటంతట,అవే అయేవి."

"ముళ్లచెట్లు పైవాళ్లదారికి మాత్రమే అడ్డురావు; అవి మనకాళ్లనుకూడా గుచ్చుకుంటాయే!"

"అవి స్కూలులో చదివించే నీతులు. మేము ఇప్పుడు సుద్ద చేతపుచ్చుకొని బోర్డుమీద వాక్యాలు వ్రాయాలని కూర్చోలేదు. మేము ఇప్పుడు ముఖ్యంగా జ్ఞాపకం ఉంచుకుండేది, మా ఒంట్లో పుడుతున్నమంట. పైవాళ్ల పాదాలే మనస్సులోపెట్టుకొని, దారిలో ముళ్లు పెంచుతాము. తరవాత ఎప్పుడో అవి మాకాళ్లనే గుచ్చుకుంటే, సావకాశంగా పశ్చాత్తాపపడతాము. ఏమిటున్నది అందులో, అంతకూడనిది? చచ్చిపోయేవయస్సు వస్తూఉన్నకొలదీ స్వభావం చల్లబడుతూ ఉంటుంది; జోరుగా ఉండవలసిన వయస్సులో మండిపడడమే శోభ."

చంద్రనాథ్ బాబు నవ్వుతూ అన్నాడు. మండిపడవలెనంటే మండిపడండి. కాని అదే వీరత్వం అనుకొనీ, లేక ఆలా చేసేవాడే మొగవాడు అనుకొనీ, మీ పనులు చూచి మీరే వహవ్వా అంటుండకండి. ప్రపంచంలో తమదేశాన్ని వృద్ధిలోకి తెచ్చినవాళ్లు గొడవా గందరగోళమూ ఎన్నడూ చేయలేదు, పనిమాత్రం చేశారు. పనిని, పులిని చూచినట్టుగా చూచేవాళ్లు, అదిరిపడి నిద్రలోనుంచి లేచి, చేయవలసినపని చేయకుండా, అడ్డుదారులవెంటవెళ్లి, అతిత్వరగా ఉత్తీర్ణులవుదామనుకుంటారు. ఘాటయిన జబాబు ఒకటి ఇద్దామని నడ్డికట్టాను. ఆలాంటప్పుడు నిఖిల్ గదిలోకి వచ్చి నిలుచున్నాడు.

చంద్రనాథ్ బాబు లేచి రాణివైపు చూచి, "నాకు పని ఉన్నదమ్మా, వెళ్లివస్తాను," అన్నాడు.

అతను వెళిపోయిన తరవాత నిఖిల్‌కి నా ఇంగ్లీషు బుక్కు చూపించి, "ఈపుస్తకంమాట రాణితో చెపుతున్నాను," అన్నాడు.

ఈ ప్రపంచంలో నూటికి తొంభైతొమ్మందుగురిన్ని మిథ్యతో మోసపుచ్చాలి. ఈ స్కూలుమాస్టరి శిష్యుణ్ణి మాత్రం నిజంతో టోపీవేయడమే సులభం. పట్టపగలు టోపీ వేస్తే నిఖిల్ మరీసులభంగా టోపీపడతాడు, అందుచేత అటువంటివాళ్లతో ఆడేటప్పుడు, చేతిలోనున్న పేకముక్కలు చూపించి ఆడేఆటే మంచిఆట.

నిఖిల్ ఆ పుస్తకంపేరు చదివి ఏమీ అనలేదు. అప్పుడు నేను అన్నాను—"తాను నివాసంచేసే ఈ భూమిని అనేక ప్రయత్నాలుచేసి, స్పష్టంగా కనబడకుండా చేసేస్తున్నాడు, మనుష్యుడు. ఇటువంటి పుస్తకాలువ్రాసే గ్రంథకర్తలు చేస్తూ ఉన్న పని ఏమిటంటే, చీపురు చేతపుచ్చుకొని పైనున్నధూళిని తుడిచి లోపునున్న వస్తువును స్పష్టపరచడం. అందుచేతనే ఈ పుస్తకం చదివిచూడడం మంచిది."

"నేను చదివాను," అన్నాడు నిఖిల్.

"నీఅభిప్రాయం ఏమిటి ?"

"నిజంగా శ్రద్ధతో ఆలోచించేవాళ్లకు మంచిదే, గాని ఏలాగైనా తప్పించుకుందాము అన్నవాళ్లకుమాత్రం విషమే"

"ఏమిటి నువ్వు అన్నదాని అర్థం?" అన్నాను.

నిఖిల్ అన్నాడు, "చూడు సందీప్, మన ఆస్తిమీద నిజమయిన అధికారం మనదిఒక్కరిదే కాదు అని, ఇప్పుడు మనదేశంలో చెపుతూఉన్నవాళ్లు, ఎటువంటిదురాశా, కాంక్షా లేనివాళ్లుఅయితేనే, ఆమాటలు అందంగా ఉంటాయి. ఆ మాటలే సహజంగాదొంగలయేవాళ్ల నోట వచ్చి అబద్ధాలు అవుతాయి. ఒంటినిండా కామంపెట్టుకున్నవాళ్లు ఇటువంటి పుస్తకాలు తిన్నగా అర్థంచేసుకోలేరు."

"కామమే ప్రవృత్తి; అది ప్రకృతికి దారిపక్కనున్న గ్యాసులైటు, దానివల్లనే మనకు దారితెలుస్తుంది. కళ్లురెండూ

పీకిపారేస్తే దివ్యదృష్టి వస్తుంది అంటే ఎంతఅసందర్భంగా ఉంటుందో, కామం మిథ్య అంటే అంత అసందర్భంగా ఉంటుంది," అని అన్నాను నేను.

"కామం నిజమయిన వస్తువని ఎప్పుడు ఒప్పుకుంటానంటే, కామాన్ని లొంగదీసి మనచేతిలో ఉంచుకోవాలి అని ఒప్పు-కున్నప్పుడే. నివృత్తి నిజమయినప్పుడే ప్రవృత్తి నిజం. బాగా, చూదామని దేనినైనా కళ్లలోపల పెట్టుకుంటే ఆ వస్తువ్రూ కనబడదు, కళ్లకూ నష్టమే. ఆ విధంగానే మనస్సునిండా కామం పెట్టుకొని అన్నిటినీ పట్టుకుందామని కూర్చుండేవాళ్లకు ప్రతి వస్తువ్రూ వంకరగానే కనబడుతుంది. వాళ్లకు నిజం అనేది కనబడనే కనబడదు."

"చూడు నిఖిల్, నీ మనస్సులో ఒకపంతులాంగం ఉన్నది. నీతిని ఒక బంగారపు సులోచనంగా చేసి అందులోనుంచి జీవనాన్ని చూస్తానంటావు నువ్వు. అందుచేత నీకు ఏదీ స్పష్టంగా కనబడదు. ప్రతిదానిచుట్టూ మేఘం కమ్మేసిఉంటుంది; ఏపనీ జోరుగా చేయలేవు."

"అవసరం ఉన్నా లేకపోయినా బలం ఉపయోగించి పనిచేయడమే పనిచేసినట్టు లెక్కకాదు, నామతం ప్రకారం."

"అయితే మరేమిటి?"

"ఉత్తవాదనలవల్ల ఏమిప్రయోజనం సందీప్? ఇటువంటి వాటిగురించి నిష్ఫలమయినవాదన చేయడంవల్ల వాటికుండే చక్కదనంకూడా పోతుంది."

మా వాదనలో రాణికూడా కలవాలని నా కోరిక, గాని. ఇంతవరకు ఆమె ఒక్కమాటైనా అనలేదు. ఆమె మనస్సును పట్టుకొని ఈవాళ ఒక్క ఊపు ఊచేశానేమో. బహుశా! అందుచేత మనస్సులో సంకోచం ప్రవేశించి ఉంటుంది. స్కూలుమాస్టరిదగ్గిరికి వెళ్లి పాఠం నేర్చుకొని వద్దామని బుద్ధిపుడుతూఉందో ఏమిటో!

ఈవాళ ఇచ్చిన మోతాదు కొంచెం జాస్తీ అయిఉండవచ్చు. కాని జోరుగా ఒకమాటు ఝాడించడమే మంచిది. ఎన్నడూ కదలవు అనుకొనే వస్తువులకుకూడా కదలిక పుడుతుంది అని, ప్రారంభంలోనే తెలుసుకోవడం మంచిది.

నిఖిల్‌తో అన్నాను—"నీతో మాట్లాడడమే మంచిదయింది. ఇంకొక్కనిమిషం అయితే ఈ పుస్తకం రాణికి చదవమని ఇచ్చేసిఉందును."

"అందులో తప్పేమి ఉంది? నేను చదివినప్పుడు విమల మాత్రం ఎందుకు చదవకూడదు? కాని ఒక్కమాటమాత్రం చెప్పవలసి ఉన్నది. ఐరోపాదేశస్థులు మనుష్యునిలోని సమస్తమునూ విజ్ఞానశాస్త్రం (సయన్సు) ద్వారా చూస్తారు; మనిషికి ఉండేది కేవలం దేహతత్వమే అన్నట్టు వాదనలుచేస్తారు— లేదా జీవతత్వం, లేదా మానసతత్వం, మహా అయితే, సంఘతత్వం. కాని మనుష్యుడు ఏతత్వమూ కాదు, అన్నితత్వాలనూ దాటివెళ్లి అనంతంలో కలిసిపోతున్నాడు. అది మరిచిపోకండి,

మీకు ఒకనమస్కారం పెడతాను. స్కూలుమాస్టరిశిష్యుడు అని నన్ను మీరు అంటారు; కాని నిజం ఏమిటంటే నాకంటే మీరే స్కూలుమాస్టరిశిష్యులు. మనుష్యుడేమిటో మీరు నయన్ను మాస్టరిదగ్గిర నేర్చుకుంటారు. మీ ఆత్మ చెప్పేది మీకు అక్కరలేదు."

"ఏమి నిఖిల్, నువ్వు ఇప్పుడు అంత ఉద్రేకంతో మాట్లాడుతున్నావు, మునుపు ఈలాగు లేదే?"

"మీరు మనుష్యులను చిన్నపుచ్చుదామని ప్రయత్ని-స్తున్నారు, అవమానపరుస్తున్నారు. అది నాకు స్పష్టంగా తెలుస్తూఉంది ఇప్పుడు."

"దేనిలో నీకు అది కనబడ్డది ?"

"ఎక్కడపడితే అక్కడే; గాలిలో, నా లోపున పుట్టిన బాధలో. మనుష్యునిలో ఉన్నదానంతటిలోకీ గొప్పదయిన-దానిని, సాధువయినదానిని, సుందరమయినదానిని, మీరు ఏడిపించాలని చూస్తున్నారు; దానికి బాధకలిగించాలని చూస్తున్నారు."

"అన్నీ ఉత్త పిచ్చిమాటలు."

నిఖిల్ హఠాత్తుగా లేచి నిలుచొని అన్నాడు, "చూడు సందీప్, మనుష్యుడు ప్రాణాంతకదుఃఖం పొందుతాడు, గాని చావడు. ఆ నమ్మకం నాకు గట్టిగా ఉంది, అందుచేత నేను

ఎంతైనా సహించడానికి సిద్ధంగా ఉన్నాను; బాగా కళ్లు తెరుచుకొని, అంతా తెలిసికూడా చూస్తూ కూర్చుంటాను."

ఈమాట అంటూ, నిఖిల్ గదిలోనుంచి బయటికి వెళిపోయినాడు. నేను గాబరాపడుతూ కథఅంతా చూస్తున్నాను. హఠాత్తుగా ఒకశబ్దం వినబడగానే అటు చూచాను, టేబిల్ మీాదనుంచి రెండుమూడు పుస్తకాలు కింద పడ్డాయి. రాణి త్వరత్వరగా దూరంనుంచి, నన్ను తప్పించుకొని వెళిపోదాము అన్నట్టుగా, బయటికి వెళిపోయింది.

చాలా అద్భుతమైనవాడు ఈ నిఖిలేశ్ ! ఇంట్లో ఏదో ఒకగొప్ప ప్రమాదం రవులుకున్నదని అతనికి బాగా తెలుసును, అయినా నన్ను మెడపట్టుకుగెంటేయ డెందుకో? విమల ఏమి చేస్తుందో అని కనిపెట్టుకొని చూస్తున్నాడు, నాకు తెలుసును.

విమలగాని అతనిదగ్గిరికి ఒకనాడు వెళ్లి, "మీాకూ నాకూ కలియదు," అని అన్నట్టయితే తలవంచుకొని మెల్లిగా, "అవును పొరపాటయింది," అంటాడు, నాకు తెలుసును. పొరపాటును పొరపాటు అని ఒప్పుకోవడం అన్నిటికంటే గొప్పపొరపాటు అని తెలుసుకొనేశక్తి అతనికి లేదు.

భావాలు మనుష్యులను ఎంతదుర్బలంచేసేస్తాయో దానికి దృష్టాంతం నిఖిలే. అటువంటివాడు మరిఒకడు నాకు కనబడలేదు ఈ ప్రపంచంలో. అతను కేవలం ప్రకృతియొక్క-

ఆటవస్తువు ; నాటకంలో పాత్రకైనా పనికిరాదు. అటువంటి-వానితో సంసారం చేయడం కుదిరేసంగతా ?

తరువాత మన రాణిమాట—ఆమె స్వప్నం ఈవాళ భంగం అయిపోయిందని నానమ్మకం. ఏ ప్రవాహంలో కొట్టుకు-పోతున్నదీ ఈవాళ హఠాత్తుగా పోల్చుకున్నది. ఇక కళ్లు విప్పి ముందుకైనా వెళ్లాలి వెనక్కైనా తగ్గిపోవాలి. లేదా, ఒక్కమారు ముందుకు వెళ్లడం ఒక మారు వెనకకు వెళ్లడమైనా చేస్తూ ఉండాలి. దానివిషయమై నాకేమీ విచారంలేదు. బట్టలకు నిప్పంటుకున్నప్పుడు భయంకొలదీ ముందుకూ వెనక్కూ ఎంతపరిగెడుతుంటే అంత నిప్పురాజుకుంటుంది. భయంవల్ల మనస్సువడి స్త్రీలలో మరింత అధికము అవుతుంది. వాళ్లసంగతి నాకు బాగాతెలుసును—కోపం అనండి, సిగ్గు అనండి, భయం అనండి, ఏపేరుకావాలంటే ఆపేరు పెట్టండి, అన్నీ వాళ్లమనస్సు-లోఉండే మంటను పెద్దదిచేస్తాయి. చిట్టచివరకు ఆమంటలో పడి, కర్ర కాలి బూడిదయిపోయినట్టు, సర్వమూ భస్మం అయిపోతుంది. ఈ నిప్పును ఆర్పగలిగినది ఐడియల్, ఆదర్శం, ఒక్కటే. ఆడవాళ్లవిషయంలో అటువంటిభయం ఉండకూడదు. వాళ్లు పుణ్యానికి కష్టాలపాల్పడతారు ; తీర్థయాత్రలు చేస్తారు; గురువుగారి కాళ్లమీద పడతారు—మనకు ఆఫీసుపని ఏలాగో వాళ్లకు ఇవన్నీ అలాగు—గాని భావాలనది ఒడ్డున మాత్రం ఎన్నడూ ప్రయాణంచేయరు.

ఇక నేను రాణితో నోటిమాటలవల్ల అట్టేచెప్పను. ఇంగ్లీషుపుస్తకాలు కొన్ని ఆమెకు చదవడానికి ఇస్తాను. ప్రవృత్తి నిజమని ఒప్పుకొని దానిని మన్నించడం మాడర్న్, ఆధునిక సాంప్రదాయం, అని తనంతటతానే బోధపరుచుకుంటుంది. వాంఛలంటే సిగ్గుపడడం గాని, వాటిని కట్టిపెట్టి ఉంచడం గాని, ఆధునికసాంప్రదాయంకాదు. "ఆధునికసాంప్రదాయం" "ఆధునికసాంప్రదాయం"—ఈలాంటిదేదో ఒకమాట ఆశ్రయానికి దొరికితే ఆమెలో కొంత బలం చేరుతుంది. ఏమికానీ, ఈ నాటకం అయిదోఅంకంవరకూ చూచితీరవలెను. కాని నేను కేవలం చూడడానికి వచ్చినవాణ్ణికాను. "మీాదిఅంతస్తులో రాయల్ సీటులో కూర్చొని మధ్యమధ్య చప్పట్లుమాత్రం కొడుతున్నాను," అని గర్వంతో చెప్పలేను. నామనస్సులో ఏదో బాధిస్తూఉండేది. ఉండుండి రక్తనాళాల్లో గొప్పబాధ ఒకటి ప్రవహిస్తూ ఉండేది. రాత్రి దీపంఆరిపి మంచంమీాద పడుకున్నప్పుడు ఎవరోవచ్చి చెయ్యి తగిలించినట్టు అయేది. ఒక్కమారు చూచినట్టు, ఏదో ఒక్కమాట చెవిలో అన్నట్టు అనిపించేది. చీకటంతా దానితో నిండిపోయినట్టు అయేది. ప్రొద్దున్న నిద్రనుంచి లేచేసరికి ఒంట్లో ఒకమోస్తరు పులకరింపు పుట్టేది. ఒంట్లో సంగీతప్రవాహం ఒకటి పుట్టి రక్తనాళాలను నింపింది.

టేబిల్ మీాదనున్న ఫోటోఫ్రేములో నిఖిల్ ఫొటొగ్రాఫు పక్కను రాణిఫోటోగ్రాఫు ఉండేది. ఇదివరలో నేను దానిని

ఫ్రేముఖిప్పి తీసుకున్నాను. నిన్నను అటువైపు చూపిస్తూ రాణితో అన్నాను, "లోభికి ఉండే లుబ్ధత్వం చోరీకి కారణం. చోరీవల్లవచ్చిన పాపం ఆ లోభీ, చోరుడూ, ఇద్దరూ చెరిసగం పంచుకోవడం ధర్మం—మీరు ఏమంటారు?"

"ఆ ఫొటోగ్రాఫు అంత బాగులేదే!" అని నవ్వుతూ అన్నది రాణి.

"దానికేమి చేయగలము! ఫోటో ఫోటోకంటే గొప్పది ఏలాగు అవుతుంది? దానివల్ల ఏపిసరు దొరికితే దానితోనే సంతోషించాలి."

రాణి పుస్తకం ఒకటి విప్పి పేజీలు తిరగవేయడం ఆరంభించింది. "మీకు కోపంగాడుంటే మాత్రం ఆ ఖాళీ ఏవిధంగానైనా నింపేస్తాను లెండి," అనినేను అన్నాను. ఖాళీని నింపాను. నింపినది నాఫోటొగ్రాఫ్, చిన్నప్పుడు తీయించుకున్నది. అప్పటిముఖం పసిముఖం, మనస్సుకూడా అలాగే ఉండేది అప్పుడు. అప్పుడు ఇహంగురించి, పరంగురించీ, చాలా నమ్మకాలు ఉండేవి. నమ్మకాలు మనను మోసపుస్తాయి, గాని వాటిలోఉన్న గొప్పగుణం ఏమిటంటే మనస్సుకు ఒకవిధమైన లావణ్యాన్ని ఇస్తాయి.

నిఖిల్ఫోటో నాఫోటో ఒకదానిపక్కను ఒకటి ఆ చట్టంలో ఉన్నవి—మేమిద్దరము స్నేహితులం కదా!

# నిఖిల్ కథ

ఇంతకు ముందు ఎన్నడూ నావిషయమై నేను ఆలో-చించలేదు. బయటనుండిచూస్తే నేను ఏలాగు కనబడుతానో కొంత తెలుసుకుందామని ఇప్పుడు మధ్యమధ్య ప్రయత్నం చేస్తున్నాను. విమలకు నేను ఏలాగుకనబడతుండాలో ఆలాగు నన్ను నేను చూచుకుందామని కొంతప్రయత్నిస్తున్నాను. ప్రతివస్తువునూ పట్టి కొంచెం గట్టిగా చూడడం నా అభ్యాసం —నా వ్యవహారాలు అందరికీ అతిగంభీరంగా కనబడతాయి గాబోలు!

ఇంకేమీ లేదు, మనజీవనాన్ని దుఃఖంతో నింపడంకంటే నవ్వులతో ఎగరగొట్టడం ప్రశస్తమైనదని—అలాగునే నడు-స్తున్నది ప్రపంచం. జగత్తులో ఈ రోజున ఎన్నో దుఃఖాలు ఇంటా-బయటా వ్యాపించి ఉన్నవి. అవన్నీ ఛాయ అనీ మాయ అనీ అనుకొని, చెదరగొట్టేసి, ఆటపాటలతో అనాయాసంగా కాలం గడుపుకుంటాము. ఒక్కక్షణకాలమయినా అవన్నీ నిజమని పట్టుకుకూర్చుంటే నోటికి అన్నం రుచిస్తుందీ, కంటికి నిద్రవస్తుందీ?

అంతా బాగానే ఉంది, గాని ఆ ఎగరగొట్టే దళంలోనూ ఆ చెదరగొట్టే సమాజంలోనూ నేనుమాత్రం చేరలేను. నా ఒక్కడి దుఃఖమే అనాదిగా వస్తూఉన్న ఒకబరువయి భూదేవి

కడుపుల్లో కూర్చున్నదా అనిపిస్తూఉంది. అందుచేతనే అంత భయంకరమైన దుఃఖం! అందుచేతనే నావైపు నేను చూచుకొనేసరికి మనస్సంతా కన్నీటితో నిండిపోతూఉంది.

ఓరి అభాగ్యుడా, ప్రపంచంఎదుట నిలబడి అందరిలో నీవు ఒకడివనుకొని చూడు! యుగయుగాలనుంచి వస్తూఉన్న మహా మేళలో, కోటానుకోట్ల మనుష్యులలో, విమల ఫీకు. ఎవరు? ఆమే నీ భార్యా? భార్య అంటే ఏమిటి? "భార్య" శబ్దాన్ని నీకడుపులోనున్న గాలితో నింపి, రాత్రింబగళ్లు కాపాడుకుంటూ తిరుగుతున్నావు. పైనుంచి ఒక్క చిన్న అల్పిపోటు తగిలేసరికి లోపునఉండే గాలి పైకివచ్చేస్తుంది, అంతా చప్పిబడిపోతుంది.

"నాభార్య," అలా అన్నంతమాత్రాన 'నాదే'నా! "కాను నేను నేనే," అని ఆమె అంటే? "అది ఏలాగవుతుంది నువ్వు నా భార్యవు," అనేదా నేను? అది ఒక యుక్తా, నిజమా? సాతాత్ ఒకమనిషిని పాదాలదగ్గిరనుంచి తలవరకూ ఆ మాటలో దూర్చి తాళంవేసి ఉంచగలమూ?

'భార్య!'—నాలోఉన్న పవిత్రమైనదీ, మధురమైనదీ, అంతా ఇచ్చి ఈపదాన్ని నా కడుపులో పెట్టుకొని, పెంచాను. ఒకనాడైనా దానిని ధూళిలో అడుగుపెట్టనివ్వలేదు. ఆ పేరును పూజచేస్తూ ఎంత ధూపంవేశాను, ఎన్నిపాటలు పాడాను, ఎటువంటిపుష్పాలతో పూజచేశాను! అది కాగితం

పడవలాగు మురికినీళ్లకాలువలో మునిగిపోతే, నేనుకూడా దానితో—

అదుగో, మళ్లా అదేధోరణా! దేనిని అంటున్నావు కాలువ అని, దేనిని అంటావు మురికినీళ్లు అని? అవన్నీ కోపం మాటలు. నీకు కోపంవస్తుందని ప్రపంచంలో ఏవస్తువూ ఇంకొకటిగా మారిపోదు. విమల నీదికాకపోతే—సరే, కాదు! ఆ మాట అణిచివేస్తున్నకొలదీ, నువ్వు కోపగించినకొలదీ, అది మరింత స్థిరపడుతుంటుంది. గుండె బద్దలైపోతుంది సుమా, ఆ ఆలోచన ఇక చాలించాలి! దానివల్ల జగత్తంతా దివాలా కాదు, నీవూ దివాలా కావు. జీవితంలో మనుష్యుడు ఏదిపోగొట్టుకున్నా పోగొట్టుకోవచ్చును, గాని తానుమాత్రం వాటన్నిటికంటే చాలా అధికమయినవాడు. మనుష్యుడు ఏడవవచ్చు, గాని ఎంతఏడ్చినా దానికి అంతంఉన్నది, లేకపోతే ఏడవనేఏడవడు.

అయితే సంఘంమాట ఏమిటి? సంఘంమాట సంఘం చూచుకోనీ, ఏమి చేయాలో చేసుకోనీ; నేను ఏడిచేఏడుపు నాఏడుపు, సంఘంఏడుపు కాదు. విమల, "నేను 'నీ' భార్యను కాను" అని, అన్నట్టయితే, అదీ బాగానే ఉంటుంది. సంఘం మూలానే ఆమెకు నాతోసంబంధంఅయితే ఎక్కడకావాలంటే అక్కడ ఉండనీ, నేను శెలవుతీసుకుంటున్నాను.

దుఃఖమేమో తప్పదు. కాని ఒకవిధమైనదుఃఖం ఉన్నది, అది ఉత్తమిథ్య; దానినుంచి, ఏమిచేసైనా, తప్పించుకోవాలి.

ఎవరూ నన్ను ఆదరించకపోతే నావిలువ తగ్గిపోయిందని పిరికి వాళ్లలాగు నేను ఎన్నటికీ భయపడకూడదు. నా జీవనానికి విలువ ఉన్నది. ఆ విలువనిచ్చి అంతఃపురాన్ని దేన్నీ కొందామని బయలుదేరలేదు. నా పెద్దపెద్ద కార్యాలూ, పనులూ, ఏవీ దివాలా కావు. ఆ మాట బాగా మనస్సుకు నచ్చచెప్పే రోజు వచ్చింది.

నన్ను నేను ఏలాగు బయటనుంచి చూచుకోవలెనని ప్రయత్నిస్తున్నానో, ఆలాగునే ఈవాళ విమలనుకూడా చూడాలి. నా మనస్సులోఉండే ఎన్నోఆదర్శాలతో విమలను అలంకరించాను. ఆ మానసికమూర్తితో మాఇంటనుండే విమల ప్రతివిషయంలో సరిపోలేదు. అయినా మనస్సులోమాత్రం ఆమెను పూజచేయడం మానలేదు.

అది నా బలహీనత, అది నాలోఉన్న గుణంకాదు. నాకుండే అత్యాశ భయంకరమైనది. నా మనస్సులోఉండే తిలోత్తమతో సుఖంఅనుభవిద్దామని భీషణమైన కోరికపుట్టింది. బయటనున్న విమలను ఆశ్రయించాను; ఆ విమల దానికి దారి అయింది. కాని విమల ఎంతయితే అంతేగాని అంతకు ఎక్కువ ఏలాగు కాగలదు? నాకోసమని తిలోత్తమ కల్పించే అసం-దర్భంకాదూ? విశ్వకర్మ నా ఇష్టప్రకారం అన్నీ చేస్తాడూ?

ఈవాళమాత్రం అన్నిటినీ స్పష్టంగా చూడవలెను. మాయరంగులతో ఎన్నిటినో చిత్రవిచిత్రంగా చేశాను, అవన్నీ

ఈవాళ శుభ్రంగా కడిగేయాలి. ఇన్నాళ్లూ అనేకమైనవస్తు-వులు. నేను చూచికూడా చూడలేదు. విమలజీవనంలో నేను ఒకఆకస్మికమైన వస్తువును, కోరకుండా వచ్చిన వస్తువును, ఏసంబంధమూ లేనివస్తువును. స్వభావాన్నిబట్టిచూస్తే అన్ని విషయాలలో విమలతో కలిసేవాడు సందీపే. ఈమాత్రం తెలుసుకున్నాను—అది నాకు చాలును.

నాముందర నేనే వినయత చూపించవలసినరోజు కాదు ఇది. పొగడవలసినగుణాలు అనేకం ఉన్నవి సందీప్‌లో; అవే ఇన్నాళ్లూ నన్నుకూడా ఆకర్షణచేసి ఉంచాయి. కాని ఎంత తక్కువగా చూచినా మొత్తంమీద నాకంటే అతనిలోఉన్న గొప్ప ఏమీలేదు. అది నేను ధైర్యంగా అనగలను. స్వయంవర సభలో ఈవాళ పూలహారం నామెడలో పడకుండా సందీప్-మెడలోనే పడితే, దానికిగాను దేవతలు నామీద నేరము మోపి నన్ను విచారణచేయరు; మాల వేసినామెను విచారణ చేస్తారు. నేను ఇప్పుడు అనేది ఉత్త బడాయికోసం అనేమాట కాదు. నిజంగా నాలోఉన్న విలువను స్పష్టంగా తెలుసుకొని దాని శక్తి గ్రహించడానికి బదులుగా, నాకు ఇప్పుడు కలిగిన దుఃఖము, మానవజన్మంలో కలిగే దుఃఖాలన్నిటిలోనూ మిక్కిలి భయంకరమైనది అనుకుంటూ కూర్చోవడం, చాలా కూడనిపని. అలాగు చేయడం, ఇంటిచెత్తాచదారంతోసమంగా నన్ను నేను చూచుకొని పెంటకుప్పమీద పారేసికున్నట్టే. అప్పుడు నా ద్వారా ఇక ఎటువంటి గొప్పపనీ కానేరదు.

.నా దుఃఖం సహించశక్యంకానిదే! అయినా దానిలో-నుంచి ఒక ఆనందం పుట్టుగాక!—ముక్తి దొరికిందనే ఆనందం ...బోధపడ్డది—ఇంట్లోదీ బోధపడ్డది బయటిదీ బోధపడ్డది. లాభనష్టాలన్నీ లెక్కవేయగా మిగిలినదే నాది—అదే అసలైన 'నేను'. ఆ'నేను' ఒక రోగిని కాను, దరిద్రుడను కాను, ఇంట్లో పథ్యపానాలవల్ల పెరిగిన జబ్బుమనిషిని కాను. నేను భగవంతుని బలమైన చేతులతో తయారైన 'నేను'. ఎంతకావలెనో అంత కానేఅయింది. మిగిలినది నిగ్గు, మరి దానికి ఎటువంటి మార్పూ ఉండదు.

మాస్టరుగారు నాగదిలోకి వచ్చి ఇప్పుడే వెళిపోయి-నారు. భుజంమీాద చెయ్యివేసి, "వెళ్లి నిద్రపో నిఖిల్, ఒంటిఘంట రాత్రి అయింది," అని అన్నారు. బాగా రాత్రి అయిపోయి విమల నిద్రపోతుంటేనే గాని, పడుకోడానికి వెళ్లడం ఈ మధ్యనుంచి నాకు చాలాకష్టం అయిపోయింది. పగటివేళ మేమిద్దరం కలుస్తుండేవాళ్లము, మాట్లాడుతుండేవాళ్లము. కాని, అర్ధరాత్రి వేళ ఆ నిశ్శబ్దంమధ్య ఒక్కణ్ణే ఆమెదగ్గిర కూర్చొని ఏమి మాట్లాడగలను? సిగ్గువేసేది— సిగ్గు ఒళ్లంతా వ్యాపించేది, మనస్సంతా నింపేసేది.

"మీారు ఇంకా నిద్రపోడానికి వెళ్లలేదేమీా?" అని అడిగాను మాస్టరుగారిని.

"నాకు నిద్రపోయేవయస్సు అయిపోయింది, మేలుకొని ఉండేవయస్సు వచ్చింది," అన్నారు.

ఇంతవరకూ వ్రాసి ఇక పడుకోడానికి వెళదాము అను-
కుంటున్నాను, తలఎత్తి కిటికీలోనుంచి చూచాను. ఎదుటనున్న ఆకాశంనిండా శ్రావణమేఘం. దానిలో మధ్యను కొంచెం వెలితిచ్చింది. ఆ వెలితిలోనుంచి పెద్ద నక్షత్రంఒకటి జిగ్ జిగ్ మంటూ కనబడ్డది. "ఎన్నో సంబంధాలు ఏర్పడుతున్నవి, కలలలాగు మాయమైపోతూఉన్నవి," అని నోటిమాటలతో ఆ నక్షత్రం అంటూఉన్నదా అనిపించింది. "నాకుమాత్రం ఎటువంటి మార్పూ లేదు; దంపతులగదిలో మొదటిరాత్రి వెలిగించిన దీపశిఖను నేను. శాశ్వతకాలం ఉండవలసిన దీపాన్ని; మొదటిరాత్రినాటి చుంబనాన్ని; గనుక నేను అనంతము," అని అంటూ ఉన్నది, ఆ నక్షత్రం.

నా అనాది అనంత ప్రేయసి, గోచరవస్తువుల పరదా వెనక, యుగయుగాలనుంచి, నాకోసం కనిపెట్టుకొని ఉన్నది అని, అప్పుడు నాకు అనిపించింది. నా హృదయమంతా నిండిపోయింది. జన్మజన్మాలబట్టి ఎన్నో అద్దాలలో క్షణక్షణమూ ఆమె ప్రతి-
బింబం చూచాను—ఎన్ని విరిగిన అద్దాలలో చూచాను; వంకర టింకర్లుపోయినఅద్దాలలో, ధూళితో నిండిఉన్న అద్దాలలో! కాని అద్దం నాదే అని, ఎప్పుడైనా తీసుకువెళ్లి పెట్టెలో పెట్టి-
వేస్తే అందులో బొమ్మ మాయమయిపోయేది...కాని, అదంతా ఎందుకు ఇప్పుడు? అద్దాలతోనూ ప్రతిబింబాలతోను నాకు మరి పనిలేదు—ప్రేయసీ, నీభక్తి ఏమీ చెదరలేదు! నీ చిరునవ్వు

ఎన్నటికీ వాడదు, నువ్వు నాకోసమని పెట్టుకున్న కుంకం బొట్టును అరుణోదయం, ప్రతిరోజూ, వికసింపజేస్తూఉన్నది.

"ఇవన్నీ పిల్లలను మరిపించేమాటలు." అని ఆ చీకటిగది మూలనుంచి వినబడుతూఉంది. అయితేకానీ, పిల్లలనుమరిపించవలెనుకదా! కాని లక్షమంది పిల్లలు! కోటిమంది పిల్లలు! పిల్లలమీద పిల్లలు! ఎంతమంది పిల్లలు ఎన్ని ఏడుపులు! ఇంతమందినీ అబద్ధాలతో మరిపించగలమూ? నా ప్రేయసి నన్ను మోసపుచ్చదు, ఆమె సత్యమైనది. ఆమె సత్యమైనదే! అందుచేతనే ఆమెను చాలాసార్లు చూచాను, ముందుకు అనేకసార్లు చూడబోతున్నాను. మాయామరిపింపులలోనుంచికూడా ఆమె కనబడ్డది కళ్లను నింపిఉన్న కన్నీటిలోనుంచి ఆమెను చూచాను. జీవితంలోజరిగే సంతలజనసమ్మర్దంమధ్య అనేకసార్లు ఆమె నాకు కనబడ్డది, తప్పిపోయింది, తిరిగిదొరికింది. మృత్యువుగుండా పైకివచ్చినతరువాత తిరిగి ఆమె నాకు దొరుకుతుంది.

ఓ క్రూరాత్మురాలా, నాతో ఆటలాడకు! నీ అడుగుల జాడ నేను పోల్చుకోలేకపోయినా, నీ జుట్టునఉన్న సుగంధం గాలిని నింపుతూఉంది; దానివల్ల నీవు వెళ్లినదారి పోల్చుకోగలను. దానివల్లా కనుక్కోలేకపోతే, ఆ తప్పుకోసమని నన్ను శాశ్వతకాలం ఏడిపించకు. ఆ ముసుగుతీసుకొని చూస్తూఉన్న నక్షత్రం "భయపడకు, భయపడకు," అని ధైర్యం ఇచ్చింది. "శాశ్వతకాలం ఉండవలసినది శాశ్వతకాలమూ ఉండేతీరుతుంది," అని నాకు అభయం ఇచ్చింది.

ఇక నా విమలను చూచివస్తాను. అలిసిపోయి, పరుపుమీద పడుకొని, నిద్రపోతూఉంటుంది. లేపివేయకుండా ఆమె నొసటిమీద ఒక ముద్దుపెడతాను. ఆ ముద్దు నా పూజయొక్క నైవేద్యం; చచ్చిపోగానే ఇవన్నీ మరిచి పోతానని నా నమ్మకం. అన్ని తప్పులూ, అంతదుఃఖమూ మరిచిపోతాను. కాని ఈ ముద్దులోపుట్టిన తరంగాలుమాత్రం ఎక్కడికోవెళ్లి ఉంటాయి. జన్మజన్మాలనుంచి పెడుతూఉన్న ముద్దులతో తయారవుతూఉన్న మాల నాప్రేయసిమెడలో వేస్తాను.

ఇదంతా మనస్సులో అనుకుంటున్నాను, మా చిన్నవదిన నా గదిలోకి వచ్చింది. అప్పుడే మా పహారాగడియారం డంగ్, డంగ్, అని రెండు కొట్టింది.

"ఏమిటి నువ్వు చేస్తున్నపని అబ్బాయి?" అన్నది. "బంగారుతండ్రివి, వెళ్లిపడుకో అమ్మా. అంతదుఃఖపెట్టుకో కూడదమ్మా. నీ వైఖరి ఏలాగుఉన్నదో తెలుసునా? నీ వైపు చూడలేకుండా ఉన్నాను."

ఈలాగు అంటూ కళ్లవెంట బొటబొట నీళ్లుకార్చుకుంది.

నేనేమీ జవాబుచెప్పలేదు. వంగొని నమస్కారంచేసి పాదధూళి తీసుకొని పడుకోడానికి వెళిపోయినాను.

మొట్టమొదట నాకు ఎటువంటిసందేహమూ లేదు; ఏ భయమూ లేదు. దేశానికని ఆత్మసమర్పణ చేసుకుంటున్నానని నా నమ్మకం. పరిపూర్ణమయిన ఆత్మసమర్పణవల్లకలిగే ఉల్లాసం ప్రచండమైనది. తననుతాను నాశనంచేసుకోవడం అన్నిటికంటే అధికమైన ఆనందాన్ని ఇస్తుందని అప్పుడే కనిపెట్టాను.

బహుశా కొన్నాళ్లకు ఈ నిషా దానంతట అదే తగ్గి-పోయిఉండునేమో, గాని సందీప్‌బాబు తనలోపునుండేదాన్ని వెల్లడిచేస్తేనేగాని ఉండలేకపోయేవాడు. అతనిమాటలు ఒక సంగీతమయి, ఆసంగీతం ఒక స్పర్శఅయి నన్ను తాకేది; అతని కళ్లచూపులు అడుక్కుంటూ నా పాదాలమీద పడేవి; వాటన్నిటిలో ఒక భయంకరమైన ఇచ్ఛ ఉండేది; అది నన్ను జుట్టుపట్టుకొని లాక్కుపోయేది.

నిజము చెపుతున్నాను—ఈ భయంకరమైన ఇచ్ఛ, ఈ ప్రళయమూర్తి, నా మనస్సును. రాత్రింబగళ్లు లాగుతూఉండేది. తనను తాను ముక్కలుముక్కలుచేసి పారేసుకోవడం అతి ఆనందమైనపని అని అనిపించేది. దానివల్ల ఎంతోసిగ్గువేసేది, ఎంతోభయంవేసేది—అయితేనేమి, మహాఆనందంగా ఉండేది. నా కున్న కౌతూహలానికి మరి అంతం ఉండేది కాదు. ఎవరు నాకు బాగా తెలియరో, ఎవరు నాకు దొరుకుతారని నిశ్చయం

లేదో, ఎవరి సామర్థ్యము ప్రబలమైనదో, ఎవరి యౌవనము సహస్రశిఖలతో వెలుగుతున్నదో— అటువంటివాని ఇచ్ఛ, అటువంటివానికోరిక, ఎంతప్రచండమైనది! ఎంత విపులమైనది! నా ఊహకైనా ఎన్నడూ అది అందలేదు. బహుదూరానఉన్న సముద్రము—పుస్తకాలలో పేరుమాత్రం విన్నాను, ఎన్నడూ కళ్లచూడలేదు — ఆ సముద్రం, ఆకలితో పరిగెత్తుతున్న ప్రవాహమై, మధ్యనున్న అడ్లన్నీ దాటి, ఇంటివెనుక అంట్లు తోముకొని నీళ్లు తెచ్చుకొనే గుంటలోకి వచ్చి, నా కాళ్లదగ్గిర పడ్డది. నా ఒళ్లంతా నురుగుతోనింపి తన అసీమతను నా చుట్టూ వెదచల్లింది.

సందీప్‌బాబును మొదట చాలాభక్తితో చూచేదానను. కాని రానురాను ఆభక్తి ఎక్కడో మలిగిపోయింది. అతనిని మన్నించడం మానివేశాను—అంతేకాదు, అతనంటే గౌరవమే పోయింది. అతనిని నా భర్తతో సరిపోల్చడం అసందర్భం అని నాకు స్పష్టముగా తెలిసిపోయింది. సందీప్‌బాబులో మొగతనమని భ్రమపడుతుండేది, మొగతనం కాదు ఉత్తచాంచల్యం అని, మొట్టమొదట కాకపోయినా, క్రమక్రమంగానైనా పోల్చుకున్నాను.

అయితేనేమి—నా రక్తమాంసాలతోనూ, నా భావభావనాలతోనూ చేయబడ్డ వీణ శ్రుతివేయడం అతనిచేతికే తెలిసింది. ఆ చెయ్యి చూచి నేను అసహ్యపడవచ్చు, ఈ వీణ చూచి అసహ్యపడవచ్చు, గాని వీణమాత్రం అతనే పలికించగలిగాడు.

ఆ వీణలోపుట్టిన సంగీతంతో రాత్రింబగళ్లు నా ప్రాణం నిండిపోయేది; నాలోఉండే మానాభిమానాలన్నీ మాయం అయిపోయినవి. "ఆ సంగీతంలో మునిగిపో, నీ సమస్తమూ ముంచేయి," అని లోపునుంచి వినబడుతుండేది. నాలో పరిగెడుతున్న రక్తప్రవాహం, ప్రతిఅలలో చెపుతూఉండెను, నాలోఉన్న రక్తశిరాలు, ప్రతికంపనంలో చెపుతూఉండెను.

ఒక సంగతి బోధపడ్డది—ఎటువంటిసందేహమూ లేదు. "నాలో ఒక—" ఏమని చెప్పేది! చచ్చిపోతే బాగాఉండును అనిపించింది దానినుంచి.

ఏమాత్రం వ్యవధిదొరికినా చంద్రనాథ్‌బాబు నాదగ్గిరికి వచ్చి కూర్చుండేవాడు. ఆయనలో గొప్ప శక్తిఉన్నది. నా మనస్సును ఒక ఎత్తయిన శిఖరంమీదికి తీసుకొనివెళ్లి ఉంచ గలిగేవాడు. అక్కడనుంచి చూచేసరికి నా జీవనంచుట్టూఉండే సరిహద్దులు దూరంగా వెళిపోయేవి. నేను అప్పటివరకు హద్దులు అనుకుంటూఉండేవి హద్దులుకావు అని తెలిసేది.

కాని, ఏమిప్రయోజనం, నాకు ఆలాగు చూడవలెననే ఉండేదికాదు! నన్ను పట్టుకున్న "నిషా" నన్ను ఇక వదిలిపెట్టేస్తే బ్రతుకుదును అని, నిజంగా కోరనేలేకపోయినాను. మా ఇల్లు ముక్కలయిపోయినా సరే, నాలోఉన్న మంచి మలిన మయిపోయి పూర్తిగా ధ్వంసంఅయిపోయినా సరే, నాలో ప్రవేశించిన నిషామాత్రం శాశ్వతంగా నాలో ఉండవలెననే కోరుతుండేదానను. ఈ కోరిక నన్ను వదిలేదికాదు, ఎంత

ప్రయత్నం చేసినా. మా ఆడబిడ్డ మొగుడు కల్లుతాగి ఆమెను బాగాకొట్టేవాడు; తరవాత పశ్చాత్తాపంతో, పెద్దకేకలు వేసు-కుంటూ ఏడ్చేవాడు; మరి, కల్లు ముట్టుకోనుగాక ముట్టుకోను అని, ఒట్టుపెట్టుకొనేవాడు; మర్నాడు సాయంత్రం అయేసరికి మళ్లా కల్లుసీసా తానూ తయారయేవాడు. చూచి అసహ్యం-తోనూ, కోపంతోనూ, ఒళ్లంతా మండుకుపోయేది నాకు. ఇప్పుడు చూడును, నా 'నిషా' అతని నిషాకంటే భయంకరంగా ఉందే! నా "కల్లు" బజారునుంచి కొని తీసుకురానక్కరలేనిది, గ్లాసులో వంపుకొని తాగనక్కరలేనిది. నాఒంట్లోనే దాని-మట్టుకు అది తయారవుతూఉంటుంది. ఏమిచేసేది? బ్రతికి ఉన్నన్నాళ్లూ ఈలాగే ఉంటుందా ఏమిటి?

ఒకొకనూరు అదిరిపడిలేచి నన్ను నేను చూచుకుంటు-న్నాను; మొదటినుంచి చివరదాకా ఇదంతా ఒకదుఃస్వప్నమూ అనిపిస్తూ ఉంటుంది అప్పుడు. ఒకొక్కప్పుడు తెలుస్తూ'ంటుంది, నాకు కనబడే 'నేను' నిజమయిన 'నేను' కాదు అని. ఇందులో ఒకదానితో ఒకటి పొందదు; మొదలూ చివరా కలియవు. ఇది గారిడీవాడిపని; నల్లనిగీతలలో మాయరంగులు పుట్టించడంవల్ల అయిన ఇంద్రధనస్సు ఇదంతా. ఏమిటో, ఏలాగయిందో, ఏమీ బోధపరుచుకోలేకుండా ఉన్నాను.

ఒకనాడు మా రెండోతోటికోడలువచ్చి నవ్వుతూ నాతో అన్నది, "మా ఛోటారాణిలో ఒకగొప్పగుణం ఉన్నది. అతిథిఅంటే ఎంతఆదరంచేస్తుందంటే, వచ్చినవాడు ఇల్లుకదిలి

పురి వెళ్లడు. మాకాలంలో అతిథులు లేకపోలేదు గాని ఇంత ఆదరం నేనెన్నడూ చూడలేదు. అప్పుడు ఇంకొక ఆచారం ఉండేది—మొగుళ్లనుకూడా ఆదరంతో చూచేవాళ్లము. మా మరిది, పాపం, ఈకాలంలో పుట్టాడు. అందుచేత అతనిపని ఉత్తదే. అతను అతిథయి ఈ ఇంటికి రావలసింది; అలాగైతే కొన్నాళ్లు ఇక్కడ ఉండగలుగును. ఇప్పుడు ఏమవుతుందో, కొంచెం సందేహమే!—మా చిన్నరాణీసీ అతనివైపు చూడనైనా చూడదే! అతనిముఖంవైఖరి ఏలాఅయిపోయింది, పాపం!"

ఈ మాటలన్నీ ఆ రోజులలో నన్ను ఏమీఅంటలేదు, నేను పట్టినవ్రతం వీళ్లకు ఏమీ అర్థం కాలేదని అనుకున్నాను. కవచంలాగు అన్నివైపులా పట్టి నన్ను కాపాడుతుండేది ఒకటి అప్పుడు నాలో ఉండేది—'దేశానికని నా ప్రాణాన్ని ధారపోస్తున్నాను, నాకు సిగ్గూలజ్జలతో పనిలేదు,' అనే నమ్మకం.

కొన్నాళ్లయింది, దేశం సంగతులు మాట్లాడడం నిలిచిపోయింది. ఇప్పుడు మేముచేసే వాదనలు*మాడర్న్ విషయాలు —ఈకాలపు స్త్రీపురుషులకుఉండే సంబంధమూ, అటువంటి ఆధునికసాంప్రదాయ సంబంధమైనవి ఏవో అనేక విషయాలూ అప్పుడప్పుడు ఇంగ్లీషు కావ్యాలూ, వైష్ణవకావ్యాలూ, వచ్చి ఆ మధ్యదూరుతూఉండేవి—ఈ కావ్యాలు తీసుకువచ్చి మేము

---

*మాడర్న్: Modern : ఆధునికసాంప్రదాయం.

చేస్తూఉండేపని ఏమిటంటే, వాటన్నిటికీ స్వరంకట్టుకుంటూ కూర్చోవడం. ఆ స్వరం బాగా మోటుస్వరం! ఆ స్వరంరుచి మాఇంట్లో ఇంతకుముందు ఎన్నడూ నాకు ప్రాప్తించలేదు. అదే పౌరుషస్వరం, మహాబలమయినది.

రహస్యంగా కథజరుపుతుండే రోజులు పోయినాయి. నెలలతరబడి, సందీప్‌బాబు ఎటువంటికారణమూ లేకుండా ఇక్కడఉన్నందుకు గాని, ఎటువంటి అవసరమూ లేకుండా అతనితో నేను వాదనా, జాతాఖానీ, చేస్తున్నందుకుగాని, ఎవరికీ సంజాయిషీ ఇవ్వవలసిన అవసరం లేకపోయింది.

ఆవాళ నామీదా, మా తోటికోడలిమీదా, ప్రపంచంలో జరుగుతున్న అన్నివ్యవహారాలమీదా, అమిత కోపం వచ్చి అనుకున్నాను—"మరివెళ్లను, బైటగదిలోకి మరి వెళ్లను. చచ్చినా సరే మరివెళ్లను."

రెండు రోజులవరకూ ఆలాగే వెళ్లలేదు. ఎంతదూరం వచ్చేశానో స్పష్టంగా మొదటిమాటు కనిపెట్టడం ఆరెండు రోజులలోనే. బ్రతుకంటే రుచి కేవలం పోయింది. కనబడ్డదంతా ముక్కలుచేసి పారేదామని బుద్ధిపుట్టింది. సమస్తమూ—తల దగ్గిరనుండి పాదాలదాకా నాలో ఉండే సమస్తమూ—ఎవరి-కోసమో ఎదురుచూస్తున్నది, అనిపించింది. నా ఒంట్లో పారుతున్న రక్తమంతా మెడచాచి బయటివైపు చూస్తున్నది అనిపించింది.

మరీవిస్తారంగా ఇంట్లోపని చేదామని ప్రయత్నించాను. మా పడకగది ఎంతో శుభ్రంగా ఉన్నప్పటికీ, బిందెలబిందెలనీళ్లు పోయించి అదంతా కడిగించాను. అలమారలో వస్తువులు ఒకమోస్తరుపేర్చిఉంచినవన్నీ తీయించి, అనవసరంగా, ఇంకొక మోస్తరు పేర్పించాను. నేను స్నానానికివెళ్లేసరికి ఆవాళ రెండు ఘంటలయింది. ఆవాళ మరి సిగవేసుకోలేదు, ఎదో ఒక విధంగా జుట్టు ముడివేసేసుకొని వంటిల్లు సవరించుదామని వెళ్లాను. అక్కడుండేవాళ్లనందరినీ నానాఅవస్థా పెట్టేశాను. ఈ మధ్య వంటింట్లో చాలా దొంగతనం జరిగినట్టుంది! కాని ఎవరినీ ఏమీ అనలేకపోయినాను. "ఇన్నాళ్లూ నీకు కళ్లు లేకపోయినాయా?" అని, ఎవరైనా, పైకి కాకపోయినా మనస్సులోనైనా, అంటారేమో అని నోరుమూసుకొని ఊరుకున్నాను.

ఆవాళంతా దయ్యంపట్టినట్టుగా, ఈలాగు అతిగందరగోళంచేశాను. ఆ మర్నాడు పుస్తకమేదైనా చదువుదామని ప్రయత్నంచేశాను. ఏమిటిచదివానో ఏమీ జ్ఞాపకంలేదు. పుస్తకం చేతపుచ్చుకొని, మధ్యమధ్య పరాకుగా ఇల్లంతా తిరుగుతుండేదానను. అంతఃపురంలోనుంచిబయిటికివెళ్లేదారిలో కిటికీ-కటకటాలు తీసి, చూస్తూ ఒకపర్యాయం నిలుచున్నాను. మా అంగణానికి ఉత్తరదిక్కున బయిటనున్న గదులవరస అక్కడనుంచి కనబడుతుంది. ఆ గదులలో ఒకటి నాజీవనసముద్రపు.అవతలబడ్డుకి వెలిపోయింది, అనిపించింది. అక్కడికి

మరి వాడ నడవడంలేదు. అటువైపు చూస్తూ నిలుచున్నాను—నిలుచొని అలాగు చూస్తూన్నాను. "మొన్నటి 'నా' యొక్క దెయ్యాన్నా నేను?" అని, అనిపించింది. ఆ అన్ని స్థలాలలో ఇంకా ఉన్నాను, గాని లేను.

నేను అక్కడ నిలుచొని ఉంటూఉండగా సందీప్ న్యూస్‌పేపరు చేతిలోపట్టుకొని ఒకమారు వరండామీదికి వచ్చాడు, నేను చూచాను. అతనిముఖం నాకు స్పష్టంగా కనబడ్డది. లోపున చాలా గాబరాపడుతున్నాడన్నమాట నిశ్చయం. ఈ అంగణంమీదా, ఆ వరండా*రైలింగ్సుమీదా కోపంతో మండిపడిపోతున్నట్టు నాకు తట్టింది. న్యూస్‌పేపరు ముక్కముక్కలుచేసి అటువైపు పారేశాడు; చేతనైతే ఆకాశం కూడా చించిపారేసేవాడే అనిపించింది. ఇదంతా చూచేసరికి నా ప్రతిజ్ఞ ఇక మరి నిలవదు అనుకున్నాను. ముందు గదిలోకి వెళదామా అని అనుకుంటూ వెనకకు తిరిగాను. తిరిగేసరికి మా తోటికోడలు అక్కడ తయారు—"వహవ్వా, మహా బాగా ఉందికదూ!" అన్నది. ఈలాగు అంటూ తిరిగి వెళిపోయింది. నేను బైటికివెళ్లడం మరి కాలేదు.

మర్నాడు ప్రొద్దున్న గోవిందుతల్లి వచ్చి, "చిన్నమహాదేవీ, వంటకు సామాను ఇవ్వేరమ్మా?" అని అడిగింది.

"హారిమతిని తీసిఇయ్యమను," అని తాళాలగుత్తి దా

*అంచున పెట్టిన ఇనప దడి

వైపు విసిరేశాను. కిటికీదగ్గర † క్రోషే అల్లుకుంటూ కూర్చు-న్నాను. అప్పుడు నౌకరువచ్చి, సందీప్‌బాబు ఇచ్చాడంటూ ఒక ఉత్తరం నాచేతిలో పెట్టాడు. ఎంతసాహసం అతనికి! నౌకరు ఏమనుకున్నాడో కదా! గుండె గబగబ కొట్టుకోవడం ప్రారంభించింది. ఉత్తరం విప్పిచూచాను. ఎవరికో పేరులేదు, ఏసంబోధనా లేదు. ఈ మాటలుమాత్రం ఉన్నవి—"చాలా అవసరం; దేశంసంబంధమైన పని—సందీప్"

అల్లిక ఒకమూల పారేశాను. అద్దందగ్గిరికి వెళ్లి తొందరతొందరగా జుట్టు కొంచెం దువ్వుకున్నాను. చీర ఏలాగున్నది ఆలాగు ఉంచేశాను. జాకెట్ మాత్రం మార్చాను—నా జాకెట్లలో ఏది అతనికి చాలాఇష్టమో నాకు తెలుసును.

బయటికి వెళ్లాలంటే ఏవరండామీదినుంచి నేను వెళ్లాలో, ఆ దారిలో మా తోటికోడలు మామూలు ప్రకారం పోకచక్కలు కత్తిరిస్తూ కూర్చుంది. నేను ఈవాళ ఏమీ సంకోచించలేదు. "ఎక్కడికి ప్రయాణం?" అని అడిగింది తోటికోడలు.

"బయటిగదిలోకి" అన్నాను.

"ఇంతపెందలాడే! ఏదో లీల జరుగుతుంది నాకు తెలుసును!"

నేను ఏమీ జబాబుచెప్పలేదు. తోటికోడలు ఏదో వెంకిపాట కూనరాగంతో పాడడం ప్రారంభించింది.

---

† ఊలుఅల్లిక మోస్తరు అల్లిక.

ముందుగదిలోకి వెళ్లేసరికి సందీప్‌బాబు అక్కడ ఉన్నాడు; ద్వారంవైపు వీపుపెట్టి కూర్చున్నాడు. బ్రిటిష్ ఎకాడెమీలో ప్రదర్శించిన బొమ్మల కాటలాగుఒకటి చేతిలో ఉన్నది, తదేకధ్యానంగా పేజీలు తిరగవేస్తున్నాడు. శిల్పంతో సంబంధించిన విషయాలలో తాను చాలా విచక్షణగలవాడు అని సందీప్ అనుకొనేవాడు. "ఏశిల్పికైనా గురువు కావలసి ఉంటే నువ్వు బ్రతికిఉన్నన్నాళ్లూ ఎటువంటిచిక్కూ ఉండదు," అని నా భర్త అతనితో ఒకమాటు అన్నారు.

ఈలాగు ఎత్తిపొడుస్తూ మాట్లాడడం నా భర్తస్వభావం కాదు. కాని ఈమధ్య అతనిలో కొంచెం మార్పువచ్చింది— సందీప్ అహంభావంమీద ఎక్కడయినా ఒక చిన్న దెబ్బ కొట్టగలిగితే ఊరుకుండేవారు కారు.

"శిల్పులకు* శుశ్రూష మరి అవసరంలేదని నీ ఉద్దేశం కాబోలు?" అన్నాడు సందీప్.

"నాబోటిగాళ్లు ఆర్టిస్ట్లపాదాలదగ్గిర కూర్చుని కొత్త కొత్త సంగతులు శాశ్వతకాలమూ నేర్చుకుంటూఉండాలి— ఎందుచేతనంటే, ఆర్ట్‌లోఎక్కడా తొక్కినదారి అంటూ

---

* ఠాగూరుగారు ఉపయోగించిన మాట: ఆర్టిస్ట్: (Artist: శిల్పి) ఆర్ట్: (Art: శిల్పం)

ఉండదు; దానిజీవనం నిత్య-నూతనం, ఏరోజు కారోజు మారు-తుంటుంది."

నా భర్త వినయాన్ని వెక్కిరిస్తూ సందీప్ ఒకనవ్వు నవ్వాడు; అన్నాడు—"దైన్యం ఒక మూలధనం. అందులో నుంచి ఎంత ఖర్చుపెడుతుంటే ఐశ్వర్యం అంత పెరుగుతుంటుం-దని నీ అభిప్రాయం. నేను చెప్పుతున్నాను, స్వాభిమానం లేనివాడు ప్రవాహంలో తేలుతున్న రెల్లు మోస్తరు—అది ఎటుపడితేఅటు తిరుగుతూఉంటుంది.

నా మనోభావం చాలా అద్భుతంగా ఉండేది. 'నా భర్త ఇవాళ వాదనలో గెలవాలి, సందీప్‌గర్వం కొంచెం అణగాలి,' అని ఒకొకనాడు కోరికపుట్టేది. కాని ఆ-సందీప్‌గర్వమే నన్ను ఆకర్షించేది—అదితళుక్ తళుక్‌మంటున్న వజ్రంలాంటిది. దానికి సిగ్గు తెప్పించే మార్గం లేదు. సూర్యునిముందర పెట్టినా అది వీగిపోయినానని ఒప్పుకోదు. పైగా, సూర్యునిముందర పెట్టినప్పుడు దానిపొగరు మరింత అధికంకూడా అవుతుంది.

నేను గదిలోకివెళ్లాను. నా అడుగులచప్పుడు సందీప విన్నాడని నాకు తెలుసును, గాని విననట్టు నటించి మరింత శ్రద్ధతో పుస్తకంలో కాగితాలు తిరగవేస్తున్నాడు. 'ఆర్ట్' ప్రసంగాలు ప్రారంభిస్తాడేమో అని నాకు భయంవేసింది. శిల్పంఅని మిషపెట్టి అతను నాతో ఏమేమిటి మాట్లాడేవాడో, ఏపబొమ్మలగురించి వాదన చేస్తుండేవాడో, అనుకుంటే, సిగ్గు పుట్టడం నాకు

ఈనాటికి పోలేదు. సిగ్గు దాచుకుందామని, 'అందులో సిగ్గు-పడడానికి ఏముంది,' అని నటిస్తుండే దానను.

అందుచేత తిరిగివెళిపోదామా అని ఒక్కమాటు బుద్ధిపుట్టింది. అంతలో సందీప్ నిట్టూర్పువిడిచి, తల నావైపు తిప్పి, నన్ను చూసి ఉలికి పడ్డాడు—"ఇదుగో వచ్చారు!" అన్నాడు.

ఆ మాటలలోనూ, ఆస్వరంలోనూ, ఆ రెండుకళ్లలోనూ, పైకిడుచ్చరించని నింద కనబడ్డది. అతనుచేసే నింద నేను ఒప్పుకున్నాను. నాగతి అంతకువచ్చింది. ఈ రెండుమూడురోజులు కనబడకపోవడం అపరాధంఅయినంత హక్కు సందీప్‌కు నా-మీాద కలిగింది. సందీప్ కోపంచూపించడం నాకు అవమానమే, నాకు అదితెలుసును. కాని తిరిగి కోప్పడడానికి నాలో శక్తి ఎక్కడిది?

ఏమీా జవాబుచెప్పకుండా ఊరుకున్నాను. ఇంకోకవైపు చూస్తున్నా, అతని రెండుకళ్లూ చేస్తూఉన్న ఫిర్యాదుమాత్రం నా కళ్లకు కట్టుఉంది. వ్రతంపట్టి దేవాలయం తలుపుదగ్గిర కూర్చొనిఉన్న భక్తురాలలాగు, ఆకళ్లు నా ముఖాన్ని చూస్తూ కూర్చున్నవి. ఓయి బాబు? అదేమిటది! సందీప్ నోటిలోనుంచి ఏదైనా ఒక్కమాట వస్తే, ఆ మాటవెనుక దాగొని బ్రతుకు-దాము అనుకున్నాను. అలాగు ఐదుమినిట్లో పదిమినిట్లో ఉన్నాను. సిగ్గు మరి భరించలేకపోయి, "మీారేదో మాట్లా-డతానన్నారు, ఏమిటా పని?" అని అడిగాను.

సందీప్ ఉలికిపడ్డట్టు నటించి అన్నాడు, "పని ఉంటేనే గాని పిలవకూడదూ? స్నేహం కూడనివస్తువా? ప్రపంచంలో ఉండే అన్నిటిలోకీ గొప్పదయినవస్తువంటే మీకు అంత అనాదరణేమి? హృదయపూర్వకంగా చేస్తూఉండే ఆరాధనను గడపదగ్గిరనుంచి, వీధికుక్కను తరిమేసి నట్టుగా, తరిమేయ వచ్చునూ, రాణీ?"

నా మనస్సులో గజగజమని వణుకుపుట్టింది. ఆపద క్రమక్రమంగా దగ్గిరికి వచ్చేస్తూఉంది, ఆపినా మరి ఆగదు. ఒక మూలనుంచి భయమూ, మరిఒక మూలనుంచి పులకరింపూ, రెండూ ఒక్కమారు నాలో పుట్టాయి. ఈ మహాప్రళయాన్ని, నా వీపుమీద పడబోయే ఈ పిడుగును, ఏలాగు నేను ఆపగలను? ధూళిలో బోర్లాపడిపోతానా ఏమిటి చివరకు?

నా కాళ్లూ చేతులూ వణకడం ప్రారంభించాయి. బాగా బలంతెచ్చుకొని నిలబడి, "సందీప్‌బాబూ, స్వదేశీపనిఏదో ఉన్నదన్నారు, అందుకోసమని ఇంటిపని అట్టేపెట్టి వచ్చాను," అన్నాను.

నవ్వుతూ సందీప్‌బాబు అన్నాడు—"నేను అదే మీకు బోధపరుస్తుంటిని. నేను ఆరాధనచేయడానికి వచ్చానని మీకు తెలియదూ? మన దేశంయొక్కశక్తి మీలో మూర్తీభవించింది, ఆ మాట మీతో నేను చెప్పలేదూ? భూగోళం *ఒక ప్రాణం ఉన్నవస్తువు కాదు. మ్యాపును మనస్సులోపెట్టుకొని ఎవరైనా

* జాగ్రఫీ: Geography:

తన ప్రాణాన్ని ధారపోసేయగలదూ? కళ్లకుఎదురుగా మీరు కనబడుతుంటే అప్పుడు బోధపడుతున్నది — దేశం ఎంత మనోహరమో, ఎంతప్రియమయినవస్తువో, దానిలో ఎంతప్రాణమున్నదో, ఎంత తేజస్సున్నదో! మీచేతితో మీరు నా నొసటను జయతిలకం ఉంచారంటే అప్పుడు నాకు నమ్మకం పుడుతుంది, దేశంయొక్క ఆదేశం నేను పొందాను అని. ఆ మాట మనస్సులోపెట్టుకొని యుద్ధానికి వెళ్లగలను ; యుద్ధభూమిలో మరణబాణం తగిలి మట్టిలోపడినా అది భూగోళం-లోని మట్టికాదు, ఒక నారీమణిపైటచెంగు అని బోధ పరుచుకుంటాను. అది ఎటువంటి పైటచెంగో తెలుసునా మీకు? మీరు ఆవాళ కట్టుకున్నారు ఒక చీర, జ్ఞాపకం ఉన్నదా?— కావిరంగు దానిది, మట్టికి ఉండేరంగు, రక్తపు ధార లాంటి ఎర్రని అంచు, ఆచీర పైటంచు,—అది ఎన్నటికైనా మరిచి పోతాననుకున్నారా ఏమిటి? ఇటువంటి భావాలన్నీ జీవనానికి తేజస్సు ఇస్తాయి, మృత్యువును రమణీయం చేస్తాయి.

ఆలాగు మాట్లాడుతూఉండగా సందీప్ రెండుకళ్లూ నిప్పులాగు మండడం ప్రారంభించాయి. వాటిలో ఉన్నది భక్తో లేక వాంఛో నాకు బోధపడలేదు. మొట్టమొదట అతని ఉపన్యాసం విన్ననాటిమాట జ్ఞప్తికి వచ్చింది. ఆవాళ అతను అగ్నిశిఖో లేక మనుష్యుడో నిర్ణయించలేక పోయినాను. సాధారణమయిన మనిషిఅయితే మనుష్యులతో వ్యవహరించి-నట్టు వ్యవహరించవచ్చును—దానికి పద్ధతులూ ఆచారాలూ

ఉన్నవి.. అగ్ని ఇంకో రకజాతివస్తువు—ఒక్క నిమిషంలో మనకళ్లు చీకట్లుకమ్మేటట్టు చేసేయగలదు. అది ప్రళయాన్ని ఒక సుందరమైనవస్తువుగా చేస్తుంది. రోజూ చేస్తూఉండే చిన్న చిన్న పనులలో దాగిఉన్న సత్యం, ఎండుకర్రలలో దాగిఉన్ననిప్పు. ఆ నిప్పు, చుట్టూ లుబ్ధులు దాచిఉంచుకున్న ధనసంచయాలను, తగలబెడుతూ భయంకరమైన పిచ్చినవ్వులతో తన దీప్తిని, తన నిజస్వరూపాన్ని, వెల్లడిచేస్తూ నాలుగువైపులా పరిగెడుతున్నదా అనిపించింది ఆవాళ.

ఏమనడానికీ నాకు మరి శక్తిలేదు. సందీప్ ఇప్పుడే వచ్చి నా చెయ్యి పట్టుకుంటాడేమో అని భయంవేసింది. ఎందుచేతనంటే, నృత్యంచేస్తున్న అగ్నిశిఖలాగు అతను వణకడం ప్రారంభించాడు; అతనికళ్లనిప్పుమిణుగుర్లు నామీద వచ్చిపడుతున్నవి.

సందీప్ అన్నాడు—“చిన్న చిన్న ఇంటిపనులు పట్టుకొని, ఇదే మనకుండే సమస్తమూ అని, కూర్చుంటారా ఏమిటి? మీలోఉన్నది ఎటువంటి ప్రాణం!—దాని వాసన ఆమాత్రం తగిలితే చాలును, జీవనమరణాలను తుచ్ఛమైన వస్తువులుగా భావిస్తూ ఎంతపనైనా చేయగలను—అది ఇంట్లో ముసుగువేసి కూర్చోపెట్టవలసిన వస్తువా? ఈవాళనుంచి సిగ్గు విడిచిపెట్టేయండి; లోకుల గుసగుసలు చెవిని పడనివ్వకండి; ఆచారాలూ, నిషేధాలూ, వాటి గతి వాటినే చూచుకోనివ్వండి; బయిటికి కురుగెత్తుకొని రండి—ముక్తిలోకి!”

ఈ విధంగా, సందీప్‌బాబు మాటలలో మాతృభూమి-స్తోత్రమూ నాస్తోత్రమూ కలిసిపోయినాయి. ఆ స్తవం వినేసరికి నా సంకోచంచుట్టూఉండే గట్లు మరి నిలవలేకపోయినాయి, నా హృదయంలో ఒక నాట్యం ప్రారంభంఅయింది. శిల్పంగురించి గాని, వైష్ణవపాటలగురించి గాని, స్త్రీపురుషులకు ఉండవలసిన సంబంధనిర్ణయంగురించి గాని, వాస్తవఅవాస్తవాలగురించి గాని, వాదనలు జరుగుతున్నన్నాళ్లూ నాకు చాలా అసహ్యంగా ఉండేది. నా మనస్సు నల్లని మసిబొగ్గులాగు అయిపోయింది. ఆ మసిబొగ్గునలుపులో ఇప్పుడు నిప్పుపుట్టింది. దాని దీప్తి నా సిగ్గును మింగేసింది—నేను స్త్రీని అన్న సంగతే నా దివ్య మహిమ అనిపించింది!

ఆహా! ఆ నా మహిమ నా ముఖంలో కనబడి, అందరికీ ప్రత్యక్షంకాదేమీ? దేశమంతటిలో ఒక్కమాటు వీరావేశం పుట్టించే మంత్రంలాగు ఎదైనా ఒకమాట నా నోటివెంట రాదేమీ?

నేను, అదంతా అనుకుంటూ ఉండగా, నా దాసీ, 'క్షేమా,' 'నాయనో, బాబో,' అని పెద్దపెద్ద కేకలు వేసుకుంటూ నా గదిలోకి వచ్చి అన్నది—"నాజీతం నాకు ఇచ్చేయండి అమ్మా, నేను మరి ఉండలేను; ఏడు జన్మాల్లో ఎప్పుడూ ఇటువంటి—హూః హూః హూః!

జరిగిన సంగతి ఏమిటం

మా తోటికోడలి దాసీ, 'ఫాళో', క్షేమామీద పడి కొట్టవచ్చిందంట; ఏమీ కారణంలేకుండా నోటికివచ్చిన తిట్లన్నీ తిట్టిందట.

అదేమిటో కనుక్కుంటాను అని నేనంతో చెప్పాను. ఏమయినా దాని ఏడుపు మరి ఆగలేదు.

ఆవాళ ప్రొద్దున్నే ఏలాగంటేఆలాగు అరంభంఅయింది దీపక-రాగంమీద పాట; అయితేనేమి, అంట్లుతోమినసీళ్లు తెచ్చి దానిమీద దిమ్మరించేసినట్టయిపోయింది. స్త్రీ పద్మవనంలోనున్న పంకజం; కెలకడంవల్ల దానిఅడుగునున్న పంకం మీదికిరావడం ప్రారంభించింది. అది సందీప్‌కి కనబడకుండా చేదామని తొందరతొందరగా అంతఃపురంలోకి వెళ్లాను. తోటికోడలు వరండాలో కూర్చొని తలవంచుకొని తదేక ధ్యానంగా పోకచెక్కలు కత్తిరిస్తూఉంది—ముఖాన చిన్న నవ్వూ, నోట్లో 'తప్పటడుగుల రాధ,' అంటూ పెంకిపాట ఒకటీ! ఇంట్లో ఏమి జరుగుతున్నదో ఏమీ తెలియదు, పాపం! "అక్కయ్యా, నీ దాసీ నా దాసీని ఎందుకు ఉత్తుత్తనే తిడుతుంది—ఎందుచేత?" అన్నాను.

కనుబొమ్మలు ఎత్తి ఆశ్చర్యపడి అన్నది, "ఓయి బాబు! నిజంగా! గయ్యాళిముండ! చీపురుతో నాలుగు కొట్టి తగిలేస్తే రోగం కుదురుతుంది. ప్రొద్దున్నే విూ గోష్ఠి మంట కలిపేసింది. నీ దాసీకూడా చాలా బుద్ధిమంతురాలు కదూ,

చూస్తున్నాను! ఎవరో పైపెద్దమనిషితో రాణి మాట్లాడుతూ ఉందని దానికి తెలుసునుగదా, ఏమికొంపమునిగిపోయిందని గబగబ పరిగెత్తివెళ్లి చెప్పేసింది!—సిగ్గూలజ్జా అన్నీ వదలేసి కూర్చుంది. ఇంటిసంగతులలో నువ్వు ఏమీ జోక్యం కలుగ-జేసుకోకు ఛోటారాణీ; నువ్వు బైటికివెళిపో, నీ స్నేహితుడి దగ్గిరికి, ఈ సంగతులన్నీ నేనే చూచుకుంటాను, నా చేత-నైనంతమట్టుకు.

మనిషిమనస్సు అద్భుతమైన వస్తువు. తెరచాపకు తగిలే గాలి ఒక్కక్షణంలో తిరిగిపోవచ్చును. ఇంటిపని వదిలేసి ప్రొద్దున్నే బయటిగదిలో సందీప్‌తో మాట్లాడడానికి వెళ్లడం, చిరకాలంనుంచివస్తూఉన్న మా అంతఃపురసాంప్రదాయాలతో ఏమాత్రమూ పొందలేదని తోచి ఎటువంటిజబాబూ ఇవ్వ-కుండా నా గదిలోకి వెళిపోయినాను.

సరియైనవేళ కనిపెట్టి మా తోటికోడలు తన దాసీని పురికొల్పి నా దాసితో పోట్లాడించింది, అది నాకు బాగా తెలుసును. గాని నేనున్నది చాలా అసందర్భమయిన అవస్థ; అందుచేత దేనిగురించీ ఒక్కమాటకూడా అనలేకపోయి-నాను. అదుగో మొన్ననే కదూ, మా దర్వాన్ నన్కూ గురించి నా భర్తతో పోట్లాడాను. మొట్టమొదట ఎంతో ఉద్రేకంతో మాట్లాడాను; చివరదాకా ఆ జోరు ఉండలేదే! —నా ఉద్రేకం చూస్తే నాకే సిగ్గువేసింది. ఇంతలో మా తోటికోడలు వచ్చి ఆయనతో అన్నది—"అబ్బాయీ, తప్పు

నాదీ. చూచావా, మేము పూర్వకాలపు మనుష్యులము, మాలాంటివాళ్లకు మీ సందీప్‌బాబు వ్యవహారం ఏమీ నచ్చదు. అందుచేత, మంచిదనుకొని దర్వాన్‌తో—అయితే మన ఛోటారాణికి అది ఇంతఅవమానం అని నేను అనుకోనే లేదు. పైగా నేను చేస్తున్నది ఆమెకు ఉపకారం అనుకున్నాను. అభాగ్యురాలను, ఎటువంటి బుద్ధి నాది!"

ఈ విధంగా, దేశసేవ అనిగాని, ఆరాధన అనిగాని చూస్తే ఎంతో శోభాకరంగా కనబడేవన్నీ కిందినుండి చూస్తే బురదబురదగా ఉంటాయి. ఇది తెలుసుకోగానే మొట్టమొదట కోపం వస్తుంది, తరవాత అసహ్యంపుడుతుంది.

ఈవాళ పడకగదిలోకి వెళ్లి, తలుపు వేసి కిటికీదగ్గిర కూర్చొని, ఆలోచించడం ఆరంభించాను—నాలుగు వైపులా ఉండేవాటితో శ్రుతి కలిపి జీవనయాత్ర చేయగలిగితే ఎంతో హాయిగా ఉంటుంది అనిపించింది. అదుగో మా తోటికోడలు వరండాలో కూర్చొని ఎంతనిశ్చింతగా పోకచెక్కలు కత్తిరించుకుంటూఉందో! సహజంగా నాకు ఉండవలసిన స్థానంలో కూర్చొని నా పనులు నేను చేసుకోవడం ఈ రోజులలో నాకు ఎంతకష్టం అయిపోయింది! దీనికి తుద ఎక్కడ అని రోజూ నేను ప్రశ్నించుకుంటున్నాను...నేను గాని చచ్చిపోతానా ఏమిటి? సందీప్ వెళిపోతాడా ఏమిటి? ఇదంతా రోగి కలవరింత లాగు, బాగయి మంచంమీదనుంచి లేవగానే

మరిచిపోతానా, లేక ఈ వినాశదేవత నన్ను పాతాళంలోకి తొక్కేసి, నాకు మరి మోక్షంలేకుండా చేసేవరకు వదలదా ? సౌభాగ్యాన్ని ఎంతసులభంగా చేతిలోనుంచి తప్పించుకుపారి-పోనిచ్చాను ? నా జీవనం ముక్కలుముక్కలుగా ఏలాగు చేయగలిగాను ?

ఇది నాపడకగది. అప్పుడే భార్యనయి మొట్టమొదటి అడుగు ఇందులోపెట్టి తొమ్మిది సంవత్సరాలయింది. ఆ గది గోడలూ, పరంబీ, నేలా, నా ముఖంవైపు మలిపోయినట్టు చూస్తున్నవి. నా భర్త ఎం. ఏ. పాస్అయి ఇంటికి వచ్చి-నప్పుడు, హిందూ మహాసముద్రంలో ఎక్కడో ఒక ద్వీపంలో పెరిగే బదనికను, కలకత్తానుంచి తీసుకు వచ్చారు. దానికి ఏనాలుగు ఆకులో ఉన్నవి, గాని పొడగాటి పువ్వుల గుత్తి ఒకటి పూసిఉంది—నందనవనంలోని సౌందర్యమంతా దేవతలు జాడీలతో తెచ్చి అది ఇక్కడ వంపేసి వెళిపోయినారా -అనిపించింది—అటువంటి అందం ఆ పూలగుత్తిది; ఇంద్రధనస్సు ఈ నాలుగు ఆకులకు పిల్లయిపుట్టి వాటిపిళ్లో ఉయ్యాల ఊగుతున్నదా అనిపించింది. మే మిద్దరమూ కలిసి నిశ్చయించి ఆ బదనికను మా పడకగదికిటికీదగ్గిర వేలగట్టాము. అది ఒకమాటుపూసింది, మరి పూయలేదు ; ముందుకు ఎప్పుడైనా పూస్తుందని ఆశమాత్రం ఉండేది. చిత్రమేమిటంటే, అలవాటు ప్రకారం రోజూ ఆచెట్టుకు నీళ్లుపోస్తూఉండేదానను. ఒక్కటి చాలా ఆశ్చర్యమయిన సంగతి — కొబ్బరి తాడుతో కట్టిన ఆ

నాలుగుఆకుల బంధం ఇప్పటికీ ఒదులు కాలేదు, ఇప్పటికీ ఆ ఆకులు పచ్చగానే ఉన్నవి.

నా భర్త ఫోటోగ్రాఫుఒకదానికి దంతం చేట్టం కట్టించి, ఆ చిన్న కిటికీలో పెట్టాను, ఇప్పటికి నాలుగు సంవత్సరాలయింది. పరాకున దానిమీద కళ్లుపడితే సిగ్గుచేత ముఖం వాల్చేసుకుండేదానను. ఆరురోజుల క్రిందటివరకూ, ప్రతిఉదయమూ, స్నానం కాగానే, పూలుకోసి ఆ పటంముందు ఉంచి నమస్కారం చేసేదానను. అందుకని నాభర్తతో ఎంతకాలమో వాదనఅయింది.

ఒకనాడు అన్నారు ఆయన—"నన్ను, నిజంగా నేనున్న దానికంటే పెద్దనుచేసి నువ్వు పూజ చేస్తున్నావు. అదిచూచి నాకు చాలా సిగ్గవుతున్నది."

"ఎందుకు సిగ్గు మీకు?" అన్నాను నేను.

"ఒక్క సిగ్గే కాదు. ఈర్ష్య కూడాను," అన్నారు.

"బాగుంది, వవావ్వా! ఈర్ష్య ఎవరిమీద?"

"ఆ మాయ 'నా'మీద. మామూలు 'నా'తో నీకు తృప్తిలేదు; నీ మనస్సును భయంతోనూ భక్తితోనూ నింపగలిగిన అసామాన్యు డొకడు నీకు కావలెనని, దానివల్ల నాకు బోధపడుతున్నది. అందుచేత ఇంకొక 'నన్ను' నీ మనస్సుతో సృజించి నిన్ను నీవు మరిపించుకుంటున్నావు."

"మీ మాటలు వింటూఉంటే నాకు కోపంవస్తూఉంది," అన్నాను నేను.

అంటే, ఆయన జవాబుఇచ్చారు, "నా మీద కోప్పడి ఏమి లాభం, నీ అదృష్టంమీద కోప్పడాలి గాని? నువ్వు నన్ను స్వయంవరసభలో ఎంచి తీసుకోలేదే, కళ్లుమూసుకొని చేతికి దొరికినది తీసుకున్నట్టుగా, తీసుకున్నావు! అందుచేత నాకు దేవత్వం ఇచ్చి, నా లోపాలు, నీ చేతనైనంతా, పూర్తిచేస్తున్నావు. దమయంతిది స్వయంవరం గనుక దేవతలను విడిచిపెట్టి మనుష్యుణ్ణి ఎంచుకోగలిగింది. ఈనాటి వివాహాలు స్వయంవరవివాహాలు కావు, అందుచేత మీకు దొరికిన మనుష్యులను వెనకకు తోసేసి, మీ మనస్సులలోపుట్టిన దేవతల మెడలలో రోజూ పూలహారాలు వేస్తున్నారు."

ఆలాగు ఆయన అనేసరికి నాకు అమితకోపం వచ్చి కళ్లవెంట బొటబొట నీళ్లుకార్చుకున్నాను. ఆమాట ఇప్పుడు జ్ఞప్తికి వచ్చి ఆ కిటికీవైపు ముఖం తిప్పలేకుండా ఉన్నాను.

నా వస్తువులపెట్టెలో ఇంకొక ఫొటోగ్రాఫ్ ఉన్నది. ఆవాళ ముందుగది దులిపించి కడిగించిననాడు ఆ ఫోటోస్టాండు తీసుకు వచ్చేశాను—నా భర్తఫొటోపక్కను సందీప్‌ఫోటో ఉన్నది ఆ స్టాండులో. ఆ ఫోటోకి పూజచేయను, నమస్కారం పెట్టవలసిన ఫొటోగ్రాఫ్ కాదు అది. అది నా వస్త్రాలూ, కెంపులూ, ముత్యాలమధ్య ఉంటుంది. అది ఎప్పుడూ దాగి ఉంటుంది, గనుకనే అది చూచేసరికి అంత పులకరింపు! గది తలుపులు అన్నీమూసి, అప్పుడు దానిని పైకితీసి చూచేదానను.

రాత్రి మెల్లిమెల్లిగా, కిరసనాయిలుబుడ్డివత్తిఎత్తి, దానిదగ్గిర ఈ బొమ్మ పట్టుకొని, కదలకుండా మెదలకుండా దానివైపు చూస్తూ కూర్చుండేదానను. అది కాగానే ఆ బొమ్మను ఆ కిరసనాయిలుదీపంలో కాల్చి భస్మంచేసేసి ఎన్నటికీ మరి లేకుండాచేసేసుకుందామా అని రోజూ అనుకొనేదానను. కాని చివరకు రోజూ ఒక పెద్ద నిట్టూర్పువిడిచి మెల్లిమెల్లిగా దానిని నా వజ్రాలూ కెంపులూ ముత్యాలమధ్యను దాచేసి తాళంవేసేసేదానను. కాని, ఓయి అభాగ్యురాలా! నీకు ఈ ముత్యాలూ కెంపులూ వజ్రాలూ ఎవరిచ్చినవే! ఎన్నాళ్లనాటి ప్రేమ, ఎంతముద్దు వాటిని అంటిపెట్టుకొని ఉన్నది! అవి ఇప్పుడు వాటిముఖాలను ఎక్కడ దాచుకోగలవు! ఆహా, నాకు ఏలాగైనా చావు వస్తే బ్రతికిపోదును.

సంకోచించడం ఆడవాళ్లస్వభావం కాదు అని, సందీప్ ఒకనాడు నాతో అన్నాడు. స్త్రీకి కుడీ ఎడమా లేదు, ఉన్న-దంతా ఒక్కటే—ముందు. సందీప్ మాటిమాటికీ అంటూ ఉండేవాడు—మన దేశపుస్త్రీలు మెలకువతెచ్చుకొని లేచారా అంటే, "మాకు కావాలి" "మాకు కావాలి" అంటూ, ఎటువంటి సంకోచమూ లేకుండా, పురుషులకంటె అనేకరెట్లువిస్తారంగా పనిమొదలుపెడతారు. ఆ 'కావాలి కావాలి' అంటూ పరుగెత్తే ఇచ్ఛముందర మంచీ చెడ్డా, సంభవమూ అసంభవమూ, అనే తర్కవితర్కాలు మరి పనికిరావు. ఒక్కమాటమాత్రం విన-బడుతుంటుంది వాళ్లనోటివెంట, "మాకుకావాలి" "మాకు

కావాలి." "నాకుకావాలి" అనేదే సృష్టికి మూలవాణి. దానికి శాస్త్రమూ పద్ధతీ అక్కరలేదు. అది అగ్నిరూపంగా సూర్యునిలోనూ, నక్షత్రాలలోనూ, ప్రజ్వలిస్తుంటుంది. దాని ప్రణయం మహోగ్రాప్పది, భయంకరమైన పక్షపాతం గలది. మనుష్యుడంటే దానికి పట్టరాని కోరిక; ఆ కోరిక నెరవేర్చుకోడానికి కోట్లకొలది జీవనాలను యుగాలతరబడి నిస్సంకోచంగా బలి వేసేసింది. సృజనప్రళయంలో పుట్టిన "నాకు కావాలి" అనే వాణి ఇప్పుడు స్త్రీగా మూర్తీభవించింది. పిరికిపెద్దమ్మ, పురుషుడు, ఈ సృజనప్రళయాన్ని గట్లుపెట్టి ఆపుదామని ప్రయత్నం చేస్తున్నాడు. ఆ ప్రళయం కేకలతోనూ, నవ్వులతోనూ, తాండవమాడుకుంటూ వచ్చి, తాను పెట్టుకున్న చిట్టిగుమ్మిడి పాదును ముంచి నాశనం చేసిపోతుందేమో అని, మొగవాడికి భయం. దిట్టమైన గట్లు పోయించాను శాశ్వతకాలము ఉంటాయి అనుకొంటూ నిర్భయంగా కూర్చున్నాడు. కాని అందులో చేరుతున్నది నీరు, చూడడానికి ఈవాళ ఒక పెద్ద చెరువుమాత్రమే, మహాశాంతంగా ఉంది; కదలదు మెదలదు; మొగవాడు వంటఇంటిబిందె తీసుకువెళ్లి, అందులో ముంచి, అతికులాసాగా బిందెడేసినీళ్లు తెచ్చుకొంటున్నాడు. అయితేనేమి, ఇప్పటికి నీరు బాగా చేరింది, ఆ అడ్లను మరి భరించదు, గట్లుతెగిపోతాయి, ఇన్నాళ్లూ మూగదానివలె మాటాడక కూర్చున్న శక్తి, "నాకుకావాలి" "నాకుకావాలి" అని గర్జన చేసుకుంటూ పరుగెత్తుతుంది.

సందీప్ అన్న ఈ మాటలు నా లోపున భేరీలాగు వాగాయి. నాలోనాకే విరోధంకలిగి, లోపున సంకోచముగాని భయముగాని పుట్టినప్పుడు, సందీప్‌మాటలు జ్ఞాపకం వచ్చేవి. అప్పుడు బోధపరుచుకున్నాను, నాలోపుదుతూఉండేసిగ్గు లోక భయంవల్ల అని. అదే మా తోటకోడలు రూపంగా బయట సార్చోని చెక్కలుకత్తిరిస్తూ వంకచూపులు చూస్తూఉంది. నేను ఎందుకు దాన్ని లక్ష్యపెట్టాలి! "నాకు కావాలి" అని నిస్సంకోచంగా, ఎటువంటి అడ్డునూ లక్ష్యపెట్టక, మనకున్న యావచ్ఛక్తితో లోపునా బయిటా చెప్పగలగడమే, మనకు పూర్తి అయిన ప్రకాశం కలగడం, ఆలాగు చెప్పలేకపోవడమే మన జీవనం వ్యర్థంకావడం. ఆ బదనికా, ఆ గూడూ ఎందుకు నాగడిలో ఉండడం? ఆ సృజనవాణి, ఆ ఆదిమవాణి, నన్ను ఉద్దీప్తరాలుగాచేస్తూ ఉన్నంతసేపు నన్ను చిన్నపుచ్చేశక్తి వీటిలో ఏమిఉన్నది? ఆ బదనికను కిటకీదగ్గిరనుంచి లాగి పారేదామని బుద్ధిపుట్టింది; ఆ ఫొటిగ్రాఫు గూటిలోనుంచి తీసేదామని బుద్ధిపుట్టింది—నాలోఉన్న ప్రళయశక్తి అలంకారాలూ, ఆచ్ఛేదనాలూ, అన్నీతీసిపారేసి సిగ్గులేకుండా ప్రకాశించునుగాక!... చెయ్యిలేచింది ; గాని మనస్సులో బాధ; కళ్లవెంట బొటబొట నీళ్లు. నేలమీద బోర్లాపడి ఏడవడం ప్రారంభించాను... ఏమిటవుతుంది! నాకుఏమిటవుతుంది!...నా నొసట ఏమిరాత ఉన్నదో కదా!

## సందీప్ కథ

నేను వ్రాసిన నా కథ చదివిచూస్తూఉంటే 'నేనేనా ఆ సందీప్' అని అనిపిస్తూఉంది. నేను కేవలం మాటలతో చేయబడ్డ వస్తువునా? రక్తమాంసాలతో చేసినఅట్ట పైనవేసి తయారుచేసిన పుస్తకాన్నా?

భూమి చంద్రునిలాగు ప్రాణంలేని వస్తువు కాదు. దానికి ప్రాణంఉన్నది. అది ఊపిరితీస్తుంది. దానిలో ఉండే నదులలోనుంచీ సముద్రాలలోనుండీ ఆవిరి పుట్టి, ఆ ఆవిరి ఆ గోళాన్ని అన్ని వైపులా కప్పేస్తుంది. దానిమీద ధూళి లేచి నాలుగువైపులా కమ్మేస్తుంది. దూరంనుండి చూచేవానికి అసలుగోళం కనబడదు; ఈ ధూళిలోనూ ఆవిరిలోనూ ప్రతిఫలించిన వెలుతురుమాత్రం కనబడుతుంది; దేశాలూ ఖండాలూ వివరంగా తెలియవు; స్పష్టంగా కనబడవు.

సజీవుడైన మనుష్యుడు ఈ పృథ్వీమోస్తరే. అతను బయటికి వదులుతున్న భావాలు, ఆవిరిమండలమయి అతనిని నాలుగువైపులా కప్పిఉంచుతాయి. అడుగునఉన్న స్థలజలాదులను ఆ ఆవిరి పైకి తెలియనివ్వదు, దిగువనున్న చిత్రవిచిత్రాలను పైకి కనబడనివ్వదు. చూచేవాళ్లకు కేవలం వెలుతురూ నీడా తప్ప మరేమీ లేదు అనిపిస్తుంది.

ప్రాణంతో ఉన్న గ్రహంచుట్టూ ఉన్నట్టుగా, నాచుట్టూ కూడా ఒక ఐడియాలమండలం, భావాలమండలం, ఉన్నది అనుకుంటాను. అయితే నేనూ—నేనుకోరేదిమాత్రమే కాను, నేనుఅనుకొనేది మాత్రమే కాను, నేనునిశ్చయించుకున్నది మాత్రమే కాను. నాకు ఇష్టంలేనిదీ, నేను కోరనిదీ, నాలో చాలా ఉన్నది. నేను పుట్టకముందే నన్ను సృష్టించడం అయిపోయింది. ఎంచి నన్ను నేను తీసుకోలేదు. అందుచేత ఇప్పుడు నా చేతికి దొరికినదానితోనే పని నడిపించాలి.

మహాపురుషులు అనదగినవాళ్లు క్రూరులుఅయితీరుతారు. ఇది నాకు బాగా తెలుసును. న్యాయం సామాన్యుల ధర్మం; అన్యాయం అసామాన్యుల ధర్మం. మామూలునేల అంతా ఒక్కసదునుగా ఉంటుంది; నిప్పుకొమ్ములతో అగ్ని పర్వతం పొడిచినప్పుడు ఎత్తుగా లేస్తుంది. చుట్టుపక్కలకు ఏమిఅన్యాయమయిపోతుందో అని కాదు దాని ఆలోచన—దానికి కావలసినదంతా తన సంగతే. సంపూర్ణమైన అన్యాయపరత్వమూ, నిష్కళంకమయిన క్రౌర్యమూ, వీటివల్లతప్ప మరిదేనివల్లా మనుష్యులుగాని, జాతులుగాని, ఈరోజువరకూ లక్షాధికార్లు కాలేదు; రాజ్యాధికారాలు సంపాదించ లేదు.

నేను ఈ అన్యాయమంత్రం ప్రచారంచేస్తాను; అన్యాయమే మోక్షానికి మార్గంఅని అందరితో చెపుతాను. అన్యాయం ఒక అగ్నిజ్వాల వంటిది—అగ్నిలో ఎప్పుడూ ఏదోఒకటి వచ్చి పడుతుండకపోతే, తనుతానే దగ్ధంచేసుకొని భస్మం-

అయిపోతుంది. అన్యాయంచేసేశక్తి లేనివాళ్ల గతి ఈ పృథ్వి-యొక్క చింకిచాటే!

ఇదయినా నా ఐడియా మాత్రమే, పూర్తిఅయిన నేను కాదు. "అన్యాయం" "అన్యాయం" అని ఎంతబడాయి కొట్టుకున్నా నేను కప్పుకున్న భావాల కాలువలో ఒక చిన్న రంధ్రం ఉన్నది, చిన్న చిరుగు. దానిలోనుంచి ఒక విధమైన వస్తువు పైకి వచ్చేస్తుంటుంది. ఆ వస్తువు చాలా మెత్తనిది, అతి సున్నితమయినది. నాలో చాలాభాగం నాకంటేముందే తయా-రయిపోయింది, అందుచేతనే మధ్యమధ్య ఇటువంటిది జరుగు-తుంటుంది.

అప్పుడప్పుడు నా శిష్యుల క్రౌర్యం పరీక్షచేస్తూఉండే-వాడను. ఒకనాడు వనభోజనానికని అందరం వెళ్లాము. ఆదగ్గిర ఒక మేక మేస్తూఉంది. వెనకనుంచి వెళ్లి ఈ కత్తి పుచ్చుకొని దాని వెనకకాలు నరికి ఎవరు తీసుకురాగలరు అని, వాళ్లందరితో అన్నాను. అందరూ ముందూ వెనకా అవుతూఉంటే, నేనే వెళ్లి కాలు నరికి తీసుకువచ్చాను. అదిచూచి అందులో ఒకడు మూర్ఛపడిపోయినాడు. ఎటువంటి చలనమూలేని నా ముఖం చూచి అందరూ నిర్వికారపురుషుడు, మహాత్ముడు, అంటూ నా పాదధూళి తీసుకున్నారు. అనగా, వాళ్లంతా ఆనాడు నా భావాల ఆవిరిమండలం మాత్రమే చూచారు. నాతప్పేమీ లేకుండా, కేవలం భాగ్యదోషంవల్ల నాలోఉన్న మెత్తదనమూ,

దయా, బలహీనతా, గుండెబద్దలుకావడమూ, ఇవేవీ వాళ్లకు కనబడనే లేదు. ఇవి లోపున దాగిఉండడమే మంచిది.

విమలానిఖిలుల విషయమయినది, ఒక కొత్తఅధ్యాయం నా జీవితచరిత్రలో తయారుఅవుతున్నది. అందులోకూడా బయటికి స్పష్టంకానిది చాలా ఉన్నది. ఈ భావాలగోల నాలో లేకపోతే ఏమీ మాటపడిఉండకపోను. నా ఐడియా తనకోరిక ప్రకారం నా జీవనాన్ని నడిపిస్తూఉంది. కాని నా జీవనమంతా ఆ కోరికే కాదు; అందులో చాలాభాగం ఆకోరికకాని పై వస్తువు. ఇది నా కోరికతో పూర్తిగా కలియదు. అందుచేతనే దాన్ని దాచీమూసీఉంచాలని అంతప్రయత్నం చేస్తుంటాను—లేకపోతే అది పైకివచ్చి నా ప్రయత్నాలన్నిటినీ మంటగలిపేస్తుంది.

జీవనం అనేది ఒక స్పష్టమైన వస్తువుకాదు; అన్యోన్య విరుద్ధమయిన వస్తువులు అనేకం కలిసి జీవనంఅనేది ఏర్పడుతున్నది. మనము—'ఐడియావాలాలము,' 'భావాలరాయుళ్లము,'—ఐడియా ఐడియా అంటూ కూర్చుంటాము; జీవనాన్ని పట్టుకొని ఏదో ఒక అచ్చులోకి దింపుదామని ప్రయత్నిస్తుంటాము; దానికి ఏదోఒక ఆకారం ఇచ్చి స్పష్టంగా కనబడే వస్తువుగా చేదామని మన ప్రయత్నం. జీవనం సఫలంకావడమంటే అటువంటి స్పష్టతను పొందడమే అని మన అభిప్రాయం. పూర్వం దిగ్విజయం చేసిన సికందర్ మొదలు ఈనాటి కోటీశ్వరుడు, అమెరికాదేశస్థుడు, రాక్ ఫెలర్ వరకూ, ప్రతి

మనుష్యుడూ తనకు ఒక స్పష్టమయిన ఆకారం ఇచ్చుకోకపోతే జీవనం వ్యర్థం అయిపోతుందని, ఏదో ఒక అచ్చులో తనను పోసుకుంటున్నాడు. ఒకడికి వచ్చినఅచ్చు కత్తి, మరిఒకడికి బాగున్నది రూపాయి. ఆ ఆ స్వరూపాలు సంపాదించి జీవితం సఫలమయిందని సంతోషిస్తున్నారు.

ఈ విషయంలో నాకూ మా నిఖిల్‌కీ వాదన—"నిన్ను నీవు తెలుసుకో" అని అతను అంటాడు, "నిన్ను నీవు తెలుసుకో," అని నేనూ అంటాను. కాని 'నిన్ను నీవు తెలుసుకోలేదు' అనే జ్ఞానం సంపాదించడానికే "తెలుసుకోవడం" అని అతనుఅంటాడు. అతను చెప్పేదానినిబట్టి 'తెలుసుకోవడం' అంటే "తెలుసుకోలేకపోవడం" అని తేలుతుంది. "నీమతం ప్రకారం, 'ఫలంపొందడం' అంటే నిన్ను, అనగా నీ ఆత్మను, నష్టపోయి ఫలంపొందడం, గాని ఫలంకంటే నీ ఆత్మ ఎంతవిలువైన పదార్థమో అది తెలుసుకోకుండా ఉన్నావు" అని నిఖిల్ చేసే వాదం.

"నీ మాటలు చేతికి దొరకవు; మేఘంలాగు తప్పించుకు పోతాయి," అని నేను అన్నాను.

"దానికి నేనేమి చేయగలను?" అన్నాడు నిఖిల్. "ఇనుముతో చేసిన యంత్రం కాదు జీవనం, స్పష్టంగా కనబడడానికి. యంత్రాన్ని చూడగలిగినట్టు చూస్తేనే జీవనాన్ని తెలుసుకున్నట్టూ, లేకుంటే లేనట్టూ అని నేను ఒప్పుకోను.

అలాగునే, ఫలంలాగు స్పష్టంగా కనబడేవస్తువుకాదు ఆత్మ. ఫలంలోనే పూర్తిగా ఆత్మను చూడడం, ఆత్మను నిజంగా చూడడం అని నేను ఒప్పుకోను."

"అయితే ఎక్కడున్నది ఆ చిత్రమైన వస్తువు, ఆ ఆత్మ? ముక్కుకొసనా! కనుబొమ్మలమధ్యనా?"

"తనను అనంతమని తెలుసుకున్న దగ్గిరే ఉన్నది ఆత్మ. ఫలాన్ని నిరాకరించినదగ్గిర ఉన్నది ఆత్మ. ఫలాన్ని దాటి చాలాదూరం వెళితేనేగాని ఆత్మ దొరకదు."

"సరే, అదంతా నిజమే కావచ్చును, గాని దేశసేవకీ దానికీ సంబంధం ఏమిటి? దేశసేవవిషయంలో నీవు అనేది ఏమిటి?"

"దేశసేవలోకూడా నే ననే మాట అదే. 'నాకు కావలసింది నా మాటే,' అని దేశం అన్నట్టయితే దేశం ఫలం పొందవచ్చును గాని ఆత్మను పోగొట్టుకుంటుంది. ప్రపంచంలో ఉండే అన్నిటిలోకీ విలువైనదానిని అన్నిటికంటె గొప్పదానిగా ఆదరిస్తూఉంటే, దేశం ఫలంపొందకపోవచ్చును, గాని ఆత్మను మాత్రం పోగొట్టుకోదు."

"దేశచరిత్రలలోగాని మనుష్యుల చరిత్రలలోగాని దానికి నిదర్శనంగా ఏమైనా చూపించగలవా?"

"మనుష్యుడు అంటే సామాన్యుడు కాదు. ఫలం అంటే ఎటువంటి నిర్లక్ష్యమో దృష్టాంతమన్నా అటువంటి

నిర్లక్ష్యమే. నేననేదానికి దృష్టాంతాలు లేవు బహుశా— విత్తులో పువ్వుదృష్టాంతం లేనట్టుగానే. కాని విత్తులో పువ్వుకోసమని వేదనఉన్నది. అలాగని దృష్టాంతాలు లేనే లేవనుకున్నావా ? బుద్ధుడు శతాబ్దాలతరబడి మనచేత ఏ సాధనచేయిస్తూ మన దేశాన్ని మెలకువగా ఉంచాడో అది ఫలంకోసంచేసిన సాధనా?”

నిఖిల్ అనే మాటలు నాకు ఏమీబోధపడకపోలేదు— అదే వచ్చిన చిక్కంతా. నాపుట్టుకకూడా భారతవర్షంలోనే, రక్తంలోఉన్న సాత్వికవిషం పూర్తిగా చావనంటుంది. ‘తనకు మాలినధర్మం’ కంటే పిచ్చితనం లేదని నోటివెంట ఎంతగట్టిగా అంటూఉన్నా పూర్తిగా వదలడంమాత్రం సాధ్యంకానిపని. అందుచేతనే మనదేశంలో ఈ రోజులలో చాలా అద్భుతమైన వ్యవహారాలు జరుగుతూఉన్నవి. ఒకపక్కనుంచి దేశము, ఇంకొకపక్కనుంచి మతము—ఈ రెండిటిపల్లవీ ఒక్కమాటు పాడుతున్నాము, మూడోస్థాయిలో! భగవద్గీత, వందేమాతరం —రెండూ ఒక్కమాటు కావలెను మనకు. దానివల్ల ఇదీ స్పష్టంగా తెలియదు అదీ స్పష్టంగా తెలియదు. బ్యాండు వాయిద్యము సనాయి వాయిద్యము—రెండూ ఒక్కమాటే జరుగుతున్నా, ఆ సంగతి మనము తెలుసుకోలేకుండా ఉన్నాము. ఈ అపస్వరవ్యవహారం ఇటుపైని మరి జరగకుండా చేయడమే నా జీవితంయొక్క ముఖ్యోద్దేశం. నాకు కావలసినది బ్యాండువాయిద్యం. సనాయి మనను పూర్తిగా నాశనం చేసింది.

మాతల్లి ప్రకృతిదేవి, ఆ మహాశక్తి, వాంఛను జయపతాకంగా చేసి, దానిని మాచేతిలో పెట్టి, మమ్మల్ని రణక్షేత్రానికి పంపించింది. ఆ పతాకం చూచి మేము సిగ్గుపడము; దానికి సిగ్గుతెప్పించే పనులు చేయము. వాంఛ సుందరమైనది, వాంఛ పరిశుభ్రమైనది, నిర్మలమైనది. అది బురదనేలనుపుట్టే కలువపువ్వు —సబ్బుతో ముఖంకడుక్కుందామని మాటిమాటికి స్నానాల గదిలోకి పరిగెత్తదు.

నా జీవనాన్ని విమలలో ఎందుకు చిక్కుకోనిస్తున్నాను? ఈప్రశ్న కొన్నాళ్ళబట్టీ నన్ను చికాకు పెడుతున్నది—కాలు-వలో కొట్టుకుపోతూఉన్న కర్రముక్కనుకాను కదా, ఏది అడ్డుగా ఉంటే దానినే అంటుకొని ఉండిపోడానికి!

కాని ఇదివరకే చెప్పిఉన్నాను—ఏదో ఒక్క-ఉద్దేశమే మనస్సులో పెట్టుకొని మనుష్యుడు తన జీవనాన్ని ఆ అచ్చులోకి దించి, అణిచిపెట్టి ఆలాగు ఉంచుదామని ప్రయత్నించినా, లొంగిఉండే వస్తువుకాదు, జీవనం—పొంగి పైకి పోతుంది. జీవనం, సహజంగా మధ్యమధ్యను, ఒక్కొక్కవిసురు విసురు-తుంటుంది, పక్కనుంచి తన్నేస్తుంటుంది. అటువంటి పెద్ద విసురు ఒకటి నా జీవనంలో ఇప్పుడు లేచింది.

విమలను కోరుతున్నందుకు నాకు ఎటువంటిదొంగసిగ్గూ లేదు. ఆమె నన్నుకోరుతున్నదని స్పష్టంగా కనబడుతున్నది; ఆమె నాదేనూ, దానికేమీ సందేహంలేదు. కాదనంటుకొని

చెట్టున వేలబడుతున్నది పండు, నిజమే! కాని అందుచేత శాశ్వతంగా ఆ కాడదేనా హక్కు? ఆ పండులో ఉండే మాధుర్యమూ, రసమూ, నావి; తనను పూర్తిగా నా చేతికి అందజేసుకోవడమే దాని సార్థకత, అదే దానిధర్మం. అందుచేత దానిని తెంపి తీసుకువస్తాను; దానిని వృథాకానివ్వడం తప్పు.

కాని నేను గొప్పచిక్కులో తగులుకున్నాను. నామీాద విమల ఒక పెద్ద పూచీఅయి కూర్చున్నది—ఇది నాకు జ్ఞప్తికి వచ్చి చికాకు వేస్తుండేది. అధికారం చలాయించడానికి నేను ఈభూమిమీాదికి వచ్చాను—మాటలలో అందరికీ అధికారిగా ఉంటాను; పనులలో అధికారిగా ఉంటాను. ఈ లోకంలోఉన్న జనసమూహమే నా యుద్ధపుగుర్రం. దాని వీపుమీాద నా ఆసనం, నా చేతిలో దానికళ్లెం—దానికి తెలియదు ఎక్కడికి వెళుతున్నదో, ఒక్క-నాకుమాత్రం తెలుసును. కాళ్లకు ముళ్లు గుచ్చుకుంటాయి, ఒళ్లు బురదతో నిండిపోతుంది, అయినా ఆలోచిస్తూ కూర్చోనివ్వను, ఒక్క వరసను పరిగెత్తిస్తాను.

ఇప్పుడు ఆ గుర్రం నా వాకిట నిలబడి బయలుదేరడానికి కొట్టుకుపోతూఉంది; డెక్కలతో నేల గోకుతూఉంది, దాని సకిలింపుతో ఆకాశమంతా వణుకుతూఉంది. కాని అటువంటప్పుడు నేను చేస్తున్నదేమిటి? దేనితో నా రోజులు గడుపుతున్నాను? అవతలశుభదినం గడిచిపోతుందే!

నేను ఒక తుపాను మాస్టరు; తుపానులాగు అతివడిగా పరిగెత్తగలను అని అనుకొనే వాడను. దారిపక్కనున్న పువ్వులు తెంచి, అవి చీల్చి, దారినిండా చల్లేసి, వాటిని తొక్కుకుంటూ వెళిపోగలను, అవి నాకు అడ్డురావు, నా మనస్సుకు బాధకలుగజేయవు, అనిఅనుకున్నాను. అటువంటిది —ఇప్పుడు పువ్వుచుట్టూ తిరుగుతూ ఉండిపోయినాను, తుమ్మెదలాగు—తుపానులాగు కాదు.

నేనన్నట్టుగా, నా ఉద్దేశాలతో రంగువేయగా తయారైన నేను, పూర్తిగా నా ఉద్దేశాలుచేసిన సరుకును కాను; ఆ రంగు ప్రతిచోటా బాగా అంటదు—నాలోఉన్న మనుష్యసామాన్యుడు, హఠాత్తుగా చూస్తే కనబడిపోతూ ఉంటాడు. ఎవడైనా ఒక అంతర్యామి నా జీవనవృత్తాంతం వ్రాసినట్టయితే, నాకూ మూఢుడైన ఆ పంచూకీ అట్టే భేదం లేదని కనబడు తుంది—నాకూ పంచూకీ అన్నమాటేమిటి, నాకూ నిఖిల్ కీ మాత్రం ఉన్నదేమిటి!

నిన్నటిరాత్రి నా స్వీయచరిత్ర వ్రాస్తూఉన్న పుస్తకం తీసి మధ్యఎక్కడో చదువుతున్నాను. అప్పుడే బి. ఏ. పాస్ అయినాను. ఫిలాసఫీతో బుర్ర పగిలిపోతూఉంది. అప్పటినుండీ శపథంపట్టి కూర్చున్నాను—నేను కల్పించుకున్న మాయకుగాని ఇతరులు కల్పించిన మాయకు గాని, నా జీవనంలో స్థలం ఇవ్వను, అని. అడుగునుంచి మీదిదాకా నా జీవనం పూర్తిగా నిగ్గయిన వాస్తవముతో కట్టుకుంటానని నిశ్చయించుకున్నాను.

కాని అప్పటినుండి ఇప్పటివరకూ నా జీవితచరిత్రలో కనబడు-తున్న దేమిటి? నేను అనుకున్న చిక్కని నేత ఏదీ? వలదారంలాగు, దారమేమో ఒకటే, ఒకచివరనుంచి ఇంకొక చివరవరకూ; గాని ఉన్నవన్నీ కన్నాలే దారం ఆక్రమించిన జాగాకంటే కన్నాలజాగా అనేకరెట్లు అధికం. ఈ కన్నాలతో ఎంతో పోట్లాడాను, గాని అవిమాత్రం పూర్తిగా చావ-నంటాయి. ఈమధ్య కొన్నాళ్లు, "భేష్ ఇప్పుడు అంతా బాగా జరుగుతున్నది," అని అనుకొని సంతోషించేసరికి కొత్తది ఒక పెద్ద రంధ్రం తయారు అయింది.....నామనస్సు మెత్తనయి-పోయింది, చిన్న చిన్న వాటిని చూచి బాధపెట్టుకుంటున్నాను.

"అది నాకు కావాలి, నాచేతిదగ్గిరికి వచ్చి ఉన్నది, నేను దాన్ని తెంపితీసుకుంటాను," — ఇది స్పష్టమయిన మాట, తిన్ననిదారి. ఈ దారిని వెళ్లినవాళ్లకే సిద్ధికలుగుతుందని నేను ఎంతకాలంనుంచో చెపుతూవచ్చాను. కాని దేవేంద్రుడు నా తపస్సు సులభంగా జరగనిచ్చాడుకాదు—ఎక్కడనుంచో ఒక అప్సరసను పంపుతాడు, కనికరం అనే అప్సరసను; సాధకుని కళ్లు నీటితో నింపుతుంది, స్పష్టంగా కనబడకుండా చేస్తుంది.

పాశంలో తగులుకున్న లేడిలాగు విమల కొట్టుకుంటూ ఉంది. ఆ పెద్దపెద్ద కళ్లురెండిటినిండా భయం; చూస్తే జాలి పుడుతున్నది. పాశం తెంచుకొని పారిపోబోయేసరికి ఒళ్లు తెగిపోతూఉంది. ఇదంతా చూస్తున్నకొలదీ వ్యాధుడికి మరింత సంతోషంగా ఉంటుంది. నాకు సంతోషంగానూ ఉన్నది,

బాధగానూ ఉన్నది. అందుచేతనే జాలంచేసేస్తున్నాను, త్వరగా పాశం బిగించేయలేకుండా ఉన్నాను.

రెండుమూడుమార్లు మంచి వీలయిన సమయం దొరికింది—అప్పుడు పరిగెత్తివెళ్లి, విమల చెయ్యి పట్టుకొని తీసుకొని వచ్చి, నా ఒళ్లో కూర్చోబెట్టుకుంటే విమల ఒక్కమాట అనలేకపోయి ఉండును. ఏదోఒక విపరీతం జరగబోతున్నదిఅనీ, అది జరిగిన తరువాత ఈ ప్రపంచంలోనున్న ప్రతిదాని అర్థమూ ఒక్కమాటు మారిపోతుంది అనీ, ఆమెకు బోధపడ్డది. ఆ అనిశ్చితమనే గుహాముందర నిలబడిఉన్నప్పుడు ఆమెముఖం తెల్లబారిపోయింది; కళ్లురెండూ, ఒక విధమైన భయంవల్లా, లోపునపుట్టిన ఉద్దీపనవల్లా, ప్రకాశించడం ప్రారంభించాయి. ఈ ఒక్కక్షణంలో ఏదోఒకటి నిశ్చయం అయిపోతుంది అని, స్వర్గమర్త్యపాతాళలోకాలు ఊపిరైనా తీయకుండా నిలుచొని చూస్తున్నవా అనిపించింది. కాని ఆ ముహూర్తం నా చేతిలోనుంచి జారిపోనిచ్చాను. ఎటువంటి సంకోచమూ లేకుండా బలంఉపయోగించి, పూర్తిగాస్థిరపడనిదానిని స్థిరపరచలేకపోయినాను. ఇంతకాలమూ నా స్వభావంలో దాగొనిఉన్న అడ్డన్నీ ఇప్పుడు పైకివచ్చి నా దారిలోని అడ్డయినాయి.

రామాయణానికి నిజమైన నాయకుడని నేను నమ్మే రావణుడుకూడా ఈలాగునే చచ్చిపోయినాడు. అతను సీతను తన అంతఃపురంలోకి తీసుకువెళిపోకుండా అశోకవనంలో ఉంచాడు. అటువంటి మహావీరునిలోకూడా లోపున ఎక్కడో

మైత్రినిజాగా ఒకటి ఉండేది; అదే అతని సంకోచానికి కారణం; దానివల్లనే లంకాకాండమంతా అలాగు వ్యర్థంఅయిపోయింది. ఆ సంకోచం లేకపోతే సీత 'సతి' అన్న పేరు వదులుకొని, రావణుని పూజచేస్తూఉండును. అతను విభీషణుని చంపకపోవ-డానికికూడా ఆ మైత్రిదనమే కారణం. విభీషణుని దయతో చూచినఫలం ఏమిటి?—తాను ఎవరిని చంపవలసిఉండెనో అతనివల్ల తాను చావడం.

అక్కడే ఉన్నది జీవనంలోఉండే ట్ర్యాజెడీ—హృద-యంలో ఎక్కడో ఒక కిందిఅంతస్తులో అతి చిన్నదయి దాగొని ఉరిటుంది, ఎప్పుడో ఒకనాడు లేచి అంతా నాశనం చేసేస్తుంది. తాను అనుకున్నలాంటివాడు కాదు మనుష్యుడు; అందుచేతనే జరగకూడనివి సంఘటిస్తుంటాయి.

నిఖిల్ చాలా చిత్రమయిన మనిషి—అతనినిచూస్తే నాకు ఎంతనవ్వు వచ్చినా అతను నా స్నేహితుడనిమాత్రం ఒప్పుకోక తీరదు. మొట్టమొదట నిఖిల్‌మాట నేను ఏమీ ఆలోచించనేలేదు; గాని రానురాను అతనిమాట జ్ఞాపకం వచ్చి సిగ్గువేస్తుండేది, మనస్సుకు బాధకలిగేది. మునపటిలాగు కూర్చొని అతనితో మాట్లాడదామనీ, వాదనచేదామనీ, వెళ్లే-వాడను, గాని ఆ ఉత్సాహము బలవంతాన తెచ్చుకున్నది, అతి అస్వాభావికంగా ఉండేది. ఆఖరుకు ఎన్నడూచేయనిది కూడా చేసేదాకా వచ్చింది—అతని అభిప్రాయాలు నాకు అంగీకారం అని నటించేవాడను. కాని ఈ కపటం నాకూ కష్టం

అనిపించేది, నిఖిల్‌కి కష్టంగానే ఉండేది. ఈ విషయంలో మాత్రం మా ఇద్దరిదీ ఒక్క స్వభావమే.

అందుచేత అప్పటినుండి నిఖిల్‌ని తప్పించుకు తిరుగుతుండేవాడను; ఏలాగో ఒకలాగు, అతను కనబడకపోతే బ్రతుకుతాను అనిపించేది. ఇవన్నీ దార్బల్యము యొక్క లక్షణాలు. అపరాధం అనేది ఒక భూతం—నమ్మినంతమాత్రాన నిజమైన వస్తువయి కూర్చుంటుంది; తరవాత నమ్మను అని ఎంతచెప్పినా, మెడపట్టుకొని వదలదు. 'మన చుట్టూ జరుగుతున్నది నిగ్గయినదనీ, వాస్తవం అనీ తెలుసుకోవలెను; నిజమైన స్నేహానికి సత్యంవల్ల ఎటువంటి ముప్పూ రానివ్వ-కూడదు,' అనే మాట నిఖిల్‌కు, సంకోచంవిడిచి నచ్చజెప్పాలని నా కోరిక.

నాలో దార్బల్యం ప్రవేశించింది—అది ఒప్పుకోక తీరదు. ఈ నా దార్బల్యం చూచి విమల నన్ను మోహించలేదు. సంకోచంలేకుండా ప్రవర్తిస్తూఉండే నా పౌరుషంచూచి, ఆ మంటలో తన రెక్కలు కాల్చుకున్నది. నా చుట్టూ పొగకమ్మినట్టయితే విమల మనస్సు తడబడడం ప్రారంభిస్తుంది; ఆమెమనస్సులో అసహ్యం పుడుతుంది; నా మెడను వేసిన స్వయంవరమాల తిరిగి తీసుకోలేదు నిజమే, గాని అది చూడలేక కళ్లుమూసివేసుకుంటుంది.

కాని వెనకకు వెళ్లడానికి దారి మరి లేదు. నాకూ లేదు, విమలకూ లేదు. విమలను విడిచిపెట్టి వెళిపోడానికి తగిన బలం

నాలో కనబడలేదు. అలాగని చెప్పి, నా అసలుదారి వదులుకో లేను. లోకంలో ఉండే జనసమూహాంమధ్యనుండి నా దారి, ఈ అంతఃపురం-వెనక-తలుపుదారి కాదు. నా "స్వదేశీ"ని నేను వదులుకోలేను—ముఖ్యంగా ఇప్పుడు. అందుచేత విమలను 'స్వదేశీ'తో ఏకంచేసేస్తాను. పశ్చిమంనుండి వచ్చిన తుపానుగాలి తగలగానే స్వదేశలక్ష్మి తలమీదనున్న న్యాయాన్యాయాల ముసుగు ఎగిరిపోయింది; ఆపశ్చిమతుపానే విమల వేసుకున్న పెళ్లికూతురు-ముసుగు తీసేస్తుంది—ఆలాగు తీసేయడంలో ఆమెకు అగౌరవం ఉండదు. జనసముద్రంలో కెరటాలమీద ఊగుతుంది ఓడ, మీద వందేమాతరం-జయపతాకం ఎగురు-తుంది—నాలుగువైపులా సముద్రపుపొంగూ, గర్జనలూ. నా శక్తి, నా ప్రేమా, రెండూకలిసి ఆ ఓడలో ఉయ్యాల ఊగుతాయి. అందులో ఒక గొప్ప ముక్తిస్వరూపం విమలకు కనబడుతుంది—అది కనబడుతూనే ఆమెబంధాలన్నీ, తనకు తెలియకుండానే, ఒక్కమాటుగా తెగిపోతాయి; తెగిపో-యినందుకు ఆమెకు ఎటువంటిసిగ్గూ ఉండదు; ఆ మహా ప్రళయంయొక్క రూపు చూచి విమల మోహపరవశం అయిపోతుంది; తరువాత ఎటువంటి క్రూరకృత్యాలు చేయడానికీ వెనకతీయదు. ప్రకృతికి స్వభావసిద్ధమైనక్రౌర్యము అతిసుందరమైన ఒక మహాశక్తి; ఆశక్తే ఈ పృథ్వీని సుందరంగా ఉంచుతున్నది; ఆశక్తే విమలలో నాకు కనబడ్డది. పురుషులు కల్పించిన బంధాలనుంచి స్త్రీలకు ముక్తి దొరికితే కాళికాదేవిని

పృథ్విమీాదనే సాక్షాత్తు చూడగలము—ఆ దేవికి సిగ్గులేదు, ఆమె నిర్దయురాలు. నేను ఆ కాళీ ఉపాసకుడను; ఒకనాడు విమలను ఆ మహాప్రళయంలో నిలుచోబెట్టి పూజచేస్తాను. ఆ ప్రయత్నంమీాదనే ఉంటాను ఇక.

# నిఖిల్ కథ

భాద్రపదమాసము. నాలుగువైపులాజలసమృద్ధి, భూమి కలకల్లాడుతున్నది. లేత చేలు నిగనిగలాడుతూ పసిపిల్లడి ఒళ్లులాగున్నవి. ఏటి నీరు మా ఇంటితోట వరకూ వచ్చింది. ప్రాతఃకాలపు సూర్యకిరణాలు భూమిమీద అన్నివైపులా వ్యాపించి ఉన్నవి—నీలాకాశం తన ప్రేమను ఈ విధంగా వ్యక్తపరుస్తున్నదా అనిపించింది.

నాకు సంగీతం రాదెందుకు? కాలువలో నీళ్లు జలజల్లాడుతున్నవి; చెట్లను ఆకులు జిగజిగ మెరుస్తున్నవి; వరిచేలలో అలలు కులుకుతున్నవి; తోటా పొలాలూ మనోహరమైన కాంతితో ప్రకాశిస్తున్నవి;—ఈ ప్రభాతసంగీతం అంతటిలో నేను ఒక్కడనే మూగవాడను. సంగీతం నాలోనుంచి బయటికి రాదు, విశ్వమంతటి ఉజ్వలతా నాలోకి వచ్చి అక్కడ ఆగి పోతున్నది, నాలోనుంచి మరి ప్రతిఫలించకుండా ఉన్నది, నాలోనున్న ఈ మాటరాని, దీప్తిలేని 'నన్ను,' నేను చూచుకున్నప్పుడు నాకు బోధపడుతున్నది—నాకు ఈ నిండుపృథ్విలో లేమి ఎందుకు ప్రాప్తించిందో. రాత్రింబగళ్లూ నాదగ్గిరనే ఎవరైనా ఏలాగు ఉండగలరు?

విమలలో ప్రాణం ఉన్నది; ఆమె ఉత్సాహంతో నిండి ఉన్నది; గనుకనే ఇప్పటికి తొమ్మిది సంవత్సరాలయినా, ఒక్క

నిమిషంపాటైనా ఆమె నాకు పాత అనిపించలేదు. కాని నాలో ఉన్నది నోరు లేనిది—లోతు ఉండవచ్చును గాని అది మూగలోతు; కలకలధ్వనితో నిండిన ఆవేగము నాలో లేదు. గ్రహించడం మాత్రం నాకు చేతనవును గాని ఇతరులలో ఎటువంటిచలనమూ పుట్టించలేను. నేను పుచ్చుకోగలను గాని ఇవ్వలేను. నాతో ఉండడం ఎవరికైనా కేవలం ఉపవాసంవంటిదే. విమల ఇన్నాళ్లూ ఎటువంటి కరువులోపడి కొట్టుకుంటుండెనో ఇప్పుడు ఆమెను చూచి బోధపరుచుకుంటున్నాను. కాని ఎవరిని నిందించగలను?

మోహజనకము భాద్రపదమిది,
ముసురు మెండుగఁ బట్టియున్నది!
ఔర! నాదగు మందిరబిది
అన్నివిధముల శూన్యమైనది!

నామందిరం శూన్యంగా ఉండవలసినదే, అందుకని కట్టినదే అది; దానితలుపులు ఎల్లప్పుడూ మూసే ఉంటాయి. నా దేవత ఆ మందిరంబయిటనే కూర్చొని ఉన్నది—ఈనాటివరకూ నాకు తెలియలేదు. నా పూజఅందుకొని నాకు వరంఇచ్చిందనే అనుకుంటుండే వాడను. కాని,

నాదగు మందిరంబిది
అన్నివిధముల శూన్యమైనది!

ప్రతి సంవత్సరమూ నాలుగు వైపులా ఈ నిండు యౌవనం కనబడుతుండే రోజులలో, శుక్లపక్షం చూచుకొని

మేమిద్దరమూ మా 'శామలద'సరస్సులో పడవమీద షికారు బయలుదేరేవాళ్లము. బహుళపంచమినాటివరకూ దానిలోనే ఉండి షికారు తిరుగుతుండేవాళ్లము; సంధ్యవెన్నెలకోసము మరి ఆశించకూడదు అన్నప్పుడు ఇంటికి తిరిగి వచ్చేసేవాళ్లము. నేను విమలతో అన్నాను—"పాటలో చరణానికిచరణానికీ పల్లవి వస్తుంటుంది. జీవనంలో మనకు వినబడే సమ్మేళన-గానానికి కూడా ఒకపల్లవి ఉన్నది. ఈపృథ్వీయొక్క బహిరంగప్రదేశం ఆ పల్లవి వినబడేజాగా. పచ్చనిభూమి, వెన్నెలలో, నీడను ముసుగుగావేసుకొని, ఏటి గట్టను దాగొని, వర్షపుగాలివల్ల ప్రవాహంలోపుట్టిన కలకలనినాదందొంగతనంగా వింటూఉండే చోట వినబడుతుంది, ఆపల్లవి. అక్కడ స్త్రీపురుషుల మొదటి సమ్మేళనము జరిగింది, గోడలతోకట్టిన గదులలో కాదు. అందుచేతనే మొట్టమొదట ఈ పల్లవి వినబడ్డ సృష్టియొక్క బహిరంగంలోకి సంవత్సరానికి ఒక పర్యాయం వస్తూఉండే వాళ్లము. కైలాసంలో పార్వతీపరమేశ్వరుల సంయోగం అటువంటిదే, మానస సరస్సులో పద్మవనంలో పూర్వం జరిగిన సంయోగం అది.

నాపెళ్లిఅయాక రెండుసంవత్సరాలు కలకత్తాలో పరీక్ష గొడవతో అయిపోయింది. ఆతరవాత తక్కిన ఏడుసంవత్స-రాలూ, వికసించిన తెల్లకలవలమధ్యను, మేము నీటిలో కల్పించుకున్న ఇంటిముందు ప్రతిభాద్రపదమాసంలోనూ, చంద్రుడు తన శంఖం ఊదుతుండేవాడు. నా జీవితంలో ఒక సప్తకం

ఈ విధంగా గడిచింది. ఇప్పుడు రెండో సప్తకం ప్రారంభం అయింది.

భాద్రపదమాసంలోని ఆ శుక్లపక్షం వచ్చింది. ఆ సంగతి మాత్రం నేను ఎన్నటికీ మరవలేను. అప్పుడే మూడురోజులు వెళిపోయినాయి, విమలకు జ్ఞాపకం వచ్చిందో లేదో నేను చెప్పలేను, గాని నాకుమాత్రం ఆమె జ్ఞాపకంచేయలేదు. అంతా నిశ్శబ్దం, సంగీతం అన్నమాట వినబడడం లేదు.

> మోహజనకము భాద్రమాసము,
>     కుంభ వర్షము కురియుచున్నది!
> కుంభ వర్షము మధ్యమందున
>     అహా! శూన్యము నా నివేశము!

విరహంవల్ల కలిగిన శూన్యంఅయితే ఆ ఇంట్లో సంగీతం వినబడుతుంది. ఆ శూన్యమే మనస్సులలోఉన్న ఎడబాటువల్ల అయినదయితే అందులో ఎటువంటి సంగీతమూ ఉండదు. అందులో ఉండేది నిశ్శబ్దమే—అక్కడ ఏడుపుకూడా అపస్వరంగానే వినబడుతుంది!

ఈవాళ నా ఏడుపు అపస్వరంగా ఉన్నది. ఈ ఏడుపు ఆపేయాలి. నా ఏడుపుతో విమలను కట్టిపెట్టి ఉంచను—నేను అంత అధముడను కాకూడదు. ప్రేమ మిథ్యఅయినచోట, కన్నీరు ఆ మిథ్యను కట్టిపెట్టి ఉంచకూడదు. నా దుఃఖము పైకి వెల్లడిఅవుతున్నంతకాలమూ విమలకు పూర్తిగా ముక్తిదొరకదు.

కాని విమలకు నేను సంపూర్ణమయిన ముక్తి ఇస్తాను, ఇవ్వలేనంతసేపు ఈ మిథ్యలోనుంచి నాకూ మోక్షం లేదు. ఆమెను నాతో కట్టి ఉంచేకోవడం నన్ను నేనే మాయ జాలంలో పడేసుకోవడం. దానివల్ల ఎవరికీ ఎటువంటిశుభమూ కలుగదు; సుఖంలేదు—ఆ మాటచెప్పనక్కరనే లేదు. విడుదలచేసేయాలి; విడుదలపొందాలి. మిథ్యనుండి విడుదల దొరికితే అప్పుడు దుఃఖము ఒకమాణిక్యమయి మనస్సులో ఉంటుంది.

ఒక సంగతి బోధపడే ప్రాంతాలదగ్గిరికి ఇప్పుడు వచ్చాను అనిపిస్తూఉంది. స్త్రీపురుషులకు అన్యోన్యంగా ఉండవలసిన ప్రేమను, మనముఅందరముకలిసి ఊది రాజపెట్టి, బ్రహ్మాండంగా పెద్దదిచేశాము. ఆప్రేమ ఇప్పుడు, తనకు స్వాభావికంగా ఉండే అధికారాన్ని మించి, అనేకరెట్లు అధికం జాగా ఆక్రమించుకొని కూర్చున్నది. సమస్తమానవకోటిపేరున ఒక నమస్కారం చేసినా తిరిగీ అది వశంలోకి రాకుండాఉంది. ఇంటి దీపం ఇంటి నిప్పు అయిపోయింది. ఇక మరి దానికి ఆశ్రయం ఇవ్వకూడదు. దాన్ని అవమానపరిచే రోజు వచ్చింది. మన ఒంట్లోఉండే ఆవేగంతో చేసిన పూజ అనుభవించి అనుభవించి ఇప్పుడు అది ఒక దేవతారూపం ధరించి కూర్చున్నది. కాని మానవునికుండే పౌరుషమంతా బలిఇచ్చి దానిచేత రక్తపానంచేయించడం నాచేత కాదు, అటువంటి పూజ నేను ఎంతమాత్రం ఒప్పుకోను. వేషమూ ముస్తాబూ,

సిగ్గూ లజ్జా, మాటా పాటా, నవ్వూ ఏడుపూ__వీటిఅన్నిటినీ కలిపి అది పన్నిన మహేంద్రజాలాన్ని ముక్కముక్కలు చేసేయాలి.

కాళిదాసు వ్రాసిన "ఋతుసంహారం"మీద నాకు కావలసినంత అసహ్యం. భూమిమీద వ్యాపించిఉన్న ఫలసంపదా, పుష్పరాసులూ, కేవలం పంచబాణునిపూజకని ప్రేయసిపాదాల దగ్గిర పెట్టి, ఈ పృథ్వియొక్క ఆనందలీలను ఆ విధంగా ఏలాగు అవమానపరచగలిగాడు? ఎటువంటినిషాతో కళ్లు మూతలుపడిపోతున్నప్పుడు వ్రాశాడో! నేను ఇంత కాలమూ తాగుతున్న మదిరం అంతఎర్రనిదికాదు, గాని నిషాలో మాత్రం ఏమీ తీసిపోదు. ఆ నిషావాంఛతో ఉండబట్టే ఈవాళ ఉదయందగ్గిరనుంచీ, "ఆ పాట నన్నుపట్టి వదలకుండా ఉన్నది__

మోహజనకము భాద్రమాసము
ఆహా! శూన్యము నా నివేశము!

శూన్యమందిరమా! అలాగు అనడానికి సిగ్గువేయడం లేదూ? ఇంత పెద్ద మందిరం, నీకంటికి శూన్యమయిందీ! ఒక మాయను మాయఅని తెలుసుకున్నంతమాత్రాన ప్రపంచంలోఉన్న సత్యమంతా ఎగిరిపోయిందీ!

పుస్తకంఒకటి తెచ్చుకుందామని ఈవాళ ప్రొద్దున్నే పడకగదిలోకి వెళ్లాను. ఇప్పటికి ఎన్నాళ్లో అయింది, పగటి





పూట ఆ గదిలోకి వెళ్ళి, పగటివెలుతురులో ఆ గది చూచే-సరికి లోపున ఒకవిధంగా పుట్టిందీ—ఏమిచెప్పను! బట్టలస్టాండు మీద కుచ్చిళ్ళుపెట్టి నులిపిఉంచిన విమలచీర ఒకటిఉన్నది; తొడుగుకొని విడిచేసిన షెమీజొ ఒకటీ, జాకెట్టుఒకటీ, మూటకట్టి ఒకమూల పడిఉన్నవి; ఆ మూట చాకలివాడి-కోసమని ఎదురుచూస్తున్నది. అద్దం-టేబిల్ మీద హెర్-పిన్నూ, హెరాయిలూ, దువ్వెనా, సెంటుబుడ్డీ, వాటి-అన్నిటిమధ్యా కుంకం భరిణే. టేబిల్ కింద జరీపనిచేసిన చిన్న స్లిప్పర్లజత—మొట్టమొదట విమల ఎంతమాత్రం జోళ్లు తొడుక్కోనన్న రోజులలో, కాలేజీలో నాతో కలిసి చదువుకున్న స్నేహితుడు ఒకడుంటే అతనికివ్రాసి, లక్నోనించి తెప్పించాను అవి; మొదటినాడు అవి తొడుక్కొని గదిలోనుంచి వరండా లోకి వెళ్లేసరికే సిగ్గుచేత మరి నిలవలేకపోయింది. అప్పటినుండీ లెక్కలేనన్ని జోళ్లు వాడింది, గాని ఈ జతమాత్రం అతిశ్రద్ధగా దాచిఉంచింది. ఆ జోళ్లు తెప్పించినప్పుడు హాస్యంచేస్తూ అన్నాను, "నేను పడుకొనిఉన్నప్పుడు దొంగతనంగా నా పాదధూళి తీసుకొని నీవు నన్ను ఆరాధిస్తుంటావు, నేను మాత్రం నీవు పడుకొని ఉన్నప్పుడు పూజచేయను, మేలుకొని ఉన్నప్పుడు నీ పాదాలకు ధూళి అంటకుండా చేయడం నాపూజ."

"వెళ్లండి, మీరు మరీనూ!—చూస్తూఉండండి ఆలా-గైతే మీ జోళ్లు తొడుక్కుంటానేమో!" అన్నది విమల.

నా పడకగది ఇది—దానిలో ఒక చక్కని వాసన ఉన్నది; అది నా మనస్సు పోల్చుకుంటుంది, ఇంకెవరికీ కొట్టదు అనుకుంటాను ఆ వాసన. ప్రేమపిపాసతోనిండిన నా మనస్సు ఆ గదిలోఉండే నానారకాల చిన్నచిన్న వస్తువులమధ్యా, అతిసూక్ష్మమైనవేళ్లను తన్నిఉన్నది. అది, ఈవాళ అనుభవానికి వచ్చినట్లు, ఇంతకుముందెప్పుడూ రాలేదు. ముఖ్యమయిన వేర్లు-తెగిపోగానే ప్రాణానికి మోక్షం దొరుకుతుందనుకోను—ఈ చిన్న జోళ్లజతకూడా ఆప్రాణాన్ని పట్టి ఉంచాలంటుంది. లక్ష్మి వెళిపోయినా ఆ ముక్కలుముక్కలు అయిపోయిన పద్మంరేకులచుట్టూ మన మనస్సు తిరుగుతుంటుంది. ఇటూఅటూ చూస్తూఉంటే నా కళ్లు ఆగూటిమీద పడ్డవి. నా ఫొటో అలాగే ఉన్నది. చాలారోజులనాటి పువ్వులు ఎండి నల్లగా అయిపోయి దానిముందర పడి ఉన్నవి. పూజలో ఇంత మార్పు వచ్చినా ఆ బొమ్మముఖానమాత్రం ఎటువంటిమార్పూ లేదు. నాకు ఈ గదిలో ఈవాళదొరికిన పూజ, ఈ ఎండిపోయిన నల్లని పువ్వులుచేసే పూజే. వాటిని అవతల పారేసేపాటి శ్రద్ధ ఎవరికీ లేకపోవడమే, అవి ఇంకా ఈ గదిలో పడిఉండడానికి కారణం. ఏమికానీ, నాకు సత్యమే కావాలి—దానిది ఎండిపోయిన శరీరంకానీ, నల్లగామాడిపోయిన శరీరంకానీ, నాకుకావలసినది సత్యమే. ఆ గూటిలోఉన్న బొమ్మలాగు ఎన్నటికయినా నిర్వికారం కాగలనా అని చూస్తున్నాను.

అటువంటప్పుడు హఠాత్తుగా విమల వెనకనుంచి గది-

లోకి వచ్చింది. గభుక్కున అటువైపునుంచి కళ్లుతిప్పేసి బీరువా వైపు వెళుతూ అన్నాను, "ఏమియల్స్ జర్నల్ తీసుకు వెళదామని వచ్చాను." ఆ సమ్జాయిషీ ఎందుకు చెప్పానో నేనుచెప్పలేను. కాని నేను ఒక అపరాధిని అన్నట్టుగా నాకే అనిపించింది. అక్కడికి రావడానికి నాకు అధికారం లేదు అనిపించింది; దాచి ఉంచినవీ, నేను చూడకూడనివీ చూడడానికి వచ్చానా అనిపించింది. విమలవైపు చూడలేకపోయినాను; తొందరతొందరగా బయిటికి వచ్చేశాను.

బయిటిగదిలో కూర్చొని పుస్తకం చదువుదామని ప్రయత్నంచేశాను. కాని ఏమీ చదవలేకపోయినాను. మరే పనైనా చేదామాఅంటే మనస్సు దేనిలోకి తిప్పుకో లేకపోయినాను. ఏదైనా వినడానికి గాని, చూడడానికి గాని, మాట్లాడడానికి గాని బుద్ధిపుట్టలేదు. నా భవిష్యత్తంతా ఆ ఒక్క క్షణంలో ఒక పెద్దరాయిఅయి కదలకుండా నాగుండె మీాద కూర్చున్నది. సరీగా ఆసమయంలో 'పంచు' ఒక బుట్టతో బుట్టెడు బాగాముదిరిన కొబ్బరికాయలు తెచ్చి నాముందర పెట్టి నేలమీాదికి వంగి నమస్కారంచేశాడు.

"ఇదేమిటి పంచూ, ఇవెందుకు!" అన్నాను.

పంచు పొరుగుజమీాదారి ఇలాకా మనిషి. నా మాస్టరుగారిద్వారా నాకు పంచుతో పరిచయం అయింది. నేను వాడి జమీాదారును కాను. పైగా వాడు పేదలలో నిరుపేద; అందుచేత వాడిదగ్గిర ఎటువంటి కానుకా పుచ్చుకోవడానికి

నాకు అధికారం లేదు. తిండికిలేక అవస్థపడుతూ వేరే ఉపాయం కానక, పాపం, కానుక అని వంకపెట్టి నన్ను ఏమైనా అడుక్కుందామని వచ్చిఉంటాడు భవాంశా, అని అనుకున్నాను.

జేబులోనున్న మనీపర్సులోనుంచి రెండు రూపాయిలు తీసిఇవ్వబోయేసరికి, చేతులుజోడించి, "వద్దు మహాప్రభూ, క్షమించండి, నాకు అక్కరలేదు," అన్నాడు.

"అదేమిటిది పంచూ ?"

"అయితే చెపుతాను వినండి. తిండికిలేక చాలాబాధ-పడుతుండే రోజులలో ఏలినవారితోటలోనుంచి కొబ్బరి కాయలు దొంగలించి తీసుకుపోయినాను. ఏనాడు చచ్చి-పోతానో తెలియదు, ఋణం తీర్చేదామని వచ్చాను."

ఈవాళ ఏమియల్స్ జర్నల్ చదివినా నాకు ఏమీ లాభం లేకపోను గాని పంచు అన్న ఈ ఒక్కమాటా విని నా మనస్సుకు ఎంతో ఆనందంకలిగింది. స్త్రీపురుషుల సంయోగ-వియోగాలను దాటి చాలాదూరం వ్యాపించిఉంది ఈ పృథ్వీ. మానవజీవితం అతి విపులం. దానిమధ్యను కూర్చొని నా సుఖ దుఃఖాల పరిమాణం చూచుకోవాలి అనిపించింది.

పంచు మా మాస్టరుగారి భక్తులలో ఒకడు. వీడు ఏలాగుజీవనం గడుపుతున్నాడో అది నాకు తెల్సును. రోజూ ప్రొద్దున్నే లేచి తమలపాకులూ, మసాలా, రంగుదారమూ,

చిన్నదువ్వెనలూ, అద్దాలూ మొదలైనవి—కూలిపనిచేసుకుండే ఆడవాళ్లు సరదాపడే చిన్నచిన్న వస్తువులు—అన్నీ ఒకదాగరలో పేర్చి మోకాలి నీటిలోనుంచి నడుచుకుంటూ తంపర* దాటి వెళ్లి, మాలపల్లెలవెంట తిప్పుతాడు. అక్కడ ధాన్యానికి అవన్నీ అమ్ముతాడు—ధాన్యానికి అమ్మడంవల్ల డబ్బుకు అమ్మినకంటే విస్తారం దొరికేది. పెందలాడే ఇంటికి తిరిగివచ్చేసినవాడు, త్వరత్వరగా భోజనంచేసి, పంచదార-పనసగుసాలు చేసేవాడి ఇంటికి వెళ్లి పాకం లాగేవాడు. అక్కడనుంచి ఇంటికి వచ్చి పట్టీగాజుల్కు తయారుచేస్తూ కూర్చుండేవాడు. ఇదంతా అయే సరికి సుమారు అర్ధరాత్రి అయిపోయేది. ఇంత కష్టపడి పని చేసినా తనకూ పిల్లలకూ రెండుపూట్లా రెండు మెతుకులు సంవత్సరం పొడుగునా దొరికేవి కావు. వాడి తిండిపద్ధతి ఏమిటంటే, భోజనానికి కూర్చుంటూనే చెంబుడు మంచినీళ్లతో కడుపునింపుకోవడం. ప్రతిరోజూ భోజనంలో ముఖ్యమైనభాగం ఒకటి ఏమిటంటే చవకరకం కందమూలం. ఏమిలేదన్నా సంవత్సరానికి నాలుగుమాసాలు, రోజుకు ఒకపూటకు జాస్తీ తిండి దొరికేది కాదు. ఒకమాటెప్పుడో వీడికి ఏదో ఇద్దామని అనుకున్నాను. కాని మాస్టరుగారు కానిచ్చారు కారు. ఆయన అన్నారు, "నీ దానాలు మనుష్యులను నాశనంచేయగలవు, గాని వాళ్ల దుఃఖాన్ని నాశనంచేయలేవు. మనహిందూదేశంలో పంచు ఒక్కడుమనిషే కాదు. దేశమాత రొమ్మున ఒక్క పాల-

* నీటితో నిండిఉండే పల్లపుభాగా.

చుక్క లేదు. రూపాయిలతో పైనుంచి ఆ పాలను తిరిగి నువ్వు పుట్టించ లేవు."

ఇవన్నీ బాగా ఆలోచించవలసిన సంగతులే. అటువంటి పనులలోనే నా జీవితం గడుపుదామని నిశ్చయించుకున్నాను. ఆవాళ విమలదగ్గిరికి వెళ్లి అన్నాను, "ఇక, మనమిద్దరమూ జీవితమంతా మనదేశంలోఉండేదుఃఖానికి మూలమైనదానిని నాశనంచేసే పనులలోనే వినియోగించాలి."

విమల నవ్వుతూఅన్నది, "మీరు నా రాజపుత్రులు, సిద్ధార్థులు, చివరకు నన్ను నడిసముద్రంలో విడిచిపెట్టి వెళిపోయేరు సుమండీ, మీధర్మం ఉంటుంది!"

"భార్యను విడిచిపెట్టి తపస్సుచేశాడు సిద్ధార్థుడు. నేను చేసే తపస్సు భార్యతో కలిసి చేసేది," అన్నాను.

ఈలాగు మాటలు హాస్యంగా వెళ్లాయి. సంగతి ఏమిటంటే—"సహజంగా రాణి" అంటాము, అటువంటిది విమల. బీదఇంట్లో పుట్టినా ఆమె రాణీయే. అడుగునఉండే బీదవాళ్ల సుఖదుఃఖాలు కొలిచే గజంబద్ద మామూలుది కాదు, పొట్టిది. లేమి వాళ్లకు ఉంటుంది, గాని అది వాళ్లకు లేమికాదు. లేమే ఒక ఆవరణలాగు వాళ్లచుట్టూ ఉండి, వాళ్లను కాపాడుతుంటుంది. చిన్నచెరువులో ఉండేనీళ్లను ఆ చెరువుకుండేగట్లే కాపాడుతుంటాయి. గట్లనుకొట్టేసి చెరువును పెద్దదిచేయబోతే నీళ్లన్నీ ఇగిరిపోయి బురద తయారవుతుంది. మన దేశంలో మనము చిన్నచిన్న భాగాలుగా ఏర్పడి మనమే గొప్పవాళ్లము

అనుకుంటూ, చుట్టూగీతలు గీసుకొని ఆ మధ్య కూర్చొని ఒక మొాస్తరు బలమూ, స్వాతంత్ర్యమూ అనుభవిస్తున్నాము. విమలరక్తంలోకూడా ఆ అభిమానమే ప్రబలంగా ఉన్నది. ఆ మహాపురుషుడు మనువు మనవరాలే ఆమె! నాలో ప్రవహి-స్తున్న రక్తం గుహాంనిరక్తం, ఏకలవ్యునిరక్తం. నా దిగువనుఉన్న వాళ్లను నీచులని దూరంగా ఉంచడం నాకు చేతకానిపని. నా భారతవర్షము కేవలం మీాదిజాతుల భారతవర్షం కాదు. కింది జాతివాళ్లు ఎంత కిందికి దిగుతున్నారో మనదేశం అంతకిందికి దిగుతున్నది. వాళ్లు ఎంత చస్తున్నారో భారతవర్షానిది అంతచావు.

విమల నా ఇంట్లోకి వచ్చింది గాని, నాలోకి రాలేదు; ఆమె నాఇంట్లో ఉన్నది గాని నా శిక్షలో లేదు. నా జీవనంలో విమలను బ్రహ్మాండమయిన పెద్దవస్తువు చేసుకొని కూర్చున్నాను; ఆమె దొరకకపోవడంతోనే మిగిలినది చాలా తక్కువయి-పోయింది. విమలకు జాగాఇద్దామని నా శిక్షలో ఎంతో భాగం ఒకమూలకు తోసేశాను. దానివల్ల దొరికిన ఫలం ఏమిటంటే —రాత్రింబగళ్లు ఆమెకు ముస్తాబు చేయడం, ఆమెకు చదువు చెప్పడం, రాత్రింబగళ్లు ఆమెచుట్టూ ప్రదక్షిణచేస్తూ ఉండడం. వీటితోనే కూర్చొని మనుష్యుడు ఎంతపెద్దవాడో, మానవ-జీవితం ఎంతగొప్పదో, ఎన్నడూ మనస్సున పట్టనివ్వలేదు.

ధానిఅంతటిలోనూకూడా నన్ను కాపాడుతూ వచ్చినది నా మాస్టరుగారు. తన చేతనయినంతవరకూ ఆయన నన్ను

జీవనంలో ఉన్న విలువైనవాటివైపు లాగి ఉంచాడు. లేకపోతే ఈనాడు ఎక్కడో ధూళిఅడుగున పడిఉందును. మహాఅద్భుతమయినమనిషి అతను. మనదేశానికి అతనికీ, మనకాలానికి అతని మతానికీ, చాలాదూరం. ఆయన తనలోనున్న అంతర్యామిని తెలుసుకున్నాడు. గనుక ఇక అతను ఎటువంటిభ్రమలోనూ పడడు. నా జీవితంయొక్క జమాఖర్చులు ఈవాళ చూచేసరికి పెద్ద కూడిక-తప్పుఒకటి కనబడుతూఉంది. సరిచేస్తే గొప్ప నష్టం తేలుతూఉంది. కాని దానిని మింగేసినంత, అనేకరెట్లు పెద్ద అంకె ఒకటి, లాభంపక్క కనబడుతున్నది — ఆ మాట నిస్సందేహంగా చెప్పగలను.

మాష్టరుగారిదగ్గిర నా చదువు పూర్తికాకముందే మా నాన్నగారు చనిపోయినారు; నేను ఇంటికిపెద్ద అయినాను. అప్పుడే మాష్టరుగారితో అన్నాను, "మీ ఉద్యోగం మానేసి వచ్చి నాతో ఉండండి," అని.

ఆయన జవాబు ఇచ్చాడు, "నేను నీకు ఇచ్చినదాని వెల నాకు ముట్టిపోయింది. అదికాక నేను నీకు ఇచ్చినదేమయినా ఉంటే దానివెల పుచ్చుకోకూడదు — పుచ్చుకున్నట్టయితే, నాలోనున్న అంతరాత్ముని సంతలో పెట్టి అమ్మినవాడను అవుతాను."

నాకు చదువుచెప్పడానికి చంద్రనాథ్‌బాబు, ఎండనకా వాననకా, రోజూ నడిచి వస్తుండేవాడు. ఎంత బ్రతిమాలి అయినా నాగుర్రపుబండీఎక్కి వచ్చేటట్టు చేయలేకపోయినాను.

"బొట్ తలా దగ్గిరనుంచి డాల్‌హౌసీ స్క్వేర్ వరకూ ఆఫీసుకు రోజూ నడిచేవెళ్లేవాడు మానాన్న; అలాగు పని చేసుకువచ్చే నన్ను పెంచి పెద్దవాణ్ణిచేశాడు—నలుగురితో వంతుకలిసైనా బండీఎక్కి ఎన్నడూ ఆఫీసుకు వెళ్లలేదు; తరతరాలనుంచీ నడకే మాకు అభ్యాసం" అని చంద్రనాథ్ బాబు అన్నాడు.

"పోనీ అయితే, మా ఇలాకాలో ఏదైనా ఉద్యోగం ఒకటి పుచ్చుకోండి," అన్నాను.

"వద్దు బాబూ, మీ పెద్దపెద్దవలలలోకి నన్ను ఎందుకు లాగుతావు, నన్ను ముక్తునిగానే ఉండనీ?" అన్నాడు.

అతని కొడుకు అప్పుడే ఎం. ఏ. పాస్‌అయి పనికోసం చూస్తుండేవాడు. మా ఆఫీస్‌లో అతనికి పని ఇస్తానని ఆయనతో అన్నాను. కొడుక్కుకూడా ఉద్యోగం పుచ్చుకుందామని చాలా అభిలాషగా ఉండెను. మొదట తండ్రితో ఆ మాట చెప్పాడు, గాని ఏమీ ప్రయోజనం లేకపోవడంచేత, నాకు తన ఉద్దేశం రహస్యంగా తెలియజేశాడు. నేను అతి ఉత్సాహపడి చంద్రనాథ్ బాబుకు నా కోరిక తెలియజేశాను. "ఇక్కడ వాడికి పని అక్కరలేదు," అని అనేశాడు ఆయన. అటువంటి మంచి అవకాశం వచ్చినప్పుడుకూడా కానిచ్చాడుకాదని తండ్రిమీద కోపంవచ్చి, పెళ్లంలేని ముసలివానిని ఒంటిగా వదిలేసి, రంగం వెళిపోయినాడు ఆకొడుకు.

ఆయన అనేకమార్లు నాతో అన్నాడు, "చూడు నిఖిల్, నీకూనాకూగల సంబంధంలో నీకూ పరాధీనతలేదు, నాకూ

పరాధీనత లేదు. నా స్వాతంత్ర్యం పూర్తిగా నాచేతిలో ఉన్నది. నీస్వాతంత్ర్యం పూర్తిగా నీ చేతిలో ఉన్నది. పవిత్ర మయిన ప్రేమ ఒక్కదానితోనే ఏర్పడిన స్నేహంలోకి డబ్బును తీసుకువచ్చిపెడితే ఆ స్నేహానికి అవమానం కలుగుతుంది."

ఆ రోజులలో ఆయన ఇక్కడఉన్న హైస్కూలులో హెడ్‌మాస్టరుగా ఉండేవాడు. అప్పటికి ఇంకా ఆయన మా ఇంట్లోకి వచ్చేయలేదు. కొద్ది రోజులబట్టీ రోజూ నేను ఆయనఇంటికి వెళ్లి రాత్రి పదకొండుపన్నెండు ఘంటలవరకూ నానారకాలవిషయాలగురించీ మాట్లాడి వస్తూఉండేవాడను. అతని ఇల్లు చిన్నది; భాద్రపదమాసపు ఉక్కకు నేను ఉండ-లేను అని తోచి, కాబోలు, అతనంతట అతనే మా ఇంటికి వచ్చేశాడు. అద్భుతమయిన సంగతిఒకటి ఏమిటంటే, ఆయనకు, బీదవాళ్లమీదలాగునే, గొప్పవాళ్లమీదకూడా దయఉండేది; గొప్పవాళ్లకు కలిగిన దుఃఖాన్నయినా అతను ఎన్నడూ పరిహాసం చేసేవాడు కాదు.

సామాన్యమయిన వస్తువులను తదేకదీక్షగా మనము గొప్పగా చూస్తున్నకొలదీ అవి మన గొంతుక పట్టుకుకూర్చుం-టాయి. సత్యంవైపు మనముఖం తిరిగేసరికి ముక్తి దొరికిపో-తుంది. సత్యం ఇక నా కళ్లకు ఎన్నటికీ కనబడదేమో అన్నంత పెద్దవాటినిగా, సామాన్యవస్తువులను చేసేసింది విమల. అందు-చేత ఈ బ్రహ్మాండమంతా వెతికినా నా దుఃఖానికి ఒడ్డు కనబడకుండాఉంది. అందుచేతనే నా రవంతదుఃఖంతో మూడు

లోకాలూ నింపి, ఈ శరత్కాలపు ఉదయాన ఘంటలకొలది ఆ పాట పాడుకుంటూ కూర్చున్నాను—

మోహావసరము భాద్రపదమిది,
ముసురు మెండుగఁబట్టి యున్నది!
ఓర! నాదగు మందిరంబిది
అన్ని విధముల శూన్యమైనది!

చంద్రనాథ్ బాబుజీవనం నాకు ఒక కిటికీ అయింది— అందులోనుంచి చూస్తే నాకు సత్యం కనబడ్డది. అందుచేత నా పాటయొక్క అర్థం పూర్తిగా మారిపోతున్నది—

హరిలేక నీ కెట్టు లరుగు బగలును రేయి?
అనుచు విద్యాపతి అనుచుండు నోయి.

ఇంతదుఃఖమూ, ఇంతభ్రమా, సత్యం మనకు దొరకనంత సేపే! నా జీవనాన్ని అటువంటి సత్యంతో నింపుకోకుండా రాత్రింబగళ్లు ఏలాగు గడపగలను. నాచేత కాదు—సత్యమా, నీవు వచ్చి నా శూన్యమందిరాన్ని నింపుదువుగాక.

ఆ రోజులలో బంగాళా దేశస్థులమనస్సు ఏలాగు అయి-పోయిందంటే, మరి చెప్పలేను. అరవయివేలమంది సగరపుత్రుల బూడిదెమీాద గంగ వచ్చిపడ్డదా అనిపించింది. యుగయుగాల-నాటి బూడిదె అది, మట్టిలో కలిసిపోయింది; ఎటువంటి నిప్పైనా దానిలో మంట పుట్టించలేదు; ఎటువంటి ద్రావకా-లైనా దానిని ముద్దచేసి గట్టిచేయలేవు. అటువంటి భస్మము ఒక్కమారు మండి మాటలాడడం ప్రారంభించింది——"ఇదుగో నేను", అంటూ లేచింది.

గ్రీస్ దేశంలో శిల్పి ఒకడు తాను చేసిన బొమ్మకు దేవునివరంవల్ల ప్రాణం ఇచ్చాడని పుస్తకాలలో ఎక్కడో చదివాను. కాని, దానిలోనైనా ఒకమోస్తరు క్రమం ఉన్నది, ఆకారండున్నతరవాతనే జీవంవచ్చింది. కాని మనదేశంలోఉండే భస్మరాశిలో ఆకారం ఎక్కడిదీ? అది రాయిలాంటి ఒక గట్టి వస్తువైనా అయిఉంటే ఈ వింత నాకు బోధపడిఉండును——తిరిగిప్రాణంవచ్చిన అహల్యఅయినా రాయిఅయి పడిఉన్నది కదా! ఇదో? ఇక్కడా అక్కడా చెదిరిపడిఉన్న వస్తువు——సృష్టికర్తపిడికిటిలో ఉంటూఉండగా వేళ్లసందులలోనుంచి జారి, గాలికి నాలుగువైపులా చెదిరిపోయి అక్కడక్కడ పడిఉన్నది.

అది ఏవిధంగానైనా అంతా ఒక్కదగ్గిర కుప్పఅయిఉండే వస్తువు కాదు. అటువంటివస్తువు ఒకనాడు అకస్మాత్తుగా మా ఇంటి అంగణంలోకివచ్చి భయంకరమైన గర్జనచేసుకుంటూ, "అయమహం భోః" అనడం ప్రారంభించింది.

అవంతా ఏదో ఒక లోకాతీతమైన సంగతి అని అందరమూ అప్పుడు అనుకున్నాము. స్వర్గంలోఉండే దేవత ఏవడో సుధారసోన్మత్తుడై ఉంటూఉండగా అతని కిరీటంలో-నుంచి మాణిక్యం రాలిపడ్డదా అన్నట్టుగా 'ఆ దినము' మా చేతిలోకి వచ్చిపడ్డది. గతానికీ వర్తమానానికీ ఎటువంటి సంబంధమూ కనబడలేదు. 'ఆ దినము' కథలలోవిన్న ఆ ఔష-ధంమోస్తరు—అది వెతికి తీసుకురాలేదు, కొని తీసుకురాలేదు, అది ఏ వైద్యుడూ ఇవ్వగా దొరికినది కాదు, అది స్వప్నంలో దొరికినది.

అందుచేతనే మా దుఃఖాలన్నీ ఒక్కమాటు నివారణ అయిపోతాయని అనుకున్నాము. సంభవానికీ అసంభవానికీ మధ్య గీత ఎక్కడా కనబడలేదు. 'ఇదుగో వచ్చింది', 'ఇదుగో వచ్చింది' అని మాత్రం అనిపించింది.

దేశచరిత్రను లాగడానికి ఎటువంటి గుర్రాలూ అక్కర-లేదు, పుష్పకంలాగు అది తనంతటతానే నడవగలదు—ఆమాట నిజంకాకపోయినా, దాని సారథికిమాత్రం జీతమేమీ ఇవ్వ-నక్కరలేదు; వాడికి తిండికర్చుకూడా ఏమీ పెట్టుకోనక్కర-లేదు, ఘడియఘడియకూ వాడిగ్లాసు కల్లుతో నింపుతుంటే

చాలును—శరీరంతో కూడా అందరికీ ఒక్కమారు స్వర్గప్రాప్తి అయిపోతుంది.

నా భర్తలో ఎటువంటి చలనమూ పుట్టలేదని కాదు; గాని మా ఉత్సాహం వెల్లి అతని మనస్సుకు బాణాలలాగు తగులుతుండేది. ఎదురుగా కనబడేది కాక దానిమీదినుంచి దూరాన్నుండేది ఆయన చూడగలిగేవారు. సందీప్‌తో వాదన చేస్తూ ఒకమాటు అన్నారు ఆయన, "అదృష్టం ఒకనాడు మన గడపదగ్గిరికి వచ్చి కేక వేస్తుంది—ఇంట్లోకి వద్దామని కాదు, తనను అందుకోడానికి తగినసామర్థ్యము మనకు లేదు అని చూపించడానికి, తనను పిలిచి కూర్చోపెట్టడానికి తగిన ప్రయత్నాలేవీ మనము చేయలేదని చూపించడానికి."

అంటే, సందీప్ అన్నాడు, "దేవుడున్నాడని నీకు నమ్మకం లేదు నిఖిల్, అందుచేతనే నువ్వు ఆలాగు మాట్లాడుతున్నావు. దేవి వరమివ్వడానికి వచ్చింది, మాకు ప్రత్యక్షంగా కనబడుతున్నది, నీకు ఇంకా దేవి ఉన్నదని నమ్మకమే పుట్టలేదు."

"నేను దేవుని నమ్ముతాను; అందుచేతనే, నామనస్సులో నాకు నిశ్చయంగా తెలుసును, ఆ పూజకుతగిన ఏర్పాట్లు ఇంకాఏమీ చేయలేకపోయినాము అని. వరమయినా అందుకొనే శక్తి మనకు ఉండాలి కదా!" అన్నారు నా భర్త.

నా భర్త నోటివెంట ఇటువంటి మాటలు వింటే నాకు మహాకోపం వచ్చేది. ఊరుకోలేక అనేదానను, "ఇప్పుడు

దేశమంతా వ్యాపించిఉన్న ఉద్దీపనం కేవలం ఒక నిషా అని మీరు అనుకుంటున్నారు కదూ? పోనీ నిషాయే అనుకుందాము—అయితే నిషామాత్రం కొంత బలాన్ని ఇవ్వదూ?"

"బలం ఇస్తుంది గాని అస్త్రం ఇవ్వదు."

నేను అన్నాను, "శక్తి దేవుడు ఇవ్వవలసినది, అది దుర్లభం; అస్త్రానికేమున్నది అది ఏకమ్మరివాడైనా ఇస్తాడు!"

"కమ్మరివాడైనా ఊరికే ఇవ్వడు, కదా!—వాడికిమాత్రం ఖరీదు ఇవ్వనక్కరలేదూ?" అన్నారు నా భర్త.

"ఇస్తామయ్యా, ఇస్తాము ఖరీదు," అన్నాడు సందీప్.

"మీరు అది ఇచ్చినప్పుడు, నేను ఉత్సవంకోసం టకోరా మేళానికి బయానా ఇస్తాను," అన్నారు నా భర్త.

"నీవు బయానా ఎప్పుడిస్తావో అని కనిపెట్టుకుకూర్చో-లేదు మేము. డబ్బిచ్చి కొనుక్కో-అక్కర లేదు మాఉత్సవం," అన్నాడు సందీప్. అంటూ, బద్దలైనఘంటలాంటి తన బొంగు గొంతుకతో పాట ఆరంభించాడు—

వెలయిచ్చికొనరాని ప్రేమకాస్పదుడైన
నా రసికుడడవిలో నందందు తిరుగుచును,
వెలలేకయే దొరకు వేణువది చేబూని
కోరి కూరిమి పాట కురియించుచున్నాడు.

నావైపు చూస్తూ అన్నాడు, "ప్రాణంలోకి సంగీతం వస్తూఉంటే కంఠం లేకపోయినా అది ఆగదు, రాణీ—ఆ సంగతి

కనపరుద్దామనే నేను పాడుతున్నాను. కంఠబలంతో పాడిన పాటలో పాటగొప్ప ఏముంది ? సంగీతప్రవాహం హఠాత్తుగా మనదేశంలో వచ్చిపడ్డది. నిఖిల్ ఇప్పుడు 'సరిగమలు' దగ్గిరనుంచీ ఆరంభించి నేర్చుకుంటూ ఉండనీ, ఈ లోపున మేము మా బద్ధలైన గొంతుకలతోనే పాట పాడి దేశానికి మత్తెక్కిస్తాము.

ఎక్కడికి పోతావు ? ఎందుకు పోతావు ?
బైటకు పోతావ ? పాడైపోతావు !
అంచు నాయిల్లు నన్నంటున్నది !
విడిపోకుమని మొత్తు విడుతున్నది !
ఉన్నదంతా పోని ! ఒక్కమాటే పోని !
పోనీ పోనీ ! బుగ్గైపోనీ !
అంచు నాజీవ మిట్లంటున్నది !
విడిచిరా అని వేగపడుతున్నది !

సరే పోనీ, లేదంటే నాశనం అయిపోతాము, అంతేనా! అంతకు ఎక్కువ ఏమీ కాదు కదా ? దానికి సిద్ధంగానే ఉన్నాము.

పోదలంచినదేదో పోనీ
రాదలంచినదేదో రానీ !
చూడుమిదిగో సర్వమిప్పుడే,
చూఱవిడుచుచునుంటి నవ్వుచు.
తరలిపోవుచునుంటి నిదిగో,
మరణసుధ మనసార గ్రోలగ !

పోదలంచినదేదో పోనీ !

రాదలంచినదేదో రానీ !

అసలు సంగతి ఏమిటంటే నిఖిల్, మాకు మరి మనస్సులలో మతిలేదు, ఒంటిమీద తెలివిలేదు. సుసాధ్య-సాధనాలమధ్య కూర్చోలేము ఇక; అసాధ్య-సాధనాల వైపు పరుగెత్తుతాము."

నా భర్త బహుశా ఏదో చెప్పాలనుకున్నారు, గాని ఏమీ అనకుండా మెల్లి మెల్లిగా బయటికి వెళిపోయినారు.

దేశంలో ఒకచివరనుంచి రెండోచివరవరకూ భయంకరంగా ప్రవహిస్తున్న ఆవేగమే స్వరం మార్చి నాలో ప్రవేశించింది. భాగ్యదేవతరథం వస్తూఉంది. ఎక్కడనుంచో దాని చక్రాల శబ్దం వచ్చి రాత్రింబగళ్లు నా మనస్సులో ప్రతిధ్వనిస్తున్నది. పరమాశ్చర్యమైనదేదో జరగబోతున్నదని ప్రతిక్షణం అనిపించేది, గాని దానితో సంబంధించిన ఎటువంటి పూచీ నామీద లేదు అని నా నమ్మకం. పాపమా?—పాపమూ పుణ్యమూ, బుద్ధీ వివేకమూ, దయా నిర్దయా, ఇవన్నీ పారిపోతాయి; ఇప్పుడుఉండేచోట మరి ఉండవు; అక్కడనుండి పారిపోయేదారి దానంతటఅదే హఠాత్తుగా తెరుచుకుపోయింది. ఆ రాణీయేదానిని నేను ఎన్నడూ కోరలేదు; దాని కోసమని నేను కనిపెట్టుకుకూర్చోలేదు; నా జీవనంఅంతా వెదికిచూస్తున్నాను, దాని సంబంధమైనపూచీ నాలో ఎక్కడా ఏమీ కనబడడం లేదు. ఇన్నాళ్లబట్టి తదేకధ్యానంతో పూజ-

చేసిన దేవుడు ఒకడు, చివరకు వరంఇచ్చేవేళకు వచ్చిన దేవుడు ఇంకొకడు. దేశమంతటా నూతన జీవనం ఉదయించి, దేశస్థుల భవిష్యత్తుకు స్వాగతంచెపుతూ, వందేమాతరం అని కేకలువేసేసరికి, నా మనస్సులోకూడా గొప్ప ఉత్సాహం పుట్టింది—వందే తమ్ అజ్ఞాతమ్, అపూర్వమ్, సకలసృష్టిత్యక్తం అంటూ నా శిరోపశిరలలోకూడా పులకరింపు పుట్టింది.

దేశంలో పుట్టిన రాగంతో నాలోపుట్టిన రాగం అతి అద్భుతంగా కలిసింది. ఒకొక్కనాడు బాగా రాత్రి అయాక మెల్లిమెల్లిగా పక్కమీదనుంచి లేచి మా పైడాబామీదికి వెళ్లి నిలవబడేదానను. మా తోటపక్కను వరిచేలు ఉన్నవి. వాటికి ఉత్తరందిక్కున ఊరితోటలు ఉన్నవి. ఆ చెట్లమధ్య-నుంచి పక్కనుండే నదీ, ఆ పైనుండే వనరేఖా, కనబడుతుండేవి. భవిష్యత్తే అస్పష్టమయిన పిండరూపంగా రాత్రి-గర్భంలో నిద్రపోతున్నదా అనిపించేది. ఆ భవిష్యత్తులోకి చూచి పోల్చుకోగలిగాను—మనదేశం నాలాంటి ఒక స్త్రీ అయి, నాలాగే కనిపెట్టుకొని కూర్చున్నది—ఇప్పటివరకు ఇంట్లో ఒక మూల ఎక్కడో పడిఉండేది, ఇప్పుడు అకస్మాత్తుగా ఎవరూ చూడని వైపునుంచి, ఎవరికీతెలియని స్థలం నుంచి, పిలుపు వచ్చింది. ఎటువంటి ఆలోచనకూ వ్యవధి దొరకలేదు; తిన్నగా ముందుఉన్న అంధకారంలోకి వెళిపోతూ ఉంది; దీపంవెలి-గించుకొని బయలుదేరేపాటి వ్యవధైనా సహించలేకపోయింది. ఈ అర్ధరాత్రివేళ ఆమె గుండె లోపలికీ పైకీ ఏలాగు ఎగురు-

తున్నదో నాకు తెలుసును. నాకు తెలుసును ఏ-దూరం నుంచి సంగీతం వస్తున్నదో, అక్కడికి పరుగెత్తుతున్నది ఆమె మనస్సు —'ఇదుగో దొరికింది' అనుకుంటున్నది, 'ఇదుగో వచ్చేశాను' అనుకుంటున్నది; కళ్లుమూసుకొని పరుగెత్తినా మరి భయం లేదు అనుకుంటున్నది. ఆమె పిల్లతల్లి కాదు, పిల్లకు పాలు పెట్టాలని బాధలేదు; గదిలో దీపం వెలిగించాలనిగాని, ఇల్లు తుడవాలి అనిగాని ఆమెకు తట్టవు. ఆమె ఒక అభిసారిక ఈవాళ. ఇది మన వైష్ణవకవుల రాజ్యం. ఆమె ఇల్లువిడిచిపెట్టి వచ్చింది. ఇంటిపనుల మాట జ్ఞప్తిలేదు. ఆమెకున్నదంతా అగాధమైన ఆవేగం, అదే ఆమెను పరిగెత్తిస్తున్నది; దారిలో ఎక్కడ ఏమిటి ఉంటుంది అనే ఆలోచన ఏమాత్రమూ లేదు ఆమె మనస్సులో. నేనుకూడా ఆ అంధకారంలోనున్న అభిసారికను. నేనూ ఇల్లు వదిలి వచ్చాను. నేనూ దారి తప్పిపోయినాను. సాధనాలూ, సాధించవలసిన కార్యమూ, రెండూ మాయ-మయిపోయినాయి. ఉన్నదంతా ఆవేగమూ, పరుగూ. ఓయి అభాగ్యురాలా! నిశాచరీ! రాత్రిముగిసి, తెల్లవారుజామున తిరిగి ఇంటికి వచ్చేటప్పుడు దారిపోల్చుకోడానికి ఎటువంటి ఆనవాలూ దొరకదు సుమా! కాని, తిరిగి ఎందుకు వస్తాను, చస్తాను గాని? మురళివాయించి నన్ను పిలిచిన అంధకారం నన్నూ, నా సమస్తమునూ నాశనంచేసేసినట్టయితే తరవాత సంగతి ఆలోచించడం ఎందుకు? అన్నీ వదిలిపోతాయి, ఒక్క రవ్వంతయినా మిగలదు. ఆనవాలుకైనా ఉండదు. నలుపునయి

ఆ అంధకారంలో కలిసిపోతాను. అటుపైని మంచి ఎక్కడ చెడుగు ఎక్కడ, నవ్వు ఎక్కడ ఏడుపు ఎక్కడ?

ఆవాళ బంగాళదేశంలో కాల-యంత్రం ఫుల్ స్టీమ్‌తో ఉన్నది. అందుచేత, ఎంతో కష్టంమీద అతినెమ్మదిగాఅయే పనులు కూడా ఝూ ఝూ మని, ఒకదానిమీదఒకటి, మా కళ్లతో మేము చూస్తూఉండగానే కావడం ప్రారంభించాయి. మేముఉండే మారుమూలలలోకూడా దేనినీ అడ్డుపెట్టి ఆప-లేము అనిపించింది. ఇప్పటివరకు బంగాళాదేశమంతటిలోనూ మా ప్రాంతాలలో జోరు కొంచెం తక్కువగానే ఉండేది. బలవంతంచేయడం నా భర్తకు ఇష్టం లేకపోవడమే దానికి ప్రధానకారణం. "దేశంపేరున స్వార్థత్యాగంచేసేవాళ్లు సాధకులు, దేశసేవకులు, దేశంపేరు పెట్టి బలంప్రయోగించే-వాళ్లు దేశానికి శత్రువులు— వాళ్లు స్వాతంత్ర్యంయొక్క వేళ్లుతెగగోసి దాని చిగుళ్లకు నీళ్లు పోస్తామనే వాళ్లు," అని ఆయన అంటూఉండేవారు.

కాని సందీప్‌బాబు ఇక్కడికి వచ్చికూర్చున్నాడు; అతని చాలాలు నాలుగువైపులనుంచీ వస్తున్నారు పోతున్నారు; మధ్యమధ్య సంతలలోనూ బజార్లలోనూ ఉపన్యాసాలు జరుగుతున్నవి. అప్పుడు ఈ ప్రాంతాలలోకూడా కెరటాలు ప్రారంభించాయి. ఈఊరి యువకులు కొంతమంది సందీప్‌దగ్గిర చేరుకున్నారు—మా ఊరికి కళంకం అయిఉండేవాళ్లు అనేక-

మంది ఉన్నారు ఆ గుంపులో. ఉత్సాహం వాళ్లను, లోపునా బయటనూ కూడా, దీప్తితో నింపేసింది. దేశంలో వీచే గాలి ఆనందంతో నిండిఉంటే మనుష్యులలో ఉండే కల్మషం, దానంతట అదే, ఎగిరిపోతుంది. దేశంలో ఆనందం లేనంతసేపు బలము గాని, ఆరోగ్యంగాని, మనస్సుకు తిన్నదనంగాని, దుర్లభం.

నాభర్తగారి ఇలాకాలో ఉండే స్థలాల్లో నుంచి సీమఉప్పూ, సీమపంచదార, సీమబట్టలూ ఇప్పటికీ ఉద్వాసం కాలేదు. అందరి కళ్లూ దీనిమీద పడ్డవి. ఎస్టేటుఉద్యోగస్థులకుకూడా, ఆఖరుకు, సిగ్గువేసింది, గడబడపడడం ఆరంభించారు. కాని ఈ గొడవంతా ఆరంభం కావడానికిముందు నా భర్త స్వదేశీసరుకులు మా ఊరికి తెప్పిస్తే, అక్కడి పెద్దాచిన్నా అందరూ, లోలోపున నవ్వుకోవడమే కాకుండా, పైకికూడా పరిహాసం చేశారు. స్వదేశీవస్తువులంటే గొప్ప లేనంతకాలమూ వాటిని చాలా అసహ్యంగా చూచాము. నా భర్త ఇప్పటికీ తన స్వదేశీచాకుతో స్వదేశీ పెనసలు చెక్కుకుంటారు, బాతుకలంతోనే వ్రాస్తారు, ఇత్తడిగ్లాసుతోనే నీళ్లు తాగుతారు, రాత్రివేళ కొవ్వొత్తి స్టాండు వెలిగించి చదువుకుంటారు. కాని ఈ పాలిపోయిన స్వదేశీ మాలో ఎటువంటిఉత్సాహమూ పుట్టించదు. మా ముందుగదులలో ఉన్న కుర్చీలూ టేబిల్‌లూ మొదలయిన సామాను అతి సామాన్యరకం. అవి చూస్తే నాకు ఎప్పుడూ సిగ్గుగా ఉండేది—ముఖ్యంగా మా ఇంటికి కలక్టర్లూ దొరలూ వచ్చినప్పుడు సిగ్గు మరి భరించలేకపోయేదానను. నా సిగ్గు

చూచినప్పుడల్లా — "ఇంత చిన్నవిషయాలలోకూడా ఇంత గడబడపడతావే!" అని, ఆయన నవ్వుతూ అనేవారు.

"మనము నాగరికతలేని కొండవాళ్లమని, వాళ్లు అనుకుంటారు," అని నేను జవాబు చెప్పేదానను.

వాళ్లు అలాగు అనుకుంటే "వాళ్ల నాగరికత వాళ్ల ఒంటినుండే తెల్లచర్మాలు దాటి లోపున ప్రవహిస్తున్న మనుష్యరక్తం దాకా వెళ్లలేదు అని నేనూ అనుకుంటాను," అని ఆయన అన్నారు.

ఆయన కూర్చుండే గదిలో ఒక ఇత్తడిపూల్ దాన ఉండేది. ఎవరైనా దొరలు వస్తారని కబురు తెలిస్తే, దొంగతనంగా అక్కడనుంచి అదితీసేసి, దానికి బదులుగా ఒక చక్కని ఇంగ్లీషు గాజుపూల్ దాన పువ్వులతో నింపి ఉంచేదానను.

ఆయన ఒకనాడు అన్నారు—"ఇదుగో చూడు విమలా, పువ్వులు ఏలాగు తాము పువ్వులు అని ఎరగవో అలాగే నా ఇత్తడిపూలదానకూడా తాను పూలదాన అని ఎరగదు. నీ సీమపూల్ దానమట్టుకు 'నేను పూల్ దానను,' అని ఎరుగును. కనుక దానిలో చెట్టునపూచే పువ్వులకంటే పట్టు పువ్వులు పెట్టడం సబబు."

ఇటువంటివాటన్నిటిలో ఆయన అన్నదానికంతటికీ, 'భలీ' అంటూఉండేది మా తోటికోడలు ఒక్కర్తే. పరిగెత్తుకు పరిగెత్తుకు వచ్చి అనేది—"స్వదేశీ సబ్బులు వస్తున్నాయని

విన్నాను, నిజమేనా? నేను సబ్బురాసుకోనేదినాలు వెళిపోయి-నాయి, అయినప్పటికీ దానిలో కొవ్వువెయ్యకపోతే రాసుకు-చూస్తాను, నాకు అభ్యంతరం లేదు—మీా ఇంటికివచ్చిననాటి దగ్గిరనుంచి ఇదొక అభ్యాసం అయిపోయింది; సబ్బు వదిలేసి ఎంతోకాలం అయింది, అయినా ఇప్పటికీ సబ్బులేనిదే స్నానం తిన్నగా కాలేనట్టే ఉంటుంది.”

ఇటువంటివి చూస్తే నా భర్తకు చాలా సంతోషంగా ఉండేది. పెట్టెలుపెట్టెలు స్వదేశీసబ్బు మా ఇంటికి వచ్చిపడి-పోయేవి. ఓయి బాబు అవేమిటి అవి! అవి సబ్బుముక్కలా లేక బట్టలు ఉడకపెట్టే క్షారంముద్దలా! మొగుడు ఉన్నప్పుడు ఏ సీమసబ్బులు వాడేదో ఆ సీమసబ్బులే ఇప్పటికీ రోజూ వాడుతుండేది మా తోటికోడలు, ఒక్కపిసరు తగ్గించలేదు. ఆ మాట నాకు తెలియ దనుకున్నదేమో! ఈ స్వదేశీసబ్బులన్నీ బట్టలుఉతకడానికి దాసీల దగ్గిరికి వెళిపోతుండేవి.

“చూడు అబ్బాయి, స్వదేశీ కలాలు దిగుతున్నాయి అని విన్నాను—మంచివాడవు, నాకుఒక నాలుగు—” అంటూ ఒకొకనాడు మొదలుపెట్టేది తోటికోడలు. అనేసరికి ఆయన కడుపు సంతోషంతో నిండిపోయేది. ‘కలం’అని పేరుపెట్టుకొని దిగబడుతుండే నానారకాల పల్దోముపుల్లల కట్టలతో ఆ గది నిండిపోయింది. దానివల్ల ఆమెకు ఎటువంటి ఇబ్బందీ కలగ-లేదు—చదువుతో వ్రాతతో ఆమెకు ఏమైనా సంబంధం ఉంటే కదూ! బట్టలపద్దువ్రాయడానికి ఏములక్కాడ అయినా చాలు.

అంతకంటే పెద్దపని ఆవిడికి ఉండేదే కాదు; కర్మం చాలక ఎప్పుడైనా అవసరం వచ్చిందా, పెట్టెలో ఉన్న దంతపుకలము మీాదికే వెళ్లేది చెయ్యి.

నా భర్తచేసే పనులలో నేను కలియకుండా ఉన్నానని తెలియజేయడానికి మా తోటికోడలు ఈ వేషాలన్నీ వేసేది. గొప్ప చిక్కు ఏమిటంటే, ఆమె దొంగతనం బయటపెట్టడానికి దారి ఏదీ లేకపోయేది—వెళ్లి ఏమైనా చెప్పబోయేసరికి, ఆయన నోరుమూాసుకొని ఇ-లాగు కూర్చుండేవారు; నేను అనుకున్న-దానికి వ్యతిరేకమే అయేది ఫలం. ఈలాగు మోసపుచ్చేవాళ్ల చేతులలోనుంచి ఎవరినైనా కాపాడుదామని చూస్తే చివరకు మనకే ముప్పు.

రెండో తోటికోడలికి క్రోషేఅల్లికఅంటే చాలా సరదా. ఒకనాడు ఏదో అల్లుతూఉంటే మరి ఊరుకోలేక అన్నాను—"మంచి వేషాలు తెలుసును అక్కయ్యా నీకు! మరిదిగారు దగ్గిరఉంటే స్వదేశీ అనేసరికి నోరు ఊరుతుంటుంది, వెనకాతలమాత్రం విదేశీకత్తెర ఉంటేనేగాని ఒక్కక్షణం నడవదు నీ పని!"

తోటికోడలు అన్నది—"దానివల్ల పోయిందేమిటి? అతని మనస్సుకు ఎంతఆనందం కలుగుతుందో కనబడడంలేదూ? చిన్నప్పటినుంచి ఒక్కదగ్గిరనే ఉన్నాము, ఒక్కచోట పెరి-గాము, నవ్వుతూనవ్వుతూ మీాలాగు నేను అతనికి కష్టం కల్గ-

నివ్వలేను. మొగవాడు! అయినా అతనికి మరి ఏవ్యసనమూ లేదు, ఉన్న నిషా ఈ స్వదేశీయే. కాని అన్నిటినీ మింగేసే నిషావు ఉన్నావు కదూ నువ్వు! ఆ నిషాలో ఎప్పుడో మిగిలి-పోతాడు, నాకు తెలుసును!"

"మహా బాగా ఉంది కదూ, కడుపులో ఒకటీ పైకి ఒకటీ!" అని అన్నాను నేను.

"ఎంత అమాయకురాలవే పాపం! స్కూలుమాస్టరి చేతిలో బెత్తంలాగు తిన్-నని దానవు! ఆడవాళ్లు అంత తిన్నని వాళ్లు కారు; మెత్తనివాళ్లు గనుక కొంచెం వంగుతున్నా దానిలో తప్పేమీ లేదు."

తోటికోడలు అన్న ఆమాటలు ఎప్పటికీ మరిచిపోను —'అన్నిటినీ మింగేసే నిషావు ఉన్నావు కదూ నువ్వు! ఆ నిషాలో ఎప్పుడో మునిగిపోతాడు నాకు తెలుసును!'

మొగవాడికి, కావలస్తే, నిషా ఉండనీ, గాని ఆడది ఆ నిషా కాకూడదని నేను ఇప్పుడు కోరేది.

మా ఎస్టేటులో జరిగే శుక్‌సార్ సంత జిల్లాసంత-లన్నిటిలోకీ గొప్పది. అక్కడ పెద్దతంపరలాంటిది ఒకటి ఉన్నది; దానికి ఇవతలపక్క ప్రతిరోజూ బజారు కూడుతుంది, అవతల పక్క ప్రతివారమూ పెద్దసంత కూడుతుంది. వర్షాకాలంనుండి ఆ సంత మరీపెద్దదిగా కూడుతుంటుంది. తంపర ఏటితో కలిసి పోవ్వడంచేత పడవలకు రాహదారీ ఏర్పడి, నూలుబస్తాలూ,

రాబోయే సీతాకాలంకోసమని రోమంసరుకూ, విస్తారంగా దిగుమతి అవుతుంటాయి.

ఆరోజులలో దేశంలోఉండే ప్రతిసంతలోనూ స్వదేశీ-గురించి ఘోరమైనయుద్ధం జరుగుతుండేది. మా అందరికీ పట్టుదల అతి భయంకరంగా ఉండేది. సందీప్ నాదగ్గిరికి వచ్చి అన్నాడు—"ఇంతపెద్ద సంతా, బజారూ, మనచేతిలో ఉన్నవి, వీటిని ఒకచివరనుంచి ఇంకొకచివరదాకా పూర్తిగా స్వదేశీ చేసేయాలి. విదేశీ 'అ-లక్ష్మిని' చేటలతో విసిరి మన తాలూకాలోనుంచి ఎగరగొట్టేయాలి."

"ఎగరగొట్టేయాలి తప్పకుండా," అని నడ్డికట్టి నేను అన్నాను.



అప్పుడు సందీప్ అన్నాడు—"దీని విషయమై నిఖిల్‌కీ నాకూ చాలా వాదన జరిగింది. కాని నేను ఏమీ సాధించలేకపోయినాను. ఉపన్యాసాలు కావలసినవన్ని ఇచ్చుకోండి గాని జబరుదస్తీకిమాత్రం ఒప్పుకోను అన్నాడు."

"అదేదో నేను చూస్తాను లెండి," అని నేను కొంచెం బడాయితో అన్నాను.

నా భర్తకు నా మీద ఎంతప్రేమో నాకు బాగా తెలుసును. అటువంటి ప్రేమను దన్నుచేసుకొని ఆయనదగ్గిర ఏదైనా కోరుకోవలసివస్తే, ఆనాడు నాబుర్రలో ఏమాత్రంబుద్ధి ఉన్నా, సిగ్గుతో చచ్చిఉండును. కాని నా శక్తి ఎంతో అది సందీప్‌కు చూపించాలి—అతని దృష్టికి నేను శక్తిస్వరూపిణి

కదా! విశ్వశక్తి, ప్రతిమానవునికీ ప్రత్యేకించి ఎవరో ఒకరి ద్వారానే, వ్యక్తంఅవుతుంటుందని సందీప్ అనేకసార్లు అద్భుత-మయిన వ్యాఖ్యానాల సహాయంతో నాకు బోధపరిచాడు. అతను అనేవాడు—"వైష్ణవ తత్వంలో చెప్పిన ఆహ్లాద శక్తి ప్రత్యక్షంగా చూదామనే ఇంత ఆతురతతో ఇన్నాళ్లూ నేను తిరుగుతున్నాను. అది నాకంటికి కనబడినప్పుడే నాలో వినబడు-తూఉన్న పాట నేను స్పష్టంగా బోధపరుచుకోగలను. ఈలాగు అంటూ ఒకొకనాడు పాట ప్రారంభించేవాడు.

ఇదంతా వింటూఉంటే నేను విమలను అని మరిచిపోయే-దానను. 'నేను శక్తి. నేను ఆనందం. ఏదీ నన్ను బంధించి ఉంచలేదు. నాకు అసంభవమయిన దేదీ లేదు. నేను ముట్టుకు-న్నదంతా కొత్తదయిపోతున్నది. ఈ నా జగత్తు నేను కొత్తగా సృష్టిచేసినది. నా హృదయంలోమున్న పరశువేదిని ముట్టించక-ముందు ఈ శరదాకాశాన్న ఇంత బంగారువన్నె లేదు. క్షణక్షణానికి కొత్తగా పుట్టిస్తున్నాను ఈ వీరుని, ఈ సాధకుని, ఈ భక్తుని—అతను జ్ఞానోజ్జ్వలుడు, తేజోద్దీప్తుడు, భావాభి-షిక్తుడు అయిన, ప్రతిభాశాలి. నేను ప్రతిక్షణమూ ఇతనిలో కొత్త ప్రాణం పోస్తున్నాను, నాకు అది లోపునుంచి తెలు-స్తున్నది. ఇతను కేవలం నా సృష్టే. సందీప్ ఆవాళ నన్ను చాలా వేడుకొని ఒక పిల్లవాణ్ణి నా దగ్గిరికి తీసుకువచ్చాడు—అమూల్యచరణ్ ఆ పిల్లవాని పేరు, అతను సందీప్ భక్తుడు. అతని కళ్లలో ఒక 'కొత్త దీప్తి పుట్టిందిఅని నేను క్షణమాత్రంలో

పోల్చుకున్నాను. అతను విశ్వశక్తిని చూడగలిగాడని నాకు బోధపడిపోయింది. అతనిలోకూడా నా సృష్టి ప్రారంభం-అయింది. ఆ మర్నాడు సందీప్‌నాదగ్గిరికి వచ్చి అన్నాడు — "ఏమిటి మీ మంత్రశక్తి! ఆ పిల్లవాడు మరి ముందురోజుపిల్ల-వాడు కాడే! ఒక్కక్షణంలో వత్తి అంటుకొని వెలగడం ప్రారం-భించింది. ఈ అగ్నిజ్వాలను ఎవరు ఇంట్లో దాచి ఉంచగలరు? ఒకొక్కరే అందరూ వచ్చేస్తారు మీదగ్గిరికి— ఒకొక్కణ్ణి ఈలాగు వెలిగించి పంపించేశారంటే, ఒకనాడెప్పుడో గొప్ప దీపావళిపండగ అవుతుంది మనదేశంలో."

నా మహిమగురించే ఆలోచిస్తూ కూర్చున్నాను. ఆ నిషావల్ల మతి పోయింది. అటువంటప్పుడు నిశ్చయించుకు-న్నాను, భక్తుడుకోరే వరం నేను తప్పక ఇవ్వాలి అని. నేను కోరేది తప్పకుండా నెరవేరితీరుతుంది, నా కోరికను ఎవరూ అడ్డుపెట్టలేరు అని కూడా అనుకున్నాను.

ఆ రోజున సందీప్ దగ్గిరనుంచి వస్తూనే జుట్టు విప్పేసు-కొని మళ్లా కొత్తగా సిగ వేసుకున్నాను. మెడమీద పడకుండా జుట్టుఅంతా కూడదీసి మీదికి ఒక సగమోస్తరు కట్టడం మిస్ గిల్బీ నాకు నేర్పింది. ఆ సిగ నా భర్తకు చాలా ఇష్టం—అనాడు ఆ సిగ వేసుకున్నాను. ఆ సిగ చూచి ఒక మాటు ఆయన అన్నారు—"మెడకు ఉండే అందం కాళిదాసులాంటి కవికి చూపించకుండా భగవంతుడు నాలాంటి అ-కవి ముందర కన-పరుస్తున్నాడు. కాళిదాసు ఆ మెడను చూచి పద్మానికి తూంటి

ఉండే మృణాలం అనునేమో! కాని నాకుమాత్రం అది ఒక దివిటీ అనిపిస్తూఉంది—మీదనున్న సిగ నల్లని అగ్నిశిఖవలె మీదివైపు వెళుతున్నదా అనిపిస్తూఉంది." అలాగు అంటూ ఆయన నా మెడమీద—ఆహా! అదంతా ఇప్పుడు ఎందుకు?

ఆయనను అంతఃపురంలోకి రమ్మని కబురు పంపాను. మునుపు అబద్ధమా నిజమా అని ఆలోచించకుండా నానా-రకాల వంకలుపెట్టి ఆయనను మాటిమాటికీ లోపలికి రమ్మని కబురుపంపేదానను. ఇప్పుడు కొంతకాలంబట్టి ఒకమారైనా కబురుపంపలేదు. అందుచేత మిషకల్పించే శక్తికూడా నాలో పోయింది.

పంచు పెళ్లాం క్షయవల్ల బాధ పడిపడి చివరకు చచ్చిపో-యింది. పంచు ప్రాయశ్చిత్తం చేయించుకోవాలట, దానికి ఇరవై మూడురూపాయిలన్నర ఖర్చు అవుతుందని వాడిజాతి-వాళ్లు లెక్కవేసి చెప్పారు.

"ఇప్పుడు ప్రాయశ్చిత్తం చేసుకోకపోతేనేమి? నీకెందుకు భయం?" అని నేను అన్నాను.

అలిసి పడిఉన్న ఆవులాగు నావైపు కళ్లుఎత్తాడు—వాటి నిండా బాధా ఓర్పూ. "కూతురు ఉన్నది, దానికి పెళ్లికావాలి —పెళ్లాం దినవారాలుకూడా జరగాలి కదా!" అని అన్నాడు పంచు.

"నువ్వు పాపం చేశావే అనుకో, అయినా అందుకు ఇన్నాళ్లూ నువ్వు చేస్తూవచ్చిన ప్రాయశ్చిత్తం తక్కువ కాదే!" అని నేను అన్నాను.

"చిత్తం, తక్కువా! ఉండే భూమీ-పుట్టా కొంత అమ్మేశాను, మిగతాదంతా తనఖా పెట్టేశాను. అయినా బ్రాహ్మలకు దానాలూ దక్షిణలూ ఇవ్వకపోతే వీలుఅవుతుందీ!"

వాదన చేసి ఏమిలాభం! "ఈ దానాలు పుచ్చుకున్న బ్రాహ్మలకు ఎప్పుడు ప్రాయశ్చిత్తం అవుతుందో కదా!" అని నాలోనేను అనుకున్నాను.

అవతల, పంచు అసలు చేస్తున్నది ఉపవాసంతో యుద్ధం. అందులో ఈ జబ్బూ, మందుఖర్చులూ; దీనిమీద దిన వారాలు. దానితో వాడికి మరి కాళ్లు అందాయికావు. అటు-వంటప్పుడు మనస్సును ఏదోఒకమోస్తరుగా సంతోషపెట్టు-కుందామని ఒక సన్యాసిదగ్గిర చాలాగిరీ ఆరంభించాడు. వాడి కొడుకులూ కూతుళ్లూ తిండికిలేక బాధపడుతున్నారన్న మాట మరిచిపోగలిగాడు—ఈ కొత్త నిషాలో మునిగిపోవడంవల్ల కలిగిన లాభం అదొక్కటే. ఈ సంసారంలో సుఖంలేనట్టుగానే దుఃఖంకూడా లేదు, అంతా కల్లే,—అనే భావంతో మనస్సును రాత్రింబగళ్లు నింపుకున్నాడు. చివరకు నలుగురుపిల్లలనూ ఆ పడిపోతూఉన్న ఇంట్లో వదిలేసి బైరాగిఅయి పారిపోయి-నాడు.

నాకు ఆ సంగతి ఏమీ తెలియనేలేదు. ఆ సమయంలో నా మనస్సు సురాసురులు మథిస్తున్న ఒక మహాసముద్రమయి ఉన్నది. మాస్టరుగారు పంచుకొడుకులనూ, కూతుళ్లనూ, తన ఇంట్లో పెట్టుకొని పెంచుతున్నారనికూడా నాకు తెలియలేదు. మాస్టరుగారి కొడుకుకూడా అప్పుడే పెళ్లాన్ని తీసుకొని రంగూన్ వెళిపోయినాడు. ఆయన ఇంట్లోఒక్కడు, పగలంతా స్కూలు, ఇంటినిండా పిల్లలూ!

ఈలాగు ఒక మాసం గడిచింది, ఒకనాడు ప్రొద్దున్నే పంచు తిరిగి హాజరు—వైరాగ్యంనిషా వదిలిపోయింది. వాడ్ని పెద్దకొడుకూ, ఇద్దరుపెద్దకూతుళ్లూ వాడిదగ్గిర కూర్చొని,

"ఎక్కడికి వెళిపోయినావు నాన్నా," అని అడగడం ఆరంభించారు. అందరికంటె చిన్నవాడు ఒళ్లో కూర్చున్నాడు, అంతకంటె పెద్దపిల్ల వీపుమీద పడి మెడపట్టుకుకూర్చున్నది— అందరూ కలిసి ఏడుపు, వాడూ ఏడుపు ఆరంభించాడు. ఎంత ప్రయత్నంచేసినా ఏడుపుమాత్రం తగ్గదు. ఏడుస్తూ అన్నాడు —"మాస్టర్ బాబూ, వీళ్లకు రెండుపూటలూ కడుపునిండా తిండిపెడదామంటే శక్తి లేదు, వీళ్లను ఇటు పారేసి పారిపోదామా అనుకుంటే అటువంటి ముక్తి లేదు—నేను ఏమి పాపం చేశానని నన్ను ఈలాగు కట్టి కొట్టడం?"

అవతల, ఇంతకుముందు ఏచిన్న వ్యాపారంవల్ల వాడు కాలక్షేపం చేస్తూఉండేవాడో ఆ వ్యాపారం తన చేతిలోనుంచి జారిపోయింది. మొట్టమొదట కొద్దిరోజులు మాస్టరుగారిఇంట్లోనే వాడి బస. అదే పట్టుకుకూర్చుందామని వాడి ఉద్దేశం గాబోలు, తన ఇంటికి వెళ్లడంమాట ఎత్తనైనా ఎత్తలేదు. చివరకు ఒకనాడు మాస్టరుగారు అన్నారు—"పంచూ, ఇక నువ్వు మీ ఇంటికి వెళితే బాగుంటుంది. లేకపోతే ఇల్లూ వాకిలీ అన్నీ పాడుఅయిపోతాయి. నేను కొంతసొమ్ము నీకు ఇస్తాను, దానితో బట్టలుకొని తిప్పి అమ్ముకుంటే కాలక్షేపం అవుతుంది; కొంచెంకొంచెంగా నా అప్పు తీర్చేదువుగాని."

అది వినగానే పంచుమనస్సున సంతోషం మరి లేదు. దయాధర్మం అంటూ ప్రపంచంలో ఏదీ లేదు కదా అని అనుకున్నాడు. రూపాయిలు పుచ్చుకున్నప్పుడు మాస్టరుగారు

ఒక ప్రోనోటువ్రాసి ఇమ్మన్నారు. "అప్పు తీర్చాలి కధా, అటు-వంటి ఉపకారానికి విలువేమిటి?" అని పంచు అనుకున్నాడు-పై దానాలవల్ల ఎవరినైనా తన రుణంలో ఉంచుకోవడం ఎంతమాత్రం మాస్టరుగారికి ఇష్టంలేదు. మనస్సులో ఉండే స్వాభిమానం పోగొట్టడం జాలిపోగొట్టడం అని, ఆయన అంటూ ఉండేవారు.

నోటు సంతకంచేసి ఇచ్చినప్పటినుంచీ పంచు మాస్టరు-గారికి చేసిన నమస్కారాలలో భక్తి కొంత తగ్గింది—పాదధూళి తీసుకోవడం ఆగిపోయింది. మాస్టరుగారు తనలోతాను నవ్వు-కున్నారు—అందరూ చేస్తూఉండే నమస్కారాలు ఎంతతగ్గితే అంత బ్రతుకుతాను అని అనుకొనేవాడు ఆయన. ఒకరిని ఆదరించడం, ఒకరివల్ల ఆదరణ పొందడం—ఇదే మనుష్యులలో ఒకరికొకరికి ఉండవలసిన నిజమైన సంబంధం. భక్తి కనపరచడం చాలాదూరం వెళ్లడం అని ఆయన ఉద్దేశం. పంచు చీరలూ, చాపులూ, చలికాలానికి పనికివచ్చే రోమంబట్టలూ, కొని తీసుకువచ్చి వ్యవసాయదార్ల ఇళ్లవెంట తిప్పి అమ్మడం ఆరంభించాడు. అమ్మకంవల్ల వాడికి నగదు విస్తారం దొరికేది కాదు; చాలామంది రూపాయిలకు బదులుగా ధాన్యం కందులూ, పెసలూ, మొదలయినవి ఇచ్చేవారు, వీటిఖరీదు-మాత్రం నగదుఖరీదుకు మించిపోయేది. రెండు మాసాలలో మాస్టరుగారి అప్పుకు వడ్డీ, అసలులో కొంత భాగమూ, తీర్చేశాడు. అప్పు తీరిపోయిన వంతుకాడికి వాడుచేసే

నమస్కారాలుకూడా తగ్గిపోయినాయి. "మాస్టరుగారిని గురువు అని అనుకొనేవాణ్ణి, అది పొరపాటు; ఆయనకు డబ్బుఆశ లేకపోలేదు," అని పంచు తన మనస్సులో తాను నిర్ధారణ చేసుకున్నాడు.

పంచురోజులు ఈవిధంగా గడిచిపోను, కాని అటువంటప్పుడు స్వదేశీ ప్రవాహం బ్రహ్మాండమైన జోరుతో వచ్చిపడ్డది. మా గ్రామంవాళ్లూ, మా పక్కగ్రామాలవాళ్లూ, అనేకమంది పిల్లలు కలకత్తాలో స్కూళ్లలోనూ, కాలేజీలలోనూ, చదువుతుండేవారు. సెలవులలో వాళ్లు ఇళ్లకు వచ్చేశారు; అందులో చాలామంది చదువు మానేశారు. వాళ్లందరూ కలిసి సందీప్‌ని నాయకుణ్ణి చేసుకొని స్వదేశీ ప్రచారంలో పడ్డారు. అందులో అనేకమంది జీతంలేకుండా చెప్పించే మా హైస్కూలులో మెట్రిక్యులేషన్ పాసయిన వాళ్లు; చాలామంది కలకత్తాలో చదువుకోడానికి నాదగ్గిర స్కాలర్‌షిప్ తీసుకుంటూ ఉన్నవాళ్లు. వీళ్లందరూ ఒకనాడు పెద్దగుంపుగాచేరి మా ఇంటికి వచ్చారు — "మన శుక్‌సార్ సంతకు ఏవిధమైన విదేశీ సామానూ రాకుండా చేయాలి," అని అన్నారు.

"ఆ పని నేను చేయలేను," అని నేను అన్నాను.

"ఏమీా, మీాకు నష్టంవస్తుంది గాబోలు ?"

నన్ను అవమానపరచడానికి ఆలాగు అంటున్నారని బోధపడ్డది—"నాకు కాదు నష్టం, బీదవాళ్లకు," అని చెప్పబోతున్నాను.

మాస్టరు గారు దగ్గిర ఉన్నారు. "ఆహా, అవును ఆయనకు నష్టంకలుగుతుంది, సందేహం ఏమిటి? ఆ నష్టం మీది కాదు కదా!"

"దేశానికోసమని—"అని వాళ్లు ఏదో అనబోతున్నారు. మాట్లాడనివ్వకుండా మాస్టరుగారు అన్నారు—"దేశంఅంటే దేశంలో ఉండే మనుష్యులుగాని దేశంయొక్కమట్టికాదు గదా! ఒక్క మాటు కళ్లువిప్పి ఎన్నడూ మీరు వాళ్లను చూచిన పాపాన్న పోలేదే! ఇప్పుడు వాళ్లమీదపడి, 'మీరు ఏఉప్పు వాడుకచేస్తున్నారు, ఏబట్టలు కట్టుకుంటున్నారు,' అని అడుగుతూ వాళ్లను పీడిస్తారెందుకు? వాళ్లు అది సహించి ఊరుకోరు, వాళ్లను మేము ఊరుకోనివ్వము."

"మేము స్వదేశీఉప్పూ, స్వదేశీచీనీ వాడుతున్నాము, స్వదేశీబట్టలు కట్టుకుంటున్నాము."

ఆయన అన్నారు—"మీకు కోపంగా ఉన్నది, గనుక పట్టుదలగా ఉన్నది. మీరు ఆ మత్తుమీద చేయడంవల్ల చేసే దేదో సంతోషంతో చేస్తున్నారు. మీకు డబ్బుఉన్నది అందుచేత అర్ధణా అధికం ఇచ్చి స్వదేశీ వస్తువులు కొనుక్కోగలరు. దానివల్ల మీకు సంతోషం కలుగుతున్నది. మీ సంతోషానికి వాళ్లు అడ్డురాలేదే! కాని మీరు జోరుఉపయోగించి మీఇష్టప్రకారం వాళ్లచేత చేయించాలని చూస్తున్నారు. వాళ్లు 'చావునోట్లో పడకుండా ఈవాళ ఏలాగు గడపగలము అని,' ప్రతిరోజూ ప్రొద్దున్న మొదలు సాయంత్రంవరకూ నానా

రకాలఅవస్థలూ పడుతున్నారు. ఏలాగైనా బ్రతికిఉంటే చాలును అని గొంతుకలో ఊపిరిఆడుతున్నంతసేపూ అన్నిరకాల లాగు లాటలూ, పీకులాటలూ, పడుతున్నారు. వాళ్లకు అర్థణా అంటే ఎంతో మీరు ఎప్పటికీ ఊహించనైనా ఊహించ-లేరు. మీతో వాళ్లను సరిపోల్చడ మేమిటి? జీవనమంతా మీరు మీది గదిలోనే గడుపుతున్నారు, వాళ్లు కిందను పడిఉన్నారు—ఇప్పుడు మీ పూచీఅంతా వాళ్లనెత్తిమీద వేసేయాలని చూస్తున్నారా! మీ కోపమంతా వాళ్లద్వారా తీర్చుకోవాలని చూస్తున్నారా! అది ధైర్యహీనులైన అధ-ములలక్షణం అని నా నమ్మకం. మీరు ఎంతవరకు చేయగలరో చేయండి—నేను ముసలివాడను, అయినా చచ్చేవరకూ మీరే నాయకులంటూ మీవెనకనే రావడానికి సిద్ధంగా ఉన్నాను. కాని ఈ బీదవాళ్ల స్వాతంత్ర్యన్ని కాళ్లకింద వేసి తొక్కుతూ, మీ జయపతాకాలమీద 'స్వాతంత్ర్యము' అని పెద్దపెద్ద అక్షరాలతో వ్రాసుకుంటే, మీకు విరుద్ధంగా నేను పనిచేస్తాను. దానివల్ల చావువచ్చినా నాకు సమ్మతమే!"

అందులో, ఒకరిద్దరు కారేమో గాని, అందరూ మాస్ట-రుగారి శిష్యులే; అందుచేత పెంకిమాటలాడడానికి సంకోచిం-చారు. దానివల్ల రక్తంలో మరింత ఉడుకుపుట్టింది. కోపం మనస్సులో కుతకుతమని ఉడకడం ఆరంభించింది. నావైపు చూచి అన్నారు—"చూడండి, దేశంలోఉండే ప్రజలందరూ ఈవాళ వ్రతంపట్టారు, మీరు ఒక్కరే దానికి అడ్డువస్తారా?"

"అడ్డుపెట్టడం నాకు సాధ్యమే! యావచ్ఛక్తి వినియోగించి నాకు సాధ్యమయినంత సహాయం చేస్తాను," అని నేను అన్నాను.

ఎం. ఏ. క్లాసు కుర్రవాడు మెడవంక చేసి నవ్వుతూ అడిగాడు, "మీరు ఇప్పుడు చేస్తూఉన్న సహాయం ఏమిటి చెప్పండి చూదాము."

నేను అన్నాను, "స్వదేశీమిల్సునుంచి బట్టలూ, నూలూ, తెప్పించి మా సంతలలో దుకాణాలు పెట్టిస్తున్నాను—మా సంతలలోనేకాదు, ఇతరతాలూకాల సంతలకు కూడా పంపిస్తున్నాను."

ఆ కుర్రవాడు అన్నాడు, "కాని మీ సంతలలోకి వెళ్లి చూచివచ్చాము, స్వదేశీనూలు ఎవరూ కొనడంలేదే!"

"అది నా తప్పుకాదు, నా సంత తప్పుకాదు. దానికున్న కారణమంతా ఒక్కటే—దేశమందరూ మీ వ్రతం పట్టలేదు."

మాస్టరుగారు అన్నారు, "అదిఒక్కటే కారణం కాదు. వ్రతంపట్టినవాళ్ల వ్రతమైనా 'విఫలం చేయవలెను' అనే. వ్రతం పట్టని దేవాంగులచేతనే బట్టలు నేయించాలని మీ వ్రతం, వ్రతం పట్టనివాళ్లచేతనే స్వదేశీబట్టలు కొనిపిద్దామని మీ వ్రతం. అది సాధించే మార్గమేమిటి?—వీలయితే బలం ఉపయోగించడం, లేకుంటే జమీందార్ల కొరడాలు ప్రయోగించడం! దానిఅర్థము ఒక్కటే—వ్రతం మీది, ఉపవాసం వాళ్లది, ఉపవాసం తరవాత పారణ తిరిగీ మీదే!

సయన్సుక్లాసు కుర్రవాడు అడిగాడు, "ఉపవాసంలో మీరు తీసుకున్న వంతు ఏదో చెప్పండి?"

"వింటానంటే చెపుతాను," అన్నారు మాస్టరుగారు. "వినండి—తాను తెప్పించిన స్వదేశీనూలు తానే కొంటాడు. ఆ నూలు దేవాంగులకుఇచ్చి తానే బట్టలుసేయిస్తాడు. బట్టలనేత స్కూలుఒకటిపెట్టించాడు. ఆ నూలుతో గావంచాలు తయారు చేయించాడు; ఆగావంచాఖరీదు బనారసుచీరలఖరీదు అయిపోయింది—అంత వర్తకజ్ఞానం మా *బాబాజీది!—అందుచేత ఆ గావంచాలు అతనే కొనుక్కొని కూర్చుండేగదికి కర్టెన్‌లు చేశాడు—కాని దానివల్ల వెనకనుండేదిఏదీ మరుగుపడేది కాదు. స్వదేశీవ్రతం పట్టువిడవగానే మనదేశస్థుల పనివాడితనం చూచి అందరికంటే మీరే గట్టిగా నవ్వుతారు. తరవాత, ఆ స్వదేశీ రంగుగావంచాలు ఒకవేళ దొరలు కావాలంటారేమో గాని, మనవాళ్లు మాత్రం కావాలనరు."

ఇన్నాళ్లు నేను మాస్టరుగారితో కలిసి ఉన్నానుగాని ఆయనకు ఇంత శాంతిభంగం కలగడం నేను ఎన్నడూ చూడలేదు. అతనిమనస్సులో కొన్నాళ్లనుంచి ఒక మోస్తరు బాధ పుడుతూఉందని నాకు ఇప్పుడు స్పష్టం అయింది. అది లోలోపునే నిశ్శబ్దంగా పెద్దదయింది. ఆయనకు నామీదఉన్న ప్రేమ దానికి కారణం. ఆయనలోనున్న ఓర్మిచుట్టూఉండే గట్లను ఆ బాధే కొట్టేసింది.

---

* నిఖిల్

మెడికల్ కాలేజీ కుర్రవాడు అన్నాడు, "మీరు పెద్ద-వాళ్లు, మీతో మేము వాదన చేయకూడదు. అయినా ఒక్క-మాటలో చెప్పండి—"విదేశీసామాను మీ సంతలలోనుంచి పంపించేయనంటారా?"

"పంపించను. ఎందుచేతను అంటే—అది నా సామాను కాదు గనుక" అన్నాను.

"దానివల్ల మీకు నష్టంవస్తుంది గనుక" అని నవ్వుతూ ఎం. ఏ. క్లాసు కుర్రవాడు అన్నాడు.

"ఆహా, నష్టం వస్తుంది; ఎవరిది నష్టమో వాళ్లకే తెలుస్తుంది ఆ నష్టం ఎటువంటిదో!" అని మాస్టరుగారు అన్నారు.

అప్పుడు కుర్రవాళ్లందరూ "వందేమాతరం" అని గట్టిగా కేకలు వేసుకుంటూ బయటికి వెళిపోయినారు.

ఇదయిన కొన్నాళ్లకు, ఘంచూని తీసుకొని ఒకనాడు మాస్టరుగారు నాదగ్గిరికి వచ్చారు.

ఏమిటి సమాచారం?

వాడి జమీదారు 'హారిశ్ కుందు' వాడికి నూరు రూపాయిలు జరిమానా వేశాడు.

"ఏమీ, వాడు చేసిన అపరాధం ఏమిటి?"

"వాడు విదేశీబట్టలు అమ్ముతున్నాడు. ఎవడో వాణ్ణి పట్టుకొని వాళ్లజమీదారిదగ్గిరికి తీసుకువెళ్లాడు. వాడు

జమీందారుగారి కాళ్లమీద పడి వేడుకున్నాడు—"మహా ప్రభూ! పైవాళ్లదబ్బు అప్పుతీసుకువచ్చి బట్టలు కొన్నాను. ఈ నాలుగూ అమ్మేసి మరిఎప్పుడూ ఇటువంటిపని చేయను," అని అన్నాడు. ఆలాగు వల్లకాదన్నారు జమీందారుగారు. "నా ముందర అవన్నీ కాల్చి మరీవెళ్లు" అన్నారు. కడుపుమండి ఊరుకో లేక పంచు అన్నాడు అప్పుడు, "నాకు ఆంత సామర్థ్యం లేదు, నేను బీదముండావాణ్ణి, మీరు లక్షాధికార్లు; వాటి ఖరీదిచ్చి మీరు కొనేసుకొని కాల్పించేయండి." ఆమాటలు విని జమీందారుగారు అగ్నిహోత్రుడయిపోయి, "పొగరుబోతు వెధవ, మాటలు నేర్చుకున్నాడు! కొట్టండి నాలుగు జోడు దెబ్బలు" అన్నారు. పంచు తిట్లు తిన్నాడు, తగినశాస్తి అయి-పోయింది. పైగా జరిమానా కూడానా! వీళ్లే సందీప్ వెనక 'వందేమాతరం' అని కేకలువేసుకుంటూ తిరుగు తుంటారు! వీళ్లు దేశసేవకులు!"

"ఆ బట్టలు ఏమయినాయి?"

"తగలబెట్టేశారు."

"ఇంకఎవరెవరున్నారు అక్కడ?"

"లెక్కలేనంతమంది— 'వందేమాతరం' అని కేకలు వేస్తూ నిలుచున్నారు. సందీప్ కూడా ఉన్నాడు. చివరకు పిడికెడుబూడిద తీసిపట్టుకొని ఆరంభించాడు—సోదరులారా, మనము విదేశీవర్తకానికి అంత్యేష్టిసత్కారం జరిగిస్తున్నాము; ఆ సంబంధంలో మొదటిచితాగ్ని మీగ్రామంలో వెలిగింది.

అందుచేత ఈ భస్మం అతిపవిత్రమయినది. ఈ బూడిదె ఒంటిని రాసుకొని స్వదేశీకార్యం సాధించడానికి బయలుదేరండి."

"నువ్వు క్రిమినల్ కేసు పెట్టాలి పంచూ," అన్నాను నేను.

"ఎవరూ సాక్ష్యానికి రారు," అన్నాడు పంచు.

"ఎవరూ సాక్ష్యంచెప్పరూ! సందీప్! సందీప్!"

సందీప్ గదిలోనుంచి పైకి వచ్చి—'ఏమిటికథ' అన్నాడు.

"ఇతని బట్టలమూట వాళ్లజమీాదారుగారు నీఎదుటనే తగలబెట్టేశారట, నువ్వు సాక్ష్యంఇవ్వవూ?"

"ఇవ్వకేమి? తప్పకుండా ఇస్తాను — కాని నేను జమీాదారుగారి పక్షం సాక్ష్యంఇస్తాను," అని నవ్వుతూ అన్నాడు సందీప్.

"అదేమిటి! సాక్ష్యం అన్నాక ఫలానావారి పక్క అన్నమాట ఏమిటి? సాక్ష్యం ఎప్పుడూ ఒక్కపక్కే—సత్యం పక్క!"

"జరిగినదిఒక్కటే గాబోలు సత్యంఅంటే నీ ఉద్దేశం?" అని అన్నాడు సందీప్.

"అదికాక వేరే సత్యం ఎక్కడిది?"

సందీప్ అన్నాడు—"జరగవలసినదిఏదో అది అన్నిటి-కంటే గొప్పసత్యం. మాయతో ఈ జగత్తు ఏలాగు కట్టబడ్డదో అలాగే మిథ్యతో ఆ సత్యం మనము నిర్మించాలి. సృష్టిచేయ-

డానికి ఈ పృథ్వీమీదికివచ్చిన మహాపురుషులు సత్యాన్ని నిర్మిస్తారు గాని సత్యంవెనక వెళ్లరు."

"కాబట్టి?"

"కాబట్టి, మీరు దేనినైతే అబద్ధం అంటారో అటువంటి అబద్ధంసాక్ష్యం నేను ఇస్తాను. తమ రాజ్యాలనూ సామ్రాజ్యాలనూ విస్తరింపజేసినవారూ, క్రొత్త సంఘసాంప్రదాయాలూ మతాలూ స్థాపించినవారూ అబద్ధమంటే జడవలేదు—కాళ్లూ చేతులూకట్టేసిన-నిజము కోసము మీరు ఏర్పరచిన కోర్టులలోకి వచ్చి ఛాతీవిరుచుకునిలబడి, వాళ్లు నాలాగే అబద్ధాలు ధైర్యంగా చెప్పగలరు. అధికార్లకూ, పాలించేవాళ్లకూ, అబద్ధంఅంటే భయంలేదు. లోబడిఉండేవాళ్లకోసమే సత్యం-తో చేసిన ఇనపగొలుసులు. మీరు దేశచరిత్రలు చదవలేదూ? రాష్ట్రయజ్ఞాలు జరుగుతున్న పృథ్వీయొక్క పెద్దపెద్ద వంట-శాలలలో తయారవుతుంటుంది పొలిటికల్ ఖిచిడీ*— అందులో వేసే మసాలాదినుసు అబద్ధాలు, అది మీకు తెలి-యదూ?"

"ప్రపంచంలో చాలా ఖిచిడీ తయారు అవుతూఉంది ఇప్పుడు, గాని—"

"కాని మీకు వండడంతో సంబంధంలేదు; వంటఅయిన తరవాత అది నోటినిండా కుక్కుకొని మింగవలసినవాళ్లు మీరు. బంగాళా దేశం రెండు ముక్కలు చేసేస్తారు, అది మన

* పప్పూ, బియ్యమూ, నెయ్యీ, మసాలా వేసి తయారుచేసే వంట.

మంచికోసంచేసిన పనే అంటారు మన పరిపాలకులు. ఉన్నత విద్య మనకు దొరకకుండా తలుపులుగట్టిగా బిగించేస్తారు, అదంతా మన ఆదర్శాలు ముందుకుతీసుకువద్దామనే సదుద్దేశంతోనే అని అంటారు. మీరు సాధువులయి కళ్ల నీళ్లు పెట్టుకొని ఇంట్లో ఒకమూల కూర్చుంటారు, మేమైనా ప్రయత్నంచేసి అబద్ధాలతో కోట దిట్టపరుచుకోవద్దూ ?"

అప్పుడు మాస్టరుగారు అన్నారు—"ఇవన్నీ వాదన చేయవలసిన మాటలు కావు నిఖిల్. మనలోనూ అందరిలోనూ కూడా మూలమైన వస్తువయి ఉన్నది మహోత్కృష్టమైన సత్యము. ఆ సత్యాన్ని చుట్టబెట్టిఉన్న అన్ని ఆవరణలూ తెగగొట్టి, దానిని మన పనులలో వెల్లడిచేయడమే మానవ జన్మంయొక్క ముఖ్యోద్దేశం గాని, బయటనుండే నిస్సారమైన వస్తువులను పోగుచేసుకుంటూ కూర్చోవడం కాదు, అని లోపునున్న సత్యాన్ని గ్రహించనివాడు ఏలాగు నమ్మగలడు."

సందీప్ నవ్వుతూ అన్నాడు—"సరీగా స్కూలుమాస్టరు అనవలసిన మాటలే మీరు అన్నవి. అటువంటివి పుస్తకాలలో ఉండవలసిన మాటలు. ప్రపంచంలో మనకళ్లముందర కనబడేవి ఇంకొకమోస్తరు పనులు. స్తూపాకారంగా అన్నీ కూడబెట్టుకోవడమే మనుష్యులు చేస్తూఉన్న ముఖ్యమైన కార్యసాధన. అటువంటివాళ్లు విజ్ఞాపనపత్రికలలో పెద్దపెద్దఅక్షరాలతో అబద్ధాలు వ్రాస్తారు; రాజకీయ వ్యవహారాలకోసమని ఉంచిన చిత్తాలలో పెద్దపెద్దకలాలతో అబద్ధంలెక్కలు ఎక్కిస్తారు;

వాళ్ల వార్తాపత్రికలన్నీ సామానుతో నిండిన పడవలాగు అబద్ధాలతో నిండిఉంటాయి; ఈగలు విషజ్వరంయొక్క బీజాలు అంతటా వ్యాపింపజేసేటట్టు, వాళ్ల మత-ప్రచారకులు అబద్ధాలు ప్రచారంచేస్తూ తిరుగుతుంటారు. నేను వాళ్ల శిష్యుణ్ణి. నేను కాంగ్రెస్‌కోసమని పనిచేస్తున్నప్పుడు బజారు పద్ధతులు కాస్త కని పెట్టి ఒక రహస్యం నేర్చుకున్నాను—ఎటువంటి సంకోచమూ లేకుండా అరపాలు. సత్యంలో తొంభై తొమ్మిదిన్నర పాళ్లు అసత్యం కలిపేవాణ్ణి. ఇప్పుడు నేను కాంగ్రెస్‌లో లేను, గాని అప్పుడు నేర్చుకున్నదిమాత్రం మరవలేదు. మానవుని లక్ష్యం సత్యముకాదు, ఫలలాభము—ఇదే అన్ని నీతులయొక్క సారమని నా నమ్మకం."

"సత్యే ఫలలాభం!" అన్నారు మాస్టరుగారు.

"అవును మిథ్యను పండించడంవల్లనే ఆ పంట పండుతుంది. కాళ్లకిందనున్న మట్టిని గుండగుండగా కొట్టినతరవాతనే ఆ పంట పండుతుంది. సత్యం అని దేనిని అంటామో అది దానంతటఅదే పుట్టి పెరుగుతుంది. అది కలుపు, గాబు; అదిముళ్లమొక్కలాంటిది—దానిని ఆశ్రయించుకొని కూర్చుం డేవి పురుగులు," అని అన్నాడు సందీప్.

అంటూ తొందరతొందరగా వెళిపోయినాడు; మాస్టరు గారు చిరునవ్వు నవ్వి నావైపుచూస్తూ అన్నారు—"సందీప్‌కు మతం లేకపోలేదు—మన మతానికి విరుద్ధమైనది అతనిమతం. అతను చంద్రుడే, అయితే కర్మవశాత్తు పూర్ణిమనాడు ఉండ్డేవైపు

కాక రెండో వైపు వెళ్లి పడి, అమావాస్యచంద్రుడు అయి-పోయినాడు.”

“అందుచేతనే నామతమూ అతనిమతమూ ఎన్నటికీ ఒకటికాకుండాఉన్నవి. కాని అతనంటే నాకు సహజంగా ఒక ఆకర్షణ ఉన్నది. అతనివల్ల నాకు చాలా నష్టంకలిగింది. ముందుకు మరీవిస్తారంగా కలుగుతుంది, అయినా అతనిని నిందించలేను.”

మాస్టరుగారు అన్నారు—“క్రమంగా నాకూ బోధ-పడ్డది. సందీప్ చేసేదంతా సహిస్తూ ఏలాగు ఊరుకుంటున్నా-వని చాలారోజులనుంచీ ఆశ్చర్యపడుతున్నాను. అది నీలోఉండే బలహీనతవల్ల అని కూడా అనుకున్నాను. మాటలకలయికలేదు గాని గతి నీదీ సందీప్‌దీ ఒకటే.”

నేను హాస్యానికి అన్నాను, “మిత్రుడూ మిత్రుడూ కలిసి *అమిత్రాక్షరియా! నాకు మిత్రుడు అవసరంలేదు; అదృష్టం అనే కవి నావిషయమై ప్యారడైజ్ లాస్ట్ లాంటి కావ్యంఒకటి వ్రాయబూనుకున్నట్టు ఉంది— అది అమిత్రాక్షరి గనుక నాకు మిత్రుడు అక్కరలేదు, ప్రాస అవసరంలేదు గనుక తోడు అక్కరలేదు!”

“పంచు సంగతి మనం ఇప్పుడు ఏమిచేయడం?” అని మాస్టరుగారు అడిగారు.

“పంచుఇల్లుఉండే జాగామీద హక్కు వాడికి చాలా-కాలంకిందటనే వచ్చేసింది. జమీందారు వాణ్ణి అక్కడనుంచి

---

* బ్లాంక్ వర్స్: Blank Verse:

ఏలాగైనా తరిమేయాలని చూస్తున్నాడు అని మీరు నాతో ఇంతకుముందు చెప్పారు. వాడిజాగా నేను కొనేసి వాణ్ణి అక్కడనే ఉంచుదామని చూస్తున్నాను," అని అన్నాను నేను.

"నూరు రూపాయిల జరిమానా ?"

"జాగా నాది అయిపోతుంది. జరిమానా రూపాయిలు ఏలాగు వస్తాయి ?"

"వాడిబట్టల మాటో మరి ?"

"వాడికి ఇంకొకటి కొనిఇస్తాను. నా ఎస్టేటులో మనిషి, వాడి ఇష్టమువచ్చిన బట్టలుఅమ్ముకుంటాడు, ఎవరు అడ్డుపెట్టగలరో చూస్తాను."

చేతులు జోడించుకొని పంచు అన్నాడు, "రాజూ రాజూ దెబ్బలాడుతుంటే పోలీసుఇన్స్పెక్టర్లూ, వకీళ్లూ, బారిస్టర్లూ, రాబందులలాగు వచ్చికూర్చుంటారు ; నలుగురూ చూచి నవ్వుతుంటారు ; చివరకు చావడం అనేసరికి నేనే రావాలి."

"ఏమిరా, నీకెందుకు భయం ?"

"నా ఇంటికి నిప్పుఅంటించేస్తారు. పిల్లలూ నేనూ అందరమూ దానిలోకాలి చస్తాము."

మాస్టరుగారు అన్నారు—"సరే నువు భయపడకు. నీ పిల్లలను కొన్నాళ్లదాకా మాఇంట్లోఉంచు, నీ ఇష్టంవచ్చినపని చేసుకుంటూ మీ ఇంట్లోనువ్వుఉండు. నీ ఒంటిమీద బ్రహ్మదేవుడు చెయ్యి వేయలేదు. అన్యాయానికి జడిసి నీవు పారి-

పోతానంటే నేను ఎంతమాత్రం ఒప్పుకోను. సహించి ఊరుకున్న కొలదీ నెత్తిమీద బరువు విస్తారం అవుతుంటుంది."

పంచుస్థలం క్రయచీటి ఆవాళే రిజిస్టరీ చేయించి, స్థలం వశపరచుకున్నాను. అప్పటినుండి ప్రారంభంఅయింది గోల్ మాల్.

పంచుకు వచ్చిన ఆస్తి వాడి తాతగారిది, అనగా తల్లితండ్రిది. వీడుతప్ప మరెవరూ వార్సులు లేరని అందరికీ తెలుసును. హఠాత్తుగా ఎక్కడనుంచో 'నాకు జీవితపు హక్కు ఉన్నది' అంటూ మూటాముల్లితోసహా జపతావళం తిప్పుకొంటూ ఒక అత్తగారూ, ఆమెవెధవకూతురూ ఇంటికి వచ్చి కూర్చున్నారు.

పంచు నిశ్చేష్టుడయిపోయి, "చాలా కాలం అయిందే మాఅత్త చచ్చిపోయి!" అని అన్నాడు.

దానికి జవాబు ఏమిటంటే, పంచు తన మామ మొదటి పెళ్లాం మాటే అనుకుంటున్నాడు అని. పంచుమామ రెండో పెళ్లామో?

కాని మామ చచ్చిపోయి చాలాకాలం అయినతరవాత అత్త చచ్చిపోయిందే! రెండోపెళ్లికి అవకాశం ఎక్కడ?

అది కాదన లేదు ఆ అత్త. అయితేనేమి, రెండోపెళ్లి మొదటి పెళ్లాం పోయిన తరవాత కాదు, పోకముందే. సవతితో కలిసి సంసారం చేయలేక అమ్మగారింట్లోనే ఉన్నదట, మొగుడు చచ్చిపోయినాడని తెలియగానే వైరాగ్యంపుట్టి

బృందావనం వెళిపోయిందట. "సుందు జమీందారుగారి ఉద్యోగస్థులకూ, కొంతకొంతమంది ప్రజలకూ, ఆ సంగతి తెలిసిఉంటుందనుకుంటాను. జమీందారుగారు గట్టిగా ఒక కేకవేశారంటే నా పెళ్లినాడు విందుకువచ్చినవాళ్లుకూడా బయలుపడవచ్చును." అని ఆమె అన్నది.

'ఇదేమిటి ఈగ్రహచారం పంచుకి మళ్లాను?' అన్న నాలో నేను ఒకనాడు అతి చికాకుపడుతూ ఉన్నాను. అటువంటప్పుడు అంతఃపురంలోనుంచి కబురువచ్చింది విమల పిలుస్తున్నదని.

ఉలికిపడ్డాను. "ఎవరు పిలుస్తున్నారు?"

"రాణిఅమ్మగారు"

"రెండోరాణీఅమ్మా?"

"చిన్నరాణీఅమ్మ."

"చిన్నరాణి!" వంద సంవత్సరాలనుంచి చిన్నరాణి నన్ను పిలవడంలేదు అనిపించింది.

చావిడిలో కూర్చున్నవాళ్లనందరినీ అక్కడనే కూర్చోమని చెప్పి అంతఃపురంలోకి వెళ్లాను. పడకగదిలో విమలను చూచి మరీఆశ్చర్యపడ్డాను—విస్తారం కాకపోయినా, ఒళ్లంతా మాత్రం కొద్దో గొప్పో ముస్తాబుచేసుకొంది. కొంతకాలంబట్టి ఆ గదికూడా ఎవరూ చక్కబెట్టడం లేదు. అన్నీ చాలా తారుమారుగా పడిఉన్నది. చూచేసరికి విమల కేవలం పర-

ధ్యానంగాఉన్న మనిషిలాగు కనబడుతూఉంది. ఆ గదికూడా ఆనాడు వెనకటి మోస్తరుగా కొంచెం చక్కబెట్టినట్టు ఉన్నది.

విమలముఖం చూస్తూ నిలబడ్డాను. నేను ఏమీ అనలేదు. విమల ముఖం ఎర్రగా చేసుకుంది. కుడిచేతితో ఎడమచేతి గాజులు అతివేగంగా తిప్పుతూ అన్నది —
“చూడండి, మన దేశం అంతటిలోకి కేవలం ఒక్క మన సంతకుమాత్రమే విదేశీబట్టలు దిగుమతి అవుతున్నవి. అది బాగుంది అంటారా?”

“ఏమిటి చేస్తే బాగుంటుంది?”

“అవన్నీ సంతలోనుంచి వెళ్లగొట్టేయాలి”

“సామాను నాది కాదే?”

“కాని సంత మీదేనా?”

“సంతమీద నాహక్కుకంటె కొనడానికి అక్కడికి సదా వచ్చేవాళ్ల హక్కు అధికము.”

“వాళ్లు స్వదేశీవస్తువులు కొనుక్కోవచ్చును!”

“కొంటే నాకు సంతోషమే.. కాని కొనకపోతే?”

“అదేమి టామాట? అంత పొగరా వాళ్లకు? అలా అయితే—”

“నాకు అట్టే వేళ లేదు ఇప్పుడు. దానిగురించి వాదన చేసి ఏమిప్రయోజనం? వాళ్లను నేను ఎంతమాత్రం బలవంతపెట్టలేను.”

"బలవంతం మీ స్వలాభంకోసం కాదే! దేశం కోసము."

"దేశాని కోసం చేసిన క్రూరప్రవర్తన దేశం మీద చేసిన క్రూరప్రవర్తనే. ఆసంగతి నీకు బోధపడదు."

ఆలాగు అంటూ పైకి వచ్చేశాను. ప్రపంచంఅంతా అకస్మాత్తుగా దీప్తితో నిండిఉన్నదన్నట్టు నా కళ్లకు అగపడ్డది. భూమికిఉండే భారమంతా పోయిందనిపించింది—తన మీద నుండే సకలజీవరాసులను పోషిస్తూ, రాత్రిపగళ్లను జపమాల-లాగు అతివడిగా తిప్పుతూ, యుగాల తరబడి ఆకాశంలో గిర్రున తిరుగుతుండడం దానికి ఇంత సులభమయిన పనా అనిపించింది. దాని అనుభవం నాలోపున నాకు కలిగింది. అది వహిస్తూఉన్న భారానికీ అంతం లేదు, అది అనుభవిస్తూఉన్న ముక్తికీ అంతంలేదు. ఎవరు దానిని ఆపగలరు? ఎవరూ ఆపరు. ఏవిధంగానూ ఆపలేరు. అకస్మాత్తుగా, నా మనస్సులోనున్న లోతులోనుంచి గొప్ప ఆనందం పుట్టింది—సముద్రంమధ్య లేచి ఆకాశాన్ని అంటుకొంటున్న జలస్తంభం అది.

"హఠాత్తుగా నీలోజరిగిన దేమిటి?" అని అనేకసార్లు నన్ను నేను ప్రశ్నించుకున్నాను. మొట్టమొదట ఎటువంటి జబాబూ రాలేదు. తరవాత స్పష్టంగా బోధపడ్డది. కొద్ది రోజులనుంచీ నా మనస్సును కట్టి బాధకలిగిస్తూఉండే బంధం తెగిపోయింది. మనస్సులో మరి ఎటువంటి కలతగాని మబ్బుగాని లేదు. అది చూచి నేను ఆశ్చర్యపోయినాను. ఫొటోగ్రాఫ్

ప్లేటులో బొమ్మపడ్డట్టుగా, అతివివరంగా విమలకుండే సమస్తమూ నా మనస్సులో పడ్డది. నన్ను సంతోషపెట్టి తన పని సాధించు-కుందామని ప్రత్యేకంగా ముస్తాబుఅయి వచ్చింది, అది స్పష్టం. ఇప్పటివరకు విమలనూ విమలముస్తాబునూ వేరువేరుగా ఎన్నడూ నేను చూడలేదు. ఈవాళ ఆమె తలనున్న విదేశీసిగ కేవలం తలమీద పెట్టిన వెండ్రుకలచుట్టలాగు నాకు కనబడ్డది. 'ఒకనాడు ఆ సిగ నాకంటికి అమూల్యమయిన వస్తువయి ఉండెను.' ఈవాళ విమల దానిని అతిచవకగా అమ్మడానికి సిద్ధపడ్డది.

సందీప్‌కీ నాకూ స్వదేశీవిషయమయి మాటిమాటికీ వాదన జరుగుతుండేది. నాకూ అతనికీ చాలా మతభేదం ఉన్నది, విరోధంకలుగుతుంటుంది. కాని ఆ విరోధం నిజమైన విరోధం, మతభేదం వల్లవచ్చిన విరోధం. కాని విమల నాతో అంటూఉన్న మాటలన్నీ కేవలము సందీప్‌నీడతో తయారయినవి, అతని ఐడియాలతో చేయబడ్డవి కావు—నీడ మారుతుంటే ఈమె మాటలుకూడా మారుతుంటాయి. ఇదంతా నాకు స్పష్టంగా తెలిసింది. లేశమాత్రమయినా సందేహంలేదు.

విరిగిపోయిన పంజరంలాంటి నా పడకగదిలోనుంచి బయటికి వచ్చాను. బయిటనున్న ఎండ ప్రపంచాన్ని బంగారపు కాంతితో నింపుతూఉంది. తోటలో చెట్లకింద మైనగోరల-గుంపుఒకటి, ఏకారణంచేతనోగాని, కిచకిచమంటూ పెద్ద సందడి చేస్తున్నవి. వరండాకు దక్షిణంవైపుఉన్న రోడ్డుమీద రెండు-

వైపులా చెట్లు ఉన్నవి. ఆ చెట్లనిండా ఉండే పువ్వులశోభతో ఆకాశం నిండిపోయింది. మరికొంచెందూరంలో, బయటనున్న రోడ్డుపక్కను, ఎడ్లువిప్పేసిన బండిఒకటి నేలమీద వాలిఉన్నది. విప్పిన రెండుఎడ్లలో ఒకటి గడ్డిమేస్తున్నది. రెండోది కాళ్లు నిగడతన్నిఎండలో పడుకొనిఉన్నది. దానివీపుమీద ఒక కాకి కూర్చొని ముక్కుతో పొడిచి పురుగులు ఏరుకుంటున్నది— సుఖంగాఉండడంచేత ఎద్దు కళ్లుమూసుకున్నది. ఈ విశ్వమంతటిలోకి మిక్కిలి విలువయినది, ఎటువంటి కృత్రిమమూలేనిది ఏదిఉన్నదో, ఈ రోజున దానిదగ్గిరికి వచ్చి కూర్చున్నాను అనిపిస్తున్నది. దాని లోపున కొట్టుకుంటూఉన్న గుండె స్పష్టంగా వినబడుతున్నది. దాని వేడివేడి ఊపిరి ఆ పువ్వుల వాసనతో కలిసి వచ్చి నా హృదయంమీద పడుతున్నది. నేను ఉన్నాను స్వేచ్ఛగా మిగిలినదంతా ఉన్నది స్వేచ్ఛగా—ఈ రెండూ కలిసి ఆకాశాన్ని సంగీతంతో నింపుతున్నవి—ఏమి మనోహారం ఆ సంగీతం!

తరవాత ఆ పంచు జ్ఞప్తికి వచ్చాడు. ఒకమూలనుంచి దారిద్ర్యము, ఇంకొక మూలనుంచి కపటము, ఈ రెండూకలిసి ఉంచిన బోనులో పడిపోయినాడు. మీదనుంచి బంగారపుఎండ కాస్తూఉంటే, కాళ్లు నిగడదన్ని దేశము యావత్తూ ఆక్రమించుకొని పడిఉన్న ఎద్దులాగు ఉన్నాడు ఆ పంచు. దానివలె కళ్లుకూడా మూసుకొనే ఉన్నాడు. కాని సుఖంచేతకాదు, గ్లానివల్ల, వ్యాధివల్ల, ఉపవాసాలవల్ల. మన దేశమంతటా

వ్యాపించిఉన్న రయితుల దుస్థితిని తెలియజేసే బొమ్మ మన పంచు. తన స్థూలకాయంనిండా విభూతిపెండెలు పెట్టుకొన్న, ఆ పరమనిష్ఠాపరుడు, వారిశ్ కుండును చూచాను. అతనూ ఏమీ చిన్నమనిషి కాదు, భయంకరమైన ఆకారం అతనిది—వెదురు-వనంఅడుగున ఎన్నో సంవత్సరాలబట్టి చేరుతున్న మురికినీళ్లు ఒక పెద్దచెరువుఅయి ఉన్నవి, జిడ్డు దానిమీద పచ్చని మీగడలాగు ఒకచివరనుంచి ఇంకొక చివరవరకూ వ్యాపించి ఉంది— దానిలాగు ఉన్నాడు మన కుండూ, ప్రతిక్షణమూ విషబుద్బుదాలు కక్కుతున్నాడు.

మనదేశంలో ఒక బ్రహ్మాండమైన తామసికత ఉన్నది. ఒకపక్కను కనబడుతున్నది—అజ్ఞానాంధకారం, ఉపవాసాలవల్ల కృశించిపోవడం, నిరాశవల్ల ఇగిరిపోవడం. వీటికి కారణమైన ఆ తామసికతే రెండోపక్కను చస్తున్నవాళ్ల రక్తం పీల్చి, బాగా ఉబ్బి, తన చలనంలేని జడత్వంకింద ఈ పృథ్విని తొక్కి పీడి-స్తూఉంది. చివరవరకూ దానితో యుద్ధంచేయాలి. అపనే వందలకొలది సంవత్సరాలబట్టి నడుస్తూ ఆగుతూవస్తున్నది. నా దుర్నిద్ర పోవలెను. నాచుట్టూఉన్న ఆవరణ పడిపోవలెను. అంతఃపురజాలలో చిక్కుకొని నా జీవితం వ్యర్థం చేయకూడదు. మేము పురుషులము. ముక్తే మా సాధన. *ఐడియల్ యొక్క-పిలుపు వినగానే ముందుకు, దానివైపు, పరుగెత్తుతాము. దైత్య-పురిగోడలు దాటి మధ్యనున్న లక్ష్మిని పైకి తీసుకురావలెను.

---

* ఐడియల్ : ఆదర్శము.

ఆ దండయాత్రకోసమని తన నిపుణహస్తంతో జయపతాకం తయారు చేసేదే మా కంటికి నిజమైన సహధర్మిణి. ఇంటిమూల కూర్చొని మాకోసం ప్రేమజాలం అల్లనివ్వము, ఆమెఛద్మవేషం ఈవాళ ముక్కలుముక్కలుచేసి ఆమెయొక్క నిజస్వరూపంతో ఆమెను చూస్తాము. ఆమెను మాకోరికలతోనే అలంకరించి అప్సరసను చేసి, మాతపస్సునే భంగంచేయడానికి తీసుకురాము. నేను జయంపొందుతాను అని నాకు ఈవాళ నమ్మకం కలుగుతున్నది. ఉన్నది ఉన్నట్టు కనబడుతున్నది. నేను ముక్తిని పొందాను, నేను ముక్తిని ఇస్తాను. నాపని నేను చేసుకుంటాను. దానిద్వారా జీవనం సఫలంచేసుకుంటాను.

తిరిగీ అప్పుడప్పుడు లోపున బాధపుడుతుందని నాకు తెలుసును. కాని దాని సంగతి బోధపడ్డది, గనుక ఇక దానిని లక్ష్యపెట్టను. ఆ దుఃఖము నా ఒక్కడిదే, గనుక దానికున్న విలువఏమిటి? విశ్వమంతటా వ్యాపించిఉన్న దుఃఖాన్ని హారం చేసి మెడలోవేసుకుంటాను. ఓ సత్యమా! రక్షించు, నన్ను రక్షించు! మోసముతో కట్టిన దొంగస్వర్గానికి నన్ను తిరిగీ వెళ్లనివ్వకు. నేను ఒంటరి బాటసారిని కావలసివస్తే అవడానికి సంసిద్ధుడను, గాని నేను వెళ్లేబాట నీ బాటే అవునుగాక! నా లోపున ఈవాళ నీ జయభేరీ మోగుతున్నది.

విమల ఆవాళ రమ్మని నాకు కబురుపంపింది. వెళ్లాను. కొంతసేపటివరకూ నోటివెంట మాటలేదు. కళ్లుమాత్రం నీళ్లతో నిండిపోతున్నవి. నిఖిల్ దగ్గిర ఏమీ సాధించలేక పోయింది, బోధపడుతూఉంది. ఏలాగైనా సాధిస్తాను అనే గర్వంతో వెళ్లింది గాని నాకుమాత్రం అంతగా ఆశలేదు. పురుషుడు ఎక్కడదుర్బలుడో స్త్రీకి బాగాతెలుసును, గాని పురుషుడు ఏవిషయాలలో నిగ్గయినపురుషుడో ఆవిషయాలలో స్త్రీకి పరమరహస్యం. ఆ రహస్యం, ఛేదించడం స్త్రీకి చేతకాదు. నిజమేమిటంటే, స్త్రీవ్యక్తి పురుషునికి అభేద్యం, పురుష వ్యక్తి స్త్రీకి అభేద్యం. ఆలాగే కానిపక్షమందు 'స్త్రీ' అనీ, 'పురుషుడు' అని రెండుజాతులు అనవసరము—సృష్టి తనశక్తి వ్యర్థపరుచుకున్నట్టే!

గర్వం! స్వాభిమానం! అవసరమయినది కాలేదు అని కాదు; తననోటితో తానుఅడిగినది దొరకలేదు అని దుఃఖం! ఈ 'నా' 'నేను' కోసమని స్త్రీలో ఎన్నో చిన్నెలూ వన్నెలూ, ఎంతో ముస్తాబు, ఎంతో ఏడుపు, ఎంతో నవ్వు, ఎంతో మోసము, ఎన్నో వేషాలు పుట్టాయి. అందులోనే ఉన్నది ఆమె మాధుర్యం. వ్యక్తివిశేషం మనకంటె వాళ్లలో బలంగా ఉంటుంది. మనను సృజిస్తున్నప్పుడు దేవుడు స్కూలుమాస్టరు

—అతని దస్తరంలో విధులూ, నిషేధాలూ, నీతులూ తప్ప మరేమీ లేవు. వాళ్లను పుట్టించినప్పుడు హెడ్‌మాస్టరుపనికి రాజీనామా పెట్టేసి, ఆర్టిస్ట్‌అయి బయలుదేరాడు; అప్పుడు దగ్గిర ఉన్నవి రంగులపెట్టే, కుంచీ—అంతే!

గర్వభంగం కావడంచేత ముఖం ఎర్రగా కందిపోయి కంటనీళ్లు పెట్టుకొంటూ విమల అక్కడ నిశ్శబ్దంగా నిలబడ్డది. సూర్యాస్తమయ మప్పుడు దిగంతాన కనబడే వర్షపుమేఘం ఆమె; ఈవాళ అగ్నితో కూడా నిండి ఉన్నదా అనిపించింది. అతి మనోహరంగా ఉన్నది చూడడానికి. బాగా దగ్గిరికి వెళ్లి చెయ్యి పట్టుకున్నాను. ఆమె చెయ్యి వెనకకు తీసుకోలేదు, గజ గజ వణకడం ఆరంభించింది. "మనమిద్దరమూ సహయోగులము! మనఇద్దరిదీ ఒకటే లక్ష్యం. కూర్చొండి ఇక్కడ," అని నేను అన్నాను.

ఆలా అంటూ విమలను ఒకకుర్చీమీద కూర్చోపెట్టాను. కాని ఏమిటీయాశ్చర్యం! అంత వడీ వచ్చి ఒక్కమాటు తకీమని నిలబడిపోయింది. పద్మానది శ్రావణమాసంలో హోరు హోరుమని శబ్దంచేసుకుంటూ, ముందు కనబడ్డవన్నీ తోసు కుంటూ అతివడిగా ప్రవహించుకుపోతుంటుంది—దేనినీ మరి ఉండనివ్వదు అనిపిస్తుంది. అంతజోరయినది కూడా ఒకొక్క-చోట, ఏకారణమూ లేనిదే తిన్ననీ తనదారి పూర్తిగా వదిలిపెట్టి, ఒక పక్కనుంచి రెండోపక్కకు తిరిగిపోతుంది. అడుగునుంచి ఎటువంటిఅడ్డు వచ్చిందో ఆ మకరవాహినికే తెలియదేమో.

విమలచెయ్యి గట్టిగా పట్టుకొని కూర్చున్నాను. నా దేహవీణలో చిన్నా పెద్దా, అన్నితీగలూ ఝుంకారం ఆరంభించాయి. కాని అది ఆ 'అస్థాయి' దగ్గరనే ఆగిపోయిందేమి? 'అంతరం' వరకూ నడిచింది కాదేమి? బోధపడ్డది—జీవనప్రవాహంకిందను లోతుగా అడుగునఉండే నేల చిరకాలంనుంచి పారుతున్న నది-వల్ల తయారుఅయినది. ఇచ్ఛాప్రవాహం, ప్రబలమయి పారు-తున్నప్పుడు ఒకొకదగ్గిర అడుగున కన్నం చేసేస్తుంటుంది, ఒకొకదగ్గిర అలాగువచ్చి నిలబడిపోతుంటుంది. నా లోపున ఏదో సంకోచం ఉండిపోయిందనుకుంటాను. అది కేవలం ఒక్క-వస్తువు కాదు, అనేకము కలిసి తయారయినది. అందుచేతనే దాని ఆకారం స్పష్టంగా తెలియడం లేదు, అది ఏదోఒకవిధమైన అడ్డు అని మాత్రం తెలుస్తున్నది. ఏది ఏలాగైనా ఒకటిమాత్రం నిజము—నేను ఎన్నడూ, ఏకోర్టులోపడితే ఆకోర్టులో, ప్రమాణాలతోకూడా రుజువుపడను. నేను నాకే రహస్యం, అందుచేతనే నేనంటే నాకు అంత ఆకర్షణ; నన్ను నేను పూర్తిగా పోల్చేసుకుంటే ఆ ఆకర్షణ ఒకమూలతోసేసి తురీయ అవస్థలోకి వెళిపోయిఉందును.

కుర్చీమీద కూర్చొనిఉన్నది విమల. చూస్తూఉండగానే ముఖం తెలతెల్లగా అయిపోయింది. శనిచేతిలోనుంచి తప్పించు-కువచ్చాను అనుకున్నది. ధూమకేతువు ఝాఁమంటూవచ్చింది, గాని పక్కనుంచి వెళిపోయింది. ఆ నిప్పుతోకరాపుడువల్ల విమల కొంచెంసేపు మూర్ఛపోయినట్టు అయిపోయింది. ఆ

మూర్ఛ పోగొడదామనే ఉద్దేశంతో మాట్లాడం ఆరంభించాను.
"అడ్డుఉన్నది. కాని దానికని దుఃఖపడవద్దు, దానితో యుద్ధం చేదాము,—మీరేమంటారు, రాణీ ?"

విమల కొంచెం దగ్గి గొంతుక సవరించుకొని, "ఆహా" అన్నది—అంతే.

"మన పని ఏలాగు ఆరంభించాలో ఆ ఏర్పాట్లగురించి కొంచెం స్పష్టంగా అనుకుందాము," అని నేను అన్నాను.

అంటూ జేబులోనుంచి. పెనసలూ కాగితమూ తీశాను. కలకత్తానుంచి మా దళం కుర్రవాళ్లు వచ్చి ఉన్నారు. వాళ్లందరినీ ఏమోస్తరుగా విభజించి మా కార్యం నడపాలో ఆ ప్రసంగం ఆరంభించాను. నేను మాట్లాడుతూఉంటే మధ్యను విమల హఠాత్తుగా లేచి, "ఇప్పటికి ఉండనివ్వండి సందీప్ బాబూ, సాయంకాలం అయిదు ఘుంటలకు వస్తాను, అన్నీ మాట్లాడదాము అప్పుడు," అంటూ గదిలోనుంచి తొందర తొందరగా బయటికి వెళిపోయింది.

ఇంతసేపటిబట్టీ ప్రయత్నంచేసిందిగాని నే నంటున్నదాని వైపు మనస్సును తిప్పుకోలేకపోయిందని స్పష్టము. తనమట్టుకు తాను కొంతసేపు ఒంటరిగా కూర్చోవాలి ఇప్పుడు, బహుశా మంచంమీద పడుకొని కొంచెం ఏడుస్తుందికూడా గాబోలు.

విమల పైకి వెళిపోగానే ఆ గదిలో గాలికి మరింత మత్తెక్కుతున్నది అనిపించింది. సూర్యుడు అస్తమించిన కొంచెం సేపటికి ఆకాశానఉన్న మేఘం రంగులమయం అయినట్టుగానే

నా మనస్సు ఉన్మత్తమవడం ఆరంభించింది. సుముహూర్తం చేతిలోనుంచి జారిపోనిచ్చాను, ఎంత ధైర్యంలేనివాణ్ణి! పిరికి పెద్దమ్మను! ఇటువంటి అద్భుతమయిన సంకోచం చూచి విమలకు తిరస్కారభావం పుట్టి ఉంటుంది. అందుచేతనే వెళిపోయి ఉండవచ్చును—ఆమె తప్పేమీ లేదు.

ఆ ఆవేశం ఇంకా నా రక్తంలో దగ్‌దగ్‌మంటూ ఉండగానే అమూల్య నన్ను చూడడానికి వచ్చాడని నౌకరు వచ్చి చెప్పాడు. ఇప్పుడు చూడనని చెప్పి పంపించేదామని బుద్ధి పుట్టింది; ఇంకా నిశ్చయం చేసుకోలేదు, అంతటిలో గదిలోకి వచ్చేశాడు అమూల్య.

ఉప్పూ, పంచదారా, బట్టలూ—వీటినిగురించి జరుగుతున్న యుద్ధం మాటలు ప్రారంభం అయినాయి, గదిగాలిలో ఉండే నిషా ఎగిరిపోయింది. కల పోయి తెలివివచ్చింది అనిపించింది. నడ్డిబిగించి సిద్ధంగా నిలుచున్నాను. ఇక రణక్షేత్రానికే యాత్ర! హర, హర, భం, భం!

ఇప్పటి స్థితి ఇదీ: కుందు జమీందారుగారి తాలూకాలో పెద్దాచిన్నా ప్రతివర్తకుడూ మా ఇష్టప్రకారం నడుచుకోడానికి ఒప్పుకున్నాడు. నిఖిల్ ఎస్టేటు ఉద్యోగస్థులు చాలాభాగం లోలోపున మా పక్షమే. వాళ్లవెనకనుండి మా తరఫున అందరినీ పురికొల్పుతున్నారు. మార్వాడీ వర్తకులు, "మాదగ్గిర ఏమైనా పినాల్టీ పుచ్చుకొని మా సామాను అమ్మేసుకోనివ్వండి, లేకపోతే దివాలా అయిపోతాము," అని బ్రతిమాలు-

కొంటున్నారు. సాయిబులు ఏవిధంగానూ
ఉన్నారు.

ఒక కాపు తన పిల్లలకోసమని చవక జర్మన్ శాలువులు కొని తీసుకువెళుతున్నాడట. మా దళంలో చేరినవాడు, ఈ గ్రామంకుర్రవాడు ఒకడు, అవి బలవంతాన తీసుకొని తగల బెట్టేశాడట. దానికోసమని పెద్ద గొడవ జరుగుతూ ఉంది. వాటికి బదులుగా స్వదేశీశాలువులు కొని ఇస్తామని మేము అన్నాము. కాని స్వదేశీవి చవకరకం రోమంబట్టలు ఎక్కడ ఉన్నవి? రంగువేసినబట్టలు ఎక్కడా దొరకవు స్వదేశీవాట్లలో. కాష్మీరుశాలువులు కొనిఇవ్వడం మాత్రం కాదు. ఆ కాపు ఏడుస్తూ నిఖల్ దగ్గిర వచ్చిపడ్డాడు. నిఖల్ దావా చేయమని చెప్పాడు. కావలసిన భోగట్టా ఎదీ దొరకకుండా చేదామని ఎస్టేటు ఉద్యోగస్థులంతా పట్టుపట్టి పని చేస్తున్నారు; ఎస్టేటు ప్లీడరుకూడా మా పక్షమే!

అయితే ఇంకొక సంగతి—కాల్చేసిన బట్టలకు బదులుగా స్వదేశీబట్టలు కొనిఇచ్చి, పైగా కోర్టులలో దావాలు జరిపించవలసివస్తే, దీనంటికీ కావలసిన రూపాయిలు ఎక్కడనుంచి వస్తాయి! కనబడ్డవన్నీ తగలబెట్టేస్తూఉంటే విదేశీసామాను మరింత విస్తారం ఖర్చు అవుతున్నట్టుందే! నబాబుగారికి బిళ్వారీ లస్టర్లు విరిగే శబ్దం మీాద సరదా విస్తారమయి ఇంటింటికీ వెళ్లి లస్టర్లు విరగగొడుతుంటే బిళ్వారీవర్తకుడి వ్యాపారం బాగా జరిగిందట—అలాగే ఉంది ఇది.

అంతకంటే పెద్దప్రశ్న ఏమిటంటే—చవక స్వదేశీ రోమంబట్టలు ఎక్కడా లేవు. సీతాకాలం వచ్చిపడ్డది. ఇప్పుడు ప్లానల్లూ, శాలువులూ వాడనివ్వడమూ, లేక వాటి అమ్మకం మానించేయడమూ?

నేను అన్నాను—"విదేశీబట్ట కొన్న వాళ్లందరికీ స్వదేశీ బట్ట ఇస్తూఉండాలంటే చాలలేము. ఆ శిక్ష వాళ్లమీదనే పడాలి, మనమీద కాదు. దావాచేస్తామని కోర్టుకు పరుగెత్తే వాళ్ల ధాన్యపుకొట్లకూ ధాన్యపుకుప్పలకూ రాత్రికాగానే నిప్పు అంటించేస్తుండాలి. ఆకాశంవైపు చూస్తూ బుర్ర గోక్కుంటుంటే ఏమీ ప్రయోజనం లేదు. అదుగో చూశావా, అమూల్యా! నువ్వు అలాగు భయపడుతుంటే పనికిరాదు. ఆ ధాన్యపుకుప్పలకు నిప్పంటించి దగ్గిర చూస్తూ నిలుచోవడం నాకుమట్టుకు సరదా అనుకున్నావా ఏమిటి! కాని జరుగుతూ ఉన్నది యుద్ధం అన్నమాట మరిచిపోకు. ఒకరికి దుఃఖం కలుగజేయడం కష్టంఅయితే మధురమైన ప్రేమరసంలో మునిగి చావవలసిందే!"

విదేశీ రోమంబట్టలూ, శాలువులూ, వీటిమాట ఏమిటి అయితే? ఎంత ఇబ్బంది పడనీ, ఎవరికి ఇబ్బంది కలగనీ అవి-మాత్రం ఒప్పుకోము. విదేశీతో మాకు ఏవిషయంలోనూ రాజీ అక్కరలేదు. కారణాలతో మాకు అవసరంలేదు. విదేశీ రంగుశాలువులు రాకముందు కాపులపిల్లలు దుప్పట్లతో చలికాలం గడిపేవారు కారూ? ఇప్పుడూ అలాగే గడుపుకోనీ.

వాటితో సరదా తీరదని నాకు తెలుసును, గాని సరదాలు తీర్చుకోడానికి ఇది కాదు సమయం.

సంతకు సామాను తీసుకువచ్చే పడవవాళ్లను అనేక-మందిని, నయానా భయానా, ఏలాగైతేనేమి, మా పక్కకు తీసుకు వచ్చేశాము. అందరిలోకి మోతుబరి ఒక సాయిబు. వాడిపేరు మీర్ జాన్. ఎంతతంటాలు పడ్డా వాడు మెత్తపడ-లేదు. ఆ సంత-సూపరెంటును పట్టుకున్నాను—"వాడి పడవ ముంచేయాలి ఏలాగైనా; ఆ ఏర్పాటు మీరు చేయలేరూ?" అని అడిగాను. "ముంచేయడం మహా పెద్దపని కాదు గాని, చివరకు ఆ పూచీఅంతా నానెత్తిమీద పడదూ!" అనిఅన్నాడు. "ఎవడినెత్తి మీదనో పూచీపడేటట్టుగానా పని చేయడం? ఎంత జాగ్రత్తగా చేసినా పడవచ్చును అంటారూ—అప్పుడు నా భుజం ఉండనే ఉంది," అని నేను అన్నాను.

సంతకూడింది, పడవవాళ్లందరూ సామాను తీసుకొని సంతకు వెళిపోయినారు. మీర్ జాన్ ఖాలిపడవ రేవులో కట్టి ఉన్నది. పడవనడిపేవాళ్లు ఎవరూ రేవుదగ్గిర లేరు. సూపరెంటు ఒకహరికథ పెట్టించి అందరు పడవవాళ్లనూ అక్కడికి మెల్లిగా లాగాడు. అక్కడ ఎవరూ లేనప్పుడు పడవనువిప్పించి దానిలో రాయీ రప్పా భారంకోసమని వేయించి, మధ్యప్రవాహం-లోకి తీసుకువెళ్లి పడవకు కన్నంపెట్టించి ముంపించేశాడు.

మీర్ జాన్‌కి అంతా బోధ పడ్డది. ఏడుస్తూ న్నాదగ్గిరికి

వచ్చి చేతులు జోడించి అన్నాడు—"తప్పుఅయింది మహా-ప్రభూ ఇకముందు—"

"అంత బాగా ఇప్పుడు ఏలాగు బోధపడ్డది!" అని అడిగాను.

నే నడిగినదానికి సరిగా జబాబు ఇవ్వకుండా అన్నాడు, "ఆ పడవ ఖరీదు రెండువేలకు తక్కువ ఉండదు! ఇప్పుడు నాకు తెలిసివచ్చింది. ఈ తప్పు మీరు క్షమిస్తే—"

అంటూ వచ్చి నా పాదాలు పట్టుకున్నాడు. ఒక పది రోజులు పోయినతరవాత తిరిగి కనబడమన్నాను. వాడికి రెండు వేల రూపాయిలు ఇవ్వగలిగినట్టయితే వాణ్ణి కొనుక్కొని ఉంచుకున్నట్టే. ఇటువంటివాళ్లను మాదళంలోకి తీసుకురా-గలిగితే మా పని బాగా జరుగుతుంది. చేతులో బాగా పైసా లేనిదే ఏమీ లాభం లేదు.

విమల మధ్యాహ్నం గదిలోకి వస్తూనే, కుర్చీమీది-నుంచి లేచి అన్నాను—"అంతా సిద్ధంగాఉంది రాణి, మరి ఎటువంటి ఆలస్యమూ లేదు. రూపాయిలుమాత్రం కావాలి."

"రూపాయిలా? ఎన్నిరూపాయిలు?" అని అడిగింది విమల.

"అట్టే విస్తారంకాదు, గాని ఎక్కడనుంచో ఒకదగ్గిర-నుంచి రూపాయిలు మాత్రం రావాలి!"

"ఎంతకావాలి చెప్పండి."

"ప్రస్తుతం యాభైవేలు చాలు."

రూపాయిలసంఖ్య విని విమల కంగారుపడ్డది, కాని ఆ సంగతిపైకి తెలియనిచ్చింది కాదు—'చేయలేను', 'చేయలేను', అని ప్రతిదాని విషయంలో ఏలాగు అవగలదు! నేను అన్నాను—"అసాధ్యమయినది సాధ్యం చేయగలరు మీరు. ఇదివరకు ఎంతో చేసి ఉన్నారు. మీరు సాధించినది ఎంతో నేను మీకు కనపరచగలిగితే మీకు బోధపడి ఉండును. కాని ఇదికాదు దానికి సమయం, ముందుకు ఒకనాడు ఆరోజు వస్తుంది. ఇప్పుడు కావలసినది రూపాయిలు."

"ఇస్తాను," అన్నది విమల.

నగలు అమ్మి ఇద్దామని విమల నిశ్చయం చేసుకున్నది. ఆమాట పోల్చుకొని నేను అన్నాను—"వస్తువులు చేతిలో ఉంచుకోవడం మంచిది, ఎప్పుడు ఎటువంటి అవసరం వస్తుందో చెప్పలేము."

విమల నా ముఖం చూస్తూ కూర్చున్నది.

"మీ భర్త రూపాయిలలోనుంచి మీరు తీసుకురావాలి నేనుకోరే రూపాయిలు," అన్నాను.

విమల మరింత గాబరా పడ్డది. కొంచెంసేపు ఊరుకొని అన్నది—"ఆయనరూపాయిలు నేను ఏలాగుముట్టుకోగలను!"

"అతని రూపాయిలు మీరూపాయిలు కావా!"

"కావు," అని అన్నది కొంచెం గర్వంతో

నేను అన్నాను— "అలా' అయితే ఆ రూపాయిలు అతనివీ కావు, అవి దేశానివి. దేశానికి అవసర మున్నదెప్పుడో నిఖిల్ వాటిని చోరీచేసి ఉంచినట్టే లెక్క!"

"అవి తీసుకురావడం ఏలాగు?"

"ఏవిధంగానో ఒకవిధంగా; మీరు వాటిని తీసుకురాగలరు. తీసుకువచ్చి ఆ రూపాయిలు ఎవరివో వాళ్లకే ఇచ్చేయండి. వందేమాతరమంత్రశక్తివల్ల ఈవాళ ఇనపపెట్టెల తలుపులు విడిపోతాయి, ఖజానాకొట్ల గోడలు విరిగి పడిపోతాయి; అధర్మం అనుకొని ఆ మహాశక్తిని మన్నించని వాళ్లగుండెలు చీల్చుకుపోతాయి. 'వందేమాతరం' అనండి రాణీ!"

"వందేమాతరం!"

## సందీప్ కథ

మేము పురుషులము, మేము మహారాజులము, మేము డబ్బు బలవంతాన తీసుకుంటాము, పృథ్వివిూద పద్దదగ్గిరనుంచీ మేము లూటీ చేస్తున్నాము. పృథ్వివిూద మేము అధికారం ఎంత చేస్తూఉంటే అది మాకు అంత వశపడుతున్నది, మా అధికారం అంతమట్టుకు అంగీకరిస్తున్నది. మేము పురుషులము, మొదటినుంచీ పళ్లు రాలుస్తున్నాము, చెట్లు కొడుతున్నాము, భూమిలోకి తవ్వుతున్నాము, జంతువులను చంపుతున్నాము, పక్షులను కొడుతున్నాము, చేపలను పట్టుకొంటున్నాము. సముద్రంఅడుగునుంచి, భూమికిందినుంచి, మృత్యువు నోటిలోనుంచి, మాకు కావలసినవల్లా తెచ్చుకుంటాము—ఆదాయం, ఆదాయం, ఆదాయం—ఇదొక్కటే పని మాకు. అటువంటి పురుషజాతి మాది. సృష్టిలోఉండే ఏభాండాగారాన్ని మేము లక్ష్యపెట్టము, ఎటువంటి ఇనపపెట్టైనా మాకు భయంలేదు—మేము చాలా విరగకొట్టిఉన్నాము, కొల్లబెట్టి తీసుకొని ఉన్నాము.

అటువంటి పురుషస్వామ్యాలు మన్నించి, నెరవేర్చడమే పృథ్వికి ఆనందం. అటువంటి హక్కులను పాలించడంవల్లనే పృథ్వి ఫలవంతం అవుతున్నది, సార్థకం అవుతున్నది, సుందరమయినది అవుతున్నది. అలాగే కాకపోతే అన్నివైపులా అడవులతో

నిండి, తనకుతానే పోల్చుకోలేకపోయిఉండును; లేకపోతే దాని నాలుగుతలుపులూ వేసేఉండును, దానిహృదయంలోకి మనము వెళ్ళలేకపోయిఉండుము, దానిగనులలో ఉండే రత్నాలూ కెంపులూ గనులలోనే ఉండును, సముద్రంలో ఉండే ముత్యాలు పైకి రాకేపోను.

మేము పురుషులము. మాహక్కులే స్త్రీలకు వికాసానికి అవకాశం ఇస్తున్నవి. తమను మాకు అర్పించుకోవడంవల్లనే స్త్రీలు గౌరవం పొందుతున్నారు, మా రాజకోశంలో సుఖంఅనే కెంపులు చెల్లించడంవల్లనే వాళ్లుతమ నిజమైన విలువను తెలుసుకోగలుగుతున్నారు, దుఃఖంఅనే ముత్యాలు చెల్లించడంవల్లనే తమ నిజమైన విలువను కనుక్కొంటున్నారు. ఈవిధంగా పుచ్చుకోవడమే పురుషులు దానము చేయడం అన్నమాట, ఈలాగు ఇవ్వడమే స్త్రీలు దానం పుచ్చుకోవడం అన్నమాట.

పెద్ద కోరిక ఒకటి కోరాను రాణిదగ్గిర. మొదట, కొంచెం అపరాధం చేశాను అనిపించింది—మానవుని మనస్సు తనధర్మాన్ని విడిచిపెట్టదు కదా, తనతో తానే పోట్లాడుతుంటుంది! నేను చేయమన్నది మహా కష్టమయిన పని. రాణిని పిలిచి, "ఈ చిక్కులలోకి మిమ్మల్ని లాగి మీ మనస్సుకు అశాంతి కలుగచేయడం నాకు ఎంతమాత్రం ఇష్టంలేదు," అని చెప్పాలని ఒకమారు బుద్ధిపుట్టింది. క్రియాహీనలైన స్త్రీలలో ఇటువంటి పనులవల్ల అశాంతిపుట్టించి వాళ్ల జీవనం సార్థకపరచడంవల్లనే పురుషుడు క్రియావంతుడు అవుతున్నాడని ఒకక్షణంపాటు మరిచిపోయి-

నాను. ఇంతకాలమూ స్త్రీలను ఏడిపిస్తూ ఉండకుండా ఉంటే వాళ్ల దుఃఖం, వాళ్ల ఐశ్వర్యం, వాళ్ల భాండాగారాలలోనే నాలుగువైపులా తలుపులు గట్టిగా బిగించుకొని ఉండును. మూడులోకాలనూ, ఏడిపించి ధన్యులనుగా చేయడమే పురుషధర్మం లేకపోతే అతనిచేతులకు అంతబలం ఎందుకు, అతని చెయ్యిపట్టుకు అంతగట్టి ఎందుకు?

విమలలో ఉండే అంతరాత్మ కోరేది ఏమిటంటే, నేను, అనగా సందీప్, ఒక గొప్ప త్యాగం ఏదైనా చేయమని ఆమెను కోరవలెను అని, ఆమెను చావుకు సిద్ధపడమని కోరవలెను అని. అంతకుతక్కువ ఏదైనా ఆమెను సుఖపెట్టదు ఇన్నాళ్ల-నుంచీ మనస్ఫూర్తిగా ఏడవలేదుగనుకనే నారాకకు ఎదురు-చూస్తూ కూర్చున్నది. ఇంతకాలమూ ఆమె పరిపూర్ణమయిన సుఖంలో ఉండబట్టే నేను కనబడ్డంతమాత్రాన ఆమె హృదయంలో నాలుగుదిక్కులా దుఃఖము నవవర్షంవలె కమ్ముకు-వచ్చింది జాలిపడి, ఆమెదుఃఖాన్ని నేను చల్లార్చిన పక్షాన నేను ఈ పృథ్విలోకి వచ్చిన లాభం ఏమిటి?

నాకు సంకోచం కలగడం ఎందుకు అనగా, నేను అడిగి-నది డబ్బు గనుక. డబ్బు పురుషులది; పురుషులే ఇవ్వవలెను. అది అడగడంలో కొంతభిక్షుకత ఉన్నది. అందుచేతనే రూపా-యిల సంఖ్య బాగా ఎక్కించి చెప్పాను. వేలూ, అయిదు వందలూ అనేసరికి చోరీవాసన కొడుతుంది; యాభై వేలు చోరీకాదు, బందిపోటు.

నేను మంచి ధనవంతుడనై పుట్టవలసింది. నాకోరికలు అనేకంగా కేవలం డబ్బులేకపోవడంచేతనే నెరవేరకుండా మాటిమాటికి ఉండిపోతూవచ్చాయి. ఇతరులకు ఫరవాలేదు గాని నాలో మాత్రం లేమి శోభించదు. భాగ్యదేవతచేసిన ఈ అన్యాయం నేను క్షమించిఉందును, గాని ఆమె చేసినది ఉత్త అన్యాయమే కాదు విరసమయిన పనికూడాను, అందుచేత అది క్షమించరాని పని. ఇల్లు అద్దెకుపుచ్చుకుంటే నెలఅయేసరికి ఇంటి అద్దెరూపాయిల కని బుర్రగోక్కొని ఆలోచిస్తూ కూర్చోవడమూ, ఎక్కడికైనా బయలుదేరదామని రైలు ఎక్కితే ఇంటర్ క్లాసు టిక్కెట్టుకని జేబులు తడుముకోవడమూ మొదలైనపనులు నాలాంటి మనుష్యులవిషయంలో దుఃఖకర-మైన సంగతులు కావు, హాస్యకరమైనవి. పిత్రార్జితమైన సంపత్తి అంత అధికంగా నిఖల్‌లాంటివాడికి కేవలం అనవసరము. దారిద్ర్యం అతనికి కుదరనివస్తువు కాదు. చంద్రనాథ్ బాబుకు జోడుగాఉండి అకించనత అనే రెండెడ్లబండీని నిఖల్ అతి కులాసాగా లాగగలడు.

నా జీవితకాలంలో కనీసపక్షం ఒక్కమారైనా యాభై వేలరూపాయిలు చేతితో పట్టుకొని అవన్నీ రెండు రోజులలో స్వదేశీలో ఖర్చుచేసి సరదాతీర్చుకుందామని చాలాకాలంబట్టి ఉన్నది. నేను నవాబును, పాదుషాను. నాముష్టివేషం రెండు రోజులపాటైనా వదలి నిజమైన నన్ను అద్దంలో చూసుకొని సంతోషిద్దామని ఉన్నది.

కాని విమలచేతికి యాభై వేలు సులభంగా దొరుకుతా-యని నాకు నమ్మకం లేదు. రెండుమూడు వేలు దొరికేసరికి కష్టం అయిపోతుందేమో. పోనీ, ఎంతయితే అంతే—"అర్ధం త్యజతి పండితః" అంటారుగాని కోరి త్యాగంచేయని పండితుడు ఒక్కముష్టాతికే కాదు, ఆఖరుకు పదిహేనుఅణాలవంతైనా విడిచిపెట్టేయడానికి ఒప్పుకుంటాడు.

ఇంతవరకు వ్రాశాను— ఇవన్నీ నా మనస్సులోని వ్యవహారాలు. వీలుచూచుకొని ఇవన్నీ బాగా విప్పిచెపుతాను, ఇప్పుడు అవకాశం లేదు. ఆ సూపరెంటు కబురుపంపాడు, తక్షణం ఒక పర్యాయం రావలసింది అని, ఏదో పెద్ద గందర-గోళం అవుతున్నదట.

ఎవడిద్వారా మేము నావ ముంపించామో వాణ్ణి పోలీసువాళ్లు పట్టుకున్నారట, నానాఅవస్థా పెడుదుతున్నారట, వాడు పాతనేరస్థుడట. వాడు పక్కామనిషి, వాడిలోనుంచి గుట్టులాగడం బహుకష్టం. అయినా ఎవరుచెప్పగలరు! ముఖ్యమైనది ఏమిటంటే నిఖిల్ చాలాకోపంగా ఉన్నాడు, అందుచేత ఆ సూపరెంటు అట్టే జోరుగా ఏమీచేయలేదు, "చూడండి, నేను చిక్కులో పడితేమాత్రం మిమ్మల్ని జారిపోనివ్వను" అన్నాడు ఆ సూపరెంటు.

"నన్ను పట్టగలిగిన బోను ఏదీ?" అని నేను అన్నాను.

"మీరువ్రాసిన ఉత్తరం ఒకటి, అమూల్యబాబు

వ్రాసినవి మూడూ నాదగ్గిర ఉన్నవి," అని అన్నాడు సూపరెంటు.

తక్షణం జవాబు ఇవ్వవలసింది అని చెప్పి సూపరెంటు పంపించిన ఉత్తరం ఇందుచేతను అర్జంటు, మరి ఏకారణం వల్లా కాదు అని, ఇప్పుడు బోధపడ్డది. ఇటువంటిసంగతులు ఇంతకు ముందు నాకు తెలియవు. పరపక్షువాళ్ల నావను ఎంత సునాయాసంగా ముంచేశాడో తనపక్షువాణ్ణికూడా అంతసునాయాసంగా ముంచేస్తాడు, అవసరం వస్తే—సూపరెంటుకు నామీద అంత ప్రేమ! జవాబు వ్రాసి పంపడానికి బదులుగా నోటిమాటతో చెప్పి ఉంటే, ఉండవలసినంత ప్రేమా ఉండును.

ఇప్పుడు చేయవలసిన దేమిటంటే, పోలీసువాళ్ల చేతులో ఏమైనాపెట్టి వాళ్లను ఓదార్చడం, అదీ చాలకపోతే ఎవడి పడవ ముంచేశామో వాడినష్టం కొంత తీర్చాలి. మేము వేసిన పెద్దవలవల్ల వచ్చినలాభంలో బాగా పెద్దభాగం సూపరెంటు వంతుకు వెళ్లాలి అని ఇప్పుడు బోధపడ్డది. కాని ఆమాట పైకిమాత్రం అనకూడదు — అతనూ "వందేమాతరం" అంటాడు, నేనూ "వందేమాతరం" అంటాను.

మా వ్యవహారాలు జరిపించవలసిన ఉపకరణాలనిండా కావలసినన్ని చిల్లులు. చివరకు అందులో నిలిచి ఉండేదానికంటే అందులోనుంచి కారి పైకిపోయేదే చాలా జాస్తి. న్యాయబుద్ధి

మనలో అస్థిగతమై దాగి ఉంటుంది, అందుచేత సూపరెంటు మీద చాలాకోపం వచ్చింది మొట్టమొదట. మరి కొంచెంసేపు ఉంటే మనదేశస్థుల కపటంగురించి జోరుగా నా డైరీలో వ్రాసేసిఉందును. కాని నా లోపునున్న దానినీ పైనున్న దానినీ అతిస్పష్టంగా తెలుసుకోనేశక్తి నాకు ఇచ్చినందుకు భగవంతు-డంటూ ఒకడుంటే, అతనికి కృతజ్ఞతా పూర్వకంగా నమ-స్కారంచేసి ఒప్పుకోవాలి. పైవాళ్లను మోసపుచ్చగలను గాని నన్ను నేను ఎన్నడూ మోసపుచ్చుకోలేను. అందుచేత నా కోపం అట్టేసేపు ఉండలేదు. నిజము నిజమే—అది మంచీ కాదు, చెడ్డాకాదు—అదే సయన్స్, విజ్ఞానము. మన్ను పీల్చేసి-నంత జలమూ పోగా మిగిలినదే జలాశయం అవుతుంది. "వందే మాతరం" కిందనుండే మట్టిజాగా, అన్నిటిమోస్తరుగానే, నీటిని పీలుస్తుంది; ఆనీరు నేనూ పీలుస్తాను, సూపరెంటూ పీలుస్తాడు. అదిఅంతా కాగా మిగిలినదే "వందేమాతరం" అవుతుంది. దీనిని కపటం అని దూషించ వచ్చును గాని అది నిజమైన సంగతి అని మాత్రం ఒప్పుకోక తీరదు. భూమిమీద జరిగే ప్రతిగొప్ప కార్యంకిందా దళసరి పొర ఒకటి తయారవుతుంది. అది కేవలం బురద. అది మహాసముద్రం అడుగునైనా తప్పదు.

అందుచేత ఏపెద్దపని ప్రారంభించినప్పుడైనా ఈ బురద సంగతి మనం మరిచిపోకూడదు. సూపరెంటుకు కావలసినది సూపరెంటు తీసుకుంటాడు, నాకు కావలసినది నాకూ ఉండనే ఉంది. ఇవన్నీ పెద్దపనిలోని చిన్నపనులు—బురద కాలంటే

గుర్రాలకు మేతా పెట్టాలి, చక్రాలలో చమురూ వెయ్యాలి!

ఏది ఏలాగుఅయినా, రూపాయిలుమాత్రం కావాలి త్వరగా. యాభై వేలకోసం కనిపెట్టుకొని కూర్చుంటే పని జరగదు. తక్షణం ఎంతదొరికితే అంత సంగ్రహించాలి. కేవలం ప్రస్తుతంమాటే చూచుకుంటే భవిష్యత్తుపని నీళ్లధారే అని నాకు తెలుసును. ఈవాళ అయిదువేలు పుచ్చుకోవడం రేపటి యాభై వేలను పువ్వుగా ఉంటూ ఉండగా తెంపేసినట్టే. త్యాగమార్గంలో నడుస్తుండేవాళ్లు లోభాన్ని అణుచుకో అక్కరలేదు అని నిఖిల్‌తో నేను అనేకసార్లు అన్నాను; లోభమార్గంలో వెళుతూఉన్న నేను ప్రతి అడుగుకీ లోభాన్ని అణుచుకుంటూ ఉండాలి. యాభై వేలు నేను త్యాగం చేయగలను, నిఖిల్ మాస్టరు, చంద్రనాథ్ బాబు, ఏలాగు చేయగలదు?

షడ్రిపులలో మొదటిరెండూ, ఆఖరిరెండూ, పురుషులు అనిపించుకోదగినవాళ్లవి. మధ్యరెండూ పిరికి పెద్దమ్మలవి. మాకు కోరిక ఉన్నదిగాని లోభంలేదు, మోహంలేదు. అవి ఉన్నట్టైనా కోరికమంటిగలిసిపోతుంది. అవి మన భవిష్యత్తునూ, మన గతాన్నీ చుట్టుకొని ఉంటాయి; మంచిమాటలతో వర్తమానాన్ని మరిపించడానికి గురువులు అవి. ప్రస్తుతం అవసరమైన పనులను చేయకుండా గతంనుంచీ భవిష్యత్తునుంచీ వస్తూఉన్న మురళీగానం వింటూ కూర్చున్నవాళ్లు విరహిణి అయిన శకుంతల మాస్తరు — తలుపుదగ్గిరికి వచ్చిన అతిథికేక వాళ్లకు

వినబడదు ; దూరాన్ని ఉన్న ఏఅతిథికోసం వాళ్లు కూర్చుంటారో, ఆ అతిథిని కూడా చివరకు పోగొట్టుకుంటారు.

ఆనాడు నేను విమలచెయ్యి పట్టుకున్నాను— ఆ స్పర్శ, ఇంకా ఆమెమనస్సును కదిలిస్తూఉంది. నామనస్సులో ఉండే ఝుంకారంకూడా ఇంకా ఆగలేదు. ఆఝుంకారాన్ని ఎప్పటికీ తాజాగా ఉంచాలి. అలవాటువల్ల దానిని పాతచేసేస్తే అది ఒక మోటుఅయినది అయిపోతుంది__పాటవలె అతిమనోహరంగా ఉన్నదానిని అసహ్యం పుట్టించే తర్కానికి దించేయకూడదు. నేను అన్నదానికి దేనికీ కూడా 'ఎందుకు' అని అడిగేపాటి అవకాశము విమలకు చిక్కడం లేదు. మోహం కావాలి అనేవాళ్లకు కావలసినంత ఇవ్వవలసిందే, మనము ఎందుకు లేదనాలి.

నేను చేయవలసినది చాలాపనిఉన్నది. అందుచేత ఇప్పటిమట్టుకు ఈ కల్లుమీదనున్న పొంగుతో ఆగాలి. అడుగు దాకా వెళితే గొడవ అయిపోతుంది. సరిఅయిన సమయంవచ్చినప్పుడు పోనివ్వను. కామముతో నిండిఉన్నవాడు లోభాన్ని విడిచి పెట్టేయాలి ; వైణికుడు వీణను పూర్తిగా తన స్వాధీనంలోకి తెచ్చుకొన్నట్టు మోహాన్ని తనచేతిలోకి తెచ్చుకొని తానం వాయించాలి.

ఇటుపక్క మాపని చాలాబాగా నడుస్తూఉంది. మా బలం బాగాపెరిగింది. కాని 'భాయి' అనీ, 'బ్రదర్' అనీ ఎంత

గొంతుక పగలగొట్టుకున్నా సాయిబులు మా స్వదేశీలో చేర లేదని చివరకు, బొజ్జ నిమురుకుంటూ, ఒప్పుకోవలసిందే. వాళ్లను అణుగునవేసి నొక్కేయాలి. మా చేతిలో బలం ఉన్నదని వాళ్లకు నచ్చజేయాలి. ఇప్పుడు వాళ్లు మామాట వినిపించుకోకుండా ఉన్నారు, కోరలు చూపించి జడిపిస్తున్నారు. కాని ముందుకు ఒకనాడు ఎలుగుబంటిని ఆడించినట్టు వాళ్లను ఆడిస్తాము.

"భారతవర్షం నిజమైన వస్తువైనప్పుడు అందులో సాయిబులుకూడా ఉన్నారని మరిచిపోకూడదు," అని నిఖిల్ అంటాడు.

"అది నిజమే కావచ్చును, గాని వాళ్ల యథార్థస్థానం తెలియజేసి అందులోనే వాళ్లను ఉండేటట్టు చేయాలి. అలాగు చేయనంతసేపు వాళ్లు విరోధం కనపరుస్తూనే ఉంటారు," అని నేను అనేది.

"విరోధం లేకుండా చేయడానికి మార్గం, ఉండేవిరోధాన్ని పెంచడం గాబోలు?"

"పోనీ నీకు సమ్మతమయిన మార్గం ఏది చెప్పు?" అని నేను అన్నాను.

నిఖిల్ అన్నాడు—"విరోధం లేకుండా చేయడానికి ఒకటే మార్గం—"

బుద్ధిమంతులు వ్రాసిన కథలలాగు నిఖిల్ చేసే వాదాలన్నీ

చివరకు ఒకనీతిగా తేలుతుంటాయి—ఈ మాట నేను చాలా కాలంనుంచి ఎరుగుదును. నీతులలోనూ, సదుపదేశాలలోనూ ఇన్నాళ్ళబట్టీ మసులుతున్నా అతనికి వాటిలో నమ్మకంపోలేదు—అదీ అన్నిటికంటే ఆశ్చర్యమయిన సంగతి. అందుచేతనే నేను అనడం, నిఖిల్ పుట్టుకదగ్గిరనుంచీ 'స్కూల్‌బోయ్' అని. అయితే ఉన్నది ఒక్కటి—ఎటువంటిమాయామర్మమూ లేదు అతనిలో. అతను అవాస్తవమంత్రం నేర్చుకున్నాడు, వాస్తవి-మనే సర్పంకాటువల్ల చచ్చినా వాస్తవాన్ని నమ్మనంటాడు. వచ్చిన చిక్కు ఏమిటంటే, చావుకూడా ఇటువంటివాళ్ళకు తగినప్రమాణం కాదు, "ఆపైన మరి లేదూ?" అంటుంటారు, కళ్ళుమూసుకొని ఉండే.

చాలా కాలంనుంచి నాకు ఒకఉద్దేశం ఉన్నది. అదిగాని ఆచరణలో పెట్టగలిగితే మనం చూస్తూఉండగానే దేశమంతటా నిప్పంటుకుంటుంది. దేశం ఒకమూర్తిరూపంగా కళ్ళఎదుట కన-బడనంతసేపు మనవాళ్ళకు మెలకువరాదు. దేశము ఒక దేవి ప్రతిమలాగు వాళ్ళకు అగపడాలి. నా స్నేహితులకు ఆమాట శకీమని నచ్చింది, "ఒక మూర్తిని కల్పించాలి" అన్నారు. కల్పిం-చినప్రతిమలు ప్రజలకు అంగీకారంగాఉండవు; వాళ్ళు ఇప్పుడు పూజచేస్తూ ఉన్నవాటిలో ఏదోఒకదానిని మనము ఉపయోగా-గించుకోవాలి. మనదేశంలో పూజమార్గం లోతైన పునాదు-లుగలమార్గం. ఆదారి వెంబడే నడిపిస్తూ మనదేశస్థులభక్తిని దేశమాతవైపు లాగాలి.

ఈ విషయంగురించి నిఖిల్‌తో నాకు కొన్నాళ్లకిందట పెద్దవాదన అయింది. "సత్యం అని నమ్మే కార్యంలోకి భ్రమను రానివ్వకూడదు" అని నిఖిల్ అన్నాడు.

"మిష్టాన్న మితరే జనాః", అని నేను అన్నాను. మోహం లేనిదే పామరులకు జరగదు—ఈ పృథ్విలో ముప్పాతికభాగం పామరులుకదా! మోహాన్ని నిలబెట్టిఉంచడం నిమిత్తమే ప్రతిదేశంలోనూ మనుష్యుడు దేవతలను సృజిస్తున్నాడు—ఆపాటి తెలుసును, మనుష్యుడికి తనసంగతి."

"మోహం పోగొట్టడానికి దేవత, నిలబెట్టడానికి అప-దేవత" అని నిఖిల్ అన్నాడు.

"సరే ఒప్పుకున్నాను, మాకు కావలసినది అపదేవతే. లేకపోతే మా పని నడవదు. కాని ఒక గొప్పదుఃఖకరమైనసంగతి ఏమిటంటే, మనదేశంనిండా కావలసినంతమంది దేవతలున్నారు, వాళ్లకు కడుపు నిండా పెడుతున్నాము, గాని వాళ్లవల్ల పని-రాబట్టుకోలేకుండా ఉన్నాము. దానికి ఉదాహరణంగా చెపు-తాను వినండి—బ్రాహ్మలను భూదేవతలని అంటున్నాము; వాళ్లపాదధూళి నెత్తిని రాసుకుంటున్నాము; వాళ్లకు సమ-ర్పించిన దక్షిణలకు లెక్కలేదు. అయినా ఇంతకష్టపడి తయారు చేసినవస్తువును వృథాగా పోనిస్తున్నాము. ఎటువంటిపనీ వాళ్ల-వల్ల రాబట్టుకోలేదు. వాళ్లకు చేతనైనంత వాళ్లచేత చేయించి-నట్టైతే మనకు ఇప్పుడు అసాధ్యమైనపనులు ఎన్నో సాధ్యమై ఉండును. ప్రపంచంలో ఒకదళం ఉన్నది, ఆదళంలోఉన్న మను-

ష్యుల సంఖ్య చాలా ఎక్కువ, వాళ్లు ఎప్పుడూ భూమట్టంతో సమానంగా ఉంటారు. వీపుమీదనో లేక నెత్తిమీదనో వాళ్లకు ఇతరుల పాదధూళి నియమం ప్రకారం ప్రాప్తం అవుతుంటేనేగాని వాళ్లు ఎటువంటిపనీ చేయలేరు. ఇటువంటి వాళ్లను వినియోగించడానికి తగిన ఒకగొప్పశక్తి ఉన్నది మోహంలో. వాళ్లను మన అస్త్రశాలల్లో వాడిచేస్తూ ఇన్నాళ్లూ ఉంచాము. చివరకు, ఇన్నాళ్లకు ఆ అస్త్రాలతో మనం పనిచేయవలసినరోజు వచ్చింది, వాటిని ఇప్పుడు ఒకమూల పారేసి కూర్చోగలమా ?

కాని ఇటువంటివన్నీ నిఖిల్‌కి బోధపడేటట్టు చెప్పడం చాలాకష్టం. నిజం నిజం అంటూ అతని మనస్సులో కేవలం ఒకటి భ్రమలాగు కూర్చున్నది. నిజంఅంటూ ఏదోఒకటి ఉన్నదని అతని నమ్మకం. ఎక్కడైతే మిథ్య నిజముగా ఉన్నదో అక్కడ మిథ్యే నిజము అని నేను అతనికి ఎన్నోసార్లు చెప్పాను. ఇది తెలుసుకొనే, మనదేశంలో అజ్ఞానులకు ఎటువంటిసంకోచమూ లేకుండా చెపుతున్నారు మిథ్యే సత్యము అని. ఆ మిథ్యనుండి వాళ్లను విడిపించడం వాళ్లను సత్యభ్రష్టులుగా చేయడమే. దేశమాతయొక్క ప్రతిమను సత్యమని పూజించేవాళ్లకు అది నిజంగా సత్యమయి వ్యవహారిస్తుంది. మన నైజమూ మన సంస్కారాలూ ఎటువంటివి అనగా—మనకు దేశంఅంటే ఒకంతట భక్తి పుట్టదుగాని దేశమాతప్రతిమ కనబడేసరికి భక్తిపుట్టిపోతుంది. ఇది తెలిసి

ఉన్నతరవాత దేశకార్యం నడిపించదలచుకున్నవాళ్లు దేశకార్యంలో ఉన్నంతసేపూ ఈమాట మనస్సులో పెట్టుకొనే ఉంటారు.

ఆలా అనేసరికి నిఖిల్ ఉద్రేకుడయిపోయి అన్నాడు— "సత్యంకోసం తగిన సాధనచేసేశక్తి మీరు పోగొట్టుకున్నారు; గొప్పఫలం ఏదైనాఒకటి ఆకాశంమీదినుండి హఠాత్తుగా పడిపోతే తీసుకుందామని మీకోరిక. దేశంకోసం చేయవలసిన పని ఎన్నో సంవత్సరాలనుండి మానేసి ఇప్పుడు దేశాన్ని దేవుడుగా చేసి కొల్చి వరంపొందుదామని చేతులు చాచుకు కూర్చున్నారు."

"అసాధ్యసాధన చేయాలి, అందుచేతనే దేశాన్ని దేవత చేయడం అవసరమయింది," అని నేను అన్నాను.

"అనగా, సాధ్యమయినది చేయడానికి మీమనస్సు పోదు. ఇప్పుడు ఉండేదంతా ఈలాగే ఉండాలి, గాని నమ్మశక్యంకాని ఫలంమాత్రం మీకు దొరికిపోవాలి!" అని నిఖిల్ అన్నాడు.

దానికి నేను జబాబు చెప్పాను—"నిఖిల్, నువ్వు చెప్పేదంతా ఉత్తఉపదేశం. అటువంటి ఉపదేశం చిన్నప్పుడు అవసరం కావచ్చునుగాని పిల్లడికి పళ్లువచ్చిన తరవాత అటువంటి వాటి ప్రయోజనం లేదు. ఇప్పుడు నాలుగువైపులా కుండుతూ ఉండే ఘంటలకు తగిన కృషి మేము ఎన్నడూ కలలోనైనా

చేయలేదు. ఈసంగతి ఊహావల్ల తెలుసుకో అక్కరలేదు మా కళ్లముందర జరుగుతూఉంది. అది దేనివల్ల ?—దేశాన్ని దేవతలాగు చూడగలుగుతున్నాము గనుకనే. దేశానికి ఒక స్వరూపం ఇచ్చి అది శాశ్వతంగా మన మనస్సులలో ఉండేటట్టు చేయడమే ఈకాలపువాళ్ల ప్రతిభ. ప్రతిభ చేసేపని తర్కం కాదు, సృష్టి. ఇప్పుడు దేశంయొక్క హృదయంలో ఉన్న దానికి రూపం ఇస్తాము. "దేవి నాకు కలలో కనబడి మనమందరమూ ఆమెను పూజ చేయవలెను అని కోరిందని, ఇంటింటికీ వెళ్లి నేను ప్రతివాళ్లతో చెపుతాను. బ్రాహ్మాలదగ్గిరికి వెళ్లి, 'మీరు దేవి పూజారులు, దేవిపూజ ఆగిపోబట్టే మీరు రోజురోజుకీ అధోగతి పాలవుతున్నారు' అని చెవుతాను. నేను చెప్పేది అబద్ధమని నువ్వు అంటావు కాబోలు. కాని, అది అబద్ధం కాదు. నా నోటివెంట ఈ మాట విందామని మనదేశస్థులు కోటానకోట్లు కనిపెట్టుకొని కూర్చున్నారు; అటువంటప్పుడు నేను చెప్పేది అబద్ధము ఏలాగవుతుంది? అదిసత్యము. నేను విన్న వాణిని ప్రచారంచేయడం ప్రారంభించానంటే దాని ఫలం ఎంత ఆశ్చర్యమయినదో నీకే తెలుస్తుంది."

"అంతదాకా బ్రతికి ఉండాలి కదా! ఇంతకూ మీరు దేశంచేతిలోపెట్టే ఫలంకాక ఆ పైఫలం ఒకటి ఇంకా ఉంది కదా! అది బహుంశా ఇహలోకంలో మనకు కనబడదు."

"నాకు కావలసినది ఈనాడు నాచేతికి దొరికిన ఫలము. ఆఫలమే నాది" అని అన్నాను నేను.

"నాకు కావలసినది ఈవాళది కాదు, రేపటిది. అదే అందరికీ లాభించేది," అన్నాడు అతను.

నిజమేమిటంటే, కల్పనశక్తి ఒక్కటే బంగాలీవాడికుండే ఆస్తి. అందరికివలెనే నిఖిల్‌కుకూడా అది ఉండవచ్చును, గాని ఎక్కడనుంచో పైనుంచి న్యాయబుద్ధి ఒకటివచ్చి ఒక మహా వృక్షంలాగు అతనిమీద శాఖలూ కొమ్మలూ అల్లి నాశనం చేసేయడానికి సిద్ధంగా ఉంది. భారతవర్షంలో జగద్ధాత్రి-పూజా, దుర్గపూజా స్థాపించినది బంగాలీవాడే, దానివల్లనే అద్భుతమైన తనశక్తిని అందరికి వెల్లడిచేస్తున్నాడు. ఆ దేవి నిజంగా రాజకీయ సంబంధమైనదేవి, "పొలిటికల్ గాడెస్" అని నానమ్మకము. మహమ్మదీయ ప్రభుత్వం రోజులలో బంగాలీ వాళ్లు దేశశక్తిని వేడుకున్నారు, శత్రుజయం కోసమని వరం ఇవ్వవలసింది అని. ఈ ఇద్దరు దేవులూ ఆ శక్తియొక్క వేరు వేరు స్వరూపాలే. ఆదర్శానికీ, సాధనకూ తగినరూపం భారత వర్షంలో బంగాలీలుకాక ఇంకెవరైనా ఇవ్వగలిగారూ ?

కల్పన చేయగలిగిన దివ్యచక్షువు నిఖిల్‌కి లేనేలేదు, ఆ కన్ను గుడ్డి అయిపోయింది. అందుచేతనే అతిసునాయాసంగా అనగలిగాడు—"మహమ్మదీయ రాజ్యం రోజులలో మహారాష్ట్రులూ, సీకులూ, కత్తి చేతపుచ్చుకొని ఫలం కోరారు, మనము కత్తి మనదేవిచేతిలో పెట్టి, మంత్రాలు చదువుతూ, ఫలం కోరుతున్నాము. అయితే దేశం దేవికాదు, అందుచేత మనకు దొరికిన ఫలం బలివేసిన మేకలూ, గేదెలూ. ధర్మమార్గం

విడువకుండా ఎప్పుడు దేశసేవ చేయడం ప్రారంభిస్తామో అప్పుడే మన దేశంకంటె గొప్పదైనదేవి మనకు సత్యమయిన ఫలాన్ని ఇస్తుంది, ఆమే నిజమైన దేవత.

అయితే వచ్చిన చిక్కు ఏమిటంటే, నిఖిల్ ఆడేమాటలు కాగితముమీద చదవడానికి అతిఇంపుగా ఉంటాయి; నా మాటలు కాగితంమీద వ్రాయవలసినవి కావు, ఘంటం పుచ్చుకొని దేశంయొక్క హృదయం చీల్చి దానిలో వ్రాయ-వలసినవి. పండితుడు కృషితత్వంగురించి పుస్తకం వ్రాసి సిరాతో అచ్చువేయిస్తాడు, గాని వ్యవసాయదారుడు తన కోరికను తెలియజేసే మార్గంమాత్రం అదికాదు; వాడు నాగలి నక్కుతో భూమిమధ్యను నాటుతాడు తనకోరికను.

విమల నాకు కనబడగానే నేను అన్నాను, "ఏదేవిని ఆరాధిద్దామని అనాదినుండి ఈ పృథ్విమీద మనము జన్మ గ్రహణంచేస్తున్నామో, ఆదేవి సాక్షాత్తు మనకళ్ల కగపడకపోతే మనము ఆమెను నమ్మగలిగామా? మీ దర్శనం నాకు దొరకక పోయిఉంటే దేశంఅంతా ఒక్కమూర్తిలో కనబడకపోను. ఈ మాట మీతో నేను అనేకసార్లు చెప్పాను, మీరు బోధ-పరుచుకున్నారో లేదో చెప్పలేను. దేవతలు స్వర్గలోకంలో కంటికి అగపడరు, మర్త్యలోకంలోనే కళ్లకు కనబడతారు— ఈ సంగతి బోధపరచడం చాలా కష్టం."

విమల అదొకచిత్రంగా, నావైపు చూస్తూ, "నువ్వు అనేదంతా నాకు బాగా బోధపడ్డది," అని అన్నది—"షీరారు".

అనడానికి బదులుగా "నువ్వు" అని విమల అనడం ఇదే మొదటిమారు.

నేను అన్నాను—"కృష్ణుడు అర్జునుని కంటికి మామూలు సారథిలాగే కనబడేవాడు; అటువంటికృష్ణునికి ఒకవిరాటురూపం ఉండెను. ఆ విశ్వరూపం ఒకనాడు అర్జునునికికూడా కనబడ్డది, అప్పుడే, అతని నిండుస్వరూపం అర్జునునికి కనబడ్డదన్నమాట. నీ విశ్వరూపం మన దేశం. అందులో నీవు నాకు కనబడ్డావు. గంగా బ్రహ్మపుత్రా నీ మెడలోవేసిన ఏడుపేటల హారము; దూరాన కనబడతున్న నీలజలధారల ఒడ్డునున్న వనరేఖ కాటుకరాసిన నీ కనురెప్పలు; పచ్చని వరిచేలలో ఎండా నీడా పడుతూ ఉన్నప్పుడు, నువ్వు కట్టుకుండే డోరియాచీర గాబోలు గాలికి కొట్టుకుంటున్నది అనిపిస్తుంది; నడివేసవి మధ్యాహ్నమప్పుడు ఆకాశము, నాలుక చాచుకొని ఝూంకొడుతూ ఎడారిలో పడుకొనిఉన్న సింహంలాగు, ఉంటుంది—అందులో క్రూరమైన నీ తేజస్సు నాకు కనబడ్డది. దేవి తన రూపాన్ని ఈ విధంగా తన భక్తుడికి కనపరిచినందుకు తప్పకుండా ఆ దేవి పూజ మన దేశమంతటా వ్యాపింపజేస్తాను. దానివల్ల మన దేశస్థులకు ఒక కొత్తజన్మ కలుగుతుంది. నీ మూర్తినే ప్రతి మందిరంలో ప్రతిష్ఠచేస్తాను. కాని ఆ మాట అందరూ బాగా బోధపరుచుకోరు. గనుక దేశంలోఉండే యావన్మందినీ పిలిచి దేవిమూర్తిని నాచేతితో నేనే చేసి ఎవరిమనస్సులోనూ ఎటు-వంటిసందేహమూ ఇకముందు లేకుండా ఉండేటట్టు పూజ

చేయాలని నేను సంకల్పించుకున్నాను. నువ్వు ఆ వరం నాకు ఇయ్యి, ఆశక్తి నాకు దయచేయి."

విమలకళ్లు మూసుకుపోయినాయి. కూర్చున్నచోట ఆలాగే ఉండిపోయింది, రాతిబొమ్మా అనిపించింది. నేను మరి ఒక్కమాట అనిఉంటే ఆమెకు మరి ఒంటిమీద తెలివి ఉండక పోను. కొంచెంసేపు అయినతరవాత కళ్లువిప్పి అన్నది—"ప్రళయమార్గంలో వెళుతూఉన్న పథికుడవు నువ్వు, నువ్వు ఆలాగు నీ దారిని వెళుతూఉంటే నిన్ను అడ్డుపెట్టడము ఎవరి-తరము? నీ ఇచ్ఛావేగాన్ని ఎవరూ ఆపలేరు, నాకు స్పష్టంగా తెలుస్తూఉంది. రాజులు నీదగ్గిరికి వచ్చి వాళ్ల రాజదండం నీఎదుట పడేస్తారు. ధనికులు వాళ్ల కొట్టు విప్పి నీముందర డబ్బురాసులు పోసేస్తారు. ఏమీలేనివాళ్లుకూడా వచ్చి నీముందర ప్రాణాలను సమర్పించి వాటిని అంగీకరించమని అడుగుతుంటారు. ఇది మంచీ ఇది చెడ్డా అనే విచక్షణ మరి ఉండదు, అంతా కొట్టుకుపోతుంది. నువ్వు నా రాజువు, నా దేవతవు, నా లో నీకు ఏమికనబడ్డదో నాకు తెలియదు గాని నా హృదయపద్మంమీద కూర్చున్న నీ విశ్వరూపంమాత్రం నాకు కనబడ్డది. దానిఎదుట నేను ఎక్కడ! మహాప్రళయం, ఏమిటి దాని మహాశక్తి! అది నన్ను పూర్తిగా నాశనం చేసేవరకూ నాకు బ్రతుకులేదు. నేను మరి సహించలేను, నాగుండె బద్దలయిపోతూఉంది."

ఆలాగు మాట్లాడుతూ కుర్చీమీదనుంచి గచ్చుమీద

పడిపోయి నాకాళ్లు పట్టుకున్నది. అటుపైని ఏడుపు, వెక్కి-వెక్కి ఏడుపు.

హిప్నాటిజమ్ అంటే అదీ! ఆ శక్తి పృథ్విని జయించే శక్తి. ఎటువంటి ఉపాయమూ లేదు, ఎటువంటి ఉపకరణాలూ లేవు, కేవలము ఒక సమ్మోహనాస్త్రము. సత్యమేవ జయతి అని అన్నది ఎవరు? జయం మోహానిది. బంగాలీలు అది గ్రహించే దశభుజములదేవి పూజను మన దేశములోకి తీసుకువచ్చారు; సింహవాహినియొక్క మూర్తిని కనిపెట్టినది బంగాలీలే. ఆ బంగాలీలే ఇప్పుడు ఇంకొకమూర్తిని స్థాపిస్తారు; ప్రపంచాన్ని కేవలం సమ్మోహనంవల్ల జయిస్తారు—వందేమాతరం!

చెయ్యిపట్టుకొని మెల్లిగా లేవనెత్తి విమలను కుర్చీమీద కూర్చోపెట్టాను. ఆవేశము తగ్గిపోకముందే ఆమెతో అన్నాను, "మన దేశములో తల్లిపూజ స్థాపించేభారం ఆమె నామీద వేసింది, గాని నేను గరీబును."

విమలముఖం అప్పటికి ఇంకా ఎర్రగాఉన్నది; కళ్లనిండా నీరు; గద్గదస్వరంతో అనడం ప్రారంభించింది—"నీవా గరీబు! ఎవనివద్ద ఏమిఉన్నా అదిఅంతా నీదే. నాదగ్గిర పెట్టెడు ఆభరణాలు ఉండి ఏమిప్రయోజనము? నాదగ్గిరఉండే బంగారమూ, మణిమాణిక్యాలూ, అన్నీ తీసుకో నీ పూజకు, నాకు అవి ఏమీ అవసరము లేదు."

విమల ఇంతకుముందుకూడా ఒకమారు తన నగలు తీసుకోమని నాతో అన్నది. ఎటువంటి పనిఅయినా వెనక-

తీయవలసినవాడను కాను నేను. ఇదిమాత్రం చాలాకష్టం అనిపించింది. కారణం ఏమిటి అని ఆలోచించి చూచాను. సనాతనంనుంచి స్త్రీకి ఆభరణాలు ఇచ్చే అధికారం పురుషునిది. అటువంటిది, ఆడదానిదగ్గిర ఆభరణాలు పుచ్చుకోవడంవల్ల మొగవాడి పౌరుషానికి హాని కలగకమానదు.

కాని ఇటువంటివాటిలో కొంతవరకు తనను తాను మరిచిపోతూ ఉండాలి. పుచ్చుకుంటూ ఉన్నది నేను కాదు. చేస్తూఉన్నది తల్లిపూజ, అంతా ఆ పూజలోకి వెళిపోతుంది. చాలా గొప్పగా పూజ జరిగించాలి, "ఇంత వైభవంగా ఏపూజా మనదేశంలో ఇంతకుముందు జరగలేదు," అని అందరూ అనాలి. నవయుగచరిత్రహృదయముమధ్యను ఈపూజను ప్రతిష్ఠించాలి. ఇది నా దేశానికి నేను ఇచ్చిన దానం. నా దానాలన్నిటిలో ఉత్కృష్టమయిన దానం కావలెను ఆ పూజ. పామరులు దేవతలను ఆరాధిస్తారు, సందీప్ దేవతలను సృష్టిచేస్తాడు.

ఇవన్నీ పెద్దమాటలు. ఇప్పుడు చిన్నవాటిలోకి దిగాలి. ప్రస్తుతము కనీసం మూడువేలు ఉంటేనే గాని జరగనేజరగదు, అయిదువేలు ఉంటే బాగా సరిపోతుంది. కాని ఇంతగొప్ప ఉద్దీపనంలోనుంచి వస్తూనే రూపాయిలమాట ఎత్తడం ఎలాగు! కాని మరి వేళలేదు ఆలస్యం చేయకూడదు.

సంకోచాన్ని దిగతొక్కి అన్నాను, "మా ఖజానా పెట్టెలు ఖాళీ అయిపోయినాయి రాణీ, పనిఅంతా నిలిచిపోడానికి సిద్ధంగా ఉంది."

విమలముఖం వాడిపోయింది. యాభైవేలూ నేను ఇప్పుడే ఇమ్మంటున్నానని గాబోలు అనుకుంటున్నది! ఆ భయం ఒక పెద్దరాయిఅయి గుండెమీద కూర్చున్నది; రాత్రిఅంతా ఆలోచించినా ఏదారి కానరాలేదు గాబోలు. తన మనస్సులో ఉన్నప్రేమను పూజద్వారా వెల్లడిచేయడానికి తగిన ఉపాయము ఏదీ చేతికి దొరకలేదు, తనహృదయాన్ని నా పాదాల దగ్గిర సమర్పిద్దామంటే అదీ చేయలేకుండాఉన్నది. అందుచేత నాకు ఇవ్వబోయేరూపాయిలమొత్తము బాగా పెద్దదిచేసి, పైకి రాలేక తనలోపున కొట్టుకుపోతున్న ప్రేమకు ఆ రూపాయిలే ఒక ప్రతిమూర్తిగాని చేయాలని కోరుతున్నది. కాని దారిఏదీ కనబడడంలేదు, ఊపిరి అందక బాధపడుతూఉన్నది. ఆమె పడుతూఉన్నబాధ వచ్చి నాకు తగులుతున్నది. ఇక ఆమె పూర్తిగా నాదేను; వేళ్లతోసహా పీకేబాధ నాకు మరి కలగదు; ఇకముందు అతిజాగ్రతతో చూచుకోవాలి, అతిముద్దుతో పెంచాలి.

నేను అన్నాను—"ఇప్పుడు ఆ యాభైవేలు అంత అవసరంకాదు రాణీ. లెక్కవేసి చూచాను, ఐదువేలు చాలు వనుకుంటాను. ఐదువేలేమిటి, ఆఖరుకు మూడు వేలైనా చాలును."

అనేసరికి విమల మనస్సున ఉండే బాధ హఠాత్తుగా తగ్గిపోయి పాటపాడుతున్నదా అన్నంత ఉల్లాసంతో, "తెచ్చి-స్తాను, అయిదువేలరూపాయిలు తెచ్చిస్తాను," అన్నది.

పూర్వం రాధ పాడిన పాట జ్ఞాపకంవచ్చింది నాకు— మూడు లోకాలలో వెతికినా దొరకని పువ్వు కొప్పులో పెట్టుకొని ప్రియునిదగ్గిరికి రావలెనని రాధ కోరిక—అయిదు వేల రూపాయిలు తెచ్చి ఇద్దామని విమలకోరిక. రెండిటిదీ ఒకటే స్వరం, రెండూ ఒకటే పాట, మాటలుమాత్రం వేరు. పిల్లనగ్రోవి గొట్టం సన్నం గనుక అటువంటిస్వరం, అటువంటి పాట. అత్యాశ ఆ పిల్లనగ్రోవిమీద కాలువేసి కుమ్మినట్టయితే పిల్లనగ్రోవి పిప్పిఅయిపోయి ఉండును, పాట మరి వినబడక పోను. దానికి బదులుగా, "ఎందుకు, నీకు అన్నిరూపాయిలు అవసర మేమివచ్చింది? నేను ఆడదానను కదా, అంతమొత్తం నాకు ఎక్కడ దొరుకుతుంది?"—ఇటువంటి నానారకాల మాటలూ వచ్చిఉండును ఆపాటలో; అది రాధపాటతో ఎంతమాత్రం కలియకపోను. అందుచేతనే నేను అంటున్నాను —మోహమే వాస్తవం, అదే ఆ పిల్లనగ్రోవి; మోహంపోతే మిగిలినది ఆ విరిగిన పిల్లనగ్రోవి గొట్టాం. అది అతినిర్మలమైన శూన్యం. సంపూర్ణమయిన శూన్యం నిఖిల్ కి ఇప్పుడు దొరికింది, ఆ సంగతి అతని ముఖంమీదనే కనబడుతున్నది, చూడడానికి నాలాంటివాడికికూడా బాధ కలుగుతున్నది. ఐనప్పటికీ సత్యమే కావాలి అని నిఖిల్ కు బడాయి. ఇవతల నాబడాయి ఏమిటీఅంటే, చేతనయినంతవరకు మోహాన్ని నాచేతిలోనుంచి జారిపోనివ్వను అని. "యాదృశీ భావనా యస్య సిద్ధి ర్భవతి తాదృశీ," ఎటువంటి వాళ్లకు అటువంటిది దొరుకుతూ

ఉంటుంది, మూలుగులవల్ల ఏమిప్రయోజనం ?

విమల మనస్సును ఆ మీాదిప్రదేశంలోనే ఎగురుతూ ఉంచుదామనే ఉద్దేశంతో అయిదువేల రూపాయిలమాట నాలుగు మాటలతో పూర్తిచేసి తిరిగి మహిషాసుర మర్దనీ పూజ విషయమయి మాటలు ప్రారంభించాను—పూజ ఎప్పుడు చేయడం? ఎక్కడ చేయడం ? నిఖిల్ ఎస్టేటు గ్రామం రుయిమారీలో మార్గశిర మాసంలో హోసేన్‌గాదీమేళా అని ఒక పెద్ద జాతర అవుతుంది. అక్కడకు లక్షలకొలది ప్రజ వస్తారు. అక్కడ ఆపూజ జరిగేటట్టు గాని మనం ప్రయత్నంచేస్తే చాలా బాగా ఉంటుంది.' విమలకు ఉత్సాహం పుట్టింది. ఇది విదేశీ బట్టలు తగలబెట్టడం కాదు, ఇళ్లు తగలబెట్టడం కాదు, అందుచేత నిఖిల్‌కు ఎటువంటి అభ్యంతరమూ ఉండదు అని అనుకున్నది. నాలోపున నేను నవ్వుకున్నాను— తొమ్మిది సంవత్సరాలు రాత్రింబగళ్లు ఒక్కదగ్గిర ఉన్నవాళ్లకుకూడా ఒకరిసంగతి ఒకరికి తెలియదు కదా ! వాళ్లకు తెలిసేది కేవలం ఇంటిసంసారం సంగతులే; పైవ్యవహారం ఒక్కటి ఇంట్లోకి ఎప్పుడైనా దూరిందా, ఎటువంటిదన్నూ వాళ్లకు మరి దొరకదు. బయటనున్న ప్రపంచానికి ఇంట్లోనున్నదానికీ సంపూర్ణమయిన కలయిక ఉన్నదనే వాళ్లనమ్మకము ; తొమ్మిది సంవత్సరాలూ బయిటకు రాకుండా ఇంట్లోనే కూర్చోవడంవల్ల వచ్చిన లాభం ఇదీ. ఎన్నడూ కలియనివి ఒక్కమాటు ఎక్కడయినా కలియు-గలవ్వూ ? ఈ సంగతి ఇప్పుడు బోధపరుచుకోవలసి వచ్చింది.

పోనీ పొరపాటుపడ్డవాళ్లు దెబ్బలు తినితిని వాళ్ల తప్పు వాళ్లే తెలుసుకోనీ, దానిగురించి నేను దుఃఖించ నవసరంలేదు.

విమలను ఈ ఉద్దీపనంలో ఉంచి ఆ బెలూన్‌ను చాలా-సేపు ఎగిరిస్తూఉంచడం సాధ్యంకానిపని. కనుక ప్రస్తుతం జరగ-వలసిన పని చేతనయినంత త్వరలో, చేయించేయాలి. విమల కుర్చీమీాదనుంచి లేచి తలుపుదాకా వెళ్లేసరికి, మనస్సులో ఏమీా లేకుండా ఏదో అడిగినట్టుగా, అడిగాను, "రాణీ, అయితే రూపాయిలు ఎప్పుడు—"

"నెలాఖరున కొత్తనెల ఖర్చులకని రూపాయిలు వసాయి—"

"అంత ఆలస్యం అయితే లాభం లేదు."

"ఎప్పుడు కావాలి అయితే?"

"రేపే!"

"సరే, రేపే తెచ్చిఇస్తాను ఆలా అయితే."

పత్రికలలో నామీద వ్రాత ఆరంభం అయింది. నన్ను వెక్కిరిస్తూ బొమ్మలూ, పద్యాలూ, త్వరలో ప్రకటించే ప్రయత్నం జరుగుతున్నదని కూడా విన్నాను. హాస్యరస ప్రవాహం పొడచూపుతున్నది. అసృతధారలుకూడా ఆ ప్రవాహంలో పడతాయి. ఇదంతా చూడగానే మనదేశస్థుల ఒంట్లో పులకరింపు పుడుతుంది. ఆ బురద వసంతకొట్టే పిచ్కారీలు తమచేతులలోనే ఉన్నవని వాళ్లు బాగా ఎరుగుదురు. నాలాంటి పెద్దమనిషి ఎవడైనా తెల్లబట్టలు వేసుకొని బట్టలు బురదకాకుండా రోడ్డుపక్కనుంచి మెల్లిగా వెళిపోదామంటే వీలయిన పనా ?

నా తాలూకాలో చిన్నా పెద్దా అనక ప్రతివానికీ స్వదేశీమీద చాలా అభిమానంగా ఉన్నదిగాని నాభయంవల్ల ఎవరూ ఏమీ చేయలేకుండాఉన్నారు అని కూడా వ్రాశారు. ఎవడైనా సాహసుడు, ఒకడూ అరా, స్వదేశీ వస్తువులు వాడుకచేసేవాడు ఉన్నట్టయితే వాడిమీద నా జమీందార్ గిరీ చూపించి వాణ్ణి నానా బాధలూ పెడుతున్నానట. పోలీసు వాళ్లకూ నాకూ లోలోపున ఏదో సంబంధము ఉన్నదట. మేజస్ట్రేటుగారికీ నాకూ రహస్యంగా ఉత్తరాలు జరుగుతున్నవట. పిత్రార్జితంగా నాకువచ్చిన బిరుదుకు స్వార్జితమయినవి కొన్ని కలపడానికి నేను చేస్తూఉన్న ప్రయత్నం వృథా కాదు

అని వార్తాపత్రికలవాళ్లు రహస్యం కనుక్కోగలిగారట. నా పేరు స్పష్టంగా చెప్పలేదు గాని వ్రాసినదంతా ఎవరిమీదనో చదివేవాళ్లకు ఎటువంటి సందేహమూ ఉండదు.

అటుపక్క, మాతృవత్సలుడు హరిశ్ కుండుగారి గుణాలను స్తోత్రంచేస్తూ ఉత్తరాలమీదఉత్తరాలు పడుతూఉన్నవి పత్రికలలో. ఇటువంటి దేశసేవకులు మరికొంతమంది మనలో ఉన్నట్టయితే మన వందేమాతరంతో కలిపి మ్యాంచస్టరు ఫ్యాక్టరీల చిమ్నీలు చావుబాకాలు ఈపాటికి ఊదుతూ ఉండును అనికూడా వ్రాశారు. సీమఉప్పు తమతాలూకాలలోకి దిగుమతి కానిచ్చే ఏఏజమీందారుల ఖజానాలు తగలబెట్టేశారో ఆ వివరమంతా తెలియజేస్తూ ఎర్రసిరాతో వ్రాసినఉత్తరం ఒకటి నాకు వచ్చింది. అగ్నిదేవుడు ఈ దేశము పావనం చేయడమనేపనిలోనే కూర్చుంటాడట. తల్లికి నిజమైన సంతానముకానివాళ్లు తల్లి ఒళ్లోనుంచి దిగేటట్టు చేయాలట, దానికి తగిన ఏర్పాట్లు జరుగుతున్నవట— "ఇట్లు, తల్లి ఒడిలోని అధములలో అధముడు, అంబికా చరణ గుప్త" అని దొంగ సంతకము.

నాకు తెలుసును, ఇదంతా ఈ చుట్టుపక్కలఉండే స్కూలూ కాలేజీ కుర్రవాళ్ల పని. వాళ్లల్లో ఇద్దరుముగ్గుర్ని పిలిపించి ఆ ఉత్తరం చూపించాను. బి. ఏ. చదువుతున్న కుర్రవాడు అతిగంభీరభావంతో అన్నాడు—"మన దేశంలో ఒక దళం ఉన్నదట, ఆ దళంలోవాళ్లు స్వదేశీఅంటే చచ్చిపో-

తున్నారు, ఆ స్వదేశీ దేశమంతటా వ్యాపింపజేయడానికి వాళ్లు చేయలేనిపని లేదట, మేమూ, వింటున్నాము."

"వాళ్ల అన్యాయమూ, జబరుదస్తీలకు మనలో ఒక్క-డయినా లోబడవలసివస్తే అది మన దేశానికంతటికీ కలిగిన పరాభవమన్నమాటే," అని నేను అన్నాను.

"మీరు అనేది నాకేమీ బోధపడడం లేదు," అన్నాడు మాస్టరీ ఎం. ఏ.

నేను అన్నాను—"దేవతలు మొదలు కనిస్టేబులవరకూ అందరికీ జడిసి జడిసి మనదేశం సగంచచ్చింది. ముక్తి అని పేరు పెట్టి మీరు ఇప్పుడు మరిఒక కొత్తభూతాన్ని తీసుకువచ్చి మీ దుర్నయాలవల్ల మన దేశస్థుల పిరికితనము మరింత అధికంచేసి దానిమీద మీ జయపతాకం స్థాపించవచ్చును, గాని దేశమంటే నిజమైన అభిమానం గలవాడు ఒక్క-డైనా మీ భయ-శాసనాన్ని మన్నించడు."

"రాజ్యశాసనము భయ-శాసనము కానిదేశం ఒక్క-టైనా చూపించగలరా ?" అన్నాడు మాస్టరీ ఎం. ఏ.

"భయ-శాసనం ప్రతిదేశంలోనూ కొంతవరకు ఉన్నది. దాని విరివినిబట్టే దేశస్థులకుఉన్న స్వాతంత్ర్యం తెలుసుకో-వచ్చును. చోరీ, బందిపోటూ, మొదలయినవాటిమీదనే భయ-శాసనం ప్రయోగిస్తూ ఉన్న దేశాలలో ప్రజలు కొంత-వరకు స్వాతంత్ర్యం పొందారని అనవచ్చును; ఆ దేశాలలో మనుష్యులు-ఇతరులను తమకు లోబరుచుకుందామని ప్రయత్నం

చేయడంలేదని ఊహించవచ్చును. కాని మనము ఎటువంటి బట్టలు వేసుకోవలెనో, ఏదుకాణములో కొనవలెనో, ఏమిటి తినవలెనో, ఎవరితో కూర్చొని భోజనంచేయవలెనో — ఇటువంటివన్నీ శాసనానికి భయపడి నిశ్చయించుకోవలసివస్తే మనకు ఎటువంటిస్వేచ్ఛా లేదని ఒప్పుకోవాలి. అప్పుడే మన మనుష్యత్వము పూర్తిగా నాశనము అయిపోయింది అన్న మాట.

"మనుష్యుని స్వేచ్ఛను నాశనం చేసేపనులు మరి ఏ దేశం లోనూ, ఏసంఘంలోనూ, జరగలేదా?" అని అడిగాడు హిస్టరీ ఎం. ఏ.

"ఎవరన్నారు జరగలేదని? ఏదేశంలో ఏపరిమాణంలో బానిసవృత్తి జరుగుతున్నదో, దానికి ఆదేశస్థులు ఎంతవరకు తోడ్పడుతున్నారో, ఆ పరిమాణంలో మనుష్యత్వం వారు నాశనం చేస్తున్నారు.

"అయితే, ఈబానిసవృత్తి మనుష్యధర్మం అన్నమాట. అదే మానుషత్వం," అన్నాడు ఎం. ఏ.

బి. ఏ. అన్నాడు, "సందీప్‌బాబు ఈ సంబంధంలో ఇచ్చిన దృష్టాంతం నాకు బాగా నచ్చింది. అదుగో అటు చూడండి ఆ జమీందారు హరిష్‌కుండూ, ఇటు చూడండి సాన్‌కి ఖాంగాలో ఉన్న చక్రవర్తి కుటుంబంవాళ్లు—ఇద్దరికిద్దరూ ఒకగిద్దెడు సీమఉప్పయినా దొరకకుండా వాళ్లవాళ్ల తాలూ-కాలు ఒకమూలనుంచి ఇంకొకమూలవరకూ శుభ్రంగా ఊడ-

పించేశారు. ఎందుచేత ? ఎందుచేతనా—వాళ్లు ఎప్పుడూ ఆ-లాగు జబర్దస్తీగానే రాజ్యం చేస్తున్నారు. స్వభావసిద్ధంగా బానిసలయినవాళ్లకు మీాదఎక్కి కూర్చొనే అధికారి ఒకడు లేకపోవడమే అన్నిటికంటే గొప్ప ఆపద !"

ఫేల్లు ఎఫ్. ఏ. అన్నాడు—"నాకు ఒక మంచిసంగతి జ్ఞాపకం ఉంది. చక్రవర్తిగారి తాలూకాలో ఒకకాయస్థుడు ఉండేవాడు, అతను జమీాదారంటే ఏమీా లక్ష్యపెట్టేవాడు కాడు. తన అధికారంలో ఉన్న ఒక్కసంతలోనూ తనఇష్టం వచ్చినట్టు ప్రవర్తిస్తూ ఉండేవాడు. జామీాదారు అతనిని దా-వాలోకి దింపి చివరకు తిండికికూడా లేకుండా చేశాడు. రెండురోజులు పొయ్యిలో నిప్పులేకపోయేసరికి పెళ్లాం వెండి వస్తువులు పట్టుకొని బయలుదేరాడు—అవి అమ్ముకొని తినాలి, అదిఒక్కటే అతనికి మిగిలిన ఆధారము. జమీాదారుగారి ఆజ్ఞ అయింది, ఊళ్లో ఎవడికీ సాహసం లేదు అవి కొనడానికి. ఎస్టేటు మేనేజరు, 'అయిదురూపాయిలకు ఇస్తే నేను కొంటాను,' అన్నాడు, వాటిఖరీదు ఎంతలేదన్నా మున్నై రూపాయిలకు తక్కువ ఉండదు. అయిదురూపాయిలకు అమ్ముతాడా చస్తాడా! వేరే ఉపాయం తోచక ఆఖరుకు అమ్మేయడానికి ఒప్పుకొని మేనేజరుచేతిలో పెట్టాడు వస్తువులమూట. మేనేజరు అది పుచ్చుకొని ఈ అయిదురూపాయిలూ నీ సిస్తుకింద జమకట్టాను పొమ్మన్నాడు. ఆమాట వినిచక్రవర్తి జమీాదారుని బోయ్కాట్ *

---

*బోయ్కాట్: Boycott : బహిష్కారం.

చేదామని నిశ్చయించుకున్నాము. ఆమాట సందీప్‌బాబుతో చెప్పేసరికి ఆయన అన్నాడు—"నిండుప్రాణాలతో ఉన్న ఇటువంటివాళ్లను నలుగురినీ మీరు అవతలికి వెళ్లగొట్టి శ్మశానంనుంచి శవాలను తీసుకువచ్చి మీ స్వదేశీ సాధిస్తారా ఏమిటి? వీళ్లకే తెలుసును తమకు కావలసినదేదో, తెలుసుకొని సంపాదించుకోడంకూడా వీళ్లే ఎరుగుదురు. ప్రభువులంటే వీళ్లే. తమకు కావలసినది కోరుకోడం చేతకానివాళ్లు కేవలం వీళ్లఇష్టప్రకారమే నడుచుకొని తీరుతారు, వీళ్లు చావమంటే చస్తారు." సందీప్‌బాబు, తరవాత, చక్రవర్తిజమీందారును మీతో సరిపోల్చి అన్నాడు—"వాళ్ల తాలూకాలో ఈరోజున ఊఁ ఆఁ అనకుండా ప్రతివాడూ స్వదేశీ అంగీకరించాడు, గాని నిఖిల్ తలకిందుల తపస్సుచేసినా తన తాలూకాలోకి స్వదేశీ తీసుకురా గలడూ?"

"నాకు కావలసినది స్వదేశీకంటే చాలాగొప్పది. అందుచేత స్వదేశీ స్థాపించడం నాలాంటివాడికి చాలా కష్టమయిన పని. నాకు ప్రాణంలేని ఎండుకర్రముక్క అక్కరలేదు; ప్రాణంతో ఉన్నచెట్టు కావాలి. గనుక నేను చేయబూనుకున్న పని చాలాకాలం పడుతుంది," అని అన్నాను.

హిస్టరీ కుర్రవాడు వేళాకోళంచేస్తూ అన్నాడు—"మీరు ప్రాణంలేని కర్రా సంపాదించలేరు, బ్రతికిఉన్న చెట్టూ సంపాదించలేరు. సందీప్‌బాబు అన్నమాట నిజము—సంపాదించడమనగా బలవంతాన లాక్కొని తెచ్చుకోవడము. ఈ

సంగతి మాకు 'స్కూల్లో చెప్పినదానికి కేవలము విరుద్ధము; గనుక ఇది నేర్చుకోడానికి మాకు చాలా కాలం పట్టింది. నా కళ్ళతో నేను చూచాను—హరిష్ కుండూగారి గుమాస్తా గురుచరణభాదురీ జమాబందీకి బయలుదేరి జమీందారిగారికి బాకీపడిపోయిన ఒక రయితుదగ్గిరికి వచ్చాడు. ఆ రయితు ఒక సాయిబు, అమ్మితే పైసా అయే వస్తువు ఒక్కటి కనబడలేదు ఆ సాయిబు దగ్గిర. ఇంట్లో ఉన్నదంతా ఒక యువతి, తన భార్య. 'నీభార్యను మారు మనువుకు పంపి బాకీ చెల్లించు' అని గుమాస్తా అన్నాడు. మారుమనువుకు ఒప్పుకున్న మొగుడు జతకూడాడు, జమీందారుగారి అప్పు తీరిపోయింది. మీతో ఇప్పుడు చెప్తున్నాను—ఆ భర్త కళ్ళ నీళ్లు చూచి నాకు రాత్రిమరి నిద్ర వచ్చిందికాదు. కష్టం అయితే కావచ్చును గాని డబ్బు రాబట్టుకోవలసినదగ్గిర బాకీ ఉన్నవాడి భార్యను అమ్మించి అయినా రాబట్టుకోగలిగినవాడు మనుష్యత్వాన్ని బట్టి చూస్తే నాకంటే గట్టివాడని నేను ఒప్పుకోక తీరదు. నేను ఆలాగు చేయలేను, నా కళ్ల వెంట నీళ్లు వస్తాయి, గనుక నే అన్నీ నాచెయ్యి తప్పించుకొని పారిపోతాయి. మనదేశాన్ని ఎవరైనా రక్షించగలిగితే ఇదుగో ఈ గుమాస్తాలు, ఈ కుండు, ఈ చక్రవర్తి లాంటి వాళ్లే!"

నేను నిర్ఘాంతపోయి అన్నాను—"ఆలాగైతే మనదేశం ఈ గుమాస్తాలూ, కుండూ, చక్రవర్తులు చేతులలోపడకుండా కాపాడడమే నాపని. చూచావూ అబ్బాయి, అస్థిగతమయి-

పోయి మనలో ఉన్న బానిసత్వము ఏమాత్రం అవకాశం దొరకినా బయటికి వచ్చేస్తుంది; వచ్చి ఒక భీషణమైన క్రౌర్యమయి అందరినీ పీడిస్తుంది—కోడలుగా ఉండి రోజూ మొట్టికాయలుతినడమూ అత్తగారయి అందరికంటే ఎక్కువ కాల్చుకు తినడమూ! ప్రతిదానికీ జడవడమూ, ప్రతిదానికీ లోబడి ఉండడమూ, మీకు అలవాటయిపోయింది. అది ఒక మతమయి మీలో కూర్చున్నది. అందరిలోనూ అటువంటి భయమూ లొంగుబాటూ పుట్టించడమే ఇప్పుడు మీ ధర్మము. నేను చేస్తూ ఉన్న యుద్ధం మిమ్మల్ని పట్టుకున్న బలహీనతతోనూ, మీ దారుణతతోనూ.

నేను చెపుతూఉండే ఈ మాటలన్నీ మామూలుమాటలే, సరళస్వభావము గలవాళ్లకు బోధపరుచుకోడానికి ఒక్క నిమిషమైనా పట్టదు. గాని మన బి. ఏ. లూ, ఎం. ఏ. లూ వాటిని నులివేసి అష్టవక్రం చేసేస్తారు—వాళ్లకుండే దేశచరిత్రజ్ఞానమంతా నిజాన్ని తారుమారు చేయడానికే గాబోలు ఉపచరిస్తుంది.

ఇవతల, పంచుదగ్గిర చేరుకున్న మాయఅత్తగారి సంగతి నన్ను బాధిస్తున్నది. అత్తకాదు అని చూపించడము చాలా కష్టము. నిజంగా జరిగిన సంగతికి సాక్షులు అట్టేమంది ఉండరు—ఒకొక్కప్పుడు ఒక్కసాక్షీ లేకపోవచ్చును. కాని ఎన్నడూ జరగని సంగతి విషయంలో మనము ప్రయత్నం చేయగలిగితేమాత్రము కావలసినంతమంది సాక్షులు. పాచు

నాకు ఇల్లు క్రయంచేశాడు, గనుక ఆ క్రయం ఏలాగైనా రద్దు-చేయిద్దామని వేసిన ఎత్తు ఇది.

నాకు ఉపాయంఏదీ తోచక నా జాగాలో ఎక్కడైనా ఒక చిన్న ఇల్లు కట్టించి ఇచ్చేస్తే తీరిపోతుంది అనుకుంటున్నాను, అప్పుడు మాస్టరుగారు వచ్చి అన్నారు—"అన్యాయం చేదామని నిశ్చయించుకుకూర్చున్న వాళ్లదగ్గిర 'మనము ఏమి-చేయగలము' అనుకుంటూ ఊరుకోడం నాతరంకాదు. నేను దానికి తగిన పని చేయాలి, ఆ ప్రయత్నంలోనే ఉన్నాను."

"మీరా!" అని అన్నాను ఆశ్చర్యపడుతూ.

"ఆహా, నేనే!"

ఇదంతా దావాలతో పని. అటువంటివాటిలో మాస్టరుగారు ఏమి చేయగలరో నాకు ఏమీ బోధపడలేదు. రోజూ సాయంకాలం నాదగ్గిరికి వచ్చేవేళకు ఆవాళ రాలేదు. కనుక్కుంటే, ట్రంకూ పరుపూ పట్టించుకొని పైకి వెళిపోయినారని తెలిసింది, తిరిగి వచ్చేసరికి మూడునాలుగురోజులు అవుతుందని మాత్రం చెప్పారట. పాతులను జాగ్రత్తపెడదామని పంచు మామగారిఊరికి వెళ్లిఉంటారు అనుకున్నాను. ఆపని మీద వెళ్లిఉంటేమాత్రం ఆయనది వృథాప్రయత్నం అవుతుంది.

శరత్కాలంలో సాయంత్రంపడుతూ ఉండేసరికి రోజూ ఆకాశాన్ని ఒకతరహా బురదరంగు చేరుతుంటుంది. ఆ సమయంలో మన మనస్సులలోకూడా కొంత కలత పుడుతుంది.

ఈ ప్రపంచంలో అనేకమంది నివాసం ఇటికలతో కట్టిన పక్కా- ఇళ్ళల్లో. వాళ్ళకు 'బయట'తో ఎటువంటి సంబంధమూ లేదు; 'బయట' అనేది లేదనుకొనే, వాళ్లు జీవనయాత్ర చేయ- గలరు. నేను ఆలాగు చేయలేను—నా నివాసస్థానము ఆ బయటనే. నా మనస్సు ఎప్పుడూ చెట్లకింద బస చేసుకు కూర్చుంటుంది; వాయుదూత నాలుగువైపులనుంచీ తీసుకు వస్తున్న సందేశాలను అందుకుంటూ ఉంటుంది; చీకటీ వెలు- తురూ కలిసి వాయిస్తూఉన్న వీణనాదం తగలగానే నాహృ- దయంకూడా వాగి పాడుతుంటుంది. పగటిపూట బాగా వెలుతురు ఉన్నంతసేపూ సంసారసంబంధమయిన పనులు లెక్కలేనన్ని నాలుగు వైపులా కనబడుతుంటాయి, అప్పుడు అవి తప్ప ప్రపంచంలో మరేమీ లేదు అనిపిస్తుంది. ఆకా- శాన్ని మెల్లిమెల్లిగా కాంతి తగ్గి, చివరకు స్వర్గద్వారం తలుపులు మూసుకుపోతాయి. సంసారం కొంతసేపు మన కంటికి అగపడ- కుండా చేయడానికి గాబోలు ప్రపంచంమీదికి సంధ్య వస్తుంది అని అప్పుడు అనిపిస్తుంది. నాలుగువైపులా నిండిఉన్న మహాంధకారాన్ని 'ఆ ఒక్కని'తో నింపవలసిన సమయం ఇది అని జలస్థలాకాశాలు మనకు చేసే ఉపదేశం. పగటివేళ 'అనే- కము' ద్వారా వికాసంపొందే ప్రాణం చీకటి కాగానే 'ఏక- ము'లో మూసుకుంటుంది—వెలుతురూ చీకటీ అనే వాటి అర్థం ఇదే. ఈ నిజము నాకు అక్కరలేదు అని పట్టుపట్టి మనస్సును రాయిచేసుకొని నేను కూర్చోలేను. కనుక, రెప్ప వేయకుండా

చూస్తూఉన్న ప్రేయసి నల్ల కళ్ల చూపులవలె ఈ పృథ్విని గాఢాంధకారము ఆక్రమించి ఉన్న సమయంలో, నాలో ఉన్న సర్వమూ నాచెవిలో చెపుతూ ఉంటుంది—"పనే మనుష్యుని ఆదీ అంతమూ అని అనుకొంటారు, గాని అది ఎన్నటికీ సత్యం కానేరదు. ఉత్తఅబద్ధము. మానవజీవనం యొక్క-రహస్యం—సారం—పనీ కాదు, దాసత్వమూ కాదు. దాసత్వం ధర్మంకోసం కావచ్చును సత్యంకోసము కావచ్చును, అయినా దాసత్వం దాసత్వమే, దానివల్ల జీవనం సార్థకం ఏలాగు కాగలదు?

ఆహా నిఖిలేశ్, చీకటిరాత్రిని నక్షత్రాలు చూస్తూ బయట కూర్చొనే వాడవు జ్ఞాపకం ఉన్నదా? చీకటి కాగానే పని అంతా తెముల్చుకొని ఆ అంధకారంలో, ఆ అమృతంలో మునిగిపోయి కూర్చుండేవాడవు జ్ఞాపకం ఉన్నదా? అటువంటి నిన్ను శాశ్వతంగా వదులుకున్నావా ఏమిటి నిఖిల్? లెక్క-లేని పనులమధ్య నున్నప్పటికీ ఏకాకినని అనుకోవలసిన వాని అవస్థ చాలా కష్టమయినది!

మధ్యాహ్నము మెల్లిమెల్లిగా సంధ్యకావస్తున్నది. ఆనాడు నేను చేయవలసినది ఏదీ కనబడలేదు. ఏపనిలోకి మనస్సు పోలేదు. మాస్టరుగారు కూడా ఊళ్లోలేరు. శూన్యం భరించ లేక నా మనస్సు ఏదైనా దొరికితే ఆసరాచేసుకొని కూర్చుందా మని కోరుతున్నది! ఏమీతోచక ఇంట్లోనున్న పూలతోటలోకి వెళ్లాను. చామంతి పువ్వులంటే నాకు చాలా సరదా. అనేక

రంగుల చామంతి మొక్కలు తొట్టెలలో వేసి తోటలో పేర్పించాను. అవన్నీ పూచినప్పుడు పచ్చని సముద్రంలో లేచిన కెరటాలు అంతా పొంగుతో నింపేశాయా అనిపించేది. ఎన్నో రోజులయి ఉంటుంది, అటువైపు వెళ్లి నేనువాటిని చూచి. నా మనస్సులో నేను నవ్వుకొని అన్నాను—"ఓహో, విరహిణి అయిన చామంతి విరహం పోగొట్టడానికి వచ్చినట్టున్నాను!"

నేను పూలతోటలో ప్రవేశించేసరికి బహుళపాడ్యమి నాటి చంద్రుడు అప్పుడే ఉదయించి మా గోడమీదనుంచి కనబడుతున్నాడు. ఆ వెన్నెల నా ముఖంమీద పడుతున్నది; గోడ చేరువను బాగా చీకటిగా ఉన్నది; తోటలో పశ్చిమ భాగమంతా అప్పుడే వెన్నెలతో నిండిపోయింది. వెనకనుంచి మెల్లిగా వచ్చి చీకటియొక్క కళ్లు తన చేతులతో మూసి పెంకినవ్వు నవ్వుతున్నాడు చంద్రుడు అని అనిపించింది.

తోటలో ఒకవైపు గ్యాలరీలాగు మెట్లు కట్టించి దాని మీద చామంతి మొక్కల తొట్టెలు వరసలువరసలుగా పేర్పించాను. అటువైపు వెళుతున్నాను, మెట్లఅడుగున ఎవరో కనబడ్డారు—గడ్డిలో చలనంఅన్న మాట లేకుండా పడుకొని ఉన్నారు. నాగుండె దబ్ దబ్ మని కొట్టుకోవడం ప్రారంభించింది. నేనూ దగ్గిరికి వెళ్లాను, ఆ పడుకున్న వారు అదిరిపడి తొందర తొందరగా లేచి కూర్చున్నారు.

తరవాత ఏమిటి చేయడం! అక్కడనుంచి తిరిగివెళిపోయేదా లేదా అని ఆలోచిస్తున్నాను, విమలకూడా లోపుప

వెళిపోనా లేదా అని ఆలోచిస్తున్నది, సందేహంలేదు. కాని అక్కడ నిలబడి ఉండడం ఎంతకష్టమో వెళిపోవడంకూడా అంతకష్టమే! ఏమి చేయాలో నేను ఇంకా నిశ్చయించుకోలేక పోయినాను. విమల లేచి నిలుచొని తలమీదికి చీరకొంగు లాగుకొని ఇంటివైపు వెళిపోతున్నది.

విమల హృదయంలో ఉండే దుర్భరమైన దుఃఖం ఆ రెండునిమిషాలలో రూపంధరించి నాకంటికి కనబడ్డది. నాదుఃఖ మంతా, ఒక్కక్షణంలో కొట్టుకుపోయింది. "విమలా" అని పిలిచాను.

విమల అదిరిపడి నిలుచున్నది. నావైపు తిరగలేదు. నేను ఆమెఎదుటికి వెళ్లాను. నా ముఖంమీద వెన్నెల పడుతు న్నది, ఆ మొముఖాన నీడ. ఆమె పిడికెళ్లు పట్టి కళ్లు మూసుకొని నిలుచున్నది. అప్పుడు నేను అన్నాను—"విమలా, ఇక్కడ నీకు నాలుగువైపులా అడ్డు, కట్టిపెట్టి నిన్ను ఈ పంజరంలో ఎందుకు ఉంచుతున్నానో నాకే బోధపడకుండాఉంది. ఇందులో ఉన్నట్టయితే నువ్వు కృశించిపోతావు, తప్పదు."

విమల కళ్లుమూసుకొనే ఉంది, ఒక్కమాటఅయినా అనలేదు.

"నిన్ను కట్టిపెట్టి బలవంతాన ఈలాగు ఉంచడం నా జీవనాన్ని ఒక ఇనపగొలుసుగా చేసుకోవడం. దానిలో ఏమి సుఖం ఉన్నది?" అని నేనే అన్నాను.

విమల ఒక్క మాట అనలేదు.

"గనుక, ఇదే నీకు విడుదల, నిజంగా చెపుతున్నాను, నామాట నమ్ము. నేను ఏది అయినా కాకపోయినా నీచేతికి సంకెళ్లుమాత్రం కాను," అని నేను అన్నాను.

ఈలా అంటూ ఇంటివైపు వెళిపోయినాను. ఇది నా ఔదార్యంవల్ల కాదు, ఔదాసీన్యంవల్ల అంతకంటే కాదు; ఒకరి స్వేచ్ఛకు అడ్డుపడినంతసేపు నాకు ఎప్పటికీ ముక్తి దొరకదు అని గ్రహించడంవల్ల. విమలను నా మెడలోని హారంగా చేసుకోవడం అనగా నామెడను ఒకభారం వేలగట్టుకోవడం అన్నమాట. అటువంటిది నాకు అక్కరలేదు. నాకు సుఖం లేకపోతే లేక-పోనీ, దుఃఖము రావలసి ఉంటే రానీ, గాని నన్నుమాత్రం కట్టి-పెట్టి ఉంచవద్దని చేతులుజోడించి ఆ ముక్తిదాయకుని అడు క్కుంటున్నాను. మిథ్యను సత్యంఅనుకొని పట్టుకుకూర్చోవడం తన మెడను తానే పిసుకుకోవడం అన్నమాట. అటువంటి ఆత్మ హత్యనుండి నన్ను రక్షించమని భగవంతుని ప్రార్థిస్తున్నాను.

ముందు గదిలోకి వచ్చి చూచేసరికి అక్కడ మాస్టరు-గారు కూర్చొని ఉన్నారు. నాగుండె ఇంకా కొట్టుకుంటున్నది, గాబరా తగ్గలేదు. ఆయనను చూస్తూనే పలకరించనైనా పలక రించకుండా, "స్వేచ్ఛ—ముక్తి—అన్నిటికంటే గొప్పది, మనిషికి —కాదండీ మాస్టరుగారూ?" అని ప్రారంభించాను. "ముక్తితో సమమయినది ఏదీ లేదు, దాని ముందర ఏదీ పనికి రాదు."

నాఉద్రేకం చూచి మాస్టరుగారు ఆశ్చర్యపోయినారు. ఏమీ మాట్లాడలేదు, నా వైపు చూస్తూ కూర్చున్నారు.

మళ్లా నేనే అన్నాను—"పుస్తకాలు చదివినంత మాత్రాన మనకు ఏమీ తెలిసిపోదు. మనలోనున్న కోరికలు బంధాల వంటివి, మనసూ కట్టి ఉంచతాయి, ఇతరులనూ కట్టిపెట్టి ఉంచుతాయి అని, శాస్త్రాలలో చదువుతుంటాము. కాని అవి వట్టి మాటలు. వాటివల్ల మనకు ఏమీ బోధపడదు. పక్షిని ఏనాడయితే పంజరంలోనుంచి విడిచిపెట్టేస్తానో ఆనాడు నిజంగా బోధపడుతుంది—నేను పక్షిని వదలడం కాదు, నన్నే పక్షి వదిలింది అని. నేను దేనిని పంజరంలో కట్టిపెట్టి ఉంచుతానో అదే నన్ను నాఇచ్ఛలో కట్టి ఉంచుతుంది—ఆ ఇచ్ఛా బంధం సంకెళ్ల బంధంకంటె చాలా బలమైనది. ఈ సంగతి మాత్రం లోకంలో ఎవరూ బోధపరుచుకోరు, నేను చెప్పాను చూస్తుండండి మాస్టరుగారూ. సంస్కరణ ఇంకెక్కడో కావలసి ఉన్నదని తప్పు అభిప్రాయపడుతున్నారు అందరూ. గాని నిజంగా సంస్కరణ మన ఇచ్ఛలలోనే కావలసి ఉన్నది."

"మనము కోరేది మనచేతిలో పడడమే స్వాధీనత పొందడం అని అనుకుంటున్నాము గాని మనము కోరేదానిని మనస్సులోనే త్యాగంచేయడం నిజమైన స్వాధీనత పొందడం," అని మాస్టరుగారు అన్నారు.

ఇటువంటివన్నీ ఆలాగు మాటలతో చెపుతున్నంతసేపు ఎవరిలోనూ నమ్మకం పుట్టించవు, విన్నవాళ్లు ఇవన్నీ వట్టిబోడి మాటలు, నిస్సారమైనవి అనుకుంటారు. కాని అనుభవంవల్ల ఏరవ్వంత తెలిసినా వాటినే అమృతం అని పట్టుకుంటారు. దేవ-

తలు ఈఅమృతాన్ని తాగే అమరులయినాము. 'సౌందర్యం' అనేదానిని చేతిలో పట్టుకుకూర్చున్నంతసేపు అదిమనకు కనబడదు. దానినిచూడవలెనంటే పట్టువదలాలి ముందు. ఈ పృథ్విని జయించినవాడు అలెగ్జాండర్ కాదు, బుద్ధుడు. ఈ సంగతి పొడిమాటలతో చెపుతూఉన్నంతసేపు అబద్ధం అనిపిస్తుంది. దీనిని గీతం రూపంగా ఎప్పుడు వెల్లడిచేయగలనో కదా! ఈ మాటలు బ్రహ్మాండమంతటిలోనూ నిజమయినవి; సజీవములు ; ఇవి గంగోత్రినుంచి వస్తూఉన్న గంగమోస్తరుగా వచ్చి అచ్చుపుస్తకాల పుటలను నింపి మన హృదయాలలోకి ఎప్పుడు పొంగి పొరలి వస్తాయో కదా!"

మాస్టరుగారు నాలుగు రోజులబట్టీ ఊళ్లో లేరని ఇంతసేపటికి జ్ఞాపకం వచ్చింది. ఎక్కడికి వెళ్లారో అదీ తెలియలేదు. ఆసంగతి ఇంతసేపూ మరిచిపోయినందుకు సిగ్గుపడుతూ— "మీరు ఎక్కడ ఉన్నారు ఈ నాలుగురోజులూ ?" అని అడిగాను.

"పంచు ఇంట్లో" అని అన్నారు.

"పంచు ఇంట్లోనా ? ఈ నాలుగు రోజులూ అక్కడే ఉన్నారా ?"

"అవా, అక్కడే. పంచు అత్తనని వేషం వేసుకువచ్చిందే. ఆమెతో కొంచెం మాట్లాడి చూదామని బుద్ధి పుట్టింది. నన్ను చూస్తూనే ఆశ్చర్యపడిపోయింది, ఉత్తమ జాతులవాళ్లు ఎవరూ వాళ్లఇంటికి రాగలరు అని ఊహించనైనా 'ఊహింఛలేక

పోయింది. రావడంతో సరిపోలేదు, వచ్చి వాళ్ల ఇంట్లో బసచేసుకుకూర్చున్నాను. అది చూచి ఆమె సిగ్గు పడ్డది. ఆమెతో అన్నాను— "దూషించి నన్ను ఈ ఇంటినుంచి వెళ్లగొట్టలేవు తల్లీ. నేను ఎప్పుడు ఉన్నానో పంచుకూడా ఉన్నాడన్న మాటే. తల్లిలేని ఈ పిల్లలందరూ ఇల్లులేక వీధులవెంట పడితే నేను చూడలేను."—రెండురోజులు ఏమీ అనకుండా నా మాటలు విన్నది—"అవును" అనలేదు "కాదు" అనలేదు ; చివరకు ఈవాళ మూటాముల్లే కట్టింది—"బృందావనం వెళిపోతాను, ప్రయాణం ఖర్చులు ఇవ్వండి," అన్నది. బృందావనం వెళ్లదు, నాకు తెలుసును. కాని ప్రయాణం ఖర్చులుమాత్రం కొంచెం ఖారీగానే ఇవ్వాలి, అందుకూ ఇప్పుడు నీదగ్గిరికి వచ్చినది."

"ఆహా, కావలసినంతా ఇస్తాను."

"ఆ ముసలిది దుర్మార్గురాలు కాదు," అని ప్రారంభించారు మాస్టరుగారు. "ఆమెది ఏజాతో తెలియక పంచు ఆమెను నీళ్లు ముట్టుకో నిచ్చేవాడు కాదు ; ఇంట్లోకి ఆమె రావడం తరవాయి, ఏదో ఒకపేరుపెట్టి ప్రొద్దస్తమానమూ పోట్లాట. తాను ముట్టకుంటే నాకు అభ్యంతరం లేదని కనిపెట్టింది, ఇక నా సేవలో పడ్డది. చక్కగా చేస్తుంది ఏపని చేసినా. అతి చక్కగా వండుతుంది. నా వ్యవహారం చూచేసరికి పంచుకి నామీద విశ్వాస భక్తి మిగిలి ఉన్నదో అదికూడా ఎగిరిపోయింది. పూర్వం నన్ను చూచి 'బ్రాహ్మడు ఏదైనా కాక-

పోయినా, సరళమయినమనిషి' అనుకుండే వాడు. ఇప్పుడు ఏలాగైనా ఆ ముసలిదానిని వలలో వేదామని ఆమె వండినది తినడానికికూడా సిద్ధం అయిపోయినాడు అనుకున్నాడు. ఎత్తులు లేనిదే ప్రపంచంలో నెగ్గడం కష్టము కావచ్చును, గాని ఆలా అని చెప్పి దేశాచారమూ కులధర్మమూ పూర్తిగా వదులుకుంటామా ? దొంగ సాక్ష్యం తయారుచేసి ఆ ముసలి-దాన్ని వెళ్లగొట్టగలిగితే తప్పేమీ లేకపోను—అప్పుడు జాతికి నష్టం రాదు, కదూ! ...సరే దానిమాట ఆలాగు ఉండనీ— అది ఏలాగు కానీ, ముసలిదానిని ఇంట్లోనుంచి పంపించేశాక-మాత్రం కొన్నాళ్లవరకూ, పంచుఇల్లు మనం కాపాడాలి. లేక-పోతే హారిశ్ కుండువల్ల ఏదో ప్రమాదం రాకమానదు. అతను అన్నాడట కదూ, అతని 'పరిషత్తు' వాళ్లతో—"నేను ఒక దొంగ అత్తను తీసుకువచ్చి పెడితే ఎత్తుకుఎత్తు వేసి వాడు ఒక దొంగతండ్రిని కుదుర్చుకున్నాడు. చూస్తాను కదూ, ఆ తండ్రి వాణ్ణి ఏలా కాపాడతాడో !"

"వాడు బ్రతక వచ్చును చావవచ్చును. కాని వృత్తి అని పేరుపెట్టీ, ఆచారం అని పేరుపెట్టీ, మతము అని పేరుపెట్టీ జాతిఅని పేరుపెట్టీ, వేయిరకాల వలలు పన్నుతున్న వీళ్లతో యుద్ధంచేయక మానను. పోట్లాటలో పీగి పడి చచ్చినా, ఆనందంతో చావవచ్చును," అని నేను అన్నాను.

## విమల కథ

ఒక్క జన్మంలో ఇంత జరగ గలదని ఊహించ శక్య-మయినా కాదు. అప్పుడే ఏడుజన్మాలు పొందాను అనిపిస్తున్నది. ఈ రెండు మూడు మాసాలలో వేయిసంవత్సరాలు గడిచి పోయినాయి. రోజులు నడుస్తున్నట్టు తెలియనే లేదు, అంత-వడిగా పరుగెత్తుకుపోతున్నవి. ఆవాళ హఠాత్తుగా ఒక్కగుద్దు తగిలేసరికి కళ్లు విప్పి చూచాను.

మా మార్కెట్లలోకి విదేశీ వస్తువులేవీ రాకుండా చేయడం విషయమయి నాభర్తతో మాట్లాడదామని వెళ్లిన-నాడు ఆయనకూ నాకూ కొంత వాదన ప్రతివాదనలు అవుతాయి అనుకున్నాను. అయితే, నాకు ఒక నమ్మకం ఉండేది, తర్కాన్ని తర్కంతో నేను ఖండించనక్కర లేదు అని. నా చుట్టూ ఉన్న వాయుమండలంలోనే ఒకమంత్రశక్తి ఉన్నది. సందీప్ అంత గొప్పవాడుకూడా పెద్-ద సముద్ర కెరటంలాగు వచ్చినాపాదాల దగ్గిర విరిగి పడిపోయినాడు. నేను పిలవడంవల్ల వచ్చాడా అంటే అదీ కాదూ! ఆ పిలుపు నా చుట్టూఉన్న వాయుమండలానిదీ. తరువాత, ఆనాడు చూచాను ఆ అమూల్యుని—పాపం అతి అల్పవయస్సు; చూచేసరికి ముద్దువచ్చే మురళి అనిపించింది—ఆహా, ఏమిటి ఆ అమాయకత్వము, ఆ ప్రేమ! నాదగ్గిరికి వచ్చాడు ఆనాడు—అరుణోదయమప్పుడు

ప్రవహిస్తున్న నదిలో కనబడే కాంతి, అతని కాంతి; లోపునఉన్న జీవనధారను వెల్లడిచేస్తూ ఉన్నది. భక్తుని ముఖం చూచినప్పుడు దేవికి ఎటువంటి ఆనందం కలుగుతుందో అప్పుడు బోధపడ్డది నాకు. నాలో ఉండేశక్తి ఏవిధంగా పని చేయగలదో అప్పుడు కనుక్కోగలిగాను.

కనుక ఆనాడు నాలో సంపూర్ణమైన విశ్వాసం గలిగి, వజ్రవాహినిఅయిన విద్యుచ్ఛిఖవలె నా భర్తదగ్గిరికి వెళ్లాను. కాని జరిగినదేమిటి?—ఇప్పటికి తొమ్మిది సంవత్సరాలు అయింది, గాని ఒకనాడూ చూడలేదు ఆనాడు ఆయన కళ్లల్లో నాకు కనబడ్డ ఉదాసీనత. కేవలం ఎడారిమీద కనిపించే ఆకాశమూ అనిపించింది ఆ ముఖం. తనలో ఎటువంటి కాంతీ లేదు సరే కదా, తనకు కనబడే వాటిలోనైనా ఉన్నదా అంటే, అవి కూడా కేవలం వివర్ణపదార్థాలా అనిపించింది ఆ ముఖంచూస్తే. ఆయనకు నామీద కొంచెం కోపం వచ్చిఉన్నా బ్రతికాను అనుకొందును. ఎటువంటి చలనమూ లేదు, ఎక్కడా ముట్టుకో లేకపోయినాను. నేను నిజమైన పదార్థాన్ని కాను, మాయను అనిపించింది, స్వప్నాన్ని అనిపించింది. స్వప్నం కావడంవల్ల ఆ స్వప్నం చెదిరిపోగానే మిగిలినది ఉత్త గాఢాంధకారము.

నాకు రూపులేకపోవడంచేత, రూపవతులైన నా ఇద్దరి తోటికోడళ్లనూ చూస్తే ఇంతకు ముందు ఈర్ష్యగా ఉండేది. భగవంతుడు నాకు శక్తి ఇవ్వలేదు, నాకున్నశక్తి నా భర్తగారి ప్రేమ ఒక్కటే అనుకొనేదానను. శక్తిసురాపాత్రతో కలువు-

నిండా తాగాను, నిషాకు బాగా అలవాటుపడ్డాను. ఇప్పుడు హఠాత్తుగా ఆ సురాపాత్ర ముక్కలయి కిందపడ్డది. నేను ఇక ఏలాగు బ్రతకగలను?

ఆవాళ తొందరతొందరగా సిగవేసుకోడానికి కూర్చున్నాను. ఛీ, ఛీ, ఎంత సిగ్గులేని పని! ఎంత సిగ్గులేని పని! చిన్నతోటికోడలి గదిపక్కనుంచి వెళుతూఉంటే ఆమె నన్ను చూచి అన్నది—"ఓహో, ఛోటారాణి లాగుంది! నీ సిగ గంతులు వేస్తున్నదే! పోనీ సిగతోపాటు తలకూడా గంతులు-వెయ్యలేదు కదా?"

ఉద్యానంలో ఆనాడు, "ఇదే నీకు విడుదల" అని ఎంత సునాయాసంగా అనగలిగారు! విడుదల—ముక్తి—ఒకరు మనకు ఇవ్వగలిగినదా! అంతసులభంగా మనము పుచ్చుకోగలిగినదా! విడుదల అనేది ఒకవస్తువు అయితే కదూ, ఇవ్వడానికీ పుచ్చుకోడానికీ? విడుదల అనగా శూన్యం అన్నమాట. ఇప్పటివరకు ప్రేమలో ఈదుకుంటూ చేపలాగు బ్రతికాను. ఇప్పుడు హఠాత్తుగా అందులోనుంచి తీసి గాలిలో పట్టుకొని, "ఇదుగో, ఇదే నీకు విడుదల" అంటే, నేను ఎటు వెళ్లగలను? ఏలాగు బ్రతకగలను?

ఈవాళ నా పడకగదిలోకి వెళ్లినప్పుడు నాకు అక్కడ కనబడ్డది ఉత్త సామానే—ఉత్త అద్దం, ఉత్త మంచం, ఉత్త బట్టల స్టాండు, వాటిఅన్నిటిమీదా వ్యాపించిఉండే ప్రేమ, వాటిలో దూరిఉన్న హృదయం ఏదీ? దానికి బదులుగా వచ్చిఉన్నది

'విడుదల'; అక్కడ నాకు కనబడ్డదల్లా 'విడుదల'—ఒక భయంకరమైన శూన్యం! ఏరు ఎండిపోయింది, ఒక్కచుక్క నీరు లేదు, గులకరాళ్లు పైకి వచ్చాయి. సామానుఅంతా ఉన్నది, ప్రేమ మాత్రం లేదు!

'నాజీవనంలో నిజం అనేది అంత పిసరైనా ఇంకా మిగిలి ఉన్నదా? ఉంటే ఎక్కడ ఉన్నది?' అనుకుంటూ, అతిగాబరాగా వెతుక్కుంటూ తిరుగుతున్నాను, లేదేమోఅని అనుమానిస్తున్నాను—ఆసమయంలో తిరిగి కనబడ్డాడు సందీప్. ప్రాణానికీ ప్రాణానికీ రాపుడు కలగగానే నిప్పుపుట్టి మునపటి మోస్తరుగానే మండడం ప్రారంభించింది. మిథ్య ఎక్కడ? అంతా నిజమే, బ్రహ్మాండమైన నిజం! అదుగో ఆ బడారాణి జపమాల తిప్పుతూ ఉంది; రెండోరాణి దాసీతో కలిసి నవ్వులాడుతూఉంది, హాస్యంపాటలు పాడుతూఉంది; నానారకాల మనుష్యులు నానారకాల పనులమీద తిరుగుతూ కబుర్లు చెప్పుకుంటున్నారు, నవ్వుతున్నారు—నాలో ఉన్నది వాటిఅన్నిటికంటే కూడా నిజము, వేయి రెట్లు నిజం.

'యాభై వేలు కావాలి' అన్నాడు సందీప్. 'తెచ్చిఇస్తాను యాభై వేలు ఒక లెక్కా!' అన్నది మత్తెక్కిఉన్న నా మనస్సు 'ఎక్కడనుంచి తెస్తాను' 'ఎలాగు తెస్తాను'—ఇవన్నీ ఒక మాటలా! ఇదుగో చూడండి నా సంగతి, ఎందులోనుంచి ఏమి అయినానో! "విమలా ఒక లెక్కేనా?" అని అందరూ అన్నదగిన స్థితిలోనుంచి "విమల కానిది ఏమిఉన్నదీ" అన్నేస్థితికి

ఒక్క రెప్పపాటులో వచ్చేశాను. ఇప్పుడు నేను చిన్న సంజ్ఞ చేసినంత మాత్రాన ఏమి కావలంటే అది నెరవేరుతుంది. తెచ్చి ఇవ్వగ-లను, ఇవ్వగలను, గలను, గలను, ఒక్క పిసరు సందేహం లేదు!

ఆలాగు అనుకుంటూ వచ్చేశాను ఆవాళ సందీప్ దగ్గర-నుంచి. అటుతరువాత నాలుగువైపులా చూదును, రూపాయిలు ఏవీ? ఏదీ కల్పతరువు? బయటనున్న ప్రపంచం హృదయాన్ని ఇంత అవమాన పరుస్తుంది ఎందుచేతనో? ఐనప్పటికీ రూపాయిలు తెచ్చియిస్తాను. ఏమిచేసి తెచ్చినా తప్పులేదు, పాపంలేదు పాపం అనేది దీనులకు; శక్తివంతులదగ్గిరికి రాదు. దొంగ చోరీ చేస్తాడు, వీర్యవంతుడైన రాజు లూటీచేసి తీసుకుంటాడు.

భోగట్టా సంపాదిస్తున్నాను ఖజానా ఎక్కడ ఉన్నదీ, రూపాయిలు వసూలుపుచ్చుకుండే ఖజాన్‌జీ ఎవరో, అక్కడ ఎవరెవరు పారా ఇస్తుంటారో. ముందుఇంటి వరండామీదికి వచ్చి ఎదుటనున్న ఆఫీసులవరస చూస్తూ రాత్రిలో సగం భాగం గడిపాను. ఆ ఇనపగజాల పిడికిలిపట్టులోనుంచి యాభై-వేలు ఏలాగు లాక్కోగలను? మనస్సున దయ అన్నమాట లేదు—నా మంత్రబలంవల్ల పారా ఇస్తున్న వాళ్ళనందరినీ చంపే-యగలిగితే తుపాకాలమీద ఆ పని చేసి లోపునుంచి రూపాయిలు తీసుకు వచ్చేదును. బందిపోటుదొంగల గుంపు దుర్గను, వరం అడుగుతూ కత్తులు చేతపుచ్చుకొని నా బుర్రలో నృత్యంచేస్తు న్నారా అని ఆ ఇంటిరాణి, విమలకు, అనిపించింది. కాని బయ-టమాత్రం ఫెళ్ళున ఝామురఝామనుకూ పారా తిరుగుతున్న త్రి

ఘంటఘంటకూ ఠంగ్ ఠంగ్ మని ఘంటలు పడుతున్నవి; ఆ మహారాజుల మహల్ నెమ్మదిగా, హాయిగా, నిద్రపోతున్నది.

చివరకు ఒకనాడు అమూల్యుని పిలిచాను. "దేశసేవ కోసం రూపాయిలు చాలా అవసరం. ఖజాన్‌జీ దగ్గిరనుంచి ఆ రూపాయిలు తీసుకురాలేవూ?" అని అన్నాను.

ఛాతీ విరుచుకొని, "ఎందుకు తేలేను?" అన్నాడు అమూల్య.

అయ్యో పాపం! సందీప్ ఎదుట నేను ఆలాగే అన్నాను, "ఎందుకు తేలేను!" అని. అమూల్య ఛాతీవిరుపువల్ల నాకు ఏమీ మనశ్శాంతి కలగలేదు.

"ఎలా తెస్తావో చెప్పు, చూదాము," అన్నాను.

ఇక ఎటువంటి ఎటువంటి అసాధ్యమైన ఎత్తులు చెప్పడం ఆరంభించాడంటే, చిన్నపిల్లలకోసం కల్పించే కథలలో వ్రాయడానికి తప్ప ఇంకెందుకూ పనికిరావు అవి.

"ఈ పిల్లతరహా చాలించు ఇక," అని నేను అన్నాను

"పోనీ ఐతే, రూపాయిలు ఇచ్చి ఆ పారావాళ్లను వశపరుచుకుంటాను," అన్నాడు.

"రూపాయిలు ఎక్కడ దొరుకుతాయి నీకు?"

"బజారు లూటీచేసి తెస్తాను," అని అన్నాడు, ఎటువంటి జంకూగొంకూ లేకుండా.

"అటువంటి పని ఏదీ అవసరం లేదులే—నా నగలు ఉన్నవి వాటితో పని జరుగుతుంది."

"కాని, అన్నట్టు ఖజాన్‌జీదగ్గిర లంచం పనికిరాదు. పోనీలెండి, మరిఒక ఉపాయం ఉన్నది, అతి సులభమైనది."

"ఏమిటది?"

"మీతో చెప్పడం ఎందుకు లెండి, ఆ పని చేయడం అతిసులభం."

"ఐనా చెపుదూ వింటాను."

చొక్కా జేబులోన్నుంచి అమూల్య * పోకెట్ ఎడిషన్ భగవద్గీత ఒకటి తీసి టేబిల్ మీద పెట్టాడు, తరవాత ఒక చిన్న పిస్తోలీ పైకి తీసి నాకు చూపించాడు. ఒక్క మాట అయినా అనలేదు.

ఏమి ఘోరం, ఏమి ఘోరం! మా ఖజాన్‌జీను చంపేదామని అనుకోడానికి అమూల్యకు ఒక్క నిమిషం పట్టలేదు! పిల్లవాడి ముఖం చూస్తే పిట్టకైనా హానిచేయలేడు అనిపిస్తుంది గాని అతనినోట వచ్చినవి ఎటువంటి మాటలు! నిజం ఏమిటంటే, ఈ ప్రపంచంలో 'ఖజాన్‌జీ' అనేది ఎంత సత్యమైన వస్తువో అతనికి ఏమి తెలియనే లేదు. అతనికి కనబడేది శుద్ధ శూన్యం, ఆకాశం. ఆ ఆకాశంలో ప్రాణం లేదు, నొప్పి లేదు,

* పోకెట్ ఎడిషన్: Pocket Edition: జేబులో పట్టే చిన్న సైజు పుస్తకం.

ఉన్నది భగవద్గీతల్లో కాలుమాత్రమే— "నహన్యతే హన్యమానే శరీరే."

"ఏమిటి నీ ఉద్దేశం, అమూల్యా? మా ఖజాన్‌జీకి పెళ్లాం ఉన్నది, కొడుకులూ కూతుళ్లూ ఉన్నారు, అతనికి—"

"పెళ్లామూ పిల్లలూ లేనివాడు ఎవడైనా ఉన్నాడా ఏమిటి మన దేశంలో? చూచారూ, జాలి అనేది కేవలం మనయొడల జాలే—మన మెత్తని మనస్సులకు బాధకలుగుతుందేమో అని ఇతరులకు బాధ కలుగజేయలేము. ఇదే పిరికితనం, పిరికితనంయొక్క పరిపాకం!

సందీప్‌మాటలు ఈ కుర్రవాడి నోటివెంట వినగానే నా లోపున వణుకుపుట్టింది. పసిబాలుడు అతను, మంచిని నిజంగా మంచి అని నమ్మేవయస్సు, మనసూ ఒళ్లూ బాగా పెరగవలసిన వయస్సు. చూచి నాలో ఉన్న మాతృత్వం మేలుకొన్నది. నామట్టుకునాకు మంచి అనిగాని చెడ్డ అనిగాని ఏదీ లేదు, ఉన్నదంతా మృత్యువుఒక్కటే—చక్కని మనోహరమైన రూపం ధరించిన మృత్యువు. కాని ఈ పద్దెనిమిది సంవత్సరాల యువకుడు నిరపరాధియైన ఒక ముసలివానిని చంపడమే ధర్మం అని అంత సునాయాసంగా నమ్మడం చూస్తే నాకు ఒళ్లంతా పులకరించింది. అతనిమనస్సులో ఎటువంటిపాపమూ లేకపోవడంవల్ల ఆ మాటలుకుండే పాపం మరీ భయంకరంగా నా కంటికి కనబడ్డది. ఆ పిల్లవాడిలో కనబడేది తల్లిదండ్రుల పాపం అని అనిపించింది.

ఉత్సాహమూ విశ్వాసమూ, వీటితో నిండిఉన్న ఆ పెద్దపెద్ద కళ్లురెండూ చూచేసరికి నా గుండె జారిపోయింది. అజగరం నోటిలోకి వెళిపోతున్నాడు కుర్రవాడు, ఎవరు అతనిని రక్షించగలరు? మన దేశమే ఒక నిజమైన తల్లి అయి లేచి ఆ పసిబిడ్డను ఒళ్లో కూర్చోపెట్టుకొని కాగలించుకోదెందుకు? "నాయనా, నన్ను నీవు బ్రతికించి ఏమి లాభం రా బాబూ, నిన్ను నేను బ్రతికించి ఉంచలేకపోయాక?" అని ఆ తల్లి నోటితో ఎందుకు అనదు?

తెలుసును, నాకు తెలుసును, ఈ పృథ్విలో కలుగుతుండే జయమూ, అభివృద్ధిచెందుతుండే శక్తీ, ప్రతాపమూ, సైతాను సహాయంవల్లనే. కాని 'తల్లి'మాత్రం ఎటువంటిసహాయమూ లేకపోయినా, ఒంటరిగానే నిలబడుతుంది; ఆ సైతాను సహాయమూ, సమృద్ధీ, ఎంతతుచ్ఛమైనవో అందరికీ తెలియచేస్తుంటుంది. తల్లికి కావలసినది కార్యసిద్ధి కాదు—అది ఎంత గొప్పకార్యసిద్ధిఅయినా సరే—తల్లికి కావలసినది ప్రాణం; తల్లి ఎప్పుడూ ప్రాణం ఇవ్వాలనే కోరుతుంటుంది, రక్షించాలనే కోరుతుంటుంది. ఆ బాలుణ్ణి రెండు చేతులతో గట్టిగా పట్టుకొని, కాపాడి ఉంచాలని నా ప్రాణం ఈవాళ కొట్టుకుంటున్నది.

ఒక్క క్షణంకిందట అతనిని చోరీకి వెళ్లమన్నాను, ఇప్పుడు చెప్పేమాటలు వాటికి కేవలం విరుద్ధం. ఎవరైనా వింటే, 'అది ఆడవాళ్ల దౌర్బల్యం' అంటారు. పృథ్విని ముం-

చేయడానికి సిద్ధపడ్డప్పుడే వాళ్లు స్త్రీలదుర్బలాన్ని నెత్తిమీద పెట్టుకుంటారు.

“అమూల్యా, నువ్వు ఏమీ చేయక్కరలేదులే, రూపాయిలు జాగ్రత్తపెట్టే భారం నాది,” అని చివరకు అన్నాను.

అమూల్య ద్వారందాకా వెళ్లాడు, అప్పుడు మళ్లా పిలిచి అన్నాను—“అమూల్యా, నేను నీ అక్కను. పంచాంగం ప్రకారం ఈవాళ *భాయ్‌ఫోటా తిథి కాదు. కాని వాస్తవమైన భాయ్‌ఫోటా తిథి సంవత్సరానికి మూడువందల అరవై అయిదు రోజులూ వస్తూఉంటుంది. ఇదే నా ఆశీర్వాదం—“ఈశ్వరుడు నిన్ను కాపాడు గాక!”

నా నోటినుండి ఈమాటలు వినగానే అమూల్య కంగారు పడ్డాడు. కొంచెం సగుదుకొని నాకు నమస్కారంచేసి నా పాదధూళి తీసుకున్నాడు. లేచి నిలుచొనేసరికి అతనికళ్లనిండా నీళ్లు; చూచి నేను అన్నాను—“తమ్ముడూ, నేను చావడానికి సిద్ధంగా ఉన్నాను, నీ పాపాలను నన్ను తీసుకుపోనీ; నా పాపాలు ఏవీ నీకు అంటకుండా ఉండాలని నా కోరిక.”

“నీ పిస్తోలీ నాకు †ప్రణామీగా ఇచ్చేయాలి. అమూల్య!” అన్నాను.

---

* బంగాళా దేశంలో కార్తీకమాసంలో వచ్చే ఉత్సవం. ఆనాడు అక్కచెల్లెళ్లు అన్నదమ్ములను తమ ఇళ్లకు తీసుకువచ్చి వాళ్లశుభం కోరుతూ వాళ్లనొసట గంధంబొట్టు పెడతారు.

† పెద్దలకు ప్రణామముచేసి ఇచ్చినది.

"దానితో ఏమిటి చేస్తావు, అక్కా?"

"చావు అభ్యాసం చేస్తాను."

"అదే కావలసినది అక్కా, స్త్రీలుకూడా చావడానికీ చంపడానికీ శక్తి సంపాదించాలి," అంటూ పిస్తోలీ నా చేతిలో పెట్టాడు.

అతని కోమలముఖాన ఒక దీప్తిరేఖ కనబడ్డది, అది నా జీవనంలో ఉషఃకాలపు అరుణరాగం పూసి వెళిపోయింది. పిస్తోలీ బట్టలోనుంచి గుండెదగ్గిరికి జారవిడిచి అన్నాను, "ఇది నా తమ్ముడు నాకుఇచ్చిన ప్రణామీ, నన్ను రక్షించే ఆఖరు సాధనం."

నా నారీహృదయంలో మాతృపీఠం దగ్గిరఉండే ద్వారం ఇన్నాళ్లకు ఈ ఒక్కమారు తెరుచుకొన్నది. ఒకమారు తెరుచుకొన్న తరువాత ఎప్పటికీ తెరిచే ఉంటుందనుకొన్నాను. కాని దాని శ్రేయోమార్గం తిరిగీ మూసుకుపోయింది; ప్రేయసి తల్లిని పైకి రాకుండా తాళంవేసి మునపటివలె లోపునే ఉంచింది.

ఆ మర్నాడు సందీప్ కనబడ్డాడు, నాకు తిరిగీ మత్తు ఆరంభం! పూర్తిగా బట్టలువిప్పేసి దిగంబరిరై ఉన్మత్తత నా హృత్పిండంమీద నిలుచొని నృత్యం ప్రారంభించింది. కాని ఇదేమిటిది! ఇది నా నిజమైన స్వభావమా! కాదు కాదు, ఎన్నటికీ కానేరదు!

ఈ సిగ్గుమాలినతనాన్ని, ఈ క్రౌర్యాన్ని, ఇంతకుముందు నాలో నేను ఎన్నడూ చూడలేదు. హఠాత్తుగా పాములవాడు వచ్చి నాబట్టలోనుంచి పాము తీస్తానని చెప్పి ఇది తీశాడు, కాని ఇది నాపైటచెంగులోనిది కాదు, వాడు తన బట్టలో దాచితెచ్చినది. నన్ను ఇప్పుడు ఒక భూతం పట్టుకొని ఉన్నది, నేను ఈవాళ చేసే దేదీ నాపని కాదు, అంతా దాని ప్రభావం!

ఆభూతమే ఒకనాడు దేవతావేషం వేసుకొని ఎర్రగా మండుతున్న మషాల్చీ చేతపుచ్చుకొని నా దగ్గిరికి వచ్చి అన్నది, "నేనే నీ దేశము, నేనే నీ సందీప్, నాకంటె గొప్పపదార్థము నీకు మరి లేదు—వందేమాతరం." నేను చేతులు జోడించి అన్నాను, "నీవే నా ధర్మము, నీవే నా స్వర్గము, నా కున్న సమస్తమూ నీ ప్రేమలో ముంచేస్తాను—వందేమాతరం."

అయిదువేలు కావాలా? సరే, అయిదువేలు తెచ్చి ఇస్తాను. రేపే కావాలా? ఆహా, రేపే ఇస్తాను. ఆ అయిదువేల రూపాయిల దానం దుస్సాహసంతోనూ, పాపంతోనూ సారాలాగు పొంగుతుండాలి. అటుతరువాత? తరువాత, మత్తెక్కి నృత్యంచేయడము! చలనంలేని పృథ్వి మన కాళ్లకింద అల్లాడడం ఆరంభిస్తుంది, కళ్లల్లోనుంచి అగ్నిజ్వాలలు వస్తాయి, చెవులలో తుపానుఝాంకారం పుడుతుంది, కళ్లఎదుట ఏది ఉన్నదీ ఏదిలేనిదీ, ఆ జ్ఞానంకూడా ఉండదు—చివరకు ఇటూ అటూ ఊగిపడిపోతూ వెళ్లి, మృత్యువు మధ్యన్ను చేరు-

కుంటాము. నిప్పంతా ఒక్క క్షణంలో ఆరిపోతుంది, బూడిద-అంతా గాలికి ఎగిరి పోతుంది, ఇక ఏమీ మిగలదు.

రూపాయిలు ఎక్కడ దొరుకుతాయి, ఏలాగు తీసుకురాగలను అని ఎంతఆలోచించినా దారివదీ కనబడలేదు. ఆవాళ ఆ తీవ్రమైన ఉత్తేజంవల్ల పుట్టిన వెలుతురులో రూపాయిలు ప్రత్యక్షంగా కనబడ్డవి.

ప్రతిసంవత్సరం దుర్గపూజ రోజులలో నా భర్త ఇద్దరు వదినగార్లకూ మూడేసివేలరూపాయిలు ప్రణామీగా ఇస్తుండేవారు. వారిద్దరి పేరా ఆ రూపాయిలు బ్యాంకులో వడ్డీకి ఏటేటా వేస్తుండేవారు. ఈ ఏడుకూడా మామూలు ప్రకారం ప్రణామీ ఇచ్చారు. కాని రూపాయిలుమాత్రం ఇంకా బ్యాంకుకు వెళ్లలేదని నాకు తెలుసును. అవి ఎక్కడ ఉన్నవో అదికూడా నాకు తెలుసును. మా పడకగదికి అంటి మేము బట్టలు కట్టుకోడానికి ఉపయోగిస్తూఉన్న పంచేగది చిన్నది ఒకటి ఉన్నది; ఆ పంచేలో ఒక మూల ఇనపపెట్టె ఉన్నది; ఆ పెట్టెలో ఉంచారు రూపాయిలు.

ప్రతిమారూ ఆయనే స్వయంగా కలకత్తా వెళ్లి బ్యాంకులో ఆరూపాయిలు జమకట్టించి వస్తుండేవారు. ఈమారు ఇంకా వెళ్లడం పడలేదు. అది కేవలం దైవకృతమే అంటాను నేను! దేశానికి కావలసిఉన్నది గనుక అవి అక్కడ నిలిచి-పోయినవి, ఆ రూపాయిలు బ్యాంకుకు తీసుకువెళ్లడం ఎవరి-సాధ్యం? ఆరూపాయిలు తీసుకోకుండా ఉండడం నాకు ఏలాగు

సాధ్యమవుతుంది? ప్రళయంకరి బలికోసము చెయ్యి చాస్తున్నది పునుక కప్పెరలో రక్తం వేయమని. "నాకు ఆకలి, ఇవ్వండి, బలి ఇవ్వండి," అంటున్నది. నేను ఈ అయిదువేల రూపాయిలు ఇస్తున్నాను, అవి రూపాయిలు కావు, నా హృదయంలోని రక్తం. ఈ రూపాయిలు ఎవరివో వారికి ఏమీపోయినట్టే అనిపించదు. కాని నన్నుమాత్రం పూర్తిగా నాశనం చేస్తున్నావు తల్లీ !.

నా ఇద్దరుతోటికోడళ్లూ దొంగలు అని నామనస్సులో నేను అనేకసార్లు అనుకున్నాను. అతిసులభంగానమ్మే స్వభావం గనుక నా భర్తను తియ్యని మాటలతో మోసపుచ్చి ఆయనదగ్గిర డబ్బులాగుతున్నారు అనుకొనేదానను. వాళ్లభర్తల మరణానంతరం ఎస్టేటుసామాన్లు అనేకం వాళ్లస్వంత వాడుకకోసం తీసుకుంటున్నారు అని నా భర్తతో నేను చాలాసార్లు ఫిర్యాదు చేశాను. ఆయన ఏమీజబాబు చెప్పకుండా ఊరుకున్నారు. నాకు కోపంవచ్చి అనేదానను, "దానం చేయాలంటే చేయండి గాని దొంగతనం ఎందుకు చేయనిస్తారు ?" అని. నా ఫిర్యాదులు విని భగవంతుడు లోలోపున నవ్వుకొని ఉంటాడు—ఈవాళ నా భర్తఇనపపెట్టెలోనుంచి నా ఇద్దరితోటికోడళ్ల రూపాయిలూ దొంగలించడానికి నేనే బయలుదేరుతున్నాను.

రోజూ రాత్రి నా భర్త ఆ చిన్నపంచగదిలోనే బట్టలు విడుస్తారు. ఆ చొక్కాజేబులోనే ఆయన తాళాలగుత్తి ఉంటుంది. ఆ తాళాలు పైకితీసి ఇనపపెట్టె తెరిచాను. శబ్దం ఏమాత్రం అయేసరికి ప్రపంచమంతా మేలుకొని లేచి

పోతుందా అనిపించింది. నా కాళ్లూ చేతులూ చల్లగా అయిపోయినాయి, గుండె దగ్ దగ్ మని కొట్టుకుంటూ వణకడం ఆరంభించింది.

ఇనపపెట్టెలో అడుగున లాగితే వచ్చే సొరుగు ఒకటి ఉన్నది. అది లాగి చూచాను, అందులో నోట్లులేవు. కాగితాలలో చుట్టి కాసులదొంతులు కనపడ్డవి. ఒక్కొక్కదొంతిలో ఎన్నిరూపాయిలు ఉన్నవో, నాకు ఎన్నిదొంతులు కావాలో, ఆ లెక్కఅంతాచూచే సమయం కాదు అది. ఇరవైదొంతులు ఉంటే ఆ ఇరవై యీాతీసి నా పైటచెంగున కట్టాను.

బరువేమీా తక్కువకాదు. ఆ చోరీభారంవల్ల నాగుండె నేలమీాద కూలిపోతున్నది అనిపించింది. నోట్లకట్టఅయితే అంత భయంకరమైన చోరీ అనిపించక పోనేమో—ఇవన్నీ బంగారం!

దొంగలాగు ఆ రాత్రి నా గదిలోకి వెళ్లేసరికి ఆ గది మరి నా గది అనిపించింది కాదు. ఆ గదిలో నాకు ఎటువంటి అధికారం ఉండేది! దొంగతనంచేసి అదంతా పోగొట్టుకున్నాను. నా మనస్సులో నేను జపంచేసుకున్నాను— "వందేమాతరం, వందేమాతరం! దేశం! నా దేశం! నా బంగారు దేశం! బంగారంఅంతా దేశానిదే! ఎక్కడెక్కడ ఉన్నదీ దేశానిదే! దేశానిదికాని బంగారం ఎక్కడాలేదు!

కాని రాత్రి ఆ అంధకారంలో మనస్సు చాలా దుర్బలంగా ఉంటుంది. పక్కగదిలో నా భర్త నిద్రపోతున్నారు.

కళ్లు మూసుకొని ఆయనగదిలోనుంచి నడిచి బయటికి వెళ్లి-పోయినాను. అవతలఉన్న డాబామీదికి వెళ్లి పైటచెంగులో కట్టిన దొంగరూపాయిలమీద గుండెమోపి పడుకున్నాను. ఆ పొట్లాలు గుండెను ఒత్తుతున్నవి. నిశ్శబ్దమైన ఆ రాత్రి నా ముఖంవైపు వేలు చూపించుతున్నది. నా ఇంటినీ దేశాన్నీ వేరు వేరు వస్తువులలాగు చూడలేక పోయినాను. ఇవాళ ఇల్లూ దోచేశాను, దేశమూ దోచేశాను. పాపంవల్ల రెండు దోపు-ళ్లూ ఒక్కమారు సంభవించాయి—ఇల్లు మరి నా ఇల్లు కాదు అప్పటినుండీ; దేశంకూడా పరదేశం అయిపోయింది. నేను ముష్టిఎత్తి దేశసేవ చేస్తూఉండి ఆ సేవ ఇంకా పూర్తికాకముందే చచ్చిపోయినా, ఆ అసమాప్తమైనసేవ పూజఅయిఉండును. దేవత దానిని పూజఅని అందుకొని ఉండును. కాని చోరీ పూజ కాదే; దీనిని దేవతచేతులలో ఏలాగు పెట్టగలను? వహావ్వా, భారంవేసి పడవను ముంచినట్టుగా ఈ చోరీమాల్‌తో దేశా-న్ని ముంచివేయ సిద్ధపడ్డానే! నేను చస్తున్నాను, గాని దేశాన్ని కాగలించుకొని దానినంతటినీ అపవిత్రం ఎందుకు చేయాలి?

ఈ రూపాయిలు తిరిగి ఇనపపెట్టెలో ఉంచేయడం అనేది అసాధ్యమైనపని. ఈలాంటి రాత్రి వేళ ఆ గదిలోకి మళ్లీ వెళ్లిఆ తాళాలు తీసి ఆ పెట్టె తెరిచే శక్తి నాకు లేదు. ప్రయత్నం చేశా నంటే నాభర్తగదిలో ఆయన పడుకొనిఉన్న మంచందగ్గిర తెలివితప్పి పడిపోతాను. ముందుకు పోవడముతప్ప మరిఏక

దారి లేదు ఇప్పుడు.

తెచ్చిన రూపాయిలు ఎన్నో కూర్చొని లెక్కపెట్టడం కూడా చేయలేను, నాకు అంత సిగ్గుగా ఉన్నది. ఏలాగు ఉన్న రూపాయిలు ఆలాగు ఉండనీ—చోరీమాల్‌కు లెక్క ఎందుకు?

ఆ సీతాకాలపురాత్రి ఆకాశాన్ని మంచుగాని, మేఘం-గాని లేదు. నక్షత్రాలు అతికాంతితో మెరుస్తున్నవి. డాబా-మీద పడుకొని అనుకుంటున్నాను—"అనాదినుంచి అంధకారం తనహృదయంలో కూడబెట్టి ఉంచిన ఆ నక్షత్రాలను, కాసులు దొంగలించినట్టుగా, ఒక్కొక్కదానిని దొంగలిస్తే, ఆ మర్నాటినుండి రాత్రి శాశ్వతకాలమూ విధవగా ఉండాలి కదా! నిశీథాకాశము పూర్తిగా అంధకాలు అయిపోతుంది కదా! అప్పుడు నేనుచేసిన చోరీ ప్రపంచమంతటిదగ్గిరాచేసిన చోరీ అవును. నేను ఇప్పుడు చేసిన చోరీకూడా కేవలం రూపాయిలచోరీ కాదు; శాశ్వతంగా ఆకాశంమీద ఉండ-వలసి వెలుతురు దొంగలించాను, ప్రపంచమంతటివద్దనూ దొంగలించాను—విశ్వాసం దొంగలించాను, ధర్మం దొంగలించాను.

రాత్రిఅంతా డాబామీద పడుకొనే గడిపాను. ప్రొద్దున్న నా భర్తలేచి పైకి వెళిపోయినారని తెలుసుకొని లేచాను. ఒంటినిండా శాలువుకప్పుకొని గదివైపు మెల్లిగా వచ్చాను. రెండోతోటికోడలు వరండామీద తొట్టెలలోనున్న పూలమొక్కలకు నీళ్లుపోస్తున్నది. నన్ను చూస్తూనే అన్నది— "విన్నావా సంగతి ఛోటారాణీ?"

నేనేమీ మాట్లాడలేదు, నిలుచున్నాను. లోపున వణుకుపుడుతున్నది. కొంగున మూటకట్టినకాసులు కాలువులో నుంచి పైకి ఎత్తుగా కనిపిస్తున్నావా అనిపించింది. బట్ట చిరిగి ఆకాసులన్నీ గలగల్లాడుతూ గచ్చుమీాద ఇక పడిపోతాయి అనిపించింది. ఆహా, తన ఐశ్వర్యం తానే దొంగలాడి అంతా పోగొట్టుకున్నదొంగ ఈవాళ ఇంటినౌకర్లఎదుటా, దాసీ-ఎదుటా, దొరికిపోతుంది కాదా!

చిన్నతోటికోడలు నన్నుచూచి అన్నది—"మీాదేశ-సేవ కూటంవాళ్లు 'మీా ఖజానా లూటీచేస్తాము జాగ్రత్త' అని సంతకంలేని ఉత్తరం ఒకటి మరిదిగారికి వ్రాసి పంపారు!"

నేను దొంగలాగు మాట్లాడకుండా నిలుచున్నాను.

"మరిదిని నీశరణు కోరుకోమన్నాను. నీ బలాన్ని కట్టి ఉంచు దేవీ, ప్రసన్నురాలవు కా. మీా వందేమాతరంకు బలి ఇచ్చుకుంటాము. చూస్తూఉండగానే అనేకచిత్రాలు జరుగు-తున్నవి. మనఇంట్లో కన్నంవేయనివ్వకు నీధర్మం ఉంటుంది," అన్నది.

ఏమీా అనలేదు నేను, తొందరతొందరగా నా పడక-గదిలోకి వెళిపోయినాను. దొంగఇసుకలో కాలుపెట్టాను, మరి పైకివచ్చేమార్గం లేదు; గాభరాపడి కొట్టుకున్నకొలదీ మరింత లోతుకు కూరుకుపోతాను.

ఆ రూపాయిలు చీరకొంగులోనుంచి విప్పేసి సందీప్-చేతిలో వేసేస్తే బ్రతుకుదును ఆ భారం మరి నేను భరించలేను,

నాగుండె బద్దలై పోతూఉంది.

పొద్దున్నే కబురువచ్చింది, సందీప్ నాకోసం కనిపెట్టు-కొని ఉన్నాడని. ఈవాళ మరి నా స్నానమూ ముస్తాబూ ఏమీ లేదు, శాలువు కప్పుకొని గాబరాగాబరాగా వెళ్లాను ముందు-గదిలోకి.

గదిలో ప్రవేశించాను, సందీప్‌తోకూడా అమూల్య కూర్చొని ఉన్నాడు. పరువు మర్యాదలు నాలో ఏమాత్రం మిగతాఉండనో అవి పైకివచ్చేసి జరజరమని కిందికి జారిపోయి, పాదాలఅడుగునుంచి భూమిలోకి దూరిపోయినాయి అనిపించింది. ఈ కుర్రవాడిదగ్గిర ఆడదానికి ఉండవలసిన సిగ్గూ లజ్జా పూర్తిగా వదిలేయాలి కదా! ఆ దళంవాళ్లు సభచేసి ఈవాళ నా చోరీగురించి అనుకుంటున్నారు గాబోలు? కొంచెమైనా ముసుగు ఉండనివ్వలేదేమో!

మొగవాళ్లసంగతి మా ఆడవాళ్లకు బోధపడదు. వాళ్ల ఇచ్ఛారథం ఈడవడానికి రోడ్డుపోస్తున్నప్పుడు విశ్వంయొక్క-హృదయం ముక్కముక్కలుచేసి ఆరోడ్డుకు కంకరగా వేసేయగలరు, ఎటువంటిసంకోచమూ లేకుండా. తమచేతులతో తామె ఏదో సృష్టించవలెనుఅనే నిషాతో మత్తెక్కి కూర్చున్నప్పుడు భగవంతునిసృష్టిని పూర్తిగా గుండపిండిచేయడానికైనా సిద్ధ-పడతారు—అలా నాశనంచేయడమే వాళ్లకు ఆనందం. నాకు ప్రాణాంతకంగా ఉండే ఈ సిగ్గు వాళ్లకంటపడనేపడదు. ప్రాణం అంటే వాళ్లకు ఎటువంటి దయా దాక్షిణ్యమూ లేదు, వాళ్ల-

దృష్టీ, వాళ్ళ ఉత్సాహమూ, వాళ్ళ ఉద్దేశ్యాలమీదే ఉంటుంది. వాళ్ళకంటికి నేను ఏమిటి? మహాప్రవాహం తోసుకువస్తూ-ఉంటే అడ్డుగా పడిఉన్న అడివిపువ్వును నేను!

నన్ను ఈలాగు తెంచిపారేయడంవల్ల సందీప్‌కు వచ్చిన లాభం ఏమిటి? ఈ అయిదువేలరూపాయిలేనా? నాలో అయిదువేలరూపాయిలకు మించినదేదీ లేదూ? ఉన్నది— సందేహమేమిటి? ఆమాట సందీప్‌నోటివెంటనే విన్నాను—అది వినేకదూ ప్రపంచంలో ఉండే సమస్తమునూ తుచ్ఛమైన-దానిగా చూడగలిగాను. నేను వెలుతురు ఇవ్వగలను, నేను జీవం ఇవ్వగలను, నేను శక్తిని ఇవ్వగలను, నేను అమరత్వము ఇవ్వగలను— ఆనమ్మకంతోనే, ఆఆనందంతోనే, గట్లుతీసి ప్రవహించి బయట వచ్చిపడ్డాను. ఆఆనందం నాకు అప్పుడు ఎవరివల్లనైనా కలిగిఉంటే, నేను చచ్చిపోయినా బ్రతికే ఉందును, నా సంసారమంతా నీటిలో మునిగిపోయినా నాకు ఎటువంటినష్టమూ లేకపోను.

ఇదంతా అబద్ధం అంటారా ఏమిటి ఇప్పుడు? భక్తునికి అభయవరం ఇచ్చేశక్తి నాలోఉన్న దేవికి లేదూ? స్తోత్రగానం విని నేను స్వర్గలోకంనుంచి భూలోకానికి రావడం భూమిని స్వర్గంగా చేయడానికి కాదూ, స్వర్గాన్ని మన్ను చేయ-డానికా?

అతితీవ్రంగా నావైపుచూస్తూ సందీప్ అడిగాడు—
"రూపాయిలు కావాలి రాణీ!"

అమూల్య రెప్పవేయకుండా నా ముఖంవైపు చూస్తూ కూర్చున్నాడు. పాపం పసిబాలుడు!—అతను నాతల్లి కడుపున పుట్టినవాడు కాదు నిజమే, గాని తనతల్లి కడుపునైనా పుట్టాడా? ఆమెకూడా తల్లేనా?—తల్లి అనేది ఒక్క పదార్థమే, పృథ్విలో ఇంతమంది తల్లులు లేరు. ఆహా, ఏమి లేతముఖం, ఆ కళ్లల్లో ఏమిప్రేమ—ఎంత పసిపిల్లడు! నేను ఆడదానిని, అతని తల్లి జాతినాది. "నా చేతిలో విషం పెట్టు అక్కా" అని నన్ను అడిగాడు. అడిగినంతమాత్రాన అతనిచేతిలో విషం పెట్టేదా!

"రూపాయిలు రాణీ!" సిగ్గుతో చస్తున్నాను, పట్టరాని కోపం వచ్చింది, ఆ కాసులమూట సందీప్‌ముఖాన్న వేసి కొట్టాలని బుద్ధిపుట్టింది. బట్ట ముడివిప్పలేకపోయినాను, నా వేళ్లు వణకడం మొదలుపెట్టాయి. తరవాత, ఆకాగితం పొట్లాలు టేబిలుమీాద పడ్డాయి, చూచి సందీప్‌ముఖం నల్లగా అయిపోయింది. ఆ పొట్లాలలో అర్ధరూపాయిలు ఉన్నవని అనుకున్నాడు, సందేహంలేదు—ఏమి తృణీకారం అతనిచూపులో! అసామర్థ్యము చూస్తే అతనికి ఎంత అసహ్యం! నన్ను కొట్టినా కొట్టగలడు అనిపించింది. అతనితో నేను బేరంపెడుతున్నాను అనుకున్నాడు. అతను అడిగిన అయిదువేలకు బదులుగా రెండుమూడువందలు ఇచ్చి తృప్తిపరిచేయడానికి వచ్చాను అనుకొని ఉంటాడు. 'నీవు ముష్టివాడవా, రాజువుగాని' అని అంటూ ఆ పొట్లాలన్నీ కిటికీలోనుంచి అవతలికి పారేదామని ఒకమాటు బుద్ధిపుట్టింది.

"మరిలేవూ, రాణీ-అక్కా?" అని అమూల్య అన్నాడు.

అతిజాలితో అడిగాడు ఆ ప్రశ్న. గట్టిగా పైకి ఏడిచేస్తానా అనిపించింది నాకు, అంతదుఃఖం వచ్చింది. ప్రాణాలు బిగబెట్టుకొని తలమాత్రం ఊచాను, నోటితో ఏమీ అనలేదు. సందీప్ మాటాడలేదు, పొట్లాలు ముట్టుకోనైనా ముట్టుకోలేదు—నోటివెంట ఒక్కపలుకైనా లేదు.

వెళిపోదామనుకున్నాను గాని కాళ్లు రాకుండా ఉన్నవి. భూమి బద్దలయి ఆపగులులోనుంచి నన్ను లోపలికి ఈడ్చేసుకుంటే ఈ మట్టిపిండం ఆ మంటిలో కలిసిపోయి బ్రతికిపోను.

నాకు జరిగిన అవమానం ఆకుర్రవాడిమనస్సును పీడించడం మొదలుపెట్టింది—లోపున గొప్పసంతోషం పుట్టినట్టు నటించి అన్నాడు—"ఇదేమి తక్కువా! ఇదే కావలసినంత! మాకు ప్రాణాలు ఇచ్చావు రాణిఅక్కా!"

అని ఒకపొట్లాం విప్పాడు—కాసులు తళుక్కున మెరిసాయి.

రెప్పపాటులో సందీప్‌ముఖం మారిపోయింది, మీదనున్న నల్లనిముసుగు హఠాత్తుగా జారిపోయింది అనిపించింది. అతనిముఖమూ, కళ్లూ, ఆనందంతో మెరవడం ఆరంభించాయి. ఎదురుగాలివచ్చి మనస్సుకు తగలడం మొదలుపెట్టేసరికి దానిని ఆపలేక సందీప్ ఛటీమని కుర్చీమీదనుంచి లేచాడు; లేచి నాదగ్గిరికి పరిగెత్తుకువచ్చాడు. అతనిఉద్దేశమేమిటో - నేను

చెప్పలేను. నేనుమాత్రం అమూల్యవైపు మెరుపులాగు ఒక్క చూపు చూచాను; హఠాత్తుగా కొరడాదెబ్బతగిలితే వివర్ణం అయిపోయినట్టుగా అయిపోయింది అతనిముఖం. నా బల మంతా ఉపయోగించి సందీప్‌ను ఒక్క తోపు తోసాను. అతనితల మార్బిల్ టేబిల్‌కు ఠక్కుమని తగిలింది, అతను నేల మీద పడిపోయినాడు—తెలివి తప్పినట్టుగా కదులూ మెదులూ లేకుండా. కొంచెంసేపు అలాగు పడిఉన్నాడు. ఇంత పని చేశానా మరి—నా ఒంట్లో ఉండే బలంఅంతా పోయింది, నిస్సత్తువగా ఒక కుర్చీమీద చతికిలడిపపోయినాను. అమూల్యునికి లోపల ఆనందంపుట్టి, అతనిముఖానికి ఒకవిధమైన దీప్తి వచ్చింది. అతను సందీప్‌వైపు చూడనైనా చూడలేదు, నా పాదధూళి తీసుకొని నా కాళ్లదగ్గిర కూర్చున్నాడు. ఆహా నాయనా అమూల్యా, తమ్ముడా, నా విశ్వం—నా అమృతకలశం శూన్యం అయిపోయింది, అందులోని ఆఖరిచుక్క ఇదిగో ఈ నీ భక్తి! నేను మరి ఆపుకోలేకపోయినాను. పైకి ఏడిచేశాను. రెండుచేతులతో పైటకొంగుపెట్టి కళ్లుగట్టిగా నొక్కుకొని వెక్కివెక్కి ఏడ్చాను. అమూల్య నా పాదాలమీద అతి ఆదరంతో మధ్యమధ్య చేతులు వేశాడు, వేసినకొలదీ మరింత ఏడుపు వచ్చింది.

కొంచెంసేపు అయాక మనస్సు సమాధానపరుచుకొని కళ్లువిప్పి చూచాను—ఏమీ జరగనట్టుగా సందీప్ టేబిలుదగ్గిర కూర్చొని కాసులు రుమాలులో కడుతున్నాడు. నా పాదాల

దగ్గిరనుంచి లేచి నిలబడ్డాడు అమూల్య, కళ్లు ఇంకా నీళ్లతో నిగనిగలాడుతున్నవి.

మా ముఖాలవైపు చూస్తూ సందీప్ నెమ్మదిగా అన్నాడు, "ఆరు వేలరూపాయిలు!"

అమూల్య అన్నాడు—"ఇన్నిరూపాయిలు మనకు ఎందుకు సందీప్‌బాబు? మూడు వేల ఐదువందలుఉంటే మన-పనికి ఎక్కుతొక్కు."

"మన పని ఈ ఒక్కచోటితో సరా? మన పనిఅంతా చూస్తే లెక్కలేనంత కావాలి," అని సందీప్ అన్నాడు.

"కావలసిఉండవచ్చు, గాని రాబోయేదానికి నేను పూచీ, ఈ పైగా ఉండే పదిహేను వందలరూపాయిలూ రాణిఅక్కకు ఇచ్చేయండి," అని అమూల్య అన్నాడు.

సందీప్ నావైపు చూచాడు, నేను అన్నాను—"వద్దు, వద్దు; ఆరూపాయిలు మరి నేను ముట్టుకోను, మీా ఇష్టంవచ్చిన పని చేసుకొండి ఆ రూపాయిలతో."

అమూల్యవైపు చూస్తూ అన్నాడు సందీప్—"స్త్రీఇచ్చినట్టు ఎన్నటికైనా పురుషుడు ఇవ్వగలడూ?"

"స్త్రీలు దేవతలు కదా!" అని అన్నాడు అమూల్య ఉత్సాహంతో.

సందీప్ అన్నాడు—"మనం మొగవాళ్లము, మహా ఇస్తే మనశక్తి ఇస్తాము, స్త్రీలు తమ్మునే పూర్తిగా ఇచ్చేయగలరు. తన-లోవున్న ప్రాణం ఇచ్చి పిల్లకు జన్మం ఇస్తుంది స్త్రీ, ప్రాణం

ఇచ్చి పెంచుతుంది— లోపుదానితోనే పైవాటితో కాదు. ఆదానమే నిజమైన దానము."

ఇది అన్నతరవాత నావైపుచూచి అన్నాడు—"రాణీ, నీవు ఈవాళ ఇచ్చినది కేవలం రూపాయిలే అయితే నేను ముట్టుకోక పోయిఉందును, లోపునున్న ప్రాణం కంటె నీకు విలువైనది ఇచ్చావు."

మనలో రెండు వేరువేరు బుద్ధులు ఉంటాయి అనుకుంటాను. నాలోఉండే రెండిటిలో ఒకటి చెపుతూఉన్నది, సందీప్ నన్ను భ్రమలో పెడుతున్నాడు అని; గాని రెండోది భ్రమలో పడడానికి ఒప్పుకుంటున్నది. సందీప్‌లో నీతి లేదు, శక్తి ఉన్నది. అందుచేతనే అతను ప్రాణం ఇచ్చిన ఉత్తరక్షణానే మృత్యుబాణాలు వస్తాయి అతనిలోనుంచి. అతనిదగ్గిర ఉన్న అమ్ములపొది దేవతలది, అక్షయం, గాని ఆ పొదిలో ఉన్న బాణాలు దానవులవి.

సందీప్ రుమాలులో ఆకాసులన్నీ పట్టాయి కావు. "రాణీ, నీ రుమాలుఒకటి ఇవ్వగలవూ?" అన్నాడు.

నేను రుమాలు ఇవ్వగానే అది పుచ్చుకొని కళ్లను అద్దుకున్నాడు. తరవాత నా పాదాలదగ్గిర వాలి నాకు నమస్కారంచేసి అన్నాడు—" దేవీ, ఈ నమస్కారంకోసమే పరుగెత్తుకొని నీదగ్గిరికి వచ్చాను, వస్తే నీవు నన్ను తోసేశావు, బుగ్గిలో పడిపోయినాను. ఆ తోసేయడమే నీవు నాకు ఇచ్చిన-

వరం, దానినే నేను నెత్తిమీద పెట్టుకుంటున్నాను," అంటూ నెత్తిమీద దెబ్బతగిలినచోటు చూపించాడు.

నిజంగా నేను పొరపాటు పడ్డానా? సందీప్ రెండుచేతులూ చాచుకొని నిజంగా నాపాదాలకు మొక్కడామనే వచ్చాడా? అయితే అతనికళ్లలోనూ, ముఖంలోనూ, ఆ ఉద్రేకం ఎందుకూ? అది అమూల్యకూడా కనిపెట్టాడు అనుకుంటాను! తాను చేసే స్తోత్ర గానానికి ఎటువంటి స్వరం పెట్టవలెనో సందీప్ ఎరుగును. అది వినేసరికి నాలో ఉండే బుద్ధిఅంతా ఎగిరిపోతుంది; నిజం తెలుసుకొనేశక్తి పోతుంది. నల్లమందు నిషా కళ్లలాగు నా కళ్లు మూసుకుపోతాయి. సందీప్‌కు నావల్ల తగిలినదెబ్బ చూడగానే అది పదింతలై తిరిగివచ్చి నాకు తగిలింది. అతనికి తలమీద దెబ్బతగిలిందిగాని ఆ దెబ్బవల్ల నా హృదయంలోనుంచి రక్తం కారడం మొదలుపెట్టింది. సందీప్ చేసిన నమస్కారం అందుకోగానే నాచోరీ ఒక శుభకార్యం అయిపోయింది. నాకు రాబోయే అపకీర్తినీ, లోపునపుట్టిన అనుతాపాన్నీ, ధిక్కరించి టేబిలుమీదనున్న కాసులు తళుకుతళుకుమని నవ్వడం ప్రారంభించాయి.

నా మనస్సుమోస్తరే అమూల్యమనస్సుకూడా తిరిగీ భ్రమలో పడిపోయింది. క్షణకాలంమాత్రం ఆగిపోయినభక్తి అమూల్యమనస్సులో తిరిగి లేచింది, బంధవిముక్తమై మొదటివలెనే పైకి పరుగెత్తిరావడం ఆరంభించింది. నన్నూ సందీప్‌నూ పూజచేయడానికి అమూల్య తనహృదయాన్ని పూలబుట్టను

పూలతో నింపినట్టుగా భక్తితో నింపాడు. సరళమైన అతనిమనస్సు విశ్వాసంతోనూ ప్రేమతోనూ నిండిపోయింది. తెలతెల్ల వారుతున్నప్పుడు కనబడే వేగుచుక్కలాగు అతనిముఖం ప్రకాశింపసాగింది. నేను పూజచేశాను, పూజ అందుకున్నాను, నా పాపం జ్యోతిర్మయం అయిపోయింది. నా ముఖంవైపు చూస్తూ చేతులుజోడించి "వందేమాతరం!" అన్నాడు అమూల్య.

అయితే, స్తోత్ర గానం నాకు ఎల్లప్పుడూ వినబడుతుండదు. కాని స్వాభిమానం నిలబెట్టుకొనే బలం నాలో పోయింది, ఏమి నిలబెట్టుకోగలిగినా ఆస్తవగానం వింటూఉన్నంతసేపే. పడకగదిలోకి మరి వెళ్లలేకపోయినాను. ఆ ఇనపపెట్టె నావైపు చూచి మొఖం చిట్లించుకొంటున్నది, మా మంచం చెయ్యెత్తి "నా దగ్గిరికి రావద్దు" అంటున్నది. నాకు నాలో జరుగుతున్న ఈ అవమానంనుండి దూరంగా పారిపోవాలని బుద్ధి పుడుతున్నది. సందీప్‌దగ్గిరికి వెళ్లి కేవలం నా స్తవం వింటూ కూర్చోడంతప్ప మరి ఏపనిమీదా మనస్సు పోకుండా ఉంది. నాకు అన్నివైపులా అడుగందని అవమర్యాద. అది నా సమస్తమునూ ముంచేసింది; దానిలోకూడా మునిగిపోని ఆ ఒక్కపూజామండపాన్ని రాత్రింబగళ్లు ఆశ్రయించుకొని కూర్చున్నాను. నాకు కావలసినది స్తవం, స్తవం, రాత్రింబగళ్లు కావలసినది స్తవం ఒక్కటే. ఈ సురాపాత్ర ఏమాత్రం ఖాళీఅయినా సహించలేను. అందుచేత సందీప్ దగ్గిరికి వెళ్లి అతనిస్తవం పొద్దస్తమానమూ వింటూ కూర్చుందామని నామనస్సు మహాకొట్టుకుంటూ

ఉంది. నా జీవనానికి ఉండే విలువ నాకాళ్లకు అందుతుండాలి, లేకపోతే నేను నిలబడలేను, అందుచేత ఇప్పుడు ఈప్రపంచం అంతటిలోనూ సందీప్ ఒక్కడే నాకు అంత అవసరమయినాడు.

నా భర్త మధ్యాహ్నం భోజనానికి కూర్చున్నప్పుడు ఆయన ఎదుట మునపటిమోస్తరు కూర్చోలేను—సిగ్గుసిగ్గు కూర్చోక పోవడం ఎలాగు? అందుచేత ఒకపక్కకు కూర్చుంటుండే దానను, ఒకరిముఖంఒకరికి కనబడకుండా. ఆవాళా అలాగే కూర్చున్నాను. ఆయన భోంచేస్తున్నారు. రెండోతోటికోడలు వచ్చి కూర్చొని అన్నది—"అబ్బాయి, వాళ్లు జడిపిస్తూ ఉత్తరాలు వ్రాస్తూఉంటే నీవు ఏమీలేదని కొట్టిపారేసి కూర్చుంటావు, నాకు అతిభయంగా ఉంది. మా రూపాయిలు కలకత్తా బ్యాంకికి పంపించేశావా!"

"లేదు, వ్యవధిలేకుండా ఉంది," అన్నారు ఆయన.

"చాలా అజాగ్రత్త మనిషివి సుమా నాయనా నువ్వు! ఆ రూపాయిలు—"

"ఆ రూపాయిలు నా పడకగది పక్కనుండే గదిలోనే ఇనపపెట్టెలో ఉన్నవి."

"ఏమి చెప్పగలము, అక్కడనుంచి తీసుకుపోతే?"

"ఆ గదిలోనే దొంగలుపడ్డప్పుడు, నిన్ను కూడా ఎప్పుడో ఒకనాడు వాళ్లు దొంగలించుకొని పోగలరన్న మాటే!"

"నన్ను ఎవ్వరూ దొంగలించరు, నీకాభయం అక్కరలేదు. దొంగలించ దగినది నీగదిలోనే ఉంది. సరే, హాస్యం

అటుండనీ, గదిలోమాత్రం రూపాయిలు ఉంచకు.”

“సర్కారుకు చెల్లించడానికి నాలుగైదురోజులలో రూపాయిలు కలకత్తా తీసుకువెళతారు, దానితో ఈ రూపాయలుకూడా పంపించేస్తాను.”

“మంచిమాటే, గాని మరిచిపోకు నీవుణ్యాం ఉంటుంది; అతి పరాకు మనిషివి.”

“పోనీ చోరీ పోయిందనుకో—నాగదిలో రూపాయలు పోతే పోయినవి నారూపాయలు అవుతాయి, నీరూపాయలు పోవులే వదినా!”

“ఆలాంటిమాటలు అంటూఉంటే నాకు చాలాకోపం వస్తుంది సుమా. నీది వేరు నాది వేరు అని మాట్లాడుతున్నానా నేను? నీసొమ్ముపోతే నాకు కష్టం అనిపించదూ? ఆ పాడుదేవుడు నాకుండే సర్వమూ తీసుకొని లక్ష్మణుడిలాంటి ఈ ఒక్క మరిదిగారిని ఉంచాడు; ఆ మరిదివిలువ నాకు తెలియక పోలేదు. మీా పెద్దవదినగారిలాగు నేను రాత్రింబగళ్లు దేవతార్చనలోపడి ఒళ్లు మరిచిపోలేను గాని దేవత నాకిచ్చినది దేవతకంటే గొప్పది. “ఏమే చెల్లీ, ఛోటా రాణీ! కర్రబొమ్మలాగు కదలకుండా మాటాడకుండా కూర్చున్నావు? చూశావా అబ్బాయి, ఛోటారాణి నేను ఇచ్చకాలాడుతున్నాననుకుంటున్నది. ఆటువంటి అవస్థ వస్తే ఇచ్చకాలన్నా ఆడాలి. కాని నువ్వు దొరికావు మరిదిగారివి, ఇచ్చకాలాడే దాకా ఉంటే కథూ! నీవు ఆ మాధవచక్రవర్తిలాంటివాడవు అయిఉంటే పెద్ద-

రాణిగారు దేవతార్చన ఈపాటికి చాలించును, ఒక అర్ధపైసా-కోసం నీ కాళ్లూ చేతులూ పట్టుకుంటూ రోజంతా గడుపును. అలాగైతేనే బాగుండునేమో, నానారకాలమాటలు కల్పించి నీమీద చెప్తుతూఉండడానికి ఇంతవేళ ఉండకపోను.

ఇదే ధోరణి, ఏదో వాగుతూనే ఉన్నది మాతోటి-కోడలు. మధ్యమధ్య 'ఇది తినవేమి?' 'ఇది తినవేమి?' అంటూ ఆ భోజనంలో ఈకూరా ఆకూరా చూపించడంమాత్రం మరిచిపోలేదు. ఇవతల నా తల గిరగిర తిరిగిపోతూఉంది. ఇకవ్యవధిలేదు, ఏదోఒక ఉపాయం కనిపెట్టాలి త్వరగా. ఏమి-టిచేయడం, ఏలాగుచేయడం అని నా మనస్సులో నేను కొట్టు-కుంటున్నాను ఒకమూలనుంచి, మా చిన్నతోటికోటలిగారి పేలాపన మాత్రం ఆలాగు అనర్గళంగా జరుగుతూనే ఉంది. అది సహించడం అంతకంతకు మరీ కష్టం అయిపోతూఉంది, ముఖ్యంగా ఇంకొకకారణం ఏమిటంటే మా తోటికోడలికళ్లు పాముకళ్లు. ఎటువంటి చిన్నసంగతైనా ఆమెకళ్లను తప్పించు-కొనిదాకోలేదు. ఘడియఘడియకూ నా ముఖంవైపు చూస్తు-న్నది. ఆమెకు ఏమిటికనబడ్డదో నేను చెప్పలేను గాని, నా ము-ఖంమీదమాత్రం అన్నిసంగతులూ స్పష్టంగా వ్రాసేసి ఉన్నవని అనిపించింది నాకు.

తరవాత—నాది ఎంతసాహసం!—అతిసరదాగా, అతి అమాయకంగా నవ్వుతూ అన్నాను—"అసలుసంగతి ఏమి-టంటే, రెండోరాణికిఉన్న అపనమ్మకమంతా నామీదకే తోంగ-

తనమూ బందిపోటూ అవన్నీ ఉత్తమాటలు."

ఒక పెంకినవ్వు నవ్వుతూ రెండో రాణి అన్నది—"సరి-అయినమాట అన్నావే, ఆడది చేసిన చోరీ అన్నిటికంటే నాశకరమైనది. నన్ను తప్పించుకొని పారిపోలేవు, నేను మొగవాణ్ణి కాను."

నేను అన్నాను—"నీకు అంత భయంగా ఉంటే నాకు ఉండేదంతా నీదగ్గిర తనఖా ఉంచుతున్నాను తీసుకో, నీకు ఎటువంటినష్టమైనా కలిగితే అందులోనుంచి పూర్తిచేసుకో."

నవ్వుతూ అన్నది రెండో రాణి—"విను, ఒక్కమారు ఛోటా రాణి మాటలు విను. ఇహలోకం పరలోకం లోకం రెండిటిలోకూడా దిద్దలేనినష్టం కలగవచ్చునని తెలియదేమో?"

మేము ఇద్దరమూ ఈలాగు ప్రశ్నోత్తరాలు విసురుకుంటూ ఉంటే ఆయన ఒక్కమాటఅయినా అనలేదు. భోజనం అవుతూనే లేచి బయటికి వెళిపోయినారు—మునపటిలాగు ఇప్పుడు ఆయన విశ్రాంతికోసమని ఇంట్లో కాస్సేపు కూర్చోవడం మానేశారు.

నా అలంకారాలలో పెద్దపెద్దఖరీదుకలవి చాలాభాగం ఖజాన్జీదగ్గిర ఉంచాను. ఐనా నా పెట్టెలో ఉన్నవి ముప్పై ముప్పైఅయిదువేల రూపాయిలకు తక్కువ చేయవు. ఆ అలంకారాలపెట్టె చిన్నతోటికోడలిదగ్గిరికి తీసుకువచ్చాను. కప్పు-తెరిచి పట్టుకొని అన్నాను—"ఇదుగో అక్కా నా అలంకారాలపెట్టె, ఇది నీదగ్గిర ఉంచుకుంటే మరేభయమూ లేకుండా

నిశ్చింతగా ఉండవచ్చును."

రెండోరాణి బుగ్గమీద వేలుపెట్టుకొని అతి ఆశ్చర్యంతో అన్నది—"ఎంతమాటన్నావే! నువ్వు నా రూపాయిలు దొంగలిస్తావనే భయంచేత నాకు రాత్రి నిద్రపట్టకుండా ఉంది అనుకుంటున్నావు కదూ!"

"భయపడడంలో తప్పేమిటుంది? ప్రపంచంలో ఎవరు ఏలాంటివాళ్లో ఏమిచెప్పగలము!" అని నేను అన్నాను.

"అందుచేతనే నామీద నీకున్న నమ్మకం వ్యక్తపరిచి నాకు బుద్ధిచెపుదామని వచ్చావు గాబోలు! నా నగలు ఎక్కడ ఉంచుకోడమో అదే నాకు తెలియకుండా ఉంది. వాటిచుట్టూ పారాఇస్తుండడం నా చేతకాదు తల్లీ, నీ వస్తువులు నువ్వే తీసుకువెళిపో."

తోటికోడలిదగ్గిరనుంచి ముందుగదిలోకి వచ్చేశాను. వచ్చి అమూల్యకు కబురుపంపాను. అమూల్యతో సందీప్‌కూడా వచ్చి నిలుచున్నాడు. నాకు అప్పుడు అట్టే వ్యవధిలేదు; సందీప్‌తో తత్‌క్షణమే అన్నాను—"అమూల్యతో ప్రత్యేకంగా నాకు కొంచెం పని ఉన్నది, మీరు ఒక్కమారు—" రాని నవ్వు కొంచెం నవ్వి సందీప్ అన్నాడు, "నీ కంటికి అమూల్య వేరు నేను వేరు కదూ, అయితే! నాదగ్గిరనుంచి అమూల్యను నీవు లాగేదామని చూస్తేమాత్రం ఆపే శక్తి నాలో ఏమీలేదు!"

నేను దానికి ఏమీ జబాబుఇవ్వలేదు, ఆలాగే నిలుచున్నాను అప్పుడు అన్నాడు సందీప్—"సరే అమూల్యతో ఆ

ప్రత్యేకంమాట్లు అయిపోయినతరవాత మాత్రం నాతో కూడా కొంచెం ప్రత్యేకంగా మాట్లాడాలి. లేకపోతే నాకు అపజయం అవుతుంది. ఏదైనా సహించి ఊరుకోగలనుగాని వీగిపోవడంమాత్రం సహించలేను. ప్రతిదానిలోకూడా ముఖ్యాంశం నాది, అందరికంటే పెద్దవంతు నావంతు. దానికోసమే పుట్టినప్పటినుండి పోట్లాట భగవంతునితో— భగవంతుని వీగగొడతాను, నేను వీగను.”

సందీప్ అమూల్యవైపు తీవ్రంగా ఒక్కమారు చూచి గదిలోనుంచి బయటికి వెళ్లాడు. అప్పుడు అమూల్యతో అన్నాను, “చూడు తమ్ముడూ, నా నాయనవు, నాకు ఒక్క పనిచేసి పెట్టాలి.”

“నీవు ఏమిచేయమంటే అది నాప్రాణాలిచ్చైనా చేస్తాను అక్కా.”

కాలువులోనుంచి నగలపెట్టె తీసి అతనిముందరపెట్టి అన్నాను—“ఈ నగలు తాకట్టు పెట్టి అయినాసరే లేదా అమ్మి అయినాసరే, సాధ్యమైనంత త్వరగా, నాకు ఆరువేలరూపాయిలు తీసుకువచ్చి ఇవ్వాలి.”

“వద్దు అక్కా, వద్దు; తాకట్టూ వద్దు, అమ్మడమూ వద్దు. కాని నీకు ఆరువేలూ తెచ్చిస్తాను,” అన్నాడు అమూల్య. చికాకుపడుతూ అన్నాను, “ఆ మాటలన్నీ ఉండనీ, నాకు వేళయిపోతూఉంది., ఇదుగో తీసుకో ఈ పెట్టె! ఈవాళరాత్రి బండి-

లోనే వెళ్లు కలకత్తా. ఎల్లుండిలోగా నాకు, తెచ్చిఇవ్వాలి ఆరువేల రూపాయిలు."

పెట్టెలోనుంచి వజ్రాలహారం ఒకటి పైకి తీసి వెలుతుర్లో ఎత్తి పట్టుకున్నాడు. తిరిగి అతివిచారంతో పెట్టెలో ఉంచేశాడు. నేను అన్నాను—"ఈ వజ్రాలతో చేసిన వస్తువులన్నీ సరియైన ఖరీదుకు సులభంగా వెళ్లవు, అందుచేత. ఇంతింతఖరీదుగల్లవి. ఇన్ని ఇస్తున్నాను నీచేతికి. అన్నీకలిపి ముప్ఫైవేలకు పైగా చేస్తాయి. అన్నీ అమ్మేసినా ఫరవాలేదు గాని ఆరువేలుమాత్రం కావాలి."

"నీకు తెలుసునా అక్కా, నీదగ్గర తీసుకున్న ఆరువేల విషయమై సందీప్‌బాబుతో బాగా పోట్లాడేశాను. ఇక చెప్పలేను నాకు అంతసిగ్గుగా ఉంది. దేశంకోసం సిగ్గు పూర్తిగా విడిచి పెట్టేయాలట, సందీప్‌బాబు అంటాడు. అది మంచిదైతే కానీ గాని ఇది వేరేసంగతి. దేశంకోసం చావడం అంటే నాకు భయంలేదు, చంపడంఅంటే భయంలేదు. దానికి తగినశక్తి నాకు కలిగింది. కాని నీ దగ్గిరనుంచి ఈ రూపాయిలు పుచ్చు-కోడం చాలా సిగ్గుమాలినపని—ఎంత తంటాలు పడ్డా ఆ మాట మరుపురాకుండా ఉంది. ఇటువంటి పనులలో సందీప్‌బాబు నాకంటే చాలా గట్టివాడు, అతనికి అణుమాత్రమైనా అను-తాపం లేదు. రూపాయిలు ఎవరి పెట్టెలో ఉంటే వాళ్లవే అనే భ్రమ పోగొట్టాలి, అది చేయలేకపోతే మన 'వందేమాతరం'

మంత్రం కేవలం జీవహీనమైనది అన్నమాట అని అన్నాడు సందీప్‌బాబు."

ఆ మాటలవల్ల అమూల్యకు ఉత్సాహంపుట్టింది—విన-డానికి నేను దగ్గిరఉంటే అతని ఉత్సాహం మరింత అధికం అవుతుంటుంది. ప్రారంభించాడు—"ఆత్మను ఎవరూ చంపలేరు అని శ్రీకృష్ణుడు అంటాడు భగవద్గీతలో. చంపడం అనేది కేవలం ఒక మాట. రూపాయిలు దొంగలించడం కూడా అలాగే ఒక మాట. ఎవరివి రూపాయిలు? వాటిని ఎవరూ సృష్టించలేదు, వాటిని ఎవరూకూడా తీసుకుపోలేరు—అవి ఆత్మలో ఒక భాగం అయితే కదూ చచ్చిపోయినప్పుడు కూడాతీసుకుపోడా నికి? అవి ఈవాళ నావి, రేపు నా పిల్లడివి, ఆ మర్నాడు నా అప్పులవాడివి. నిజంగా ఈ చంచలలక్ష్మి ఎవరిదీ కానందుకు, ఎందుకూ పనికిరాని వకొడుకు చేతిలోనో పడేకంటే, దేశసేవ-కుల సేవలో వినియోగించడం ఉత్తమం. అలాగు చేసినవాళ్లను అందరూ నిందించినా ఆ నింద వాళ్లకు తగలదు."

సందీప్ మాటలు ఈ కుర్రవాడినోట వింటే భయం-వల్ల నా గుండెలో వణుకుపుడుతుంటుంది. పాములవాడు పాము-లతో ఆడుకోనీ; చచ్చినా వాడు తెలిసితెలిసి చస్తాడు. కాని, ఆహా! వీళ్లు పసిబిడ్డలు, ఉత్త అమాయకులు! వీళ్లు సుఖంగా ఉండాలని అందరూ ఆశీర్వదిస్తుంటారు. ఏమీ తెలియకుండా నవ్వుతూ నవ్వుతూ పాముదగ్గిరికివెళ్లి ఆడుకుందామని చెయ్యి చాస్తే తెలుస్తుంది, పాముతో ఆట ఎంత భయంకరమైనపనో.

ఎంత ప్రమాదమో! సందీప్ నిజంగా పోల్చుకున్నాడు—అతని వల్ల నేను చస్తేచావనీ గాని ఈ కుర్రవానినిమాత్రం ఏలాగైనా అతనిచేతులలోనుంచి తప్పించి రక్షిస్తాను అని. నవ్వుతూ నేను అన్నాను—"అయితే మీ దేశసేవకుల సేవకోసం కావాలన్న మాట ఆ రూపాయిలు!"

అతి గర్వంతో జవాబు ఇచ్చాడు అమూల్య—"అవు! కావాలి, సందేహంఏమిటి? వాళ్లే మా రాజులు; దారిద్ర్యంలో ఉంటే తప్పకుండా వాళ్లశక్తి క్షయం అయిపోతుంది. మీకు తెలిసేఉంటుంది, సందీప్‌బాబును ఎన్నడూ ఫస్టుక్లాసు బండిలోనేగాని ప్రయాణం చేయనివ్వము. రాజభోగం అనుభవించడానికి అతనికి ఎటువంటి సంకోచమూ లేదు. ఆయనకు మర్యాదలన్నీ జరిగేటట్టు ఆయనే ఏర్పాటు చూస్తుంటాడు; అది ఆయన గొప్పకోసం కాదు, మా అందరి గౌరవంకోసం. ప్రపంచంలో ఈశ్వరుడు అనదగినవాని చేతిలో ఉండవలసిన అస్త్రాలన్నిటిలో గొప్పది ఐశ్వర్యమనే సమ్మోహనాస్త్రం అని సందీప్‌బాబు అన్నాడు. వాళ్లు దారిద్ర్యవ్రతం పట్టడం వ్రతంపట్టడం కాదు, ఆత్మహత్య చేసుకోవడం."

ఆ సమయంలో సందీప్ గదిలోకి వచ్చిపడ్డాడు. తొందర తొందరగా నా నగలపెట్టెమీద శాలువు కప్పేశాను. వెక్కిరింపుమాటలతో సందీప్ అడిగాడు—"అమూల్యతో ప్రత్యేకం మాట్లాడడం ఇంకా కాలేదు గాబోలు?"

సిగ్గుపడుతూ అమూల్య అన్నాడు—"అబ్బే, అయిపో యింది—అంత ప్రత్యేకించి మాటాడవలసినంత ఏమీ లేదు."

"కాలేదు అమూల్యా, ఇంకా కాలేదు!" అని నేను అన్నాను.

"అయితే సందీప్ రెండో పర్యాయం నిష్క్రమణం చేయాలన్న మాట," అన్నాడు సందీప్.

"చేయాలి," అన్నాను నేను.

"అలా అయితే సందీప్‌కుమార్ గారి పునః ప్రవేశం—"

"ఈవాళ మరి వీలు లేదు, నాకు వ్యవధి లేదు."

సందీప్ కళ్లల్లోనుంచి నిప్పులు కురిసిపోతున్నవి— అన్నాడు, "ఓహో, ప్రత్యేకంగా మాట్లాడడానికేగాని వృథాగా కాలం పాడుచేయడానికి వేళ లేదు అనుకుంటాను?"

ఈర్ష్య! బలవంతుడు దుర్బలుడు అయినచోట అబల తన జయభేరీ తప్పకుండా వాయించి తీరుతుంది. అందుచేత బాగా ధాటీగా చెప్పాను—"ఔను, నాకు వేళ లేదు," అని.

సందీప్ ముఖం ఎర్రగా చేసుకొని వెళిపోయినాడు. భయపడుతూ అమూల్య అన్నాడు—"సందీప్‌బాబుకి కోపం వచ్చింది అక్కా."

నేను జోరుగా అన్నాను—"కోప్పడడానికి కారణం లేదు, అధికారం అంతకంటే లేదు. ఒక్కమాట చెపుతున్నాను మనస్సులో పెట్టుకో అమూల్యా, ఈ నగలు అమ్మడం గురించి, ప్రాణం పోయినా సరే, సందీప్‌తో చెప్పకూడదు."

"లేదు, నేను చెప్పను."

"ఐతే, మరి ఆలస్యం కానివ్వకు, ఈరాత్రిబండిలోనే కలకత్తా వెళిపో."

అలా అంటూ నేనూ, అమూల్యా ఇద్దరమూ కలిసే బయటికి వచ్చేశాము. వరండామీద సందీప్ ఇంకా నిలుచొని ఉన్నాడు. అమూల్యను పట్టుకొని ఇక పీక్కుతింటాడు అని తెలిసిపోయింది నాకు. అదికాకుండా చేదామని సందీప్‌తో మాట్లాడ వలసివచ్చింది.—"ఏమిటి మాట్లాడాలనుకున్నారు సందీప్ బాబూ?"

ప్రత్యేకం మాట్లాడ వలసినమాటలేవీ కావు, సావి ఉత్తపొల్లు కబుర్లు. వేళ లేనప్పుడు—"

"వేళ ఉంది."

అమూల్య వెళిపోయినాడు. గదిలోకి తిరిగి వెళ్లాము. "అమూల్యచేతికి ఒక పెట్టెఏదో ఇచ్చావు, అది ఏమిపెట్టె?" అని అడిగాడు.

పెట్టె సందీప్‌దగ్గిర దాగింది కాదు. మనస్సు కొంచెం గట్టిచేసుకొని అన్నాను—"మీతో చెప్పవచ్చునంటే మీ ముందరనే ఇచ్చిఉందును."

"అమూల్య నాతో చెప్పడని గాబోలు, అనుకుంటున్నావు?"

"లేదు చెప్పడు."

సందీప్ కోపం మరి పట్టలేకపోయినాడు, అగ్నిహోత్రుడయిపోయి అన్నాడు— "నామీద అధికారం చేదామని నీ ఉద్దేశంగాని ఎన్నటికీ చేయలేవు. ఆ అమూల్య ఉన్నాడే, వాణ్ణి నేను కాలికింద నలిపేసి చంపేస్తే అతి ఆనందంతో చచ్చిపోతాడు. వాణ్ణి నీపాదాలదగ్గిరికి తెచ్చుకుందామని ప్రయత్నిస్తున్నావు, గాని నేను బ్రతికి ఉండగా ఆ పని జరగదు."

బలహీనత! చేతకానితనం! చివరకు సందీప్‌కు బోధపడ్డది నాతో చాలలేదని. అందుచేతనే అకస్మాత్తుగా ఆ పట్టరాని కోపం. నాలో ఉండే శక్తితో జోరూ జబరుదస్తీ ఏమీ పనికిరావు అని బోధపరుచుకున్నాడు. ఒక్కమారు దృష్టిప్రసారం చేసినంతమాత్రాన అతని కోటప్రాకారాలన్నీ విరిగి పడిపోవచ్చును అని అతనికి తెలిసిపోయింది. అందుచేతనే ఈవాళ ఆ కోపోద్రేకం, ఆ దుఃఖం. నేను ఏమీ అనకుండా ఊరికే కొంచెం నవ్వాను. ఇన్నాళ్ళకు అతనికంటే పైమెట్టుమీదికి వచ్చాను. ఆ స్థానంమాత్రం పోగొట్టుకోకూడదు, దానిమీదినుంచి మరి దిగకూడదు. ఇంతదుర్గతి వచ్చినందుకు ఆపిసరుపాటువైనా దక్కించుకోవాలి.

"నాకు తెలుసును, అది నీ వగలపెట్టె," అన్నాడు సందీప్.

"మీ ఇష్టం వచ్చినట్టు ఊహించండి, నేనుమాత్రం చెప్పను," అన్నాను.

"అమూల్యను నాకంటే నమ్ముతున్నావు. కదూ ? కాని వాడు నా నీడయొక్క నీడ, నా ప్రతిధ్వనికి ప్రతిధ్వని, ఆమాట తెలుసునా? నాదగ్గిరనుంచి తీసేస్తే వాడిలో ఏమీ మిగలదు— మిగిలేది సున్న."

"నీ ప్రతిధ్వని కానివిషయాలలో అతను అమూల్య. ఆవిషయాలలో నేను నీ ప్రతిధ్వనిని నమ్మేకంటే అతనిని అధికంగా నమ్ముతాను."

"మాతృదేవి పూజకోసం నీ నగలన్నీ నా చేతికి ఇచ్చేస్తానని ప్రతిజ్ఞ చేశావు మరిచిపోకూడదు. నిజంగా అవి అప్పుడే ఇచ్చేసినట్టు లెక్క."

"దేవి నాకు ఏవైనా దక్కించి ఉంచితే అవి తప్పకుండా దేవికే సమర్పించేస్తాను. దొంగలు తీసుకుపోయినవి ఎవరికైనా ఏలా ఇవ్వగలను ?"

"చూడు, నాదగ్గిర ఈలాగు తప్పించుకుందామని ప్రయత్నించేస్తే లాభంలేదు. నాకు ఇప్పుడు తొందరపనిఉన్నది. ఆ పని ముందు తెమిలిపోతే ఈ ఆడఆటలన్నీ ఆడడానికి కావలసినంత వేళ ఉంటుంది. అప్పుడైతే నేనుకూడా నీ ఆటలో కలుస్తాను."

రూపాయిలు దొంగలించి సందీప్ చేతిలో పెట్టినప్పటినుండీ మాసంబంధం సంగీతవిహీనం అయిపోయింది. నాలో ఉండే విలువంతా పోయి నేను చిల్లిగవ్వకంటే చవక అయిపోవడమే కాకుండా నామీద అధికారం చలాయించగలిగే సందీప్ శక్తి వ్యర్థం అయిపోయింది ; మునపటివలె నన్ను ఆడించ-

డానికి మరి అవకాశం లేకుండా అయిపోయింది—వచ్చి చేతిలో పడిపోయినదానిమీద బాణాలు ఎలా వేయగలము? కనుక సందీప్ ఇప్పుడు మరి మునపటి వీరమూర్తి కాదు; అతని మాటలలో ఇప్పుడు వినబడేది నీచులకలవాలకేకలే!

అగ్నిజ్వాలల్లాంటి కళ్లు రెండూ నావైపు ఎత్తాడు సందీప్. దాహంతో మండిపోతున్న మట్టమధ్యాహ్నపు ఆకాశమూ అనిపించాయి ఆ కళ్లు. ఒకటి రెండుసార్లు లేవడానికి అన్నట్లు కాళ్లూ పాదాలు కదిపాడు. ఒక్క దుముకుదుమికి నామీద పడి నాపీక పట్టుకుంటాడా అనిపించింది. నాకు లోపున కుదుపు పుడుతున్నది, ఒంట్లో ఉన్న రక్తనాళాలన్నీ దబ్‌దబ్‌మంటున్నవి, చెవులు ఝూంఝూంమంటున్నవి. ఇంకొక్క నిమిషం ఆలాగు కూర్చుంటే మరి లేవలేను అని తెలిసిపోయింది. విశ్వప్రయత్నం-చేసి కుర్చీమీదనుంచి లేచి ద్వారంవైపు పరుగెత్తాను.

"ఎక్కడికి పారిపోతున్నావు రాణీ!" అని సందీప్‌గొం-తుకలోనుంచి నిస్వరంగా మాట వినబడ్డది. ఏదైనా అడ్డుపడ్డదా గొంతుకలో అనిపించింది, ఆమాటలు వింటే.

ఆలాగు అంటూ ఒక్క గంతువేసి కుర్చీమీదినుంచి లేచి నావైపు పరుగెత్తుతున్నాడు, నన్ను పట్టుకుందామని. ఆలాంట-ప్పుడు బయట జోళ్లచప్పుడు వినబడ్డది. అతి గాబరాగా సందీప్ తిరిగి ఆ కుర్చీదగ్గిరికి వెళ్లి దానిమీద కూర్చున్నాడు; నేను పుస్తకాలబీరువావైపు ముఖం తిప్పి పుస్తకాలపేర్లు చూస్తు-న్నాను.

నా భర్త గదిలో కాలు పెట్టారో లేదో ప్రారంభించాడు సందీప్—"నిఖిల్ నీ పుస్తకాలలో బ్రౌనింగ్ లేదూ ? మన కాలేజి క్లబ్బుమాట చెపుతున్నాను రాణితో—జ్ఞాపకం ఉందా బ్రౌనింగ్ తర్జుమాగురించి మన నలుగురికీ అయిన పోట్లాట? లేదేమిటి, చెప్పూ ? అల్లా—

She should never have looked at me,
If she meant I should not love her !
There are plenty...men you call such,
I suppose...she may discover
All her soul to, if she pleases,
And yet leave much as she found them.
But I'm not sq, and she knew it
When she fixed me, glancing round them.

ఆ మాటలన్నీ పోగుచేసి కలగాపులగంగా మన భాషలో తర్జుమాచేశాను గాని ఒళ్లుమరిపించేటంత ఆనందం మనకు పుట్టించదు అది. గొప్ప కవిని అయిపోడానికి ఇక అట్టే రోజులు పట్టదు అని ఒకప్పుడు అనుకున్నాను, కాని ఆ విపత్తు నామీద పడకుండా దేవుడు కాపాడాడు. మన స్నేహితుడు దక్షిణాచరణ్ ఉండేవాడు జ్ఞాపకం ఉన్నదా?—సాల్ట్ ఇన్స్పెక్టరు అయిపోనాడుగాని లేకపోతే ఈపాటికి గొప్ప కవి అయి ఉండును. అతనితర్జుమా చదివితే తర్జుమాలాగు ఉండేదికాదు. జాగ్రఫీలోలేని ఏదేశంభాషో కాదు, ఆభాష—ఇప్పటికీ నేను అది మరిచిపోలేదు.

"లేదు రాణీ నువ్వు వృథాగా వెతుకుతున్నావు ఆ పుస్తకంకోసం. పెళ్లిఅయినప్పటినుండీ కావ్యాలూ పద్యాలూ చదవడం ఆపేశాడు నిఖిల్, మరి అవసరంలేదు అని గాబోలు. నేనూ మానేశాను పనితొందరవల్ల; గాని 'కావ్యజ్వరో మనుష్యాణాం' మళ్లీ నన్ను 'పట్టుకుంటాను' 'పట్టుకుంటాను' అని జడిపిస్తున్నట్టు ఉంది"

"నిన్ను జాగ్రతగా ఉండమని చెప్పడానికి వచ్చాను సందీప్!" అన్నారు నాభర్త.

"కావ్యజ్వరం విషయమయా?" అన్నాడు సందీప్. ఆయనసందీప్ హాస్యంగా అనబోయినమాట వినిపించుకోకుండా అన్నారు—"కొన్నాళ్లనుండి ఢాకానుండి మాల్వీలు వచ్చిపోతున్నారు. ఈ ప్రాంతాలలోఉండే సాయిబులను రేపాలని ప్రయత్నం లోలోపున జరుగుతున్నదట. నీమీద వాళ్లు అతికోపంగా ఉన్నారట, ఒకవేళ ఏమైనా సాహసం చేస్తే చేస్తారు."

"పారిపోమని సలహాఇవ్వడానికి వచ్చావా?"

"సంగతి చెప్పడానికి వచ్చాను, సలహాఇవ్వాలని రాలేదు."

"ఈఎస్టేటు నాదిఅయిఉంటే ఆ 'జాగ్రతగా ఉండడ' మేదో మాల్వీలచేత చేయించి ఉందును. వచ్చి నన్ను జడిపించడానికి బదులుగా నీ సత్తువ ఎటువంటిదో వాళ్లకు కొంచెం చూపించిఉంటే నువ్వుచేసిన పని నీకు మెప్పుపుట్టించును, నాకూ

పుట్టించును. నీ బలహీనత పక్కజమీందారులనుకూడా బలహీనులుగా చేసిపారేస్తూఉంది తెలుసునా?"

"నీకు నేను సలహాఇవ్వడంలేదు సందీప్. నువ్వుకూడా నాకు సలహాఇవ్వకుండా ఉంటే బాగుంటుందని నా అభిప్రాయం. ఇచ్చినా వృథా అవుతుంది. నేను చెప్పవలసినది ఇంకొక మాట ఉన్నది. ఇప్పటికి కొంతకాలం అయింది, నువ్వూ నీ శిష్యులూ కలిసి నా ప్రజలమీద అధికారం చలాయించి లోలోపున చాలా బాధపెడుతున్నారు. అది మరి పనికిరాదు. ఇక మీరంతా నా తాలూకా వదిలి వెళిపోవలసి ఉంటుంది."

"సాయిబుల భయంవల్లనా లేక ఇంకేదైనా భయం ఉన్నదా?"

"కొన్నిరకాల భయం లేకపోవడమే పిరికితనం. అట్టి భయంచేతనే చెపుతున్నాను సందీప్,—నీవు వెళిపోవాలి. నాలుగైదురోజులలో నేను కలకత్తా వెళుతున్నాను, నాతో నువ్వు వచ్చేయాలి. కావాలంటే, కలకత్తాలో మాఇంట్లోనే ఉండవచ్చు. దానికేమీ అభ్యంతరం ఉండదు."

"సరే అయిదురోజులు వ్యవధి దొరికింది కదా ఆలోచించుకోడానికి ! ఈలోపున, తేనెపట్టును విడిచి వెళిపోతున్నాను గనుక, మా రాణికి ఆఖరుపాట పాడి వినిపిస్తాను—ఝూంకారగానంతో సెలవుతీసుకుంటాను—"ఓ ఆధునిక కవివర్యా, తెరువు నీ తలుపులు. నీ వాణిని నేను దోచుకుంటాను. చోరీ చేసినది నీవు, నేను కాదు. నాపాట నీవు అపహరించి నీదానిగా

చేసుకున్నావు.. వేను నీదే ఉండనీ కావాలంటే, పాటమాత్రం నాది."

ఆలా అంటూ తన పగిలిన బొంగు గొంతుకతో ప్రారంభించాడు భైరవిమీద పాట, పాడుతున్నంతసేపూ ఏక్షణం అపస్వరంలోకి లాగేస్తుందో అని నాకు భయంవేస్తూనే ఉంది.

ఏమి టతని సాహసం! మితిమీరినది; కప్పూ విప్పూ లేదు; బట్టబయలు! నిగురులేని నిప్పు! తాను చేసే పనికి అడ్డుపెట్టడానికైనా వ్యవధి ఇవ్వడు. అతనిని ఆపడం పిడుగును ఆపడంలాంటిదే! ఆపితే ఏమిచేస్తుంది పిడుగు? నిర్లక్ష్యంగా నవ్వుతుంది మెరుపురూపంగా!

నేను గదిలోనుంచి పైకి వచ్చేశాను. అంతఃపురంలోకి వెళిపోబోతున్నాను. అమూల్య ఎక్కడనుంచో వచ్చి ఎదుట నిలబడ్డాడు, "నువ్వేమీ భయపడకు అక్కా.. ఈరాత్రే వెళుతున్నాను, ఎంతమాత్రం ప్రయత్నం నిష్ఫలం చేసుకురాను." అని అన్నాడు.

నిష్ఠాపూరితమైన అతని ముద్దుముఖంవైపు చూస్తూ అన్నాను—"నావిషయమై నేను భయపడలేదు అమూల్యా, గాని నీగురించి నాకు కలుగుతూఉన్న భయం ఒక్కక్షణమైనా మరవకూడదనే నా ప్రార్థన."

అమూల్య వెళిపోతున్నాడు, అతనిని పిలిచి "మీ అమ్మ ఉన్నదా అమూల్యా?" అని అడిగాను.

"ఉన్నది."

అక్కా?"

"లేదు మా అమ్మకు నేను ఒక్కణ్ణే పిల్లణ్ణి."

"వెళిపో అమ్మా, మా అమ్మదగ్గిరికి తిరిగి వెళిపో అమూల్యా!"

"నాకు ఇక్కడే అమ్మా అక్కా కూడా ఉన్నారు అక్కా."

"రాత్రి నువ్వు వెళిపోయేలోగా ఇక్కడ భోజనం చేసి వెళ్లు అమూల్యా."

"భోజనానికి వేళ ఉండదు అక్కా, నీ ప్రసాదం కొంచెం ఇయ్యి, అది నాతో కూడా తీసుకొని వెళిపోతా."

"నీకు ఏమిటిఇష్టం అమూల్యా?"

"మా అమ్మ దగ్గిరఉంటే కడుపునిండా కర్జికాయలు తిని ఉందును. తిరిగి వచ్చాక నువ్వుచేసిన కర్జికాయలు కడుపునిండా తింటాను అక్కా."

# నిఖిల్ కథ

ఒకొక్కనాడు రాత్రి మూడుఘంటలకు తెలివివచ్చి లేచి కూర్చుండేవాడను. నేనుమునుపుఉండేప్రపంచం చచ్చి దయ్యమయి వచ్చి ఈ మంచమూ ఈ ఇల్లూ ఇంట్లో ఉండే యావత్తు సామానూ—ఈ అన్నిటినీ ఆక్రమించుకొని కూర్చున్నదా అని ఆ అర్ధరాత్రి వేళ అనిపించేది. ఎరిగినవాళ్ల భూతమే మనకు భయంపుట్టిస్తుంది. అది ఎందుచేతనో ఇప్పుడు బాగా బోధపడ్డది. చాలాకాలంనుంచీ మనము బాగా ఎరిగినటువంటిది ఒక్కక్షణంలో ఎరగనిదిగా మారిపోయినప్పుడు అది మహాభయంకరమైన వస్తువు అవుతుంది. అన్నివ్యవహారాలూ చేసుకుంటూ జీవనం ఇప్పటివరకూ ఎటువంటి అడ్డూ లేకుండా చల్లగా నదిప్రవాహం లాగు జరిగిపోతూ ఉండెను. అటువంటి దాన్ని దారి ఏర్పడని బురదలోనుంచి నడిపించుకొని వెళ్లడం గాబరాపుట్టించక మానదు. ఆ పని చేయవలసివస్తే చికాకు పడకుండా మన శాంతిని మనము కాపాడుకోవడం అసాధ్యమైన పని—మన కంటికి మనమే ఇంకెవరోలాగు కనబడుతుంటాము.

సందీప్‌సమాజంవాళ్లు మాప్రాంతాలలో ప్రజలను నానారకాల బాధలూ పెడుతున్నారని కొన్నాళ్లనుంచీ తెలుస్తూఉంది. నామనస్సు సరిగా ఉంటే, "ఇక్కడనుంచి వెళిపో అబ్బాయి," అని సందీప్‌తో చెప్పిఉందును. ఈ చికాకువల్ల

కేవలం అస్వాభావికం అయిపోయింది నామనస్సు. నా దారి ఇక సులువైనదికాదు. సందీప్‌తో వెళిపోమని చెప్పడానికి సిగ్గువేస్తున్నది. ఆమాటతోకూడా మరికొన్నిమాటలు ఎంత వద్దు అనుకున్నా వచ్చేస్తాయి, నాముందర నేనే చిన్నపుచ్చుకో-వలసి వస్తుంది అని సంకోచించాను.

దాంపత్యం నా మతంప్రకారం ఒక ఆంతరంగికమైన పదార్థము, అది కేవలం గృహస్థాశ్రమంకాదు, కేవలం సంసార యాత్రతో చెల్లిపోయేది కాదు. అది నా జీవనానికి ఒక వికాసం వంటిది. అందుచేతనే బైటనుండి దానిమీద బలం ఉపయోగించ లేకపోయినాను. జోరుచేయబోయేసరికి నా దేవతను అవమాన పరుస్తున్నాను అనిపించేది. ఈ సంగతి బోధపడేటట్టు ఎవరితోనూ చెప్పలేను. నేను ఒక అద్భుతమైన మనిషిని. కనుకనే బహుశా నేను మోసపోయిఉంటాను. కాని బాహ్యశరీరానికి ఇతరులవల్ల కలిగిన మోసాన్ని తప్పించబోయి నా అంతస్సును నేనే ఏలాగు మోసపుచ్చగలను ?

అంతస్సులోనుండి బైటను సృజించగలిగిన సత్యాన్నే పూజ చేస్తానని దీక్షపట్టాను. అందుచేతనే బయటనున్న మాయా-జాలాన్ని ముక్కముక్కలు చేయవలసి వచ్చింది. నా దేవత బయటి దాసత్వంనుంచి నన్ను విముక్తుని చేస్తుంది. నా లోపున రక్త-పాతం జరగవలసివస్తే జరగనీ, నేను ముక్తిమాత్రం సంపాదించి తీరుతాను. ఆ ముక్తి నాకు దొరికినతరువాత లోపలి రాజత్వం నాదే అవుతుంది.

ఆ ముక్తియొక్క సువాసన నాకు అప్పుడే కొంచెంకొంచెం కొడుతున్నది. ఉండుండి అంధకార గర్భంలోనుంచి పక్షిపాట వినబడుతున్నది—అది నాలోపున పుట్టబోయే అరుణోదయా-నికి సూచకము. 'మాయతో తయారైన విమల స్వప్నంలాగు చెదిరి పోనీ, ఏమి భయపడకు,' అని నా లోపునున్న పురుషుడు మాటిమాటికి నాకు ధైర్యంచెపుతున్నాడు.

పొరుగు జమీందారుతో కలిసి సందీప్ అతి గొప్పగా మహిషాసురమర్దనిపూజ చేయించడానికి ప్రయత్నం చేస్తు-న్నాడని మాష్టరుగారివల్ల విన్నాను. ఆ పూజఖర్చులుకోసం జమీందారు తన ప్రజలవద్ద డబ్బు లాగుతున్నాడట. మా ఇద్దరి పండితులనూ కూర్చోపెట్టి రెండుఅర్థాలతో ఒకపాట వ్రాయించాడట. దాని విషయమై మాష్టరుగారికి సందీప్‌తో ఒక వాదన అప్పుడే అయిందట. సందీప్ అంటాడట—"దేవతలకు కూడా ఒక *ఇవల్యూషన్ ఉన్నది. తాత సృజించిన దేవతను తన ఇష్టప్రకారం మార్చుకపోతే మనమడు నాస్తికుడుగా ఉండి పోవలసివస్తుంది. పురాతన దేవతలను ఆధునిక దేవతలుగా చేయడమే నా పని, నా మిషన్.' దేవతలను గతముయొక్క బంధనంనుండి విముక్తులను చేయడానికే నేను జన్మం ఎత్తాను. నేను దేవతల ఉద్ధారకుడను."

చిన్నప్పటినుండీ చూస్తున్నాను సందీప్ భావాలతో,ఐడి-యాలతో, గారిడీచేసే మనిషి. నిజం కనిపెట్టడంలో ఎటువంటి

---

* పరిణామము.

సరదా లేదు అతనికి. నిజంలాగు కనిపించే మాయను కల్పిస్తేనే అతనికి సంతోషం. అతను ఆఫ్రికా అడవులలో పుట్టిఉన్నట్టైతే నరబలీ, నరమాంసభక్షణమూ, ఇవే మనిషికీమనిషికీ ఉండే అంతరంగికమైన బాంధవ్యాన్ని బలపరిచే మార్గాలు అని చూపిస్తూ అనేకమైన కారణాలు కనిపెట్టి ఉండును. భ్రమపెట్టడమే నాపని అని కూర్చుండే మనిషి చివరకు తననుకూడా భ్రమపెట్టుకుంటేనే, తప్ప ఉండలేడు. మాటలమంత్రం సహాయంవల్ల అతను క్రొత్త-క్రొత్త మాయలను సృష్టిచేస్తుంటాడు; వాటిలో ఒకదానికిఒకటి ఎంత విరుద్ధంగాఉన్నా క్రొత్తమాయ తయారైనప్పుడల్లా 'నిజం దొరికింది' అని పట్టుకుంటాడు.

ఏమయినప్పటికీ దేశంలో మాయ అనే సారా పండడానికి నేను ఎటువంటి సహాయమూ చేయలేను. దేశసేవ చేదామనికోరే ఈ యువకులకు మొదటినుండీ ఈ నిషావచ్చే ప్రయత్నంతో నాకు ఎటువంటి సంబంధమూ ఉండకూడదని నా కోరిక. మంత్రాలతో మనస్సును భ్రమపెట్టి పనిచేయించేవాళ్ల మతంప్రకారం పనికి ఎక్కువ విలువ, భ్రమలో పెట్టినవాళ్ల మనస్సులు కేవలం విలువలేనివస్తువులు. ప్రమత్తతనుండి దేశాన్ని రక్షించలేనప్పుడు దేశానికిచేసే పూజ దేశానికి అర్పించిన విషనైవేద్యం అవుతుంది—దేశసేవ విముఖ బ్రహ్మాస్త్రంలాగు వెనకకు తిరిగివచ్చి దేశంయొక్కగుండెకే తగులుతుంది.

మా ఇంట్లోనుంచి వెళిపోవలసింది అని విమల ఉంటూ

ఉండగా సందీప్‌తో అన్నాను. విమలా సందీప్, ఇద్దరూ, బహుశా, నా ఉద్దేశం సరిగా బోధపరుచుకోరని నేను ఎరుగుదును. కాని వాళ్లు మరొకలాగు భావిస్తారేమో అని భయపడడం మాత్రం కూడదు. ఆ భయంనుండి నేను విముక్తుడను కావలెను. విమలకూడా తప్పభిప్రాయపడితే పడనీ.

ఢాకానుంచి మౌల్వీల రాకపోకలు ఇంకా జరుగుతూ ఉన్నవి. గోహత్య అంటే హిందువులకు ఎంత ఘోరం అనిపించేదో నా తాలూకాలో ఉండే సాయిబులకుకూడా అంత ఘోరం అనిపించేది. కాని ఇప్పుడు రెండుమూడుచోట్ల ఆవులను చంపడం జరిగింది. ఈ సంగతి నాకు మొదట తెలియజేసినవాళ్లు సాయిబులే. దానిని బాగా ఖండిస్తూ మాట్లాడడం సాయిబుల నోటివెంటనే విన్నాను. సులభంగా తెగే చిక్కు కాదని బోధపడ్డది. మూఢభక్తి అని నటిస్తూ వ్యవహారం జరుపుతున్నారని పోల్చుకున్నాను. వాళ్లు చేస్తూఉండేది నిషేధించడంవల్ల ఇప్పుడుండే కృత్రిమభక్తిని నిజమైనభక్తిగా మార్చినవాడను అవుతాను; నా ప్రయత్నానికి విరుద్ధంగా చేస్తూఉన్నవాళ్ల ఎత్తు అదే.

హిందువులలో ముఖ్యమైన వాళ్లను పిలిపించాను, నచ్చేటట్టు చెపుదామని చాలా ప్రయత్నంచేశాను. "మనధర్మం అనుసరించడంలో కావలసినంత పట్టుదల కనపరచవచ్చును గాని ఇతరులధర్మం విషయంలో మనకు ఎటువంటి అధికారమూ లేదు," అని చెప్పాను. "నేను వైష్ణవుడను కదా అని నా పొరుగునఉన్న శాక్తేయుడు జంతుబలి మానడే! దానికి మనము

ఏమిచేయగలము ? అలాగునే సాయిబులనుకూడా వాళ్లఆచా-
రాలప్రకారం చేసుకోనివ్వండి, అల్లరి చేయకండి."

"ఇంతకుముందు ఇటువంటి దుర్మార్గం లేదు, మహా
రాజా!" అని వాళ్లు అన్నారు.

"అప్పుడు దుర్మార్గం లేకపోవడం బలవంతం వల్లకాదు,
వాళ్లలో ఆ ఇచ్ఛ ఉండబట్టి. తిరిగీ మునపటిలాగు ఉండవలె-
నంటే వాళ్లంతటవాళ్లే ఆ పనులు మానేసేటట్టు చేసే మార్గం
అవలంబించండి. అది సాధించేమార్గం యుద్ధమార్గం కాదు."

"ఆరోజులు వెళిపోయినాయి మహారాజా! బలం ఉప-
యోగించకపోతే ఆ పనులు ఎంతమాత్రం ఆగవు."

నేను అన్నాను— "బలం ప్రయోగిస్తే గోహత్య
ఆగదు, పైగా నరహత్యకూడా ప్రారంభంఅవుతుంది."

వాళ్లలో ఒకడు ఇంగ్లీషు చదుకున్నవాడు ఉన్నాడు—
ఈనాటి క్రొత్తక్రొత్తమాటలు వల్లించడం నేర్చుకున్నవాడు. అత
ను అన్నాడు—"చూడండి, ఇది కేవలం ఆచారంఅంటే వదిలి-
పోదు. మన దేశం కృషిప్రధానమైనదేశం, అందుచేత ఈ
దేశంలో ఆవులు—"

"ఈ దేశంలో గేదెలుకూడా పాలు ఇస్తాయి, దున్నపో-
తులు దున్నుతాయి. వాటితలలు నరికి, ఆ తలలు మన నెత్తిమీాద
పెట్టుకొని, వాటిరక్తం మన ఒంటినిండా పూసుకొని, దేవిఎదుట
నృత్యంచేస్తూఉండి సాయిబులతో పోట్లాడుతుంటే చూచి
'ధర్మం' లోలోన నవ్వుకుంటుంది. ఏమిా లాభం ఉండదు, మిగిలే

దంతా పోట్లాటా విరోధమూ. ఆవులను చంపకూడదుగాని పోతులను చంపవచ్చును అనేది మతం కాదు, గుడ్డిఆచారం.

ఆ ఇంగ్లీషుచదివినవాడు అన్నాడు—"దీని వెనక ఎవ-రున్నారో మీకు తెలియడంలేదండీ? సాయిబులకు బోధపడి పోయింది—ఎటువంటి అరాచకాలు చేసినా వాళ్లకు ఏమీ శిక్ష కాదు అని! 'పాచుడీ'లో వాళ్లు ఏమిటిచేశారో విన్నారు కదూ?"

నేను అన్నాను—"ఏసాయిబులను అస్త్రాలుగాచేసి మన మీద విసరడానికి సాధ్యం అయిందో ఆ సాయిబులను మనచే-తులతో మనమే అస్త్రాలుగా చేశాము. ధర్మం మనకు ఈ విధంగా బుద్ధి చెపుతుంటుంది. మనము ఇన్నాళ్లూ కూడ ఔడుతూ వచ్చి-నది మనమీదనే కర్పు కావాలి."

ఇంగ్లీషుచదివినవాడు అన్నాడు—"సరే, మంచిదే! కర్పు అయిపోనీ! దానివల్ల మాకూ కొంత సుఖం ఉన్నది—కలిగే జయం మాదే. మన పరిపాలకులకుఉండే శక్తులు అన్నిటిలోకీ గొప్పది న్యాయపరిపాలన అని కదా అందరూ నమ్ముతున్నారు—అన్యాయాన్ని ఈవాళ మంటిలో కలిపేశాము. ఇన్నాళ్లూ వాళ్లు రాజులుకదా, ఇప్పుడు వాళ్ల చేత బందిపోటు చేయిస్తాము. ఈ సంగతి దేశచరిత్రలో ఎవరూ వ్రాయరు, గాని మా మనస్సులలో మాత్రం చిరకాలమూ ఉంటుంది."

ఇవతల, ప్రతి పేపరులోనూ నాపేరు పడుతున్నది, అప-ఖ్యాతిలో విఖ్యాతుడను అయిపోయినాను. చక్రవర్తి జమీందారు

గారి తాలూకాలో నదిఒడ్డున శ్మశానంలో ఒకపెద్ద గడ్డిబొమ్మకు నా పేరుపెట్టి ఎంతో సంబడిచేసి తగలబెట్టారట. ఇంకా నానా రకాలగా నన్ను అవమానపరుద్దామని ప్రయత్నం జరుగు-తున్నది...జాయింటుస్టాకు కంపెనీ ఏర్పరిచి బట్టల ఫ్యాక్టరీ పెడతాము, మీరు అందరికంటే అధికంగా షేర్లు కొనవలసింది అంటూ వీళ్లు నా దగ్గిరికి వచ్చారు. నేను అన్నాను— "నేను వేసిన ఏనాలుగు రూపాయిలో పోతే నాకు దుఃఖం లేదు, గాని మీరు ఫ్యాక్టరీ పెడితే అనేకమందిబీదవాళ్ల రూపాయిలు కూడా దానితో పాటు మునిగిపోతాయి. అందుచేత నేనేమీ షేర్లు కొన దలచుకోలేదు."

"ఏమి మహారాజా, దేశంయొక్క హితం మీకు అక్కర లేదా?"

"అటువంటి పరిశ్రమలవల్ల దేశానికి హితం జరగ-వచ్చును గాని దేశానికి హితం చేదామని కూర్చున్నంత మాత్రాన పరిశ్రమలు జరగవు. మనము చల్లగా ఉన్నన్నాళ్లు ఎటువంటిపరిశ్రమా సాగలేదు, ఇప్పుడు మనకు పిచ్చిఎక్కింది గనుక పరిశ్రమలన్నీ ఝామ్మంటూ నడుస్తాయి గాబోలు!"

"ఒక్కమాటలో చెప్పండి, మీరు షేర్లు కొంటారా కొనరా?"

"కొంటాను, గాని ఇప్పుడు కాదు; మీరు చేసే ప్రయ-త్నం నిజంగా పరిశ్రమదిమయమైన ప్రయత్నమూ అని నాకు ఎప్పుడు నమ్మకం పుడితే అప్పుడు. మాట అరంభించిబోయి క్షధా అని

పాయిర్యమీదికి బియ్యం ఎక్కుతాయి అని ఎక్కడఉన్నది? దానికి నిదర్శనంగా ఏమీ కనబడడం లేదే?"

వీడు చాలా హిసాబీమనిషి, పైసా ఒకంతట వదలడు, లోభి, అని అనుకుంటున్నారు వీళ్లంతా. నేను స్వదేశీ పనుల అభివృద్ధికి చేసినదంతా, జమాఖర్చులపుస్తకాలు తీసి, వీళ్లకు చూపిద్దామని బుద్ధి పుడుతున్నది. మాతృభూమి సారవంతంచేసి పంటలు అభివృద్ధిచేదామని నేను చేసిన ప్రయత్నమంతా వీళ్లకు తెలియ దనుకుంటాను. ఎన్నోసంవత్సరాలు జావా మారిషస్‌నుంచి విత్తనాలు తెప్పించి చెరుకు పండించాను. గవర్నమెంటు అగ్రికల్చురల్ డిపార్టుమెంటు సలహా తీసుకొని నానారకాల గత్తాలు వేయించి చేయవలసిన దంతా చేశాను. దానివల్ల నాకు వచ్చిన రాబడి చూచి మా తాలూకాలోని వ్యవసాయదారులు లోలోపున నవ్వుకున్నారు. ఆ నవ్వు ఇప్పటికీ పైకి రాకపోను. అయితే నేను అక్కడితో ఊరుకోలేదు. సర్కారువారు ప్రచురిస్తూఉన్న కృషిపత్రిక తర్జుమాచేయించి జపాను చిక్కుడూ, ఈజిప్టు ప్రత్తి, మొదలైనవాటిగురించి బోధపరుద్దామని మా వ్యవసాయదారులదగ్గిరికి వెళ్లేసరికి ఇంతకాలమూ అణుచుకొన్న నవ్వు వాళ్లు మరి పట్టలేకపోయినారు. ఆ సమయంలో దేశసేవకులు ఏమి చేస్తున్నారు? ఎక్కడా చడీచప్పుడు లేదే! 'వందేమాతరం'మంత్రం నిద్రపోతున్నది. అటుపైని, ఆ స్వదేశీస్టీమరు వ్యవహారం—పోనీ, పోనీ! అవన్నీ ఇప్పుడు వెళ్లకక్కి ఏమిప్రయోజనం? దేశహితంకోసం

వీళ్లు పెట్టిన మంట నా గడ్డివిగ్రహం తగలపెట్టి అక్కడితో ఆరిపోతే బ్రతుకుతాము!

* * * * * *

ఇదేమిటి ఇది! మా 'చాకువా' సబ్ ట్రెజరీ లూటీ-చేశారు. హెడ్ క్వార్టర్సు ట్రెజరీకి ఒక కిస్తీ చెల్లించవలసి ఉండి ఏడువేల అయిదువందల రూపాయిలు జమచేసి అక్కడ ఉంచారు—ప్రొద్దుపూరకముందే పడవ చేసుకొని హెడ్ క్వార్టర్సుకు వెళ్లి అక్కడ చెల్లించే ఏర్పాటు. పంపడానికి వీలుగా ఉంటుందని మా మేనేజరు సర్కారుట్రెజరీలో నూరురూపా-యిల నోట్లకింద ఆసొమ్ము మార్పించి, నోట్లు మడతపెట్టి కట్టి ఉంచాడు. అర్ధరాత్రివేళ బందిపోటుదొంగలు తుపాకులూ పిస్తూలీలతో వచ్చి ట్రెజరీ లూటీ చేసేశారు. కాసిమ్ సబ్ వారుకు గుండుదెబ్బ తగిలిందట. అందులో ఒక చిన్న చిత్రమైన సంగతి ఏమిటంటే, దొంగలు సరిగా ఆరువేలుమాత్రం తీసుకొని మిగ-తా పదిహేనువందలనోట్లూ గదినిండా చల్లేసి పోయినారు. తీసుకుపోయినవాళ్లు అనాయాసంగా అన్నిరూపాయిలూ తీసుకుపోయి ఉండవచ్చును. ఏలాగయితేనేమి బందిపోటు-వాళ్ల వంతు అయిపోయింది, ఇక పోలీసువాళ్ల వంతు ప్రారంభం అవుతుంది. రూపాయిలేమో పోయినాయి; అంతతో తీరదు ఇక శాంతికూడా పోవాలి.

ఇంట్లో అప్పుడే కబురు తెలిసిపోయింది. చిన్నవదినె వచ్చి "ఇదేమిటి అబ్బాయి, కొంప మునిగిపోయిందే!" అన్నది.

ఆవిడ శోకం పోగొడదామని హాస్యానికి అన్నట్టుగా అన్నాను, "మునిగిపోడానికి ఇంకా చాలా వ్యవధి ఉంది; తిండికీ బట్టకీ ఇంకా కొన్నాళ్ళవరకూ ఏమీ లోటు ఉండ-కూడదు."

"లేదు తండ్రీ, హాస్యం కాదు. వీళ్ళకు నీమీద ఇంత-కోపం ఎందుకు? వాళ్ళను కొంచెం ఖుషామత్తు చేస్తూఉంటే బాగా ఉంటుందేమో? దేశంలో ఉండేవాళ్ళనుఅందరికీ నీ—"

"దేశంలో ఉండే మనుష్యులందరి భయంవల్లా యావత్తు దేశాన్నీ ముంచేయలేను కదా!"

"అదికూడా విన్నాను, నిన్ను అవమానపరుద్దామని నదిఒడ్డున ఏమో చేశారట. భయంతో చచ్చిపోతున్నాను. ఛోటారాణి దొరసానిదగ్గిర చదువుకున్నది, దానికి ఎటువంటి భయమూ లేదు. నేను పురోహితుడికి కబురుపంపి శాంతి చేయించి స్వస్తివాచనం చదివిస్తేనేతప్ప ఉండలేను నాయనా. నీపుణ్యం ఉంటుంది తండ్రీ నువ్వు కలకత్తా వెళ్ళిపో, ఇక్కడ ఉంటే తప్పకుండా ఏదో ప్రమాదం చేస్తారు."

మా చిన్నవదిన భయమూ ఆతురతా నా మనస్సును సుధావర్షంలో ముంచేశాయి—"అన్నపూర్ణా, నీ హృదయ-ద్వారం ఎదుట కూర్చొని శాశ్వతకాలమూ అడుక్కుం-టాను."

చిన్నవదిన అన్నది—"పక్కగదిలో రూపాయిలు పెట్టుకొని కూర్చోవడం ఏమీ బాగులేదు సుమా అబ్బాయి!

వాళ్లు ఏలాగో మెల్లిగా పసిగడతారు, చివరకు ఒకనాడు—నేను రూపాయిలకోసం భయపడడం లేదు—ఏమో! ఇంకేమి జరుగునో!"

వదిన భయం పోగొట్టాలని అన్నాను—"సరే అయితే వదినా, రూపాయిలు ఇప్పుడే పైకితీసి ఖజాన్‌జీ దగ్గిరికి పంపించేస్తాను. ఎల్లుండి, తప్పకుండా, కలకత్తా బ్యాంకులో జమకట్టేస్తాను."

ఈలా అంటూ పడకగదిలోకి వెళ్లి చూచేసరికి పక్కగది తలుపు గడియవేసి ఉంది లోపునుంచి. తలుపు కొట్టాను. విమల లోపునుంచి అన్నది—"నేనూ, బట్టకట్టుకుంటున్నాను."

వదినె అన్నది—"ఇంత పెందలాడే ముస్తాబు అవుతున్నది చోటారాణి, చాలా ఆశ్చర్యంగా ఉందే! ఇవాళ 'వందేమాతరం'సభ కూడుతుంది కాబోలు. ఏమేవ్, దొంగలకు రాణీ! లోపల కూర్చొని కొల్లసొమ్ము లెక్కపెట్టుకుంటున్నావా ఏమిటి?"

సరే, కొంచెంసేపు పోయినతరువాత వచ్చి అదేదో చూదాము అనుకొంటూ బయటికి వచ్చాను. పోలిస్ ఇన్‌స్పెక్టరు అప్పుడే వచ్చి నిలుచున్నాడు. "జాడ ఏమైనా దొరికిందా?" అని అడిగాను.

"అనుమానం మాత్రం ఉన్నది."

"ఎవరిమీద?"

"ఆ కాసిమ్ సర్దార్ మీద."

"అదేమిటి! వాడు దెబ్బతిని వస్తే!"

"అట్టే దెబ్బ ఏమీలేదు. పాదంమీద చర్మం కొంచెం గీసుకుపోయి రక్తం వచ్చింది—అదైనా తనంతట తాను చేసుకొన్నదే."

"కాసిమ్‌మీద నాకు ఎటువంటి అనుమానమూ లేదు. వాడు అతి నమ్మకమైనవాడు."

"నమ్మకమైనవాడు కావచ్చును, నేనూ ఒప్పుకుంటాను. అలా అనిచెప్పి చోరీ చేయలేదు అని మాత్రం చెప్పలేము. పాతికసంవత్సరాలు అతి విశ్వాసంగా ఉన్నవాళ్లను నేను చూచాను, అటువంటి వాళ్లుకూడా ఎప్పుడో ఒకనాడు—"

"ఐతే కావచ్చును; ఐనాగాని వాణ్ణి జైలుకు పంపలేను."

"మీరు పంపడం ఎందుకు? ఆభారం ఎవరినెత్తిమీద ఉన్నదో వాళ్లు పంపుతారు."

"కాసిమే అయితే ఆరువేలు తీసుకొని మిగతారూపాయిలు పారేశాడు ఎందుచేత?"

"మనకు నానారకాల సందేహాలు కలగాలని. మీరేమి అనుకొన్నప్పటికీ, మనిషిమాత్రం చాలా పక్కామనిషి. ఇవతల మీ ఖజానాదగ్గిర పారాఇస్తుంటాడు,గాని ఆదగ్గిర ప్రాంతాలలో జరుగుతున్న ప్రతిచోరీ బందిపోటులలో నిశ్చయంగా వీడికి సంబంధం ఉన్నది."

పెట్ట, ఇరవై, ముప్పై మైళ్లదూరాన బందిపోటువేసి రాత్రికి

రాత్రి తిరిగి వచ్చి డ్యూటీకి ఈ పారావాళ్లు ఏలాగు హాజరు అవుతుంటారో, ఆ కథలు అనేకంగా ఇన్‌స్పెక్టరు చెప్పాడు.

"కాసిమ్‌ను తీసుకు వచ్చారా?" అని అడిగాను.

"వాడు పోలీస్‌స్టేషన్‌లో ఉన్నాడు. డిప్యూటీగారు ఇప్పుడేవస్తారు తనిఖీ చేయడానికి," అన్నాడు ఆయన.

"వాణ్ణి నేను చూడాలి."

వాడు నన్ను చూస్తూనే నా పాదాలమీద పడి ఏడుస్తూ అన్నాడు, "ప్రయాణం చేస్తాను మహారాజ్, నేను ఇదేమీ ఎరగను."

"నీమీద నేను అనుమానం పడడంలేదు కాసిమ్. ఏమీ భయపడకు. అపరాధంలేనిదే నీకు ఏహానీ రాదు, నేను పూచీ."

కాసిమ్ దొంగలను సరిగా వర్ణించలేకపోయినాడు. వాడు చెప్పినమాటలన్నీ కేవలం అతిశయోక్తి. "నాలుగయిదు-వందలమంది వచ్చారు. ఇంతంత పెద్ద తుపాకులూ పిస్తోలీలూ పట్టుకున్నారు,"—ఈలాగు అనడం మొదలుపెట్టేవాడు అవన్నీ ఉత్తమాటలని తెలుస్తూఉంది. భయంవల్ల అన్నీ ఆలాగు కనబడి ఉండవచ్చును, లేదా వాడికి జరిగిన పరాభవానికి సిగ్గుపడి కొంతవరకు దాచుకుందామనిఅన్న మాటలు అయిఉండాలి. నా విరోధి హరిశ్ కుందు చేయించిన పని ఇదిఅంతా అని వాడి అభిప్రాయం. వాళ్లసర్‌దార్ ఏక్రామ్‌గొంతుక స్పష్టంగా ఆ-రాత్రి వినబడ్డది అని వాడినమ్మకం.

"చూడు కాసిమ్, ఖబర్దార్! ఉత్త అనుమానంవల్ల వీడిపేరూ వాడిపేరూ అందులో కలపకు. హారిశ్ కుండు అందులో ఉన్నాడో లేదో అది స్థిరపరిచే భారం నీది కాదు," అని నేను అన్నాను.

ఇంటికి వచ్చాక మాష్టరుగారిని పిలిపించాను. తల ఊపుకుంటూ అన్నాడు ఆయన—"ఇక మరి శుభం అన్నమాట ఉండదు. సత్యమూ ధర్మమూ ఉండవలసినచోట దేశాన్ని తీసుకువచ్చి కూర్చోపెట్టారు, దానిపాపాలన్నీ పైకివచ్చి వికసిస్తాయి. సిగ్గూ లజ్జా పూర్తిగా పోతాయి."

"మీ ఉద్దేశం ఏమిటి? ఈ పని—"

"నన్నేమీ అడగకు, ఏవైపు చూచినా పాపమే. పంపించేయి, వీళ్లనందరినీ నీ తాలూకాలోనుంచి పంపించేయి."

"ఇంకొక్కరోజు వ్యవధి ఇచ్చాను. ఎల్లుండి వీళ్లంతా వెళిపోతారు."

"చూడు నిఖిల్, నేను ఒకమాట చెప్పాలి. విమలను నీతో కలకత్తా తీసుకొని వెళిపో. ఇక్కడనుంచి ఆమెకు కనబడే ప్రపంచం చాలా సంకుచితమైనది. మనుష్యులవిగాని మరివేటివిగాని, సరియైన పరిమాణాలు ఇక్కడనుండిచూడడంవల్ల తెలియవు. ఆమెకు ఒకమారు ఈ పృథ్వి చూపించి తీసుకురా. మనుష్యులనూ, మనుష్యుల కర్మక్షేత్రాన్నీ, విశాలమైన స్థలంలో ఉంటూఉండగా చూచి రానీ."

"నేనూ అదే అనుకుంటున్నాను."

"అయితే మరి ఆలస్యం చేయకు. చూచావూ నిఖిల్, మానవచరిత్ర అనేది ప్రపంచంలో ఉండే అన్నిజాతులచరిత్రా అన్నిదేశాలచరిత్రా కలిసి ఏర్పడుతుంది. అందుచేత పాలిటిక్స్ అని చెప్పి సత్యమూ ధర్మమూ అమ్మేసి, దేశమే సర్వమూ అని కూర్చుందామంటే ఎన్నటికీ జరగని పని. ఆ మాట యూరప్ ఒప్పుకోదు అని నాకు తెలుసును. అందుచేతనే అది గురుపదవికి అర్హురాలుకాదు అని నేను అనేది. మనుష్యుడు సత్యంకోసం ప్రాణాన్ని ఇస్తాడు, చచ్చి అమరుడు అవుతాడు. ఒక జాతికిజాతీ చచ్చిపోవచ్చును సత్యంకోసం, ఆలా చచ్చిపోయినా అది మానవ చరిత్రద్వారా అమరత్వం పొందుతుంది. మనభారతవర్షంలో సత్యం ఆవిధంగా అనుభవంలోకి వచ్చుగాక! మనను చూచి దుష్టపిశాచాలు ఆకాశం బద్దలైపోయినట్లు నవ్వుకోనీ, కావాలంటే,—మనముమాత్రం సత్యమే ఆచరింతుముగాక! కాని ఏమి భయంకరమైన పాపము! పైదేశాలనుంచి వచ్చి మనదేశంలో దూరిన ఈ మహామారి ఏమిఘోరమైనది!

రోజంతా ఈగొడవతోనే అయిపోయింది. బాగా రాత్రి అయింది, అలసిపోయి పడుకోడానికి వెళిపోయినాను. ఆ రూపాయిలు ఈవాళ మరి తీసి పంపించలేను, రేపు తప్పకుండా పంపించాలి అని నిశ్చయం చేసుకున్నాను.

మధ్యరాత్రి తెలివి వచ్చింది. గదిలో చీకటి. అంధ-

కారం. ఏదో శబ్దం వినబడ్డట్టు అయింది. ఎవరో ఏడుస్తున్నారా అనిపించింది.

వర్షపు రాత్రి ఉండుండి గాలి ఒక్కొక్క విసురున వచ్చి-నట్టుగా కన్నీటి భారంతో నిండిఉన్న నిట్టూర్పు మధ్యమధ్య వినబడుతున్నది. అది నాకు గదిహృదయంమధ్యనుండి పుడు-తూఉన్న ఏడుపు అనిపించింది.

నా గదిలో ఇంకెవరూ లేరు. కొన్నాళ్లనుంచీ విమల ఆ పక్కనున్న గదులలో దేనిలోనో పడుకుంటున్నది. నేను మంచం దిగి వరండాలోకి వెళ్లాను. అక్కడ విమల నేల బోర్లా పడుకొని ఉన్నది.

అది మాటలతో వ్రాయడానికి వీలులేనిది. విశ్వం యొక్క హృదయంలో కూర్చొని జగత్తులో ఉండేదుఃఖాన్ని అంతటినీ అందుకొని తన కడుపులో పెట్టుకొనేవాడికి తప్ప మరిఎవరికీ అది ఏమిటో తెలియదు. ఆకాశాన ఎటువంటి కద-లికా లేదు, నక్షత్రాలు మాటలేదు, రాత్రి నిశ్శబ్దం, దానిఅంతటి మధ్యా ఈ నిద్రారహితమైన ఏడుపు!

ఈ సుఖదుఃఖాలు సంసారంలో దీనినుంచీ దానినుంచీ వచ్చాయి అనుకొని, శాస్త్రజ్ఞానం ఉపయోగించి మంచి అనీ చెడ్డ అనీ పేరుపెట్టి, ఏదో మహా బోధపడ్డట్టు మనస్సును సమా-ధానపరుచుకుంటాము. కాని మానవుని హృదయం చించి అంధ కార గర్భాన్ని నింపుతూఉన్న ఈ దుఃఖానికి తగిన పేరు ఎవరు పెట్టగలరు?, ఆ చీకటిరాత్రి చలనంలేని నక్షత్రకోటికి ఎదురుగా

నిలబడి విమలవైపు చూచేసరికి అతి భయంతో నా మనస్సు నా చెవిలో చెప్పసాగింది—"ఆమెను విచారణ చేయడానికి నేను ఎవడను ?" ఓ జీవమా, ఓ అపారవిశ్వమా, ఓ అనంత విశ్వబ్రహ్మాండనాయకా! మీఅందరికీ ఒక సాష్టాంగనమస్కారం! మీలోఉండే రహస్యానికి ఒక నమస్కారం !

తిరిగి గదిలోకి వెళిపోదామని అనుకున్నాను ఒకమారు, గాని వెళ్లలేకపోయినాను. మెల్లిగా విమలతలదగ్గర కూర్చొని ఆమెతలమీద చెయ్యివేశాను. మొట్టమొదట ఆమెఒళ్లు కర్ర లాగు గట్టిగా ఉన్నదనిపించింది. వెంటనే ఆగట్టి కరిగింది, సహస్రధారలుగా కన్నీరు ఒలకడం మొదలుపెట్టింది. మానవ హృదయంలో అంతదుఃఖము, అంతఏడుపు, ఉండగలదని నేను ఎన్నడూ ఊహించనైనా ఊహించలేకపోయినాను.

నెమ్మదిగా చేతితో విమలను దువ్వాను. ఆలాగు దువ్వతూ ఉండగా మధ్య ఎప్పుడో తడుముకుంటూ నా రెండుపాదాలూ పట్టుకున్నది. పట్టుకొని తనగుండెదగ్గిరికి లాక్కొని గుండె పగిలిపోతుందా అన్నంత గట్టిగా నొక్కు-కున్నది.

అమూల్య ఈ ఉదయం కలకత్తానుంచి తిరిగి వస్తాడు. అతను రాగానే నాకు కబురు చెప్పమని నౌకరుతో చెప్పాను. అయినా మనస్సును పట్టి ఉంచలేక ముందుగదిలోకి వెళ్ళి కూర్చున్నాను.

అమూల్యను నగలు అమ్మడానికి కలకత్తా పంపుతున్నప్పుడు నా మనస్సులో ఒక్క నాసంగతితప్ప మరేమీ లేదు అనుకుంటాను. అంత చిన్న కుర్రవాడు అంత విలువైన నగలు అమ్మచూపితే అంతా అనుమానిస్తారు అన్న సంగతి నా తలలోకి దూరనే లేదు. ఆడవాళ్ళము మేము, మామీదికి ఆపదఏదైనా వచ్చిపడితే దానిని ఇంకొకరినెత్తిమీద వెయ్యడం తప్ప మాకు ఇంకొకటి ఏమిటి చేతఅవుతుంది—అంత నిరాధారం మా గతి! చావవలసివస్తే నలుగురిని ముంచి మరీ చస్తాము.

అతి గర్వంతో అన్నాను, అమూల్యను కాపాడతాను అని. తమనే కాపాడుకోలేనివాళ్లు ఇంకొకరిని కాపాడుతారు! ఆహా హా, ఆ అమూల్యను నేనే చంపేశాను కాబోలు! తమ్ముడూ, నేను నీనొసట బొట్టుపెట్టి ఆశీర్వదించిననాడు యముడు లోలోపున నవ్వుకున్నాడు కాబోలు— అశుభం నెత్తిమీద పెట్టుకు తిరుగుతున్నాను, అటువంటి అక్కను నేను.

అమంగళమనే ప్లేగువచ్చి మనుష్యులను ఒకొక్కప్పుడు పట్టుకుంటుంది అని నాకు ఈవాళ అనిపిస్తూఉంది. ఎక్కడ-నుంచో హాఠాత్తుగా ప్లేగుబీజం వచ్చి పడుతుంది, సరే— ఒక్కరాత్రిలో చావు సమకూడుతుంది. అటువంటి రోగిని ఎడంచేసి ఎవరికీ తగలకుండా దూరంగా ఉంచలేమూ? అంటు-రోగం అది, ఆ రోగి స్పర్శ ఎంతభయంకరమైనదో నాకు స్పష్టంగా తెలుస్తున్నది. అది విపత్తుఅనే దివిటీ, ప్రపంచాన్ని తగలబెట్టేదామని తాను తగలబడుతూఉంటుంది.

తొమ్మిది ఘంట లయింది. తప్పకుండా అమూల్య ఏదో చిక్కులో తగులుకొని ఉండాలి—ఆ భయం నన్ను ఎంతకూ వదలకుండా ఉంది. అతనిని పోలీసువాళ్లు పట్టుకొనిఉంటారు. నా వస్తువులపెట్టెగురించి స్టేషనులో పెద్దగొడవ అవుతున్నది. అది ఎవరిపెట్టె, అతనికి ఏలాగు దొరికింది—ఆ ప్రశ్నలన్నిటికీ జబాబు చివరకు నేనే చెప్పవలసివస్తుంది. లోకంలోని జనులందరి ఎదుటా ఏమి జబాబు ఇవ్వగలను? మా తోటికోడలిని ఇన్నాళ్లూ అవమానిస్తూ వచ్చాను—అక్కా, ఇప్పుడు నీరోజులు వచ్చాయి. లోకులద్వారా పగతీర్చుకుంటావు. భగవంతుడా, నన్ను ఈ ఒక్కమారు రక్షించు, నా గర్వంఅంతా మంటిలో కలిపేసి మా తోటికోడలి పాదాలదగ్గిర పడిఉంటాను!

మరి ఉండలేకపోయినాను—తక్షణం, ఇంట్లోకి తోటి-కోడలిదగ్గిరికి వెళ్లి నిలుచున్నాను. ఆమె తమలపాకులు సరుదుతూ వరండామీద ఎండలో కూర్చున్నది. ఖక్కాను దాస్

ధాకో ఉన్నది. దాసీ కనబడేసరికి కొంచెం జంకు పుట్టింది; ఆ జంకును తొక్కిపెట్టి తోటికోడలికాళ్లకు మొక్కి పాదధూళి తీసుకున్నాను. ఇదేమిటే, ఛోటా రాణీ, ఏమిటి కథ? హఠాత్తుగా ఇంతభక్తి పుట్టిందేమిటి ?"

నేను అన్నాను—"ఈవాళ నా జన్మదినం అక్కా! నేను అనేకమైన అపరాధాలు చేశాను. మీ ఎవరికీ ఇకముందు నేను దుఃఖం కలుగజేయకుండా ఉండేటట్టు నన్ను ఆశీర్వదించు అక్కా! నా మనస్సు అతిచిన్నది."

అంటూ, మరిఒకమారు ప్రణామంచేసి లేచి వచ్చేశాను. వెనకనుంచి కేకవేస్తూ అన్నది తోటికోడలు—"ఇదిగో చూడు, *ఛూటూ! నీ జన్మదినమా? ఆ సంగతి ముందు చెప్పావు కావేమి? మధ్యాహ్నం ఇక్కడికి భోజనానికి రావాలి. బంగారుతల్లివి మరిచిపోకు అమ్మా!"

"భగవంతుడా! నిజంగా ఈవాళ నా జన్మదినం అయేటట్టు ఏమీ చేయలేవూ? పూర్తిగా కొత్తమనిషిని కాలేనూ? అంతా కడిగి తుడిచి కొత్తదానిగా చేసి నాకు ఇంకొక అవకాశం ఇచ్చి చూడలేవు తండ్రీ?"

ముందుగదిలోకి తిరిగి వచ్చేసరికి సందీప్ అక్కడ కూర్చొని ఉన్నాడు. అసహ్యంపుట్టి నా మనస్సంతా విషం అయిపోయింది. ఇంతకుముందు నేనుఅనుకున్న ప్రతిభా, ఆ ఇంద్ర-

---

* ఛోటారాణి ముద్దుపేరు.

జాలంచేసే శక్తి, ఒక్క పిసరైనా సందీప్‌ముఖంలో ఈ ఉదయం కనబడలేదు. "మీరు వెళ్లండి ఇక్కడనుండి," అని అన్నాను.

"అమూల్య లేడే! ఇప్పుడు నావంతు ప్రత్యేకంగా మాట్లాడడం," అని నవ్వుతూ సందీప్ అన్నాడు.

నా కర్మం! నామీద చలాయించడానికి నేను ఇచ్చిన అధికారం ఇప్పుడు ఏలాగు తీసుకోగలను?—"కొంచెం ఏకాంతంగా కూర్చోవలసిన అవసరం ఉన్నది," అని అన్నాను.

"గదిలో ఇంకొకరున్నా ఏకాంతంగా ఉండడానికి అభ్యంతరం ఉండదే. నలుగురిలో నేనుఒకణ్ణి అనుకోకు రాణీ; నేను సందీప్‌ను, లక్షమందిలో ఉన్నా నేను ఒంటరిగానే ఉంటాను. నేను మూకలో ఉన్నా మూకలో కలిసిపోను."

"మరిఒకమారు ఎప్పుడైనా రండి, ఈ ఉదయం నేను—"

"అమూల్యకోసం కనిపెట్టుకొని ఉన్నారా?"

చికాకువేసి గదిలోనుంచి వెళిపోబోతుంటే సందీప్ శాలువులోనుంచి నా వస్తువులపెట్టె పైకితీసి డబ్‌మని శబ్దం-చేసుకుంటూ మార్బుల్ టేబిల్‌మీద పెట్టాడు.

ఉలికిపడి చూచి అడిగాను, "అయితే అమూల్య వెళ్లలేదూ?"

"ఎక్కడికి వెళ్లలేదు?"

"కలకత్తా?"

"లేదు," అని నవ్వుతూ అన్నాడు.

"త్రిలోకానూ! నేను భాయ్‌ఫోటానాడు చేసిన ఆశీర్వాదం ఫలించింది. నేను దొంగను, ఆ విధాత నాకు శిక్ష విధించినా అమూల్యనుమాత్రం రక్షించనీ!"

సందీప్ నా ముఖంవైపు చూచి నా భావం కనిపెట్టి వెక్కిరిస్తూ మొదలుపెట్టాడు—"అంత సంతోష మెందుకు రాణీ! అంతవిలువైనదా ఆ నగలపెట్టె? అయితే ఎటువంటిమనస్సుతో దేవిపూజకోసం ఇచ్చేయాలని అనుకున్నావు? దేవికి ఇచ్చేసినట్టే లెక్క, ఇప్పుడు దేవిచేతిలోనుంచి తిరిగి తీసుకుంటావా?"

గర్వం ఒకంతట చావదు, చస్తూ చస్తూ తలఎత్తుతుంటుంది. ఆ నగలన్నీ ఒక గుడ్డిగవ్వతో సమానం అని అతనికి కనపరుచుదామని బుద్ధిపుట్టి అన్నాను—"ఆ వస్తువులమీద మీకు అంత లోభమూ అంత కోరికా ఉంటే అవి మీరు తీసుకోవచ్చును."

"ఇప్పుడు మనదేశంలో ఎక్కడెక్కడ ఎంతెంత ధనం ఉన్నదో దానంతటిమీదా నాకు లోభం ఉన్నది. లోభంవంటి సహజశక్తి, అంత బలమైనది, అంత గొప్పది, ఇంకేదైనా ఉన్నదా? పృథ్వికి ఇంద్రులెవరో వారి ఐరావతం లోభం, అయితే, ఈ వస్తువులన్నీ నావే?"

ఆ మాట అంటూ వస్తువులపెట్టె తీసి శాలువులో పెట్టాడు, అమూల్య గదిలో ప్రవేశించాడు. అతని కళ్లదిగువను నల్లని రేఖలు ఏర్పడ్డవి, ముఖం వాడిపోయింది, జుట్టు

చింపిరిచింపిరిగా ఉన్నది. అతని ముఖాన్ని ఉండే కోమలమూ, లావణ్యమూ, ఒక్కరోజులో మాయం అయిపోయినాయి. అతను నా కంటపడేసరికి నాలోపున వేదనపుట్టింది.

నావైపు చూడకుండానే సందీప్‌దగ్గిరికి తిన్నగా వెళ్ళి అన్నాడు, "నా ట్రంకులోనుంచి నగలపెట్టె తీసుకొని వచ్చేశాను!"

"నగలు నీవి కాబోలు ?

"కావు, గాని ట్రంకు నాది."

పెద్దకేకలు వేసుకుంటూ హా-హా-హా అని నవ్వుతూ సందీప్ అన్నాడు—"నీదీ-నాదీ అనే భేదంసంబంధమై, అమూల్యా, నీకు చాలా సూక్ష్మజ్ఞానం ఉన్నదే! ఎప్పుడో ఒకనాడు మతప్రచారకుడవు అయి మరీ చస్తావు నాకు తెలుసును."

అమూల్య కుర్చీమీద కూర్చోబడిపోయి రెండు-చేతులతో ముఖం మూసుకొని టేబిలుమీద వాలాడు. దగ్గిరికి వెళ్ళి అతనితలమీద చెయ్యివేసి, "ఏమయిందమ్మా అమూల్యా?" అన్నాను.

లేచి నిలుచొని అమూల్య అన్నాడు—"ఈ నగలపెట్టె నేను స్వయంగా తీసుకువచ్చి నా చేతులతో నేనే నీకు ఇవ్వాలని నా కోరిక, అక్కా. అది సందీప్‌బాబుకు తెలుసును—అందు-చేతనే అతను తొందరతొందరగా—"

"ఏమి చేసుకుంటావు నగలు—పోనీ కాదా! దానివల్ల-వచ్చిన నష్టం ఏమిటి?"

ఆశ్చర్యపడుతూ అమూల్య అన్నాడు—"పోనివ్వడం ఎక్కడికి?"

"ఈ వస్తువులు నావి. రాణి నాకిచ్చిన అర్ఘ్యం ఇది!" అని సందీప్ అన్నాడు.

అమూల్య పిచ్చివానిలాగు అనడం ప్రారంభించాడు—కాదు, కాదు, కాదు, కాదు, ఎంతమాత్రం కాదు. అక్కా, ఇది నేను నీకు తీసుకువచ్చి ఇచ్చాను. నీవు మరి ఎవరికీ ఇవ్వడానికి వీలులేదు."

"నీ దానం నా హృదయంలో శాశ్వతంగా ఉంటుంది తమ్ముడూ, గాని వస్తువులుమాత్రం ఎవరికి అంత కక్కుర్తిగా ఉంటే వాళ్లే తీసుకోనీ."

అమూల్య ఒక క్రూరజంతువులాగు సందీప్‌వైపు చూస్తూ మాటమాటకూ ఆగి గుర్రుమంటూ అన్నాడు—"ఇదుగో సందీప్‌బాబూ, నేను ఉరికైనా జడవను, ఆ సంగతి మీకు తెలుసును. ఆ వస్తువులపెట్టెగాని మీరు తీసుకున్నట్టైనా—

సందీప్ వెక్కిరింతగా నవ్వినట్టు నవ్వబోతూ అన్నాడు—"నేను నీ ఆజ్ఞకు లోబడి నీకు జడిసిఉండేవాడను కాను అని ఈ పాటికి నీకు తెలిసిఉండవలసింది అమూల్యా!...రాణీ, ఈ వస్తువులు నేను తీసుకుందామని ఈవాళ రాలేదు, నీకు ఇచ్చేదామనే వచ్చాను. కాని అవి నావస్తువులు న్యాయంగా. అమూల్య నీకు తెచ్చిఇస్తే నీవు అవి పుచ్చుకోవడం చాలా

అన్యాయం, గనుక ఆ అన్యాయం నివారణచేదామని నీచేత అవి నావి అని స్పష్టంగా చెప్పించాను. నా ఈ వస్తువులు ఇప్పుడు నీకు దానం చేస్తున్నాను, ఇవిగో తీసుకో. ఇక నీవూ అమూల్యా మీరిద్దరూ మీ ఇష్టంవచ్చినట్టు చేసుకొండి, నేను వెళి-పోతున్నాను. కొన్నాళ్ళబట్టి మీ ఇద్దరికీ ప్రత్యేకించినమాటలు జరుగుతున్నవి, ఆ ప్రత్యేకాలలో నేను లేను. ఇప్పుడు ఒకవేళ ప్రత్యేకించిన దేదైనా సంభవిస్తే నన్ను దూషించకండి. అమూల్యా, నీ ట్రంకూ, పుస్తకాలూ, మిగిలిన ఏవేవస్తువులు నా గదిలో ఉన్నవో, అన్నీ మార్కెట్టులో నీ బసకు పంపేశాను. నీ సామానువేదీ నా గదిలో మరి ఉంచడానికి వల్లపడదు."

ఈలాగు అంటూ అతివేగంతో గదిలోనుంచి వెళి-పోయినాడు.

అప్పుడు నేను అన్నాను—"అమూల్యా, నగలు అమ్మమని నీచేతికి ఇచ్చినదగ్గిరనుంచీ నాకు ఒక్క పిసరైనా శాంతి లేదు."

"ఏమి అక్కా?"

"ఆ వస్తువులమూలాన నువ్వు చిక్కులో పడ్డావేమో అని చాలా భయపడ్డాను; దొంగ అని అనుమానించి నిన్నెవ-రైనా పట్టుకుంటారేమో అని జడిశాను. నాకు ఆ ఆరువేల-రూపాయిలు మరి అవసరం లేదు. ఇప్పుడు నేను ఒకమాట చెపుతాను అది నువ్వు వినాలి—నువ్వు మీ ఇంటికి వెళ్ళు, వెళిపో మీ అమ్మదగ్గిరికి!"

ఖండువాలోనుంచి అమూల్యా ఒక కాగితంపొట్లం పైకి తీస్తూ అన్నాడు—"ఇవిగోటి అక్కా, తీసుకువచ్చాను ఆరువేల రూపాయిలు!"

"ఎక్కడనుంచి తెచ్చావు?"

దానికి జవాబుఇవ్వకుండా అన్నాడు—"కాసులకోసం చాలా ప్రయత్నంచేశాను, గాని కార్యంలేకపోయింది. అందుచేత నోట్లు తీసుకువచ్చాను."

"నీ పుణ్యం ఉంటుంది తండ్రీ, ఎక్కడనుంచి తీసుకు-వచ్చావు ఈ రూపాయిలు, చెప్పు అమూల్యా!"

"అది నీతో చెప్పను."

నాకళ్లు చీకట్లు కమ్మేశాయి. అన్నాను—"ఎంతపని చేశావు అమూల్యా! కొంపతీసి ఈరూపాయలు—"

"నాకు తెలుసును, నేను అన్యాయంగా ఈరూపాయిలు తీసుకువచ్చానని నువ్వు అంటావు—సరే అది ఒప్పుకున్నాను. కాని అపరాధం ఎంతగొప్పదో తీసుకువచ్చినవాటి వెలకూడా అంత అధికం ఆవెల నేను ఇచ్చాను అందుచేత ఈ రూపాయిలు నావే ఇప్పుడు."

అవి ఏలాగు తీసుకువచ్చాడో దానివివరం మరి నాకు వినబుద్ధిపుట్టలేదు. ఒంట్లోఉండే శిరాలన్నీ బిగించుకుపోయి మొత్తదేహాన్ని ముద్దచేసేస్తూ ఉన్నవి అనిపించింది. తీసుకువెళిపో అమూల్యా, ఈ రూపాయిలు. ఎక్కడనుండి తీసుకువచ్చావో అక్కడ్డ ఉంచేసి రా," అని అన్నాను.

"అది చాలా కష్టమైన పని."

"కాదు తమ్ముడూ, కష్టమైనపని కాదు. ఏపాడు ముహూర్తాన నాదగ్గిరికి వచ్చావమ్మా నువ్వు! నేను చేసిన అపకారం నీకు సందీప్ అయినా చేయలేదు."

సందీప్ పేరు చెవినిపడేసరికి అతి బాధ అనిపించి అన్నాడు—"సందీప్! నీదగ్గిరికి రాబట్టే అతని సంగతి బోధపడ్డది. తెలుసునా అక్కా, నీదగ్గిరనుంచి ఆవాళ ఆరువేలు తీసుకు వెళ్లాడే, అందులో ఒకదమ్మిడీఅయినా ఇంకా ఖర్చుపెట్టలేదు. ఇక్కడనుంచి వెళుతూనే గదిలో దూరి తలుపు గడియవేసుకున్నాడు; రుమాలు విప్పి కాసులు టేబిలుమీద వంపి ఇవన్నీ కుప్ప చేసి మతిపోయినట్టు అతి ఆశ్చర్యంతో ఆ కుప్పవైపు చూస్తూ కూర్చున్నాడు. అన్నాడు— "ఇవి కాసులు కావు, ఐశ్వర్యమనే పారిజాతంయొక్క మొగ్గలు, స్వర్గంలో వేణువులోనుంచి బయటికి వస్తూఉన్నప్పుడు గట్టిపడి భూలోకంలో పడ్డ గానము ముక్కలు. వీటిని కరెన్సీ నోట్లకింద మార్చకూడదు. వాటిలో ఉండే కోరిక నీకు తెలియడం లేదూ?—అవి స్త్రీకంఠంలో హారంలాయి ఉందామని కోరుతున్నవి. దీనిని మీరు స్థూల దృష్టితో చూడకూడదు అమూల్యా; ఇది లక్ష్మీదేవి నవ్విన నవ్వు; ఇంద్రాణి లావణ్యం. లేదు, లేదు, ఇవి ఆ దున్నపోతు సంత సూపరెంటు చేతిలో పట్టడానికి పుట్టలేదు. ఆ సూపరెంటువచ్చి అబద్ధం చెప్పాడు సుమా అమూల్యా! పోలీసువాళ్లకు అసలు ముడివేయడం సంగతి వనీ తెలియనే లేదు. ఇద్దే సందీప్‌గారి-

కిందిఅని కొంత, లాగుదామని చూస్తున్నాడు. చూడు అమూల్యా, వాడిదగ్గిరనుంచి మెల్లిగా ఏలాగైనా ఆమూడు ఉత్తరాలూ తీసుకు వచ్చేయాలిరా అబ్బాయి." "ఏలాగు?" అని నేను అడిగాను. "జడిపించి, బలం ఉపయోగించి," అన్నాడు. దానికి నేను ఒప్పుకుంటాను అన్నాను, "గాని ఆ కాసులు మాత్రం అక్కకు ఇచ్చేయాలి," అన్నాను. "సరే ఇచ్చేదాము," అన్నాడు. సూపరెంటుని ఏలాగు భయపెట్టి ఆ ఉత్తరాలు తీసుకొని తగలబెట్టేశానో అదంతా చాలా పెద్దకథ. ఆరాత్రే సందీప్ దగ్గిరికి వెళ్లి "మరేమీ భయపడక్కరలేదు, కాసులు ఇక ఇవ్వండి రేపు ఉదయమే వెళ్లి అక్కకు ఇచ్చేస్తాను," అన్నాను. సందీప్ జబాబు చెప్పాడు— "ఇదిఎక్కడనుంచి వచ్చి నిన్ను పట్టుకుకూర్చున్నది, ఈ మోహం! అక్కపైటకొంగు వచ్చి దేశాన్ని కప్పేసింది కాబోలు! 'వందేమాతరం' అను!— నీ నిషాపోనుగాక!

"సందీప్ ఎటువంటి ఎటువంటి మంత్రాలు ఎరుగునో నీకు తెలుసును కదా, అక్కా! కాసులు మాత్రం మరి అతని దగ్గిరనుంచి రాలేదు. ఆ అర్ధరాత్రి వేళ అంధకారంలో 'వందేమాతరం'మంత్రం పఠిస్తూ ఆ చెరువుగట్టున మండడంమీద కూర్చున్నాను. అమ్మవని వస్తువులు నువ్వు నాకు ఇచ్చిన తరవాత మళ్లీ వెళ్లాను సందీప్ దగ్గిరికి. నా మీద మండిపోతున్నాడు, స్పష్టంగా తెలుస్తుండెను. కాని ఆ కోపం పైకి వెళ్లపుచ్చకుండా అన్నాడు— "చూచుకో ఆ కాసులు నా పెట్టెల-

లో ఎందులో నైనా ఉంటే తీసుకో” అంటూ తాళంచెవుల గుత్తి నామీద విసిరేశాడు. కాసులు ఎక్కడా కనబడలేదు. ఎక్కడుంచావు చెప్పమన్నాను. “మొదట నీమోహం పోనీ, తరవాత చెవుతాను, ఇప్పుడు కాదు,” అన్నాడు. చూచాను, మరి ఇతనిని మెత్తపరచడం సున్న అని ఎప్పుడు తెలిసిపోయిందో వేరే ఉపాయం చేయవలసి వచ్చింది. తరవాత ఈ నోట్లు చూపించి వాటికి బదులుగా ఆ కాసులు ఇవ్వమని అనేకవిధాల ప్రార్థించాను. తీసుకువస్తానని నన్ను భ్రమలో పెట్టాడు. నన్ను అవతల కూర్చోపెట్టాడు, తన పడకగదిలోకి వెళ్ళి నా ట్రంకు తాళం విరగకొట్టి వస్తువులపెట్టె పట్టుకొని నాకు తెలియకుండా ఇక్కడికి వచ్చేశాడు. నన్ను తీసుకు రానిచ్చాడు కాదు ఆ వస్తువులు; పైగా, నీకు దానంచేయడానికి తెచ్చాను అంటాడు. నాకు ఇతను చేసిన మోసంఇంతా అంతానా! నేను ఎవరితో చెప్పగలను? అది నేను ఎన్నటికీ క్షమించను. అతని మంత్రం నామీద మరి పారదు అక్కా—అది నీ మహిమే!

నేను అన్నాను—“తమ్ముడూ, నాజీవనం సార్థకం అయింది. కాని ఇంకొక్కటి తరవాయి ఉంది అమూల్యా. కేవలం భ్రమపోతే చాలదు. బంటిని పులుముకున్న మసి కూడాపూర్తిగాకడిగేసుకోవాలి, ఆలస్యం చేయకు అమూల్యా; ఎక్కడనుంచి ఆ రూపాయిలు తెచ్చావో అక్కడ ఇచ్చేసిరా. ఇచ్చేసిరాలేవూ తమ్ముడూ, బంగారు తండ్రివి!”

“నీ ఆశీర్వాదముంటే ఏదైనాచేసుకురాగలను అక్కా!”

"చేసుకురావడంవల్ల సాధించేది నీ ఒక్కడి మోక్షమే కాదు, నా మోక్షానికీ అదే మార్గం. నేను ఆడదానను, బయటనుండే దారులు నాకు అందనివి; లేకపోతే నిన్ను ఈ పని మీద వెళ్ళనివ్వను, నేనే వెళ్ళేదాన్ను. నా పాపం నువ్వు మోయవలసి ఉండడమే నేను భరించవలసిన శిక్షలన్నిటిలోకీ కఠిన-మైనది.'

"అలాగు అనకు అక్కా. నేను వెళుతూఉండే మార్గం నీమార్గం కాదు. అది కష్టమైన దారి గనుక నన్ను ఆకర్షించింది. ఇప్పుడు నీ దారి నన్ను పిలుస్తున్నది అక్కా, ఇది దానికి వేయిం-తలు కఠినమైనది అయినా, నీ పాదధూళితీసుకొని జయించుకు వస్తాను, ఏమీ భయంలేదు. అయితే ఈ రూపాయిలు ఎక్కడ నుంచి తీసుకువచ్చానో అక్కడ తిరిగి ఇచ్చేయాలనా నీ ఆజ్ఞ?"

"నాఆజ్ఞ కాదు తమ్ముడూ, మీదినుంచి వచ్చిన ఆజ్ఞ."

"అది నాకు తెలియదు. ఏమీదినుంచి వచ్చిన ఆజ్ఞఅ-యినా నీనోటివెంట వచ్చింది, నాకు కావలసినదంతా అదే! కాని, అక్కా, నువ్వు నాకు ఇవ్వవలసిన విందు ఒకటిఉన్నది. అదికానిదే వెళ్లను. నీ ప్రసాదం ముందు ఇయ్యి; తరవాత, పిలుంటే, సాయంకాలమే వెళ్లి ఆపని చేసుకొని మరీ వస్తాను.

నవ్వాలోయినాను, కళ్లు నీళ్లతో నిండిపోయినాయి— "సరే లే!" అన్నాను.

అమూల్య నన్నువిడిచిపెట్టి వెళ్లాడు, నా గుండె జారి పోయింది. తల్లికి ఒక్కడే కొడుకు—ఆహా, ఎటువంటి ఆపదలో దించేశాను అతనిని! నా పాపానికనిచేసే ప్రాయశ్చిత్తం ఇంత ప్రమాదమైన దెందుకు తండ్రీ, దానికి ఇంతఆడంబరం ఎందుకు భగవంతుడా? నేను ఒక్కర్తెనే చాలనూ, ఇంతమందికి ఆహ్వానం ఎందుకు తండ్రీ? వీళ్లందరిచేతా నా బరువు మోయి స్తావూ? ఈ పసిబిడ్డణ్ణి రక్షించు తండ్రీ, చంపేయకు!

'అమూల్యా' అని పిలిచాను తిరిగి వెళిపోరావాలని. నా కంఠం అతి క్షీణంగా ఉండడంవల్ల అతనికి వినబడి ఉండదు. తలుపుదగ్గిరికి వెళ్లి తిరిగి పిల్చాను, "అమూల్యా!" అప్పటికి వెళిపోయినాడు.!

"ఎవరురా బంట్రోతు!".

"ఏమి ఆజ్ఞ మహారాణీ?"

"అమూల్యబాబును పిలిచేయి!"

అమూల్య పేరు తెలియదో ఏమిటో బంట్రోతుకు— కొంచెంసేపు అయినతరవాత సందీప్‌ను తీసుకువచ్చాడు. గదిలో ప్రవేశిస్తూనే సందీప్ అన్నాడు—"నన్ను పంపేస్తున్నప్పుడే అనుకున్నాను మళ్లా పిలిపిస్తావని. ఏచంద్రునివల్ల సముద్రం-

లో పాటు కలుగుతుందో ఆచంద్రునివల్లనే పోటుకూడా కలుగుతుంది. నేను తలుపుదగ్గరనే కనిపెట్టుకొని కూర్చున్నాను, నాకు అంతనిశ్చయంగా తెలుసును నీవు కబురు పంపుతావుఅని. మీనౌకరు కనబడ్డాడో లేదో, ఇంకా వాడినోటివెంట మాటైనా లేదు, తొందరతొందరగా లేచి అన్నాను—"సరే, సరే, వస్తున్నాను, ఇదుగో ఇప్పుడే వస్తున్నాను!" నౌకరు కంగారుపడి చూస్తున్నాడు నేను వచ్చేస్తుంటే. మనిషికి మంత్రశక్తి ఉన్నట్టుంది అనుకున్నాడు. భూమిమీదజరిగే యుద్ధాలన్నిటిలోకీ గొప్పయుద్ధాలు మంత్రబలంతో జరిగేవి, రాణీ. ఇవతలనుంచి సమ్మోహనం అయితే అవతలనుంచి సమ్మోహనం. బాణాలు శబ్దభేదులు, కొన్ని నిశ్శబ్దభేదులుకూడాను. ఇన్నాళ్లకు సందీప్‌కి సరియైనఉర్జీ దొరికావు. నీ అమ్ములపొదిలో అనేకంగా అస్త్రాలు ఉన్నవి రణరంగిణీ! ఈ పృథ్విలో తనఇష్టప్రకారం సందీప్‌ను తోలేయ గలిగినది నువ్వుఒక్కర్తెవు కనబడ్డావు నాకు. తిరిగీ నీఇష్టం వచ్చినప్పుడు తెప్పించగలిగావు. నువ్వు కొట్టదలచిన జంతువు నీ పాదాలదగ్గిర వచ్చిపడిఉన్నది. ఇక ఏమిచేయాలని నీ ఉద్దేశం చెప్పు, రాణీ? ఒక్కదెబ్బతో ఆఖరు చేసేస్తావా, లేక నీబోనులో పెట్టేసిఉంచుతావా? రాణీ, మొట్టమొదటే చెపుతున్నాను, ఈ జీవాన్ని వధించడం ఏలాగైతే కష్టమైన పనో బంధించి ఉంచడం కూడా అలాగునే కష్టమైన పని. అందుచేత నీ చేతిలోఉన్న దివ్యాస్త్రాలు ప్రయోగించడం మరి జాలం చేయకు, ఇదే నా సలహా."

తనకు పరాభవం జరగబోతుంది అని సందీప్‌మనస్సున అనుమానం చేరింది. అందు చేతనే ఈలాగుఒక్కవరసను వేలడం ప్రారంభించాడు. నేను అమూల్యకోసమే కబురుపంపాను అని అతనికి తెలుసును, అదే నా నమ్మకం. నౌకరు అమూల్యపేరే చెప్పిఉండవచ్చు; వాణ్ణి టోపీవేసి వచ్చేసి ఉంటాడు. తనను పిలవలేదు, అమూల్యను పిలిచాను, అని చెప్పేటంతవ్యవధైనా లేకుండా మాటలాడు తున్నాడు. కాని అతని సందడి నన్ను మోసపుచ్చలేదు. అతని ఎత్తులు కేవలం నిష్ప్రయోజనం. అతని చేతకానితనమూ, అతని బలహీనతా, నాకు స్పష్టంగా తెలిసిపోతూఉన్నవి. యుద్ధంచేసి జయంపొంది సంపాదించినది నాపదవి, ఒక సూదికొన పాటి స్థలమైనా తిరిగీ వదులుకోను.

ఆఖరికి నేను అన్నాను—"సందీప్‌బాబూ, అనంతంగా ఆలాగు గలగలమంటూ ఏలాగు మాట్లాడగలరు? వచ్చేటప్పుడే పాఠమంతా కంఠతాపెట్టుకువస్తారు కాబోలు!"

ఒక్కక్షణంలో సందీప్‌ముఖం కోపంతో ఎర్రగా అయిపోయింది. నేను అన్నాను—"ప్రచారకులు నానారకాల లెక్చర్లూ, వర్ణనలూ పుస్తకాలలో వ్రాసి దగ్గిర ఉంచుకుంటారని నేను విన్నాను. ఎక్కడ ఏది సందర్భంగాఉంటే అది నిలబడ్డ పాటున వర్ణించేస్తారట. అటువంటి పుస్తకం మీదగ్గిరకూడా ఉన్నదా ఏమిటి, సందీప్‌బాబూ?"

పళ్లు కొరుక్కుంటూ పళ్లమధ్యనుంచి అన్నాడు సందీప్, "దేవుని ధర్మాన మీ ఆడవాళ్లకు చిన్నెలూ వన్నెలూ, లెక్క-

లేనన్ని ఉన్నవి.' మీ మాటకున్న అంతం లేదు. పైగా దర్జీదు కాణమూ, కంసాలిదు కాణమూ, మీ సహాయానికి ఉండనేఉన్నవి! కాని భగవంతుడు మమ్మల్ని అంత నిరాయుధులుగా చేయ లేదు. మేము అటువంటి—"

మీ నోటుబుక్కు చూచుకురండి సందీప్ బాబూ, మీ గ్రంథ నేమాటలు అత్తుకుండా ఉన్నవి. చూస్తున్నాను కదూ, మాటలు ఇక్కడివిఅక్కడా అక్కడివిఇక్కడా వచ్చేస్తున్నవి. కంఠతా పెట్టుకు రావడంవల్ల వచ్చే గొప్పచిక్కు ఇదే!"

సందీప్ మరి పట్ట లేక పోయినాడు. పెద్ద గర్జన చేస్తూ అన్నాడు—"నువ్వా—నువ్వ నన్ను అవమాన పరుస్తావూ! నీలో ఏముంది చెప్పు, అట్టడుగువరకూ నేను చూడనిది? నువ్వు—"

అతనినోటను మరి మాట వచ్చిందికాదు. మంత్ర సాధకుడు అతను, మంత్రం పారదని తెలియగానే శక్తి, జోరూ అన్నీ ఎగిరి పోతాయి—రాజుగారల్లా ముష్టివాడు అయిపోతాడు. ఏమి బలహీనత! ఏమి చేతకానితనము! అతను మాటా మాటలు ఎంత మాట్లాడుతుంటే, అంత ఆనందంతో నా మనస్సు నిండిపోతూ ఉంది, అతని చేతకానితనం చూచి. నన్ను కట్టే నాగపాశం అతనివద్ద మరి లేదు. నాకు ముక్తి దొరికింది, బ్రతికి పోయినాను, నేను బ్రతికి పోయినాను. అవమానం చేయి, నన్ను అగౌరవపరుచు! నిజమైన 'నీవు' అందులోనే వెల్లడి అవుతావు, స్తుతి చేయకు, అది అబద్ధం.

ఆ సమయంలో నా భర్త గదిలోకి వచ్చారు. మామూ-లుగా సందీప్ అలాంటప్పుడు ఒక్క నిమిషంలో సరుదుకుండే వాడు. ఈవ్వాళ ఆ శక్తి మరి అతనిలో లేదు. నా భర్త అతని ముఖంవైపు చూచి ఆశ్చర్య పోయినారు. ఇంతకుముందు అయితే అది చూచి నేను సిగ్గుపడిఉందును. కాని ఈవాళ నా భర్త ఏమనుకున్నప్పటికీ, నేను మాత్రం చాలా సంతోషించాను; తుదముట్టా చూచేదాము వీణ్ణి అనుకున్నాను.

మేము ఇద్దరమూ ఊరుకున్నాము, ఏమీ మాట్లాడ లేదు. అది చూచి నాభర్త కొంచెం గజిబిజిపడ్డారు ; తరవాత కుర్చీమీద కూర్చున్నారు— "సందీప్, నీకోసం వెతుకు-తున్నాను, ఇక్కడ ఉన్నావు అని తెలిసి వచ్చాను."

"అవా ఉన్నాను." అని అన్నాడు మాట నొక్కుతూ ధాటీగా "రాణి కబురుపంపింది ప్రొద్దున్నే, మా తేనెపట్టుకి నేను దాసుణ్ణి గనుక ఆజ్ఞఅయిందని వినగానే అన్నిపనులూ వెనకకు పెట్టి ఇక్కడికి వచ్చాను."

"నేను రేపు కలకత్తా వెళుతున్నాను, నువ్వుకూడా రావాలి," అని అన్నారు నా భర్త.

"ఎందుకో కొంచెం చెప్పూ—నేను నీ అనుచరుణ్ణి అని అనుకోలేదు కాదా!"

"నువ్వే కలకత్తా వెళ్లు, నేను నీ అనుచరుణ్ణి అవుతాను."

"కలకత్తాలో నాకేమీ పని లేదు."

"అందుచేతనే నువ్వు వెళ్లాలి కలకత్తా. ఇక్కడ నీకు పని అతి విస్తారం అయిపోయింది."

"నేను ఇక్కడనుంచి కదలనే కదలను."

"అయితే నేను కదిలిస్తాను."

"బలవంతానా ?"

"ఆహా, బలవంతాన్నే !"

"సరే అయితే లేస్తాను. కాని ప్రపంచంలో ఉన్నవి కలకత్తా, నీ తాలూకా, ఈ రెండు స్థలాలే కావు. మ్యాపులో ఇంకా అనేక స్థలాలు ఉన్నవి."

"నీ వ్యవహారం చూస్తూఉంటేమాత్రం ఆలా అనిపించ లేదు— నా తాలూకాతప్ప వేరే జాగా లేదేమో అని పించింది."

సందీప్ లేచి నిలబడిపోయి అన్నాడు—"ప్రపంచం యావత్తూ ఇంత పిసరుజాగాలోకి వచ్చి దూరే అవస్థ మనుష్యు-లకు అప్పుడప్పుడు సంభవిస్తుంటుంది. ఆవిధంగా మీ ముందు గదిలో నా విశ్వం నాకు ప్రత్యక్షంగా కనబడ్డది. అందుచేత నేను ఇక్కడనుంచి కదలలేదు. రాణీ, నా సంగతి వీళ్లెవరికీ బోధపడదు, బహుశా నీకూ బోధపడదేమో. ఇదుగో నా వందనం. నీపూజ చేయడానికే వెళిపోతున్నాను. నిన్ను చూచి-నప్పటినుండీ నా మంత్రం మారిపోయింది—ఇప్పుడు నా మంత్రం 'వందేమాతరం' కాదు, 'వందే ప్రియం' 'వందే మోహినీం.' తల్లి మనను రక్షిస్తుంది, ప్రేయసి మనను నాశనం చేస్తుంది—

ఆ నాశనం అతి మనోహరమైనది. నా హృదయంలో నూపుర-ఘూంకారం వినబడుతున్నది, అక్కడ మరణ-నృత్యం జరుగుతున్నది. నీ భక్తుని హృదయంలో ఉండే దేశాన్ని, ఆ 'సుజలాం సుఫలాం మలయజ సీతలాం'ని, ఒక్క నిమిషంలో మార్చేశావు. దయాదాక్షిణ్యం లేవు నీకు—మోహినివి నీవు, నీ విష-పాత్ర తీసుకొని వచ్చావు, ఆ విషం తాగుతాను, తరవాత ఉక్కిరిబిక్కిరి అయి చావనైనా చస్తాను లేదా మృత్యుంజయుణ్ణి అయిపోతాను.

వందేమాతరమా!—'మాత' రోజు కాదు ఇది. ప్రియే, ప్రియే, ప్రియే, నీవు వచ్చాక స్వర్గమూ, ధర్మమూ, సత్యమూ, అన్నీ కొట్టుకుపోయినాయి. పృథ్విలో ఉండే సంబంధాలన్నీ తుచ్ఛమైనవి అయిపోయినాయి; అన్నీ నీడలు, ఉత్త నీడలు. ఏనియమమూ ఏనిబంధనా నన్ను కట్టిఉంచలేదు. కట్లుఅన్నీ ముక్కముక్కలు అయిపోయినాయి. ప్రేయసీ, నీ రెండు పాదాలు ఉన్నంతమేరా విడిచిపెట్టి తక్కిన యావత్తు పృథ్వికి నిప్పు అంటించి తగలబెట్టి, ఆ బూడిదలో ఈవాళ తాండవ మాడగలను...వీళ్లంతా మంచి మనుష్యులు, అతి మంచివాళ్లు, వీళ్లుపృథ్వికి మేలుచేయ దలచుకున్నారు—పృథ్వి మహా నిజమైనట్టు! ఎంతమాత్రం కాదు, నాలో ఉండే ప్రేమతప్ప ప్రపంచంలో మరిఏదీ నిజంకాదు, అంతా మిథ్య! నీకు ఒక నమస్కారం, నీయందు నాకుగల నిష్ఠ నన్ను క్రూరుణ్ణి చేసింది; నీయందు నాకుగల భక్తి నాలో ప్రళయాగ్ని పుట్టించింది. నేను

మంచివాడను కాను, నేను ధార్మికుడను కాను. నేను భూమి మీదఉండే దేనినీ మన్నించను, అన్నిటికంటే నాకు స్పష్టంగా కనబడ్డదాని నొక్కదానినే నేను మన్నిస్తాను.

ఏమి ఆశ్చర్యం! ఏమి ఆశ్చర్యం! ఒక్క నిమిషంకిందనే ఇతనంటే పరమఅసహ్యంతో చూచాను. ఉత్త బూడిద అనుకొన్నదానిలోనుంచి నిప్పు పుట్టి మంట లేచింది. ఇది నిజమైన అగ్ని, అందుకు సందేహమేమీ లేదు. ఈ విధంగా మిశ్రమంచేసి విధాత మనుష్యుణ్ణి తయారుచేస్తాడెందుచేతనో? తన దివ్యశక్తి, తన ఇంద్రజాలం, మనకు కనపరచడానికా? 'రాజు అని భ్రమపడ్డాను గాని, ఇతను నిజంగా యాత్రలో వేషం వేసుకువచ్చిన రాజు' అని ఒక్క అరఘుంటకుముందు అనుకున్నాను. కాని అది కాదు, అది కాదు—యాత్రలో వచ్చేరాజులలో కూడా ఆ గిల్టుబట్టలలోపున దాగొని ఒకొక్కప్పుడు నిజమైనరాజే ఉండవచ్చును. సందీప్‌లో వాంఛ ప్రబలము, అతని స్వభావంలో కావలసినంత మోటుతనం ఉన్నది. పొరలు పొరలుగా మాంసంలో దాగొని మోసం చాలా ఉన్నది అతనిలో. కాని అయినప్పటికీ మనకు ఏమి తెలుసును, ఆఖరుమాట ఎవరు చెప్పగలరు? మనలోఉన్నదానినే మనము పోల్చుకోలేము అని ఒప్పుకోవాలి, జ్ఞానవంతులమైతే. అతిఅద్భుతమైన పదార్థము మనుష్యుడు. మనుష్యులద్వారా ఎంతగొప్పరహస్యం తయారవుతున్నదో ఆ రుద్రునికే తెలియాలి—మధ్య ఘుంటలోపడి కాలడం మాత్రం మనవంతు.

మహాప్రళయం! ఆ ప్రళాయానికి అధిపతి శివుడు, అతను ఆనందమయుడు, అతనే మనకు బంధవిమోచనం చేస్తాడు.

నాలో రెండు వేరువేరుబుద్ధులు ఉన్నవని మాటిమాటికీ నా మనస్సుకు తడుతున్నది. సందీప్‌కు ఉండే ప్రళయరూపం అతిభయంకరమైనది అని ఒక బుద్ధి తెలుసుకొంటున్నది; రెండో బుద్ధికి అదే అతిమధురంగా కనబడుతున్నది. పెద్ద ఓడ మునిగి-పోయేటప్పుడు చుట్టుపక్కల ఈదుకుంటూ ఉన్నవాళ్లనందరినీ తనతో ఈడ్చుకుపోతుంది. సందీప్ అటువంటి మరణమూర్తి. మనలో ఇంకా భయం పుట్టకముందే అతని ప్రచండశక్తి వచ్చి మనను పట్టుకుంటుంది; చిన్నప్పటినుండీ మనము కూడబెట్టుకుం-టున్న వెలుతురు, స్వేచ్ఛ, శుభం, మొదలైనవాటి సంచయం-నుండి మనను ఈడ్చుకుపోతుంది. మన పనులు, మన తాపత్ర-యాలు, మన భావనాలు, మన ప్రాణాలు—అన్నిటినీ విడిచి-పెట్టించేస్తుంది. రెప్పపాటులో వీటిఅన్నిటినుండీ తీసుకుపోయి వినాశసముద్రంలో అట్టడుగున పెట్టి మట్టేస్తుంది. ఏ మహామారి దూతగావచ్చాడో గాని, అశివమంత్రం ఉచ్చారణచేస్తూ రోడ్డు వెంబడి సందీప్ వెళుతూఉంటే దేశంలో ఉండే యావన్మంది బాలకులూ, దేశంలో ఉండే యావన్మంది యువకులూ, పరు-గెత్తి వస్తారు, అతనివద్దకు. దేశంయొక్క హృదయపద్మంలో కూర్చున్న మన తల్లి ఏడుస్తున్నది—తలుపు పగలగొట్టి, ఆమె అమృతభాండారంలో ప్రవేశించి. కల్లుజాడీలు పెట్టుకొని అక్కడ సభచేస్తున్నారు వీళ్లు—అమృతమంతా బుగ్గిలో

పోసేదామని హళ్లుచేసే ప్రయత్నం; సుధాపాత్ర ముక్కలు ముక్కలు చేసేదామని వాళ్లకోరిక; అంతా బోధపడుతున్నది గాని వ్యామోహంమాత్రం వదలకుండా ఉన్నది.

మన దీక్షా, మన బలమూ, పరీక్ష చేదామని సత్యదేవత చేస్తూఉన్న పని ఇదంతా. మత్తత దేవీవేషం వేసుకొని తపస్సు-చేస్తూఉన్నవాని ఎదుట నృత్యం చేస్తూ అంటుంది—"నువ్వు మూఢుడవు, తపస్సువల్ల సిద్ధి దొరకదు, అది చాలా చుట్టుదారి, ఆదారి పట్టుకుకూర్చుండేవాళ్లకు వేళకూడా అతిమందంగా అతికష్టంగా జరుగుతుంటుంది, అందుచేతనే వజ్రధారి, ఆ దేవేంద్రుడు, నన్ను పంపించాడు—నేను మత్తతను, నా పేరు సుందరి, నా ఆలింగనంవల్ల ఒక్కనిమిషంలో సిద్ధి పొందగలవు."

కొంచెం సేపు ఊరుకొని తిరిగి ప్రారంభించాడు, సందీప్—"ఇప్పుడు దూరంగా వెళిపోయేవేళ వచ్చింది, దేవీ! అది మంచిదే అంటాను. నీదగ్గిరికి వచ్చిన పని అయిపోయింది. ఇటు తరువాత మరి ఉన్నట్టయితే దొరికినదంతా ఒకొక్కటి తిరిగి పోగొట్టుకోవడమే అవుతుంది. అన్నిటికంటే విలువైన దానిని అతివాంఛవల్ల చవక చేసేశామంటే పూర్తిగా నాశనం అయిపోతుంది—ఒకక్షణంలో ఇమిడిఉన్న అనంతాన్ని రోజుల-లోకీ, సంవత్సరాలలోకి సర్దిపెట్టబోతే సహజంగా దానికి లేని హద్దులు తెచ్చిపెట్టడం అవుతుంది. అటువంటి అనంతాన్ని మేము పాడుచేయ సిద్ధపడ్డాము, సరిగా ఆ సమయంలో వజ్రాయుధం ఎత్తుకుంటూ వచ్చావు నీవు. నీ పూజ

పాడుకాకుండా కాపాడినది నీవే, నీ పూజారిని కాపాడినదీ నీవే! నేను సెలవుతీసుకుంటున్నాను, ఇప్పుడు అన్నిటిలోకీ గొప్పదిగా నాకు కనబడేది నీపూజ. దేవీ, నేనుకూడా నిన్ను విడుదల చేసేశాను ఈవాళ. నామట్టి మందిరంలో నీవు పట్టవు, ఏపక్కకుఆపక్క ముక్కముక్కలయి పడిపోతానని జడిపిస్తూ ఉన్నది. నీ పెద్దమూర్తిని విశాలమైన మందిరంలో పూజచేయ్యడానికి వెళుతున్నాను. దూరంగా ఉన్నప్పుడే నిన్ను నిజంగా పొందగలను. ఇక్కడ నీవల్ల నాకు ఆశ్రయం దొరికింది, అక్కడికి వెళ్లి వరం పొందుతాను.''

టేబిలుమీద నానగలపెట్టె ఉన్నది, అది తీసి పట్టుకొని అన్నాను—“ఈ ఆభరణాలు మీద్వారా ఎవరికి అర్పించానో వారి పాదాలదగ్గిరికి అందజేయండి.''

నాథ_ర్త మాట్లాడలేదు. సందీప్ బయటికి వెళిపోయినాడు.

పోసేదామని వాళ్లు చేసే ప్రయత్నం; సుధాపాత్ర ముక్కలు ముక్కలు చేసేదామని వాళ్ల కోరిక; అంతా బోధపడుతున్నది గాని వ్యామోహంమాత్రం వదలకుండా ఉన్నదీ.

మన దీక్షా, మన బలమూ, పరీక్ష చేదామని సత్యదేవత చేస్తూఉన్న పని ఇదంతా. మత్తత దేవీవేషం వేసుకొని తపస్సు-చేస్తూఉన్నవాని ఎదుట నృత్యం చేస్తూ అంటుంది—"నువ్వు మూఢుడవు, తపస్సువల్ల సిద్ధి దొరకదు, అది చాలా చుట్టుదారి, ఆదారి పట్టుకుకూర్చుండేవాళ్లకు వేళకూడా అతిమందంగా అతికష్టంగా జరుగుతుంటుంది, అందుచేతనే వజ్రధారి, ఆ దేవేంద్రుడు, నన్ను పంపించాడు—నేను మత్తతను, నా పేరు సుందరి, నా ఆలింగనంవల్ల ఒక్కనిమిషంలో సిద్ధి పొందగలవు."

కొంచెం సేపు ఊరుకొని తిరిగి ప్రారంభించాడు, సందీప్—"ఇప్పుడు దూరంగా వెళిపోయేవేళ వచ్చింది, దేవీ! అది మంచిదే అంటాను. నీదగ్గిరికి వచ్చిన పని అయిపోయింది. ఇటు తరువాత మరి ఉన్నట్టయితే దొరికినదంతా ఒకొక్కటి తిరిగీ పోగొట్టుకోవడమే అవుతుంది. అన్నిటికంటే విలువైన దానిని అతివాంఛవల్ల చపల చేసేశామంటే పూర్తిగా నాశనం అయిపోతుంది—ఒకక్షణంలో ఇమిడిఉన్న అనంతాన్ని రోజుల-లోకీ, సంవత్సరాలలోకీ సర్దిపెట్టబోతే సహజంగా దానికి లేని హద్దులు తెచ్చిపెట్టడం అవుతుంది. అటువంటి అనం-తాన్ని మేము పాడుచేయ సిద్ధపడ్డాము, సరిగా ఆ సమ-యంలో వజ్రాయుధం ఎత్తుకుంటూ వచ్చావు నీవు. నీ పూజ

పాడుకాకుండా కాపాడినది నీవే, నీ పూజారిని కాపాడినదీ నీవే! నేను సెలవుతీసుకుంటున్నాను, ఇప్పుడు అన్నిటిలోకీ గొప్పదిగా నాకు కనబడేది నీపూజ. దేవీ, నేనుకూడా నిన్ను విడుదల చేసేశాను ఈవాళ. నామట్టి మందిరంలో నీవు పట్టవు, ఏపక్కకుఆపక్క ముక్కముక్కలయి పడిపోతానని జడిపిస్తూ ఉన్నది. నీ పెద్దమూర్తిని విశాలమైన మందిరంలో పూజచేయ్యడానికి వెళుతున్నాను. దూరంగా ఉన్నప్పుడే నిన్ను నిజంగా పొందగలను. ఇక్కడ నీవల్ల నాకు ఆశ్రయం దొరికింది, అక్కడికి వెళ్లి వరం పొందుతాను."

టేబిలుమీద నానగలపెట్టె ఉన్నది, అది తీసి పట్టుకొని అన్నాను—"ఈ ఆభరణాలు మీద్వారా ఎవరికి అర్పించానో వారి పాదాలదగ్గిరికి అందజేయండి."

నాభర్త మాట్లాడలేదు. సందీప్ బయటికి వెళిపోయినాడు.

నేను అమూల్యకోసం ఫలహారం తయారు చేస్తూఉంటే చిన్నతోటికోడలు వచ్చి అన్నది—"ఇదేమిటి 'ఛూటా' నీ జన్మదినంనాడు నువ్వే విందుకు ప్రయత్నంచేస్తున్నట్టు ఉన్నదే!"

"ఇంకొకరి కోసం కాకూడదా విందు?" అని నేను అన్నాను.

" ఈవాళ నువ్వు విందుచేయకూడదు. మేము చేస్తాము. నేను ఆ ప్రయత్నంలోనే ఉన్నాను, అప్పుడు ఎవరో వచ్చి చెప్పారు, అయిదారువందలమంది దొంగలు మన కచేరీలో ప్రవేశించి ట్రెజరీకొట్టి ఆరువేలరూపాయిలు తీసుకున్నారట. ఇక మనఇంట్లో పడతారట, అంతా అనుకుంటున్నారు. అది విని అతిగాభరాపడి నీదగ్గిరికి పరుగెత్తి వచ్చాను."

ఈమాట వినగానే నా మనస్సులో భారం కొంచెం తగ్గింది—అయితే, ఆ రూపాయిలు మావేను. 'ఆ ఆరువేలూ ఇప్పుడే తెచ్చి నా భర్తచేతికి ఇచ్చేయి, తరవాత చెప్పవలసినదంతా నేనే ఆయనతో చెపుతాను' అని అమూల్యకు కబురుపంపి చెపుతాను.

తోటికోడలు అన్నది—"నిన్ను చూస్తే నాకు చాలా ఆశ్చర్యంగా ఉన్నది సుమా, నీకు భయమూ భీతీ ఏమీ లేదే!"

"మనఇల్లు లూటీచేస్తారని నేను నమ్మను."

"నమ్మవూ! మన ట్రెజరీ లూటీచేస్తారు అని ఎవరైనా నమ్మగలిగారా?"

ఏమీ జవాబు ఇవ్వకుండా తలదించుకొని కర్జికాయలలో కొబ్బరికోరు పెడుతూ కూర్చున్నాను. నావైపు మరికొంచెంసేపు చూచి అన్నది— "వెళ్లి మరిదికి కబురుపంపుతాను. మాఆరువేలరూపాయిలు తక్షణం ఇనపపెట్టెలోనుంచి తీసి కలకత్తా పంపేయమని చెపుతాను. ఇంకొక్క నిమిషం ఆలస్యం చేయకూడదు."

ఆలాగు అంటూ ఆవిడా వెళిపోయింది, నేనూ ఆ కర్జికాయలు అక్కడ వదిలేసి వేగంవేగం ఇనపపెట్టెఉండే గదిలోకి వెళ్లి లోపునుంచి తలుపు వేసుకున్నాను. నా భర్తది ఎటువంటి అమాయకత్వం అంటే—చూచేసరికి ఆ తాళంచెవ్వులుఉంచిన చొక్కా ఇంకా చిక్కునే వేలబడి ఉన్నది. జేబులోనుంచి రింగు తీసి ఇనపపెట్టెతాళం పైకితీశాను, తీసి అది నా జాకెట్టులోపల దాచేశాను.

పైనుంచి ఎవరో తలుపు కొట్టారు. "బట్టకట్టుకుంటున్నాను" అన్నాను. పైన తోటికోడలిమాటలు వినబడుతున్నవి —"ఇప్పుడిప్పుడు చూచాను, కర్జికాయలు చేస్తున్నది— ఇంతటిలోకి వచ్చి ముస్తాబులో పడ్డది. ఎంతటికైనా తగినదానవే! ఏమేవ్ రాణి, దొంగలరాణి, లూటీమ్మాల్ లెక్కపుచ్చుకుంటున్నావు కాబోలు!"

ఏమిబుద్ధిపుట్టిందో, ఒకమారు మెల్లిగా ఇనపపెట్టె తెరిచాను. అంతా కల అయిఉంటే ఎంతబాగుండును అని అనిపించింది కాబోలు—అటువంటి ఆశ కలిగిందేమో! కిందిసొరుగు లాగేసరికి ఆకాగితం పొట్లాలు సరిగా అలాగే పేర్చి ఉంటే ఎంతబాగుండును!...ఆహా, విశ్వాసఘాతకుని మనస్సులో ఉండే విశ్వాసం మోస్తరుగానే లోపున అంతా శూన్యం!

ఉత్తనే బట్టమార్చాను. ఏమీ అవసరంలేదు, అయినా జుట్టు విప్పి కొత్తగా సిగవేసుకున్నాను. బయటికి వచ్చాను, చిన్నతోటికోడలు కనబడుతూనే అడిగింది—"ఇంత ముస్తాబు ఎందుకమ్మా ఈవాళ, చెప్పవూ ?"

"జన్మదినం కదా ?" అన్నాను.

"కొంచెం సందు దొరికితే చాలు, కావలసినంత ముస్తాబు! ఇంతమందిని చూచానుగాని నీలాంటి వేషకత్తె నాకు మరిఎవరూ కనబడలేదే !"

అమూల్యను రమ్మని కబురుపంపడానికి నౌకరుకోసమని వెదుకుతున్నాను, అంతటిలో నౌకరే నాదగ్గిరికి వచ్చి పెనసలుతో వ్రాసిన ఉత్తరం ఒకటి నా చేతిలో పెట్టాడు. అమూల్య వ్రాసిన ఉత్తరం అది—"అక్కా, నన్ను భోజనానికి పిలిచావు, గాని ఉండడానికి వీలు అయింది కాదు. ముందు నీ ఆజ్ఞ పాలించనీ, తరవాత నీ ప్రసాదం పుచ్చుకుంటాను. తిరిగి వచ్చేసరికి బహుశా సాయంకాలం అవుతుంది."

ఎవరిచేతికి ఆ రూపాయిలు ఇద్దామని అతుకూల్య వెళ్లా-డో! మళ్లా ఇప్పుడు ఏచిక్కులలో పడతాడో కదా! అతనిని ఒక బాణంలాగు వదలడమే తెలుసును గాని నాకు, గురితప్పి-పోతే మళ్లించి వెనకకు తెప్పించడం చేతకాదు.

ఈ దొంగతనానికి కారణం నేను అని తక్షణం నేను చెప్పేయవలసింది. కాని ఆడవాళ్ల బ్రతుకుకు ఆధారం నమ్మకం, ఇతరులకు వాళ్ల యెడలగల విశ్వాసం. అదే వాళ్ల లోకం. రహ-స్యంగా మోసపుచ్చారని తెలిసిపోయినతరవాత ప్రపంచంలో ఉండడం వాళ్లకు చాలా కష్టం. దేనిని విరగగొట్టి ముక్కలు ముక్కలు చేస్తారో సరిగాదానిమీాదనే నిలుచోవలసి వస్తుంది. ఇటు కదిలినా అటు కదిలినా ఆ విరిగిపోయిన ముక్కల అంచులు కత్తులలాగు గుచ్చుకుంటూ ఉంటాయి. తప్పుచేయడం కష్టం కాదు గాని చేసినతప్పు దిద్దుకోవడమంత కష్టం ఇంకొకటి లేదు, మా ఆడవాళ్లకు.

ఇప్పటికి కొన్నాళ్లు అయింది, నా భర్తతో కులాసాగా మాట్లాడడం లేనే లేదు. కనుక ఇప్పుడు హఠాత్తుగా ఇంత బ్రహ్మాండమైన సంగతి ఏలాగు చెప్పగలను, ఎప్పుడు చెప్పగ-లను? ఈవాళ భోజనానికి చాలా ఆలస్యంగా వచ్చారు, సు-మారు రెండుఘుంటలు అయింది. పరధ్యానంగా ఉన్నారు. ఏమీా ముట్టుకో లేదు. మంచిమాటలుచెప్పి కొంచెం తిన-మని బ్రతిమాాలే అధికారం నాకు ఇప్పుడు మరి లేదు. ముఖం

అటుతిప్పి పైటకొంగుతో కళ్లు అద్దుకున్నాను—అంతే నేను చేయ గలిగినది.

సంకోచం తొక్కిపెట్టి, "గదిలోకి వచ్చి కొంచెం విశ్రాంతి పుచ్చుకోండి, చాలా అలసిపోయినట్టు కనబడుతున్నారు," అని అందామని అనుకున్నాను. కొంచెం దగ్గి కంఠం సవరించుకొని అనబోతున్నాను, అంతలో నౌకరు వచ్చి చెప్పాడు, ఇన్స్పెక్టరుబాబు కాసిమ్ సర్దార్ను తీసుకొని వచ్చాడు, అని. ఆయన అతిఆతురతగా లేచి వెళిపోయినారు.

ఆయన పైకి వెళిపోయిన కొంచెం సేపటికి తోటికోడలు వచ్చి అన్నది—"భోజనానికి ఎప్పుడు వచ్చాడే అబ్బాయి, నాకు కబురైనా పంపావు కావు! ఈవాళ అతనిభోజనం ఆలస్యం అయేటట్టున్నదని స్నానానికి వెళ్లాను,—ఈ లోపున ఎప్పుడు—"

"ఏమీ, ఏమైనా కావాలా?"

"మీరు రేపు కలకత్తా వెళుతున్నారట కదూ—విన్నాను. అలా అయితేమాత్రం నేను ఇక్కడ ఉండలేను. పెద్దరాణి తన రాధావల్లభస్వామిని వదిలి ఎక్కడికీ కదలదు. కాని ఈచోరీ రోజులలో మీ శూన్యమందిరం కాచుకుంటూ మూలమూలలా తలుక్కుపడుతూ నేను మాత్రం ఇక్కడ ఉండలేను తల్లీ, చచ్చిపోతాను! రేపు వెళ్లడం నిజమే?"

"అవు, నిజమే!" అన్నాను. ఆవెళ్లడానికిముందు ఒక్క క్షణంలో ఎంతకథ జరగబోతుందో ఎవరూ ఊహించలేరు

కదా అని నామనస్సులో నేను అనుకున్నాను. అయినతరవాత కలకత్తా వెళ్లినా ఇక్కడ ఉన్నా రెండూ ఒకటే. తరవాత మా సంసారం ఏమవుతుంది నాబ్రతుకు ఎలాగు ఉంటుంది ఏమీ తెలియదు కదా! అంతా పొగ, స్వప్నం!

నా అదృష్టం దృష్టిగోచరం కావడానికి మరి ఏనాలుగు ఘుంటలో ఉన్నది. ఆ సమయాన్ని రోజుకురోజూ వెనకకు తోసితోసి నాకున్నవ్యవధిని బాగా పొడిగించగలిగే వారు ఎవరూ లేరూ? అదే సాధ్యమైతే ఈలోపున నేను నాచేత నైనంత మెల్లిమెల్లిగా సవరించేస్తాను. అది వీలుకాకపోతే అధ-మపక్షం రాబోయే ఉపద్రవం భరించడానికి నన్నూ నా సంసా-రాన్నీ సిద్ధపరిచైనా ఉంచుకుంటాను. ప్రళయబీజం భూమిలో-పున ఉన్నంతకాలమూ చాలానెమ్మదిగా కథ జరుగుతుంటుంది. ఎంతమెల్లిగా నడుస్తుంటుంది అంటే భయపడడం కేవలం అన-వసరం అనిపిస్తుంది. కాని పైకిమాత్రం మొలక పొడచూ-పిందా, మనము చూస్తూచూస్తూఉండగానే పెద్దది అయిపో-తుంది. అప్పుడు దానిని పైటకొంగుతో ఆపగలమూ? పైట-కొంగు ఒక లక్ష్యమా, గుండెను అడ్డుపెట్టి ఆపలేము, మనప్రా ణాన్ని ఇచ్చి ఆపలేము.

దాన్నిగురించి మరిఏమీ ఆలోచించకుండా ఉందామని అనుకుంటున్నాను; ఎటువంటి కదలికాలేనిదానిలాగు పడి ఉంటాను, నెత్తిమీద ఏదివచ్చి పడుతుందో! పడనీ! కాబోయేదంతా ఎల్లుండిలోగా అయిపోతుంది—ఎవరెవరికి

తెలియాలో అందరికీ తెలిసి పోతుంది, నవ్వవలసినవాళ్లు నవ్వేస్తారు, ఏడుపులు అయిపోతాయి, ప్రశ్నలూ ప్రశ్నలకు జబాబులూ అన్నీ అయిపోతాయి !

కాని ఆత్మసమర్పణవల్ల దీప్తిచెందిన ఆ అమూల్యుని మ-నోహర ముఖం నాకు ఎంతకూ మరుపు రాకుండా ఉన్నది. దుర దృష్టం ఎప్పుడు వచ్చి నెత్తిమీాద పడుతుందో అని జడుస్తూ ఒకమూల కూర్చోలేదు అమూల్య, భయంకరమైన విపత్తు మధ్యకు పరుగెత్తుకొని వెళ్లాడు. నేను స్త్రీలలో అధమురాలను; అతనికి నమస్కారం. అతను నా బాలదేవుడు, ఆటఅని వంక పెట్టి నా కళంకభారమంతా తననెత్తిమీాద పెట్టుకున్నాడు. నా నెత్తిమీాద పడవలసిన దెబ్బలకు తన తల ఒడ్డి నన్ను బ్రతికింతా-మని వచ్చాడు. భగవంతునికి నామీాదగల ఈ భయంకరమైన కృప నేను ఏలాగు సహించగలను ? నా చిట్టితండ్రీ, నీకు ఒక నమస్కారం ! నా తమ్ముడా, నీకు ఒక నమస్కారం! నీవు నిర్మ-లుడవు, సుందరుడవు, వీరుడవు, నిర్భయుడవు, నీకు నమస్కారం. వచ్చేజన్మంలో నా బిడ్డవై రా, నాబిల్లోకి ! ఇదే నేను కోరే వరం.

ఈ లోపున నానారకాల వదంతులు పుట్టిపోయినాయి. పోలీసువాళ్లు రావడంపోవడం జరుగుతున్నది, ఇంట్లోనిదాసీలు కంగారుపడుతున్నారు. నా దాసీ, క్షేమ, నాదగ్గిరికివచ్చి తన బంగారపు పోచీలూ, బాజుబందులూ, ఇనపపెట్టెలో దాచమని నాచేతికి ఇచ్చింది. తోటికోడలి దాసీ, థాకో, కూడా వచ్చి

తాను కూడబెట్టుకున్న రూపాయిలు దాచమని ఇచ్చింది, నా చేతికి, ఛోటారాణిచేతికి!— అవీ పుచ్చుకున్నాను. కాని దేశమంతా వ్యాపించిఉన్న ఈ వల ఛోటారాణిపన్నిన దే అని ఎవరికీ తెలియదుకదా; ఎవరితో చెప్పను 'అదంతా నాపనే, నా వలలో నేనుకూడా చిక్కుకున్నాను' అని? మాకు పాలిచ్చే గొల్లది తనకుండే బనారసు చీరా, వెలగల నగలూ, ఒక ట్రంకులోపెట్టి తెచ్చిదాచమని ఇచ్చింది—"ఈచీర ఛోటారాణి పెళ్లిలో నాకు ఇచ్చారు," అన్నది.

రేపు ఇనపపెట్టె తీసేసరికి నా గదిలోనే ఈ క్షేమా, థాకో, గొల్లదీ, వీళ్లందరి—పోనీ, పోనీ—ఆ మాటలన్నీ అనుకొని ఏమిప్రయోజనం? దానికంటే ఇంకొకమాట అనుకోవడం నయం— రేపు ఏలాగో గడచిపోతుంది, తరవాత ఇంకొక సంవత్సరం నడిచిపోతుంది, వచ్చేసంవత్సరం ఈరోజు వస్తుంది తిరిగి, మాఘశుద్ధ సప్తమి. అప్పటికీ నా ఇంటికితగిలిన దెబ్బలు ఇప్పటిలాగే ఉంటాయా—ఇంతపచ్చిగా? ...ఈ సాయంత్రం-లోగా వస్తానని అమూల్య వ్రాశాడు. అంతవరకూ ఇంట్లో ఒక్కర్తెనే ఏమీచేయకుండా కూర్చోలేను. ఆ కర్జికాయలు మరికొన్ని చేదామని వెళ్లాను. ఇప్పటికి అయినవి కావలసినన్ని, అయినా ఇంకా చేదామనుకున్నాను. ఇన్ని ఎవరు తింటారు? ఇంట్లో ఉండే దాసీలచేతా నౌకర్లచేతా తినిపిస్తాను. ఈరాత్రే తినిపించాలి, ఈ రాత్రివరకే నారోజుల పరిమితి, రేపటిదినం మరి నాచేతిలోది కాదు.

కర్జికాయిమీదకర్జికాయి వేయిస్తూనే ఉన్నాను, విరామంలేదు. మధ్యమధ్య మేడమీద నా గదివైపు ఏదో గొడవ అవుతున్నదని అనిపించింది. నా భర్త ఇనపపెట్టె తీయడానికి తాళంకోసం వెళితే తాళం దొరకలేదేమో! అందుచేత తోటికోడలు దాసీలనూ నౌకర్లనూ పిలిచి గందరగోళం చేస్తున్నది కాబోలు!—వద్దు, నేను వినను, ఏదీ నా చెవినిపడవద్దు తలుపులు వేసుకొని కూర్చుంటాను. తలుపులు మూసేదామని లేచాను, థాకో పరుగెత్తిపరుగెత్తి వచ్చి ఊపిరి అందకుండా "రాణిఅమ్మా! రాణిఅమ్మా" అన్నది. "వెళిపో, పో, ఇప్పుడు చికాకుపెట్టకు, నాకు ఇప్పుడు వేళలేదు," అన్నాను. దాసి అన్నది, "ఆ రాణిఅమ్మ పెద్దక్కకొడుకు కలకత్తానుంచి ఒక యంత్రం తీసుకువచ్చాడు అమ్మా, అది సరిగా మనిషిలాగు పాడుతుంది, రాణిఅమ్మ మిమ్మల్ని పిలుచుకు రమ్మన్నారు."

నవ్వడమా ఏడవడమా? నాకేమీ తోచిందికాదు. మంచి! వేళ దొరికింది గ్రామొఫోన్ రావడానికి. మహా గొప్ప పాట కదూ, ఎటువంటిసంకోచమూ లేకుండా మరతిప్పినప్పుడల్లా పాడేస్తుంది, ముక్కుతో పాడినట్టు ఆ నాటకంపాటలు. మనుష్యులు చేసినట్టుగా యంత్రం చేయబోతే ఏమవుతుంది, వెక్కిరింపుకాక?

సాయంకాలం అయిపోయింది. వస్తూనే అమూల్య నాకు కబురుపంపుతాడు, నాకు తెలుసును. అయినా ఊరుకోలేకపోయినాను, నౌకరును పిలిచి, "అమూల్యబాబును పిలుచు

కొనిరా” అని చెప్పాను. ఒక్కనిమిషంలో తిరిగివచ్చి, “అమూల్యబాబు లేడు,” అని అన్నాడు నౌకరు.

మాటలో ఏమీ లేదు, అయినా ఎందుచేతనో నా గుండెలో రాయి పడ్డది నౌకరుమాట వినగానే. “అమూల్య-బాబు లేడు”—గబగబ కమ్ముకొని వస్తున్నది చీకటి, అందులో-నుంచి ఆ మాటలు వచ్చేసరికి ఏడుపులాగు వినబడ్డవి. “లేడు. అమూల్య లేడు.”—సూర్యాస్తమయమప్పుడు కనబడే సువర్ణ రేఖలాగు ఒక్క మారు నాకు దర్శనం ఇచ్చాడు అమూల్య, తరవాత మరి ‘లేడు’! సంభవమైనవి అసంభవమైనవీ నానా రకాల ఊహలు నా మనస్సులో పుట్టడం ఆరంభించాయి. మృత్యువు ఎదుటికి నేనే పంపాను అతనిని. అతను ఎటువంటి భయమూ లేకుండా వెళ్లాడు నిజమే, గాని అది అతనిలో ఉన్న గొప్ప కనపరుస్తుంది—అంతే! నేను ఇటుపైన ఏలాగు బ్రతికి ఉండగలను?

జ్ఞాపకార్థమైనా అమూల్యదేదీ నా దగ్గిర లేదు—ఉన్న దంతా ‘భాయ్ ఫోటా’నాడు అతను నాకిచ్చిన పణామీ, ఆ పిస్తోలీ. ఆ కానుకలో దేవునిఉద్దేశంఏమైనా సూచనఅయి ఉంటుందేమో? నా జీవనంలోని కళంకం వేరునే పట్టింది. దేవుడు బాలకునివేషంతో వచ్చి ఆ పాపం పరిహారం చేయ-గల ఉపాయం నాచేతిలో ఉంచి మాయంఅయిపోయినాడు గాబోలు. నన్ను ఎంతప్రేమించకపోతే నాకు అటువంటి దానం చేస్తాడు; అందులో పావనమంత్రం లీనమై ఉన్నది.

పెట్టె తెరిచి పిస్తోలీ పైకి తీశాను; రెండుచేతులతో పట్టుకొని కళ్లను అద్దుకున్నాను. సరిగా అప్పుడే మా దేవా-లయంలో హారతిఇస్తున్నారు, జేఘంట వినబడుతున్నది. నేను సాష్టాంగ ప్రణామం చేశాను.

నేను చేసిన పిండివంటలతో రాత్రి అందరికీ విందు చేశాను. తోటికోడలు వచ్చి, "ఏలాగయితే నేమి, ఆఖరికి నీ మట్టుకు నువ్వే జన్మదినం చేస్తున్నావు ఇంత సందడిగా; మమ్మల్ని ఏమీ చేయనివ్వవు కాబోలు!" అన్నది. అంటూ గ్రామొఫోన్ వాయించడం మొదలుపెట్టింది. కీచుగొంతుకలతో గొంతుక బద్దలైనట్టు పాడుతూఉన్న ఆ కలకత్తానాటకాలలోని ఆడవాళ్ల పాటలు ఆరంభం అయినాయి. గంధర్వలోకంలో ఉన్న గుర్రపుసాలల్లోనుంచి సంగీతం వస్తున్నది అనిపించింది; చెవులు బద్దలైపోతున్నవి.

విందు పూర్తిఅయేసరికి చాలా ఆలస్యం అయింది. ఈవాళ తప్పకుండా నా భర్తగారి పాదధూళి తీసుకోవాలి అనుకున్నాను. మా పడకగదిలోకి వెళ్లి చూచాను, ఆయన హాయిగా నిద్రపోతున్నారు—రోజంతా చాలా తిరిగారు, చాలా గడబడపడ్డారు. అతిజాగ్రతగా దోమతెర ఎత్తి నెమ్మదిగా నా తల ఆయనపాదాల దగ్గిర పెట్టాను. జుట్టు పాదాలకు తగలగానే నిద్రమత్తులో నా బుర్ర పాదాలతో తోసేశారు.

పశ్చిమంవైపుఉన్న వరండామీదికి వెళ్లి కూర్చున్నాను. దూరాన ఒక బూరుగుచెట్టు కనబడుతున్నది. ఆ చీకటిలో

కొముకల గూడులాగు ఉన్నది, దాని ఆకులన్నీ పూర్తిగా రాలిపోయినాయి. దానివెనకను సప్తమినాటి చంద్రుడు మెల్లి-మెల్లిగా కుంగిపోయినాడు.

ఆకాశం మీాదనున్న నక్షత్రాలన్నీ హఠాత్తుగా నన్ను-చూచి జడుస్తున్నవా అనిపించింది. అంధకారంతో నిండిఉన్న ఈజగత్తుఅంతా నావైపు వంకచూపులతో చూస్తున్నది ఎందు చేతనో కదా! నేను ఒంటరిగా ఉన్నాననా? ఒంటరిగా ఉన్నమనిషి లాంటి భయంకరమైనదీ, అంత ఆశ్చర్యమైనదీ మరి ఒకటి లేదు పృథ్వీమీాద! బంధువులూ మిత్రులూ ఒకరితరువాత ఒకరు, అంతా చనిపోవడంవల్ల ఏకాకి అయిపోయినవాడు నిజంగా ఏకాకి కాడు, వాళ్లసహవాసం మృత్యువుఅవతలనుంచి అతనికి దొరుకుతుంది—కేవలం మృత్యువల్ల వచ్చినఎడబాటు ఎడబాటు కాదు. దగ్గరఉండే బంధువులూ స్నేహితులూ దగ్గర ఉంటూఉండగానే ఏకాకిఅయిపోయినవాడు నిజంగా ఏకాకి. అటువంటివాడు ప్రపంచంలోనుండి రాలిపడిపోయిన ఒక వస్తువు మోస్తరు.

చీకటిలో అటువంటివాని ముఖం చూడడానికి నక్ష-త్రలోకానికి కూడా పులకరింపు పుడుతుంది. నేను ఎక్కడ ఉన్నానో, నిజంగా అక్కడ లేను. నాచుట్టూ ఉండేవాళ్లమధ్యను నేను లేను, వాళ్లకు చాలా దూరం నేనుఉన్నది. విశ్వమంతా ఆవరించుకొనియున్న ఎడబాటుమధ్య నానివాసం; అందు-

లోనే నేను మసలుతున్నాను, తిరుగుతున్నాను, బ్రతికి ఉన్నాను—తామరాకుమీాదనున్న నీటిబొట్టును నేను.

మనుష్యులలో మార్పువచ్చినప్పుడు నఖశిఖపర్యంతరమూ ఎందుకు మారిపోరో ? లోపల చూచుకుంటే నా హృదయంలో ముందు ఉన్నవే ఇప్పటికీ ఉన్నవి, గాని అన్నీతల క్రిందుమాత్రం అయిపోయినాయి ; ఇంతకుముందు అన్నీ చక్కగా పేర్చి ఉండేవి, ఇప్పుడు కలగాపులగంగా పడిఉన్నవి —హారంగా గుచ్చిఉన్న వజ్రాలన్నీ మట్టిలో విరజల్లేసి ఉన్నవి. అది చూచి నా గుండె బద్దలయిపోతున్నది. చచ్చిపోదామని బుద్ధి పుడుతున్నది, కాని మనస్సులోవన్నీ ఇంకామనస్సులోనే ఉన్నవి, చావుతో అంతా అంతంఅయేటట్టు కనబడకుండా ఉన్నదే? చావువల్ల మరీభయంకరమైన దుఃఖం కలగవచ్చును— వదులుకోవలసినది బ్రతికిఉంటూఉండగానే వదులుకోవాలి, వేరేఉపాయం లేదు.

ఈ ఒక్కమారు మాత్రం క్షమించు తండ్రీ ! జీవనధనం అని నీవు నాకు ఇచ్చినదానిని మెడకుకట్టిన బండరాయిగా మార్చేశాను. ఈవాళ దానిని మోయలేకుండా ఉన్నాను, పారేయలేకుండా ఉన్నాను. పూర్వం ఒకనాడు నా ప్రాతఃకాలపు ఆకాశంఅంచున అరుణరాగంమధ్య నిలబడి నీవు నీ వేణువు నాకు వినిపించావు. అది మరిఒక్కమారు వినిపించవూ, తండ్రీ ! నా చిక్కులన్నీ సులువుగా విడిపోతాయి. విరిగిపోయినది తిరిగీ అతుక్కోవడం నీవేణుగానం వల్లనే గాని మరి

దేనివల్లా సాధ్యం కాదు. అపవిత్రం అయిపోయినది పవిత్రం చేయడం నీ వేణుగానానికితప్ప మరి దేనికీ సాధ్యం కాదు. నీ వేణుగానంతోనే నా ఇంటికి నూతనసృష్టి కల్పించు తండ్రీ!—ఇది కాక నాకు మరేదీ దారి కనబడదు.

గచ్చుమీద బోర్లా పడుకొని ఒకటేవడుపు ఏడ్చాను. అణుమాత్రం కృప ఎక్కడైనా దొరుకుతుందా అనిప్రార్థించాను. నేను కోరేది, కొంచెం ఆశ్రయం, క్షమ దొరుకుతుందని ఆమాత్రం సూచన, అన్నీ చక్కబడిపోతాయి అని ఆమాత్రం ఆశ. దీక్షపట్టి దేవాలయద్వారంఎదుట పడుకొని ఉన్నాను, దేవుని ఆశీర్వాదం నాకు దొరికేవరకూ ఈలాగే పడిఉంటాను—భోజనంచేయను, నీళ్లయినా ముట్టుకోను, అని నాలో నేను నిశ్చయించుకొన్నాను.

అప్పుడు అడుగుల చప్పుడు వినబడ్డది. నా గుండె దబ్ దబ్ మని కొట్టుకో నారంభించింది... దేవుడు కనబడడని ఎవరంటారు? నాదృష్టి ఆయన సహించలేదేమో అని నేను ముఖం ఎత్తి చూడలేదు. నీ పాదాలు నా తలకు తగలనీ తండ్రీ! రా-రా-రా, తండ్రీ! రా! నాలో పుడుతూఉన్న ఈ కంపనం అణిగేటట్టు నా హృదయంమీద నిలబడు! ఈక్షణమే నన్ను తీసుకొని పో ప్రభూ!

నా తలవద్దకు వచ్చి కూర్చున్నారు. ఎవరు!—నా భర్త! నా భర్తహృదయంలో నాదేవుని సింహాసనం ఉన్నది. నా ఏడుపు విని సహించలేక దిగివచ్చాడు ఆ దేవుడు, మూర్ఛపో

తాను అనిపించింది. నా హృదయంవేదన చుట్టూఉన్న రక్త నాళాలను తెంచుకొని ఒక మహాప్రవాహంఅయి కన్నీటి ధారలలో వెల్లడిఅయింది. ఆయనపాదాలు నా గుండెదగ్గిర పెట్టి నొక్కుకున్నాను. ఆ పాదాలచిహ్నం శాశ్వతంగా అక్కడ అచ్చుకొట్టి ఉంచుకోలేనూ ?

ఇకనైనా అంతా విప్పి స్పష్టంగా చెప్పేయవచ్చును. కాని చెప్పవలసినది ఏమిటి మిగిలి ఉన్నది? చాలుచాలు, నా మాటలు ఇక లేకపోతేనే బాగుంటుంది.

ఆయన అతి దయతో నా తలమీద చెయ్యివేసి నెమ్మదిగా దువ్వారు. నాకు ఆశీర్వాదం దొరికింది. నాకు రేపు జరగబోయే అవమానం అందరిఎదుటా నిస్సంకోచంగా స్వీకరించి నెత్తిమీద పెట్టుకోగలను. మనస్సులో ఎటువంటిభారమూ లేకుండా దేవుని పాదాలకు నమస్కారం చేయగలను.

కాని, తొమ్మిది సంవత్సరాల కిందట ఈ ఇంటికి నేను నవవధువుగా వచ్చినప్పుడు నాకు స్వాగతంచేసిన శుభగానం మరి నాకు ఈజన్మలో వినబడదు కాబోలు! ఆ మాట తలచుకుంటే నా గుండె బద్దలయిపోతున్నది ఈ వాళ. ఆ మధుపర్కాలతో ఆ పెళ్లిపీటమీద కూర్చోబెట్టగల దేవత ఈ విశ్వంలో ఎక్కడా లేదు కాబోలు! ఉంటే ఆ దేవతపాదాలదగ్గిర నానెత్తి పగలగొట్టుకుంటాను. ఆ తొమ్మిదిసంవత్సరాలకు ముందురోజు తిరిగీ రావడానికి ఎన్ని రోజులు పడుతుందో,

ఎన్ని సంవత్సరాలు, ఎన్ని యుగాలు, ఎన్ని మన్వంతరాలు, ఎన్ని కల్పాలు పడుతుందో? దేవుడు కొత్తసృష్టి చేయగలడు గాని, ముక్కలైపోయినదానిని తిరిగి ముక్కలు కానిదానిగా చేయగల శక్తి అతనికి ఉన్నదీ?

## నిఖిల్ కథ

మేము ఈవాళ కలకత్తా వెళతాము. సుఖదుఃఖాలు కేవలం కూడబెటుతూకూర్చుంటే భారం మోయశక్యంకానంత అయిపోతుంది. వాటిని ఉండనివ్వడం మిథ్య, వాటిని జమచేయడం అంతకంటె మిథ్య. ఇంటికి పెద్ద అని నాకుండే పదవి ఒక కల్పితపదవి. నేను నిజంగా జీవనపథంలో ఒక పథికుడను. అందుచేతనే ఇంటిపెద్దకు మాటిమాటికీ దెబ్బతగులుతుంటుంది —చిట్టచివరకు తగిలేదెబ్బ ఉండనే ఉన్నది, మృత్యువు.

ప్రేయసీ, నీతో నాకు కలిగిన సంయోగము దారిపక్కను తటస్థించినది. నీదీ నాదీ ఒక్కటేదారి అయినంత కాలము కలిసిఉండడం మంచిదే. అటుపైని ఒకరినొకరము ఈడ్చిపట్టుకొని కలిసి ఉండడానికి ప్రయత్నంచేస్తే ఆ సంయోగము బంధనము అయిపోతుంది గాని బంధుత్వం కాదు. ఆ బంధనంలో నుంచి పైకి వచ్చేశాము ఈవాళ. దారిలో మధ్యమధ్య నీ చూపూ నా చూపూ కలవడం, నీచెయ్యి నాకూ నాచెయ్యి నీకూ తగలడం—ఇవి మనకు ఎంతప్రాప్తిఉంటే అంతే మంచిది. అటుతరువాత? అటుతరువాత అనంతజగత్పథము, అనంత జీవన ప్రవాహము!

చివరకు నీవు నాకు లేకుండా చేయగలిగినది ఎంత స్వల్పం! ఎదుట జరుగుతున్న వేణుగానం చెవిఇచ్చి శ్రద్ధతో

వింటే వినబడుతున్నది. ఎడబాటువల్ల కలిగిన ప్రతి పగులు-లోనుంచీ ఆ చక్కని పాటయొక్క మధురప్రవాహం పైకి వస్తూఉన్నది. లక్ష్మీదేవిచేతిలోనున్న అమృతకలశం, ఎన్నిటికీ వట్టిపోదు. అప్పుడప్పుడు మాత్రం ఆమె మన పాత్రను పగలగొడుతుంటుంది, మనము దుఃఖపడుతుంటే చూచి తాను నవ్వుతుంటుంది. విరిగిన ముక్కలన్నీ కూడదీసుకుంటూ కూర్చొను నేను, తృప్తిపొందని మనస్సుతోనే ముందుకు ప్రయాణం చేస్తుంటాను.

వదినె వచ్చి అన్నది— "నీ పుస్తకాల పెట్టెలన్నీ ఎడ్ల బండిమీాద వేసి తీసుకువెళిపోతున్నారే, దాని అర్థం ఏమిటి చెప్పూమీా, తెలియకుండా ఉంది ?"

"పుస్తకాలమీాద ఆసక్తి ఇంకా వదులుకోలేకుండా ఉన్నాను—అది దాని అర్థం."

"ఆమాత్రమైనా దేనిమీాదనో ఒకదానిమీాద ఉంటే బ్రతుకుతాము బాబూ. కాని మరి ఇక్కడికి తిరిగీ రామూ?"

"వచ్చిపోతుండడమే గాని మునపటిలాగు ఇక్కడ పడి ఉండడం మరి కాదు."

"నిజంగా ? ఆలా అయితే ఒక్కమారు వచ్చి చూడు నాకు ఎన్నిటిమీాద ప్రేమో," అని అంటూ నా చెయ్యిపట్టుకొని లోపలికి ఈడ్చుకుపోతుంది.

వదినగదిలోకి వెళ్లి చూదును, అనేకరకాల పెట్టెలూ మూటలూ! ఒక పెట్టె కప్పు ఎత్తి చూపించి, అన్నది—"ఇదిగో

అబ్బాయి, ఇటు చూడు! ఇది నా తాంబూలం సరంజాం; ఇదిగో ఈ సీసాలన్నీ మొగలిరేకుల గుండ, ఈ డబ్బాలు మసాలా సామాను. పేకదస్తా ఇదిగో; పచ్చీశ్ పాలీకూడా మరిచిపోలేదు చూచావా? మీరు ఎవరూ నాకు దొరకకపోతే ఎవరినైనా జతపెట్టుకుంటాను ఆటకు. ఈ దువ్వెన మీ స్వదేశీలో కొన్నది; ఈ—"

"సరే, అంతా బాగానే ఉంది గాని కథ ఏమిటి, వదినా? ఇవన్నీ పెట్టెల్లో పెట్టావు ఎందుకు?"

"నేనూ మీతో కలకత్తా వస్తాను."

"అదేమిటి ఆకబురు?"

"భయపడకు నాయనా, భయపడకు. నీతో స్నేహం చేదామని రాలేదు, ఛోటారాణితో పోట్లాడుతుందామని అంతకంటే రాలేదు. ఎప్పుడో చావాలి కదా, వేళ ఉంటూ ఉండగానే గంగబడ్డునున్న దేశంలో ఎక్కడైనా చేరుకుంటే మంచిది కదా! మొరడుపోయిన మన మర్రిచెట్టుకింద తగలబెడతారంటే చావు పరమ అసహ్యంగా ఉంది,—అందుచేతనే కదూ మిమ్మల్ని అందరినీ ఇన్నాళ్లూ కాల్చుకుతింటున్నాను!"

ఇంతకాలానికి నా ఇంట్లో వాణి వినబడ్డది, ఇల్లే మాట్లాడుతున్నదా అనిపించింది. నాకు ఆరేళ్లప్పుడు మా చిన్నవదినె మా ఇంటికి వచ్చింది. అప్పుడు ఆమెకు తొమ్మిదేళ్లు. రోజూ మధ్యాహ్నం మా డాబామీద, ఎత్తుగోడల మూలను మా వదినెతో ఆడుకుంటూ ఉండేవాడను. మా తోటలోఉన్న

ఉసిరిక చెట్టు ఎక్కి పచ్చిఉసిరిక్కాయలు మీదినుంచి వేస్తూఉంటే వదినె కింద కూర్చొని అవి తరిగి ఉప్పూ మిరపకాయలూ కొత్తిమిరీ వేసి పచ్చడిచేసేది—అజీర్ణానికి మందు: బొమ్మల-పెళ్లికి విందు చేసేది వదినె. ఆ విందుకు కావలసిన సామాను కొట్టుగదిలోనుంచి తీసుకువచ్చేభారం నాది. నాది ఎందు-చేతను అంటే నాయనమ్మగారికోర్టులో నాకు ఏఅపరాధానికీ శిక్ష లేదు. తమాషాతమాషా వస్తువులేవైనా అన్నయ్యదగ్గిర నుంచి వదినెకు కావలసివస్తే మధ్యవర్తిని నేను. ఏలాటివస్తువైనా సరే, అన్నయ్యను చికాకుపెట్టి ఏలాగో తీసుకువచ్చేవాడను.

ఒకమారు నాకు జ్వరం వచ్చింది; వైద్యుడు అతి కఠిన-పథ్యం చెప్పాడు. పటికపంచదారా కిసిమీసుపళ్లనీరూ తప్ప మరేదీ ముట్టుకోవద్దన్నాడు. మూడురోజులు నా దుఃఖంచూచి వదినె మరి సహించలేకపోయింది. దొంగతనంగా రోజూ నాకు తినడానికి ఏదో తెచ్చిస్తుండేది, ఒకొక్కనాడు దొరికిపోతే బాగా చీవాట్లు తినేది.

తరవాత పెద్దవాళ్లం అవుతూఉన్న కొలది మా బాం-ధవ్యంవల్ల కలిగిన సుఖదుఃఖాల లోతుకూడా అధికం అవుతూ వచ్చింది. ఎన్నో దెబ్బలాటలు అయినాయి, డబ్బూ సౌఖ్యం విషయమై ఒకరిమీదఒకరికి ఈర్ష్య, అపనమ్మకం, విరోధం పుట్టేవి. తరవాత వీటికితోడు ఆ మధ్యకు విమల రావడం, ఎప్పుడు జరిగిందో, మా స్నేహం ముక్కలయిపోయింది. ఆ ముక్కలు మరి అతుకోవు అనుకున్నాను. కాని లోపున

మైత్రి, కలయిక, ఉండబట్టి పైదెబ్బలు ఏమీ చేయలేక పోయినాయి.

ఈ విధంగా ఒక నిజమైన అనురాగం మా ఇద్దరిలో చిన్నప్పటినుండి ఇప్పటివరకు రోజకురోజూ పెరుగుతూవచ్చింది. అది తన శాఖోపశాఖలను మా ఇంటి గదులలోనూ, అంగణంలోనూ, వరండాలోనూ, డాబామీదనూ, తోటలోనూ— అంతటా దట్టంగా అల్లి, సమస్తమూ స్వాధీనం చేసుకు కూర్చున్నది. చిన్నచిన్నవస్తువు మొదలు తనకున్న సమస్తమూ పెట్టెలలో సరిది మాఇల్లు వదిలి మాతో రావడానికి వదిన సిద్ధంకావడం చూచాను, నా హృదయంలో మూలమూలల పారిఉన్న మా స్నేహవృక్షం వేళ్లు కదిలినవి. తొమ్మిదేళ్లప్పటి నుండి ఇప్పటివరకు ఒక్కనాడైనా ఇల్లు విడిచి బయటికి వెళ్లని మా వదినె, తన అలవాటు తప్పించుకొని, సర్వమూ విడిచి, ఎన్నడూఎరగని దేశానికి వెళ్లడానికి ఎందుకు సిద్ధపడుతూ ఉందో నాకు స్పష్టంగా బోధపడ్డది. కాని దాని నిజమైన కారణం నోటితో చెప్పాలని లేక, ఏవేవో దొంగకారణాలన్నీ చెపుతున్నది. భాగ్యదేవత మోసపుచ్చిన ఈమెకు భర్త లేదు, బిడ్డలు లేరు, ప్రపంచంలో మరి ఏసంబంధమూ లేదు. ఉన్న ఈ ఒక్క సంబంధాన్నీ తన హృదయంలో కూడబెడుతున్న అమృతంపోసి పెంచుతూ వచ్చింది. ఆమెగదినిండా విరజల్లి ఉన్న పెట్టెల్లూ మూటలమధ్య నిలుచున్నప్పుడు బోధపడ్డంత స్పష్టంగా, ఆమెదుఃఖం ఎంతభయంకరమైనదో, అంతకుముందు

ఎన్నడూనాకు బోధపడలేదు. డబ్బూ ఎగాణీ గురించి గాని, ఈగది నాది ఆగది నాది అని గాని, ఇటువంటి లెక్కలేనన్ని చిన్న చిన్న ఇంటివిషయాలగురించి రోజూ ఆమెకు విమలతోనూ నాతోనూ జరుగుతున్న కలహాలకు కారణం, తుచ్ఛమైన భోగాపేక్ష కాదు అని నాకు స్పష్టం అయిపోయింది. ఈజీవనంలో ఆమెకుఉన్న బాంధవ్యం ఒక్కటే. ఆ ఒక్కదానిమీద తనకుగల హక్కు బలపరచుకోలేకపోవడం ఉంటూఉండగా, మధ్య విమల ఎక్కడనుంచోవచ్చి దానిని మరింత బలహీనంచేసేసింది. ఇటు నుయ్యి అటు గొయ్యిలాగున్నది ఆమె అవస్థ—అయినా నోరు ఎత్తడానికి వీలులేదు. ఇది ఆమె కలహాలకు కారణం, డబ్బుకోసముగాని, అధికారమూ సౌఖ్యమూ కావలెనని గాని, ఎంతమాత్రం కాదు. ఆమెకు నామీద గల హక్కు కేవలం సంఘసాంప్రదాయంవల్ల వదినకువచ్చిన హక్కు కాదు అని విమలకుకూడా ఒకమోస్తరుగా తెలిసిపోయింది. వదినెకూ నాకూగల సంబంధము చిన్నప్పటినుండీ పెరుగుతూ వేళ్లుతన్నిన సంబంధం. అందుచేతనే విమలకు అంత ఈర్ష్య. నా హృదయం ఈవాళ లోపునుంచి తనచుట్టూఉన్న గోడలను ధబ్ధబ్ మని గుద్దుతున్నది. అక్కడఉన్న పెట్టెలలో ఒకదానిమీద చతికిల పడిపోయి అన్నాను—"వదినా, మనమిద్దరం ఈ ఇంట్లో మొట్టమొదట ఎప్పుడు కలుసుకున్నామో నీకు జ్ఞాపకం ఉన్నదీ? తిరిగి ఆ రోజులలోకి వెళిపోయి ఉందామని కోరిక పుడుతున్నది వదినా!"

వదినె పెద్ద నిట్టూర్పు విడిచి అన్నది— "లేదు తండ్రీ, అటువంటిది మరి నాకు అక్కరలేదు. ఇప్పుడు భరించినది చాలును ఎన్ని జన్మాలకైనా. ఇది ఈలాగు పూర్తిఅయిపోనీ. తిరిగీ అదే. భరించడం నా తరమా!"

"దుఃఖంద్వారా వచ్చిన ముక్తి దుఃఖం కంటే అనేక-రెట్లు గొప్పది," అని నేను అన్నాను.

"అయి ఉండవచ్చు, నాయనా. గాని అది మీ పురుషులకు—ముక్తి మీదీ. మేము ఆడవాళ్లము; మేము మిమ్మల్ని బంధిస్తాము, మమ్మల్ని బంధించమని కోరుతాము. మమ్మల్ని విదిలించుకొని సులభంగా మీరు పోలేరు నాయనా. రెక్కలు విప్పుకొని ఎగిరి పోదామంటే మమ్మల్ని కూడా తీసుకొనే వెళ్లాలి, వదిలేసి పారిపోలేరు. అందుచేతనే సిద్ధంచేసి ఉంచాను ఈ భారంఅంతా; మిమ్మల్ని తేలికగా వెళిపోనిస్తే బ్రతకగలమా?"

"అవును నిజమే నువ్వుఅనేది, భారము స్పష్టంగా కనబడుతునే ఉంది. కాని ఆ భారము మోసినందుకు తగిన మజూరీ మీదగ్గిర మాకు దొరకకుండా ఉండిపోదు. అందు-చేతనే మేము ఎప్పుడూ మూలగము."—అని నవ్వుతూ అన్నాను.

"మా మూటలలో ఉన్నవిఅన్నీ చిన్నచిన్న వస్తువులే. అందులో ఏదో ఒకటి ఉంచేయమని మీరు అనేసరికి 'అతి చిన్నవస్తువును, నా బరువు ఎంత గనుక నన్ను ఉంచేయడానికి?'

అని అది లేచి అంటుంది. ఈ విధంగా చిన్న చిన్న వాటితోనే మా మూపులు వంచుతాము మేము...సరే, ఎప్పుడు బయలుదేరడం అబ్బాయీ?"

"రాత్రి పదకొండున్నరబండిలో, ఇంకా కావలసినంత వేళ ఉన్నది."

"అయితే ఒక్కపని చేయి బాబూ, బంగారు తండ్రివి! పెందలాడే భోంచేసి మధ్యాహ్నం కొంచెం పడుకో అమ్మా, రాత్రి బండిలో బాగా నిద్రపట్టదు. నువ్వు ఏలాగు కనబడుతున్నావో తెలుసునా, మరి కొంచెం అయితే కూలిపోతావు. ఇక పద, స్నానం చేదువుగాని!"

నా గదివైపు వెళ్లబోతున్నాము, దాసి, క్షేమ, ఎదురుగావస్తున్నది. ముసుగు మూరెడు కిందికి లాగుకొని అతి వినయంతో అన్నది—"ఇన్స్పెక్టరుబాబు ఎవరినో కూడా తీసుకు వచ్చాడు, మహారాజుబాబుతో మాట్లాడాలి అంటున్నాడు."

"మహారాజుబాబు బందిపోటు దొంగా ఏమిటి, ఇన్స్పెక్టరు రాత్రింబగళ్లు అతనిని వదలకుండా పట్టుకుకూర్చున్నాడు? వెళ్లు, పో! బాబు స్నానం చేస్తున్నారు అని చెప్పు," అని అతి కోపంతో వదిన అన్నది.

"ఒక్కమారు వెళ్లి రానీ వదినా, జరూరు పని ఏదైనా ఉంటుందేమో."

"అలా' వల్లకాదు అబ్బాయి. ఛోటారాణి గంపెడు కర్జికాయలు చేసింది నిన్న, కొన్ని పంపించి ఇన్‌స్పెక్టర్‌ను ఓదార్చి ఉంటాము. అంతలో నీ స్నానంభోజనం అయిపోనీ." ఈ మాటలు అంటూ, నా రెక్కపట్టుకొని లాక్కుపోయి, స్నానాల గదిలో తోసేసి పైనుంచి గొళ్ళెం వేసేసింది.

లోపునుంచి నేనంటున్నాను—"నా తెల్లబట్టలు—"

ఇంకా నేను వాక్యం పూర్తిచేయకముందే జబాబు చెప్పింది, "అవన్నీ నేను సిద్ధంచేసి ఉంచుతాను, ఇంతలో నీ స్నానం అయిపోనీ."

ఇటువంటి జబర్‌దస్తీని ఒక పక్కకు తోసేసి నా వ్యవహారం నేను చూచుకోవడం నాకు సాధ్యంకాని పని—అది ప్రపంచంలో సులభంగా దొరికే వస్తువుకాదు. ఇన్‌స్పెక్టరు కర్జికాయలతో కడుపు నింపుకుంటూఉండనీ. పని ఒకనాడు వెనక పడితే కొంపేమీ మునిగిపోదు!

పోలీసువాళ్లు చాలా చురుకుగా పనిచేస్తున్నారు. ఈ నాలుగురోజులూ ఎవడో ఒక అమాయకుణ్ణి పట్టుకొని ఎరస్టుచేయడం, నలుగురూ మా ముందుగదిలో చేరి రోజుకు ఒక కొత్త నాటకం ఆడడం జరుగుతూ ఉంది. ఈవాళకూడా, పాపం, ఎవడో అభాగ్యుణ్ణి పట్టుకొని తీసుకువచ్చి ఉంటాడు, నాకు తెలుసును...అన్నట్టు కర్జికాయలు తనుఒక్కడే కూర్చొని తింటూఉంటాడు కాబోలు, మంచి పనే! తలుపుమీద నాలుగు గుద్దులుగుద్దాను. "తలమీద నీళ్లు పోసుకో, తలమీద!

కొంచెం పైత్యాధికంగా ఉంది, చల్లని నీళ్లు తలమీద పోసుకుంటే తగ్గుతుంది," అని పైనుంచి కేకవేసింది వదిన.

"కర్జికాయలు రెండు ప్లేట్లలతో పంపించు వదినా, ఇద్దరికోసం. ఇన్‌స్పెక్టరు తీసుకువచ్చిన దొంగే అతనికంటే అర్హుడు కావచ్చును. ఆ రెండోదానిలో జాస్తీగా వెయ్యమని చెప్పు."

సాధ్యమైనంతత్వరగా స్నానంచేసి బయటికి వచ్చాను. పైన ఉత్త నేలమీద విమల కూర్చొని ఉన్నది. ఏమిటిది, నా మునపటి విమలేనా ఈమె! ఏదీ ఆ స్వాభిమానమూ, ఆ జోరూ, ఆ గర్వమూ! ఏకొత్త కోరిక మనస్సులో పెట్టుకొని నా గుమ్మంముందర కూర్చున్నదో ?

కనబడగానే ఉలికిపడి నిలుచున్నపాటునే నిలబడిపోయినాను. విమల నన్నుచూచి లేచి ముఖం వాల్చుకొని అన్నది—"మీతో కొంచెం మాట్లాడాలి."

"పద అయితే మనగదిలోకి వెళదాము," అన్నాను నేను.

"ప్రత్యేకం ఏపనిమీదనో వెళుతున్నారేమో బయిటికి ?"

"అయినా అంతతొందరపని ఏదీ లేదు, నీతో మాట్లాడి మరీ—"

"వద్దు, మీపని ముందు అయిపోనివ్వండి, భోజనంచేసి కూర్చుందాము."

ముందు గదిలోకి వెళ్లాను. ఇన్‌స్పెక్టరుగారి పళ్లెం ఖాళీ అయిపోయింది. అతను దొంగఅని తీసుకువచ్చినఅతను మాత్రం ఇంకా తింటూ కూర్చున్నాడు.

"ఇదేమిటి ఇది, మన అమూల్య!" అని అతి ఆశ్చర్యంతో అన్నాను నేను.

"చిత్తం, నేనే!" అన్నాడు అమూల్య—నోటినిండా శర్జి కాయలు. "కడుపునిండా తిన్నాను. క్షమించండి, మిగిలిపో-యినవి రుమాలులో కట్టి తీసుకుపోతాను," అంటూ జేబులో-నుంచి రుమాలు తీసి అన్నీ కట్టాడు.

నేను ఇన్‌స్పెక్టరువైపు చూస్తూ, "ఏమిటి సంగతి?" అని అన్నాను.

ఇన్‌స్పెక్టరు నవ్వుతూ అన్నాడు—"దొంగ ఎవడో తెలియలేదు. ఆ ఇంద్రజాలం ఆలాగే ఉంటూఉండగా ఇప్పుడు చోరీమాలు అంతకంటే గొప్పఇంద్రజాలం ఒకటి తీసుకువచ్చి పెట్టింది. కాళ్లూ చేతులూ ఏమీ అందకుండా ఉన్నవి."

ఈ మాటలు అంటూ ఒక చింకిగుడ్డమూట పైకి తీసి, అది విప్పి, అందులోఉన్న నోట్లకట్ట చేతిలోపట్టుకొని అన్నాడు "ఇవిగో మీ ఆరువేలరూపాయిలు!"

"ఎక్కడ దొరికాయి?"

"ఇప్పటివరకు చెప్పగలిగినది, అమూల్యబాబు చేతిలో అని. నిన్నరాత్రి అతను మీ మేనేజరుగారిదగ్గిరికి వెళ్లి, 'ఇవిగో, మీ చోరీనోట్లు దొరికాయి,' అన్నాడు. దొంగనోట్లు

కనబడేసరికి మీ మేనేజరుకు వేసినభయం చోరీపోయినప్పుడు కూడా వెయ్యలేదు. ఈ దొంగతనం తనపనే అని అందరూ అనుమానిస్తారు అని జడిసిపోయినాడు. 'ఈ గందరగోళం చూచి కథఏమీ బాగులేదు చిక్కువచ్చేటట్టుగా ఉంది అని.కనిపెట్టి, ఒక వేదరాసి.పెద్దమ్మకథ కల్పించి చోరీరూపాయిలు దొరికాయి అంటూ, తాను దాచిఉంచిన రూపాయిలే పైకితీశాడు అంటారు' అని అతని భయం. అమూల్యబాబును ఫలహారానికి కూర్చోబెట్టి నాకు కబురుపంపాడు. తక్షణం గుర్రంఎక్కి వెళ్లాను, ప్రొద్దుటినుంచీ ఇతనిని పట్టుకొనే కూర్చున్నాను. 'రూపాయిలు ఏలాగు దొరికాయో మీకుచెప్పను,' అంటాడు. 'చెప్పకపోతే మిమ్మల్ని వదలను,' అన్నాను నేను. 'అయితే అబద్ధాలు చెప్పేస్తాను,' అంటాడు."

"సరే అబద్ధాలే చెప్పండి."

"ఒక పొదలో దొరికాయి," అన్నాడు.

"అబద్ధాలు అంతసులభం కాదు. ఆ పొద ఎక్కడో, అందులోకి మీరు వెళ్లవలసిన అవసరం ఏమి వచ్చిందో, అదంతా చెప్పవలసి ఉంటుంది," అన్నాను నేను.

"అవన్నీ కల్పించి చెప్పడానికి వ్యవధి కావలసినంత ఉంటుంది. మీకు ఆ విచారం అక్కరలేదు," అన్నాడు.

"గొప్పఇంటి పిల్లడు, పెద్దమనిషి, అలాంటి వానితో పేకుడాడితే ఏమిప్రయోజనమండీ ఇన్స్పెక్టరుగారూ!" అని నేను అన్నాను.

"పెద్దమనిషి అనడంతో సరిపోలేదు—అతని తండ్రి, నివారణ్ ఘోషూ, నేనూ ఒక్క క్లాసులో చదువుకున్నాము. సంగతేమిటో చెప్పమన్నారా మహారాజా ? తీసినవాడు ఈ వందేమాతరం కూటంవాడు ఎవడో ఇంకొకడు. ఆ పాపం తన నెత్తిమీద పెట్టుకొని వాణ్ణి రక్షిద్దామని చూస్తున్నాడు. ఇదంతా ఒక వీరత్వం." అమూల్యవైపు తిరిగి—"నాకు తెలుసును బాబూ, నాకూ నీలాగే ఒకప్పుడు పద్దెనిమిది పంథొమ్మిదేళ్లు ఉండేవి. రిపన్ కాలేజీలో చదువుతుండే వాణ్ణి. ఒకనాడుఎవడో ఎడ్లబండీవాడిని కనిస్టేబు చేతులలోనుంచి తప్పించబోయి జైలు గేటుదాకా నేనే వెళ్లవలసి వచ్చింది—అదృష్టం బాగుండి తప్పించుకున్నాను అనుకో!" నావైపు తిరిగాడు మళ్లా—"దొంగ తప్పించుకొని పారిపోవచ్చునుగాని, నాకు తెలుసును మహారాజా, దీనికి మూలకారణం ఎవరో."

"ఎవరు ?" అని నేను అడిగాను.

"మీ మేనేజరు, 'తీన్ కొడి దత్త', ఒకడూ మీ కాసిమ్ సర్దారు ఒకడూ."

ఎంతయుక్తి ఉపయోగించి తన అనుమానం స్థిరపరిచాడో అదంతా వివరంగా నాకు బోధపరిచి ఇన్‌స్పెక్టరు వెళిపోయి-నాడు. అప్పుడు అమూల్యతో అన్నాను—"రూపాయిలు ఎవరు తీశారు నాతో చెప్పు అమూల్యా, ఎవరికీ ఎటువంటి శిక్షా కాకుండా నేను చేస్తాను."

"నేనే!" అన్నాడు.

"అదేమిటి! ఆ బందిపోటుదొంగల గుంపు——"

"నేను, ఒక్కణ్ణే!"

తరవాత అమూల్య చెప్పాడు, అతిఅద్భుతంగా ఉంది ఆ కథ— మేనేజరు అప్పుడే భోజనంచేసి లేచాడు. వరండామీద నిలుచొని చెయ్యి కడుక్కుంటున్నాడు, అతి చీకటిగా ఉంది, అటువంటి సమయంలో అమూల్య దిగబడ్డాడు. రెండు జేబు-లలో రెండు పిస్తోలీలు ఒకదానిలో ఖాళీతోటాలు, రెండో దానిలో నిండుతోటాలు. అమూల్య నల్లని మారుముఖంఒకటి పెట్టుకున్నాడు; తనచేతిలోఉన్న దొంగలాంతరు తిప్పి మేనే-జరు ముఖంమీది లైటువేసి ఖాళీతోటా పేల్చేసరికి మేనేజరు హడిలిపోయి ఒక్కకేకవేసి మూర్ఛపోయినాడు. నలుగురైదు-గురు జవానులు, శబ్దం విని గాబోలు, పరుగెత్తి వచ్చారు. వాళ్లవైపు తిప్పి మరిరెండు ఖాళీతోటాలు పేల్చేసరికి ఎవడిమ-ట్టుకు వాడు పరుగెత్తి, ఎక్కడ తలుపు కనబడితే అక్కడ దూరి పోయి లోపునుంచి గడియవేసుకున్నారు. కాసిమ్ సర్దారు మాత్రం లాఠి పట్టుకువస్తున్నాడు. అతని కాలిని గురిచూచి అమూల్య రవ్వతోటా పేల్చాడు. దెబ్బతగిలి కాసిమ్ చతికిల-పడిపోయినాడు. తరవాత మేనేజరును లేవనెత్తి ఇనపపెట్టె తెరిపించి ఆరువేల రూపాయిలనోట్లూ తీసుకున్నాడు. గుర్రపు సాలలోకి వెళ్లి మంచి గుర్రంఒకటి విప్పాడు. అది ఎక్కి ఒక అయిదారుమైళ్లదూరం వెళ్లి అక్కడ ఆ గుర్రాన్ని వదిలి ఆ మర్నాడు తిరిగి వచ్చాడు. మాఇంటికి.

"ఎందుకు ఈ పని చేశావు, అమూల్యా?"

"అలాంటి అవసరం వచ్చింది."

"అయితే తిరిగి రూపాయిలు ఇచ్చేశావు ఎందుకు?"

"ఎవరి ఆజ్ఞప్రకారం అవి తిరిగి ఇచ్చేశానో వారిని పిలుచుకురండి, వారిముందర చెపుతాను."

"ఎవరు వారు?"

"ఛోటారాణీ-అక్క."

విమలకు కబురు పంపాను. తలమీాద తెల్లనిశాలువు ముసుగు వేసుకొన్నది, ఆ శాలువుతోనే ఒళ్లంతా కప్పుకొని మెల్లిగా గదిలో ప్రవేశించింది. విమల నాకంటికి ఎన్నడూ ఆలాగు కనబడలేదు. చంద్రుణ్ణి ప్రాతఃకాలపు కాంతితో కప్పి ఎవరైనా తీసుకు వస్తున్నారా అనిపించింది.

విమలకు సాష్టాంగ నమస్కారం చేశాడు అమూల్య, ఆమెపాదధూళి తీసుకున్నాడు. లేచి నిలుచొని అన్నాడు—"నీ ఆజ్ఞపాలించి వచ్చాను అక్కా, రూపాయిలు ఇచ్చేశాను."

"బ్రతికించావు నాయనా!"

"నీ స్మరణచేస్తూ ఒక్కఅబద్ధమైనా లేకుండా సాధించుకొని వచ్చాను. 'వందేమాతరం' మంత్రం నాకు మరి అక్కరలేదు, నీ పాదాలదగ్గిర పారేశాను. తిరిగి ఇక్కడికి వచ్చాక నీప్రసాదం కూడా దొరికింది."

విమలకు తిన్నగా బోధపడలేదు ఈమాట. జేబులోనుంచి రుమాలుమూట తీశాడు, ముడి విప్పి కర్జికాయలు

చూపిస్తూ, అన్నాడు—"అన్నీ తినేయలేదు అక్కా, కొంచెం ఉంచాను; నీచేతితో నువ్వే నా ఆకులో వేస్తే నీఎదుట తిందామని ఇవి తీసుకు వచ్చాను."

బోధపడ్డది. అక్కడ మరి నాఅవసరం లేదు. ఆ గది-లోనుంచి బయటికి వచ్చేశాను. నాలో నేను అనుకున్నాను— "నేను ఇవతల బోధ చేసిచేసి చస్తున్నాను, అవతల వాళ్లు నా శ్రమకు ప్రతిఫలంగా గడ్డిబొమ్మ చేసి, దానికి నా పేరుపెట్టి, దాని మెడలో పాతజోళ్లమాల వేసి నదిఒడ్డున తగలబెడుతున్నారు. చావుదారిని పోతుండేవారిలో ఒక్కమనిషినైనా నేటివరకు మంచిదారిలో పెట్టలేకపోయినాను; పెట్టగలిగేవాళ్లుమాత్రం అతి సులభంగా పెడతారు—చిన్న కనుసంజ్ఞవల్ల వాళ్లు చేయవలసినది చేయగలరు. నా వాణిలో అటువంటి అమోఘమైన సూచనాశక్తిలేదు. నేను అగ్నిశిఖను కాను, ఆరిపోయిన అగ్నిని, మసిబొగ్గును. దీపం వెలిగించే శక్తి లేదు నాలో. నా జీవితచరిత్ర అంతా దీనికి ప్రమాణమే. నేను ఒకప్రమిదల బారును, దీపాలతోరణం కాను.

మెల్లిగా నడుచుకొని అంతఃపురంలోకి తిరిగివెళ్లాను. చిన్నవదినె గదివైపు నా మనస్సు నన్ను లాగుతూఉంది అనుకుంటాను. నా జీవనం ఈ పృథ్వీమీద ఏదో ఒక్కహృదయవీణ-నైనా తనస్పర్శవల్ల నిజంగానూ స్పష్టంగానూ పల్కించగలిగింది అనే అనుభవం కలగడం నాకు ఈనాడు చాలా ఆవశ్యకం

అయింది — మన అస్తిత్వం స్థిరపరిచే ప్రమాణం మన లోపల దొరకదు, అది బయటనే దొరకాలి.

వదినెగదిముందునుంచి అలాగు వెళుతున్నాను వదినె పైకి వచ్చి అన్నది—"ఈవాళకూడా నువ్వు ఆలస్యంగానే వస్తావు అనుకున్నాను, గాని నువ్వురావడంచూచి వడ్డించేయ-మన్నాను, మరి ఆలస్యంలేదు."

"ఈ లోపున ఆ రూపాయిలు పైకితీసి సిద్ధంగా ఉంచనీ వదినా."

నా పడకగదివైపు వెళుతున్నాను, వదినె అడిగింది— "పోలీసు ఇన్‌స్పెక్టరు వచ్చిఉండెనే, చోరీసంగతి ఏమీ చెప్ప లేదూ!"

ఆ ఆరువేలూ తిరిగి రావడం కథ అంతా ఆమెతో చెప్ప బుద్ధిపుట్ట లేదు. "ఆగోడవే జరుగుతున్నది," అన్నాను.

ఇనపపెట్టెఉన్న గదిలోకి వెళ్ళి జేబులోనుంచి తాళం చెవులగుత్తి పైకి తీసి చూదును, ఇనపపెట్టెతాళమే లేదు అందులో! నా పరధ్యానం అద్భుతంగా ఉన్నదే! ప్రొద్దున్న-మొదలుపెట్టి ఇప్పటివరకూ ఆ గుత్తితో ఎన్ని పెట్టెలు తీశాను, ఎన్నిబీరువాలు తీశాను,—ఇనపపెట్టెతాళం అందులోలేదని ఇప్పటివరకూ కనిపెట్టనే లేదు!

"తాళం ఏదీ?" అన్నది వదినె.

నేనేమీ జవాబు చెప్పలేదు. ఈజేబులో తడివాను, ఆ జేబులో తడివాను, చూచినదే చూచాను పదిమార్లు. గదిలో

ఉన్నవన్నీ తిరగాబోర్లా వేశాను, వెదికాను. తాళం పోలేదు, ఎవరో రింగులోనుంచి తీసేసి ఉండవలెను అని మా ఇద్దరికీ బోధపడిపోయింది. ఎవరు తీసుకోగలరు? ఈ గదిలోకి—:

. వదినె అన్నది— "నువ్వేమీ కంగారుపడకు, ముందు భోజనం అయిపోనీ, తరవాత చూచుకుందాము. నువ్వు అజాగ్రతగా ఉంటావని ఛోటారాణి ఆ తాళంమాత్రం ప్రత్యేకంగా తనపెట్టెలో దాచిఉంటుందని నానమ్మకం."

నేనుమాత్రం చాలా గాబరాపడ్డాను. నాకు తెలియకుండా రింగులోనుంచి తాళం తీసే అలవాటు విమలకు లేదు. నా భోజనందగ్గిర విమల ఆవాళ లేదు, వంటింటినుండి అన్నం తన గదిలోకి తీసుకువెళ్లి అప్పుడే అమూల్యకు విందు చేస్తున్నది. విమలకు కబురుపంపబోయింది వదినె; నేను వద్దన్నాను.

భోజనంచేసి లేస్తున్నాను విమల వచ్చింది. ఆ తాళం గురించి వదినెముందర విమలతో వాదించడం నాకు ఇష్టంలేదు. —కాని అది మరి జరిగింది కాదు, విమలను చూస్తూనే అడిగింది, "అబ్బాయి ఇనపపెట్టెతాళం ఎక్కడుున్నదో నీకు తెలుసునే?"

. "నాదగ్గిర," అన్నది విమల.

"నేను చెప్పలేదూ"! అన్నది వదినె. "నాలుగువైపులా చోరీ దొంగతనాలూ జరుగుతున్నవి, ఛోటారాణీపైకి భయం లేనట్టు నటిస్తుంది గాని రహస్యంగాజాగ్రతపడడం మానదు."

విమలముఖం చూచేసరికి నాకు అతికష్టం అనిపించి అన్నాను— "సరే, తాళం నీదగ్గిరే ఉండనీ ప్రస్తుతం, సాయంత్రం తీదాము, రూపాయిలు."

వదినె అన్నది—"మళ్లా సాయంత్రం ఏమిటి, ఇప్పుడే తీసి ఖజాన్‌జీ దగ్గిరికి పంపించేస్తే తీరిపోతుంది."

"నేను తీశాను ఆ రూపాయిలు," అన్నది విమల.

ఉలికి పడ్డాను.

"తీసి ఎక్కడుంచావు?" అన్నది వదినె.

"కర్చు పట్టేశాను."

"ఓయి బాబు, అదేమిటే ఆమాట! అన్ని రూపాయిలు ఏలాగు కర్చుపెడతావే?"

విమల దానికి ఏమీ జబాబు చెప్పలేదు. నేనుకూడా ఏమీ అడుగలేదు. తలుపు పట్టుకొని ఏమీ అనకుండా నిలుచున్నాను. వదినె విమలతో ఏదో అనబోయింది, గాని ఆపుకున్నది. ఒక్కక్షణం ఊరుకొని నావైపు తిరిగి అన్నది— "తీసుకున్నది, మంచిపని చేసింది. నేనూ అంతే చేసేదానను— మీ అన్నయ్య పెట్టెలోనూ జేబులలోనూ ఉండే రూపాయలన్నీ ఆయనకు తెలియకుండా తీసి దాచేసేదానను—లేకపోతే అవన్నీ * 'పంచభూతాలూ' దోచుకుపోతాయి అని నాకు తెలుసును. నీ దశా రమారమి ఆలాగే అయింది అబ్బాయి, ఆఖరికి! ఎన్ని తమాషాతమాషా కర్చులు తెలుసును మీ మొగ-

* ఆశ్రయించుకొని ఉన్న నానారకాల మనుష్యులు.

వాళ్లకు! మేము దొంగలాడితేనే మీకు రూపాయిలు మిగ-
లాలిగాని ఇంకొక మార్గం లేదు. ఇక పదఅమ్మా, కొంచెం
పడుకొని వద్దువుగాని, పద!"

నన్ను నా గదిలోకి తీసుకువెళ్లింది వదిన, గాని నా
ఒంటిమీద ఏమో తెలివి లేదు, ఎక్కడికో వెళుతున్నానుఅనే
జ్ఞానమైనా లేదు. గదిలోకి వెళ్లాము. నేను పరువుమీద పడు-
కున్నాను, వదినె నా పక్కను కూర్చొని నవ్వుతూ విమలను,
"రెండు తమలపాకులు ఇయ్యవే తల్లీ, ఛూటూ!" అని
అడిగింది—"ఏమిటే! నీగదిలో ఆకులు లేనే లేవా! దొరసానివి
అయిపోయినావు పూర్తిగా! పోనీ నా గదిలోనుంచిఅయినా
తెచ్చి ఇయ్యి."

"వదినా, నువ్వు ఇంకా భోజనంచేయలేదు!" అని
అన్నాను.

"ఎంతసేపు అయింది నేను భోజనం చేసి!" అన్నది.
కాని ఉత్త అబద్ధం.

నా పక్కను కూర్చొని వదినె ఒకటే వరసను నోటికి
వచ్చినదంతా చెపుతున్నది—ఒకదేశంగురించీ ఒకమనిషిగురించీ
అని కాదు—ఆమె చెప్పనిదొంగమాట లేదు. దాసీది వచ్చి
అవతలనుంచి విమలకు వడ్డించేశారు భోజనం చల్లారిపోతున్నది
అని అన్నది. విమల వినిపించుకో లేదు. వదినె అన్నది—
"అదేమిటే, ఇంకా భోజనం లేదూ, ఇంత ఆలస్యం అయి-

పోతే!" అలాగు అంటూ విమలను బలవంతాన రెక్క-పట్టుకొని ఈడ్చుకుపోయింది.

ట్రెజరీలో చోరీపోయిన ఆరువేలకూ ఇనపపెట్టెలో-నుంచి తీసిన ఆరువేలకూ ఏదో సంబంధం ఉన్నదని నాకు బోధపడ్డది. ఎటువంటిసంబంధమో తెలుసుకుందామని నాకు బుద్ధిపుట్టలేదు; దానిగురించి నేను ఎన్నడూ అడగను.

భగవంతుడు మన జీవనపత్రము వ్రాసినప్పుడు ఏవో ముఖ్యమైనవి నాలుగుగీతలు మాత్రం కనబడీకనబడనట్టు వ్రాసి వదిలేస్తాడు. మనజ్ఞానం వినియోగించి ఆ పత్రాన్ని మన రుచిని అనుసరించి, అవసరంవచ్చినచోట చెరిపి కొత్తగా వ్రాసి, అవస-రంఉన్నంత వివరమునుఇచ్చి స్పష్టంగా కనబడే బొమ్మగా చేయవలెనని విధాత అభిప్రాయము. ఈశ్వరునిసూచన సహాయంగా తీసుకొని నా జీవనాన్ని నేనే నిర్మించవలెను అని చిన్నప్పటినుండీ నా కోరిక. నా జీవనంలో ప్రతిచిన్నవిషయం-లోనూ గొప్పఉద్దేశం ఒకటి వ్యక్తపడుతూ ఉండవలెనని నా దీక్ష.

ఈసాధనలోనే ఇంతకాలమూ గడిపాను. నా వాంఛ లను ఎంత అణిచిపెట్టి ఉంచానో, ప్రతిక్షణమూ నా మన-స్సును ఎంతజాగ్రత్తతో నడిపించుకొని వచ్చానో, అది నా ఆంతరంగిక చరిత్ర. నా అంతర్యామికి తప్ప మరెవరికీ అది పూర్తిగా తెలియదు.

కాని ఒక్క చిక్కు ఉన్నది—మన జీవనం పూర్తిగా మన ఒక్కరిదే కాదు; గనుక సృష్టిచేసేవారు తమ పరిసరాల సహాయంతో చేయవలెను, లేనియడల అంతా వృథా ప్రయాసం అవుతుంది. అందుచేత నన్ను నేను సృష్టించుకోవడంఅనే పనిలోకి విమలనుకూడా లాగవలెనని నేను అంత పట్టుతో ప్రయత్నించాను. ఎటువంటి శక్తివంచనా లేకుండా సంపూర్ణ హృదయంతో ఆమెను ప్రేమించినప్పుడు జయం ఎందుకు కలగదు, తప్పక కలిగితీరుతుంది, అని అనుకొనేవాడను.

కాని త్వరలో ఒకసంగతి కనిపెట్టాను. అది ఏమిటి అంటే—తమతోపాటు తమ పరిసరాలను సులభంగా సృష్టి-చేయగలవారు ప్రత్యేకం ఒక తెగవారు, నేను ఆ తెగలోని వాడను కాను. దీక్ష పుచ్చుకోవడమే నాకు చేతనైనపని గాని దీక్ష ఇవ్వడం నాకు చేతకానిపని. జీవనావేగము నేను గ్రహిం-చగలిగాను గాని అది ఇంకొకరికి పొందించలేక పోయినాను —నా సర్వమునూ ఎవరికి ధారపోసేశానో వారైనా, అంతరతమమైన ఆ ఒక్క వస్తువు తప్ప మిగతాదంతా తీసుకో గలి-గారు.

నా పరీక్ష మహా కష్టమయినది. ఎక్కడ నాకు సహాయం అతి ఆవశ్యకమో అక్కడే నేను కేవలం ఏకాకిని అయిపో-యినాను. ఈ పరీక్షలోకూడా ఉత్తీర్ణుడను కావలెను. అదీ నా దీక్ష. నా దారి దుర్గమము. నేను ఒంటరినిఅయినా ఆదారినే పోతాను. నాది కొంతవరకు బలంప్రయోగించే

స్వభావం అని నాకు ఇప్పుడు సందేహం కలుగుతున్నది. నాకు విమలతో గల సంబంధాన్ని మిక్కిలి కఠినమైన మంచితనంతో నింపి, అచ్చులో పోసి తయారుచేసినదానివలె, ఎటువంటి లోపమూ లేని దానిగా, చేయవలెనని ఒక మూర్ఖపట్టు నాలో ఉండెను. అయితే, మన జీవనం అచ్చులో పోస్తే అయే వస్తువు కాదు. అది ఒక జడపదార్థం అనుకొని దానితో 'మంచిది' అనదగినదానిని నా ఇచ్ఛానుసారం నిర్మించబోతే అది మనమీద పగతీర్చుకుంటుంది—చచ్చిఊరుకుంటుంది! మా ఇద్దరికీ మధ్యను లోలోపున పెరుగుతూ వచ్చిన ఎడబాటుకు కారణం నేను ప్రయోగించిన జులూమే అని ఇప్పుడు తెలుస్తున్నది, గాని ప్రయోగిస్తూ ఉన్నంతకాలం ఎన్నడూ అది నాకు తట్టలేదు. మీదినుండి నేను ప్రయోగిస్తూఉండే బలాన్ని అతిక్రమించి లోపునఉన్న 'తన'కు వికాసము నిచ్చుకోగలిగే శక్తి విమలలో లేదు. కనుక ఆ బద్ధజీవనం రాత్రింబగళ్లు లోలోపున పనిచేసి అడుగునఉన్న గట్లను కోసేసింది. తనకు కావలసినది నాతో స్పష్టంగా చెప్పలేకపోయింది; తనహక్కులు బహిరంగంగా తెలుపలేకపోయింది. కొన్నివిషయాలలో మాలోమాకు భయంకరమైన మతభేదం ఉన్నదని ఆమె ఎరుగును, అందుచేతనే ఆ ఆరువేలూ నాకు తెలియకుండా తాను తియ్యవలసి వచ్చింది. ఐడియాలను పూజిస్తూ ఒకేపట్టు పట్టి కూర్చుండే నాలాంటివాళ్లతో, కలిసేవారికి బాగా కలుస్తుంది, కలియనివాళ్లుమాత్రం మోసపుచ్చి తమ పని

సాధించుకుంటారు. మేము సరళస్వభావాలను కూడా కపటమైనవిగా చేసేస్తాము. సంపూర్ణ సహధర్మచారిణిని తయారు చేదామని బయలుదేరి ఉండే సామాన్య భార్యాను కూడా పోగొట్టు కుంటాము.

మొట్ట మొదటికి తిరిగి వెళ్లడానికి వీలులేదూ ? వీలయితే మాత్రం ఈమాటు సరళమూ సహజమూ అయిన దారినే వెళతాను. నా సహచారిణిని ఈమారు భావాలగొలుసులతో కట్టడానికి ప్రయత్నించను. నా ప్రేమవీణను పాడిస్తూ అంటాను, "నీకు నామీద ప్రేమ ఉన్నది, దాని కాంతిసహాయంవల్ల నీ నిజ స్వరూపం పూర్ణవికాసం పొందేటట్టు చేయి. నా భావాలను తొక్కిపెట్టి ఉంచి, నీలోఉన్న ఈశ్వరేచ్ఛకు జయం కలిగించు; నాఇచ్ఛను మన్నించకు, అది సిగ్గు పడి వెనకకు తిరిగి పోనీ!"

మాలోని ఎడబాటు ఇంత కాలమూ లోలోపున విస్తరించింది, చివరకు భయంకరమైన గాయంరూపంగా బయటకి వచ్చేసింది. ఎంత దయతో సంరక్షణచేసే ప్రకృతిఅయినా దానిని ఇప్పుడు మాన్పగలదూ? ఏకప్పుకిందను ఉండి ప్రకృతి మన గాయాలను మాన్పుతుంటుందో ఆ కప్పు పూర్తిగా చెరిగిపోయింది. గాయాన్ని కప్పి, కట్టుకట్టి ఉంచాలి. ఈ గాయాన్ని నా ప్రేమతో కప్పి, కట్టుకట్టి ఉంచుతాను. నా హృదయాన్ని పొరలుపొరలుగా ఆ గాయంమీద వేసి పైస్పర్శ తగలి బాధించకుండా కాపాడుతాను. చివరకు ఏమీ ఆనవాలైనా లేకుండా నా గాయము మానిపోతుందని ఆశపడుతున్నది.

కాని అంత వ్యవధి ఉన్నదీ? ఆహా! తప్పుతోవలో పడ్డానని తెలుసుకోవడంలో ఎంత కాలం పాడుచేశాను! ఇప్పటికి పొరపాటు పోల్చుకోవడం అయింది. ఇక అది దిద్దుకోవడం ఎన్నాళ్లు పడుతుందో! చివరకు దెబ్బకూడా మానవచ్చు, గాని కలిగిన నష్టం ఎప్పటికీ ఆలాగు ఉండవలసినదే గాబోలు!

ఏదో డబ్‌మని శబ్దం అయింది, తిరిగి చూచాను. విమల తలుపు దగ్గరనుండి తిరిగి వెళిపోతున్నది. బహుశా తలుపుదగ్గిరికి వచ్చి ఇంతసేపూ నిలుచొని ఉంటుంది—లోపలికి వద్దామా లేదా అని ఆలోచించిఆలోచించి చివరకు తిరిగి వెళిపోతున్నది. నేను చప్పున లేచి వెళ్లి 'విమలా' అన్నాను. విని విమల నిలబడ్డది. ఆమెవీపు నావైపు ఉన్నది. దగ్గిరికి వెళ్లి చెయ్యి పట్టుకొని గదిలోకి తీసుకువచ్చాను.

గదిలోకి వస్తూనే, గచ్చుమీద పడిపోయి తలగడమీద ముఖం పెట్టుకొని ఏడవడం మొదలుపెట్టింది. నేను ఏమీ అన లేదు, విమల చెయ్యి పట్టుకొని ఆమెతలదగ్గిర కూర్చున్నాను.

ఏడుపు జోరు కొంచెం తగ్గి లేచి కూర్చున్నది. తరవాత ఆమెను నాగుండెదగ్గిరికి తెచ్చుకుందామని ప్రయత్నంచేశాను. జోరుగా చెయ్యి లాక్కొని మోకాళ్లమీద వంగి తలతో నా కాళ్లు అద్దుకున్నది. అనేకసార్లు అద్దుకున్నది. నేను పాదాలు లాగేయబోతే తన రెండుచేతులతో వాటిని గట్టిగా పట్టుకొని గద్గదస్వరంతో అన్నది—"వద్దు, వద్దు, వద్దు, పాదాలు తీసుకోకండి, నన్ను పూజచేయనివ్వండి."

నేను ఇక మరి మాట్లాడలేదు. ఆ పూజ నిషేధించడానికి నేను ఎవర్ని ? నిజమైన పూజ ఉండేచోట ఉన్న దేవతకూడా నిజమే! ఆ ధేవతను నేను కానే—పూజను నేను ఏలాగు, ఆపు-చేయగలను?

లే! లే! ప్రేమతరంగిణి భక్తిసాగరంలో కలిసే కూడలివద్దకు పోదాము పద! బయలుదేరడానికి ఇదే వేళ—ఇకను లే! అక్కడ ఆ అడుగందని నిర్మలనీలిమలో నీ పంకభారమంతా ములిగిపోతుంది.

ఇక నాకు భయంలేదు. నన్నుచూచీ భయపడను, పై-వాళ్లనుచూచీ భయపడను. అగ్నిపరీక్ష అయింది నాకు, నాలో కాలిపోవలసినదేదిఉన్నదో అది కాలి బూడిదయిపో-యింది. మిగిలినది చావులేనిది. నా సకల అపరాధాలూ తనహృదయవేదనలో ఎవరు దాచేసి ఉంచగలిగారో ఆయన పాదాలకు ఆ చావులేని నన్ను సమర్పిస్తున్నాను.

ఈ రాత్రి మేము కలకత్తా వెళతాము. లోపునా పైనా వ్యాపించి ఉన్న ఆందోళనవల్ల ఇప్పటివరకు సామాను సరుదుకోవడం వైపు మనస్సువెళ్లనేలేదు. ఇప్పుడు ఈపెట్టె ఆపెట్టె సరదడం మొదలుపెట్టాను. ఒక్క నిమిషం అయాక చూదును, ఆయనకూడా నాపక్కను ఇవీ అవీ సరుదుతూ సిద్ధం అయినారు.

"అలాగు వల్లపడదు, మీరు వెళ్లండి—నిద్రపోతానని మాట ఇచ్చారు, వెళ్లి పడుకోండి," అన్నాను.

"నేను మాటఇచ్చాను నిజమే, గాని నా నిద్ర మాట ఇవ్వలేదు— అసలు అది కనబడితేనా !"

" అదంతా పనికిరాదు, మీరు వెళ్లి నిద్రపోవాలి."

"ఇదంతా నువ్వు ఒక్కర్తివే చేయలేవు," అన్నారు.

"ఓ, ప్రశస్తంగా చేయగలను."

"నేను లేకపోయినా జరిగిపోతుంది అని నువ్వు గర్వ పడుతూ చెప్పగలవు గాని నాకు ఒకక్షణం గడవదు నువ్వు లేనిదే. ఆఖరుకు నిద్రకూడా వచ్చింది కాదు ఆ గదిలో ఒంటరిగా ఉంటే."

అంతలో నౌకరు వచ్చి అన్నాడు, "సందీప్‌బాబుగారు వచ్చారు. మీతో చెప్పమన్నారు."

ఎవరితో చెప్పమన్నారు అని అడిగేపాటి ధైర్యం నాకు లేకపోయింది. ఆకాశాన్ని ఉన్న కాంతిఅంతా ఒక్క క్షణంలో నిద్రభంగిఆకులలాగు మూసుకు పోయింది.

"పద విమలా, సందీప్ ఏమిటంటాడో వినివద్దాము. సెలవుపుచ్చుకొని వెళిపోయినవాడు తిరిగి వచ్చాడు, ఏదో ముఖ్యమైన సంగతి ఉండాలి."

వెళ్లడంకంటే వెళ్లకపోవడమే విస్తారం సిగ్గు అనిపించింది, అందుచేత ఆయనతో కలిసి బయటికివెళ్లాను. గోడను వేలగట్టిన పటం చూస్తూ సందీప్ మా ముందుగదిలో నిలుచున్నాడు. మమ్మల్ని చూడగానే అన్నాడు—"వీడేమిటి, తిరిగి వచ్చాడు అని గాబోలు మీరు అనుకుంటున్నారు! సంస్కారం

పూర్తిఅయితేనే గాని ప్రేత శెలవు పుచ్చుకోదు, ఆ సంగతి మీాకు తెలుసును."

ఈలాగు అంటూ శాలువులోనుంచి చిన్న రుమాలు మూట ఒకటి పైకితీసి విప్పి టేబిలుమీాద పెట్టాడు. ఆకాసులు అవి. సందీప్ అన్నాడు, "పొరపాటు పడకు నిఖిల్. నీ సంపర్కంవల్ల హఠాత్తుగా సాధువు అయిపోయినానుఅని అనుకోకు. పశ్చాత్తాపంతో కన్నీళ్లు కార్చుకుంటూ ఈ ఆరువేలరూపాయిల కాసులూ తిరిగి నీకు అప్పజెప్పడానికివచ్చేమోస్తరు మనిషి-కాదు సందీప్; గాని—"

వాక్యం పూర్తి చేయలేదు. కొంచెంసేపు ఊరుకొని నావైపు చూస్తూ అన్నాడు—"సందీప్‌యొక్క నిర్మలజీవనంలోకి ఇన్నాళ్లకు ఎక్కడినుండో వచ్చి ఒక చిన్న 'గాని' దూరింది, రాణీ! ప్రతిరాత్రీ మూాడు ఘంటలు అప్రాంతాలకు లేచి దానితో భయంకరమైన యుద్ధం చేయవలసివస్తూఉంది. అది ఒక మాయగాని భ్రమగాని కాదు. దానికి బాకీ ఉన్నది ఇవ్వక సందీప్‌కైనా నిష్కృతి లేదు. ఆ వినాశకారిణి, ఆ'గాని' చేతికి నాఅర్ఘ్యము అందజేసి పోతాను. దేవీ, ప్రపంచంలో ఒక్కనీధనంమాత్రం నేను తీసుకోలేను, బ్రహ్మాండమైన ప్రయత్నంచేశాను, నెగ్గలేక పోయినాను. సమస్తమూా నీదగ్గిర అప్పజెప్పనిదే నాకు సెలవు దొరకదు, ఇదుగో దేవీ, ఇది ప్రతిగ్రహించు."

అంటూ ఆ వస్తువులపెట్టెకూడా పైకి తీశాడు. టేబిలు మీద పెట్టి చప్పున తిరిగి వెళిపోబోతుంటే ఈయన సందీప్‌ను పిలిచి అన్నారు—"ఇదిగో, ఇది విని వెళ్లు, సందీప్!".

తలుపుదగ్గిర తిరిగి నిలబడి సందీప్ అన్నాడు—"నాకు వ్యవధి లేదు, నిఖిల్. నేను ఒక అమూల్యరత్నాన్ని అని సాయిబులు కనిపెట్టి నన్ను లూటీచేసి వాళ్ల మసీదులో పాతే-పెట్టి నన్ను శాశ్వతంగా ఉంచుకోవలెనని చూస్తున్నారట. కాని నేను బ్రతికిఉండడం అవసరం. ఉత్తరాదివెళ్లే బండికి పాతికమినిట్లుమాత్రం వ్యవధి ఉన్నది, గనుక వెంటనే వెళిపో-వాలి. తరవాత కొంచెం వీలుకాగానే మిమ్మల్ని కలుసుకొని చెప్పవలసినదంతా పూర్తిగా చెపుతాను. నా సలహా లక్ష్యపెట్టే వాళ్లుఅయితే ఆలస్యం చేయకుండా మీరుకూడా వెళిపొండి. రాణీ, నమస్కారం! వందే ప్రళయరూపిణీం హృత్పిండ మాలినీం!"

అంటూనే సందీప్ ఒక్కపరుగు వేశాడు. నేను నిశ్చేష్టు-రాలనయి చూస్తున్నాను. కాసులూ, నగలూ, ఇప్పుడు కన-బడ్డంత తుచ్ఛమైన వస్తువులుగా ఇంతకు ముందు ఎన్నడూ కన-బడలేదు. ఒక్కక్షణంముందు ఏఏసామాను తీసుకొని వెళ-దాము, ఎందులో సరుదుదాము, అని ఆలోచిస్తుంటిని, ఇప్పుడు ఏవీ తీసుకువెళ్లడం అవసరం లేదు, బయిటికి వెళ్లడం ఒక్కటే చేయవలసిన పని అనిపించింది.

ఆయన కుర్చీమీదనుంచి లేచి నాదగ్గిరికి వచ్చి నా చెయ్యి పట్టుకొని మెల్లిగా అన్నారు—"ఇక వేళ అట్టేలేదు, మనము అంతా సిద్ధం చేసుకోవాలి."

అంతలో చంద్రనాథ్ బాబు గదిలోకి వచ్చారు. గదిలో నన్ను చూచి కొంచెం సంకోచించి అన్నారు, "క్షమించాలి అమ్మా, ముందుగా కబురుపంపి రానందుకు. నిఖిల్, సాయిబుల వ్యవహారం చాలా ఘోరంగా ఉన్నది. హరిశ్ కుండుగారి ట్రెజరీ లూటీ చేశారు; దానికి అంతగా విచారించ నక్కర-లేదు. కాని ఆడవాళ్లను అవమానపరచ మొదలుపెట్టారట, ప్రాణం ఉంటూఉండగా అటువంటి పనులు సహించి ఊరు-కోవడం ఏలాగు?"

"అయితే నేను అక్కడికి వెళుతున్నాను," అన్నారు నా భర్త.

"అక్కడికి వెళ్లి మీరు ఏమి చేయగలరు?" అని ఆయన చెయ్యి పట్టుకొని నేను అన్నాను—"వెళ్లవద్దని చెప్పండి మాస్టరుగారూ."

"ఆపేవేళ కాదు తల్లీ, ఇది," అని మాస్టరుగారు అన్నారు.

"నువ్వేమీ భయపడకు విమలా!" అంటూ, ఆయన వెళిపోయినారు.

రెండు మినిట్లు ఇంకా అయిందో లేదో, కిటికీలోనుంచి

చూచాను—ఆయన గుర్రంమీద ఎక్కి గ్యాలపు వెళిపోతు-న్నారు, చేతిలో ఎటువంటి అస్త్రమూ ఉన్నట్టులేదు.

అప్పుడే తోటికోడలు గదిలోకి పరుగెత్తుకువచ్చి అన్నది—"ఎంతపని చేశావే ఛూటూ, నా కొంప ముంచే-శావు, అబ్బాయిని ఎందుకు వదిలావే?" నౌకరును పిలిచి, "పరుగెత్తి వెళ్లి దివాన్‌జీని పిలుచుకురా," అన్నది. ఇప్పటివరకు ఎన్నడూ ఆమె దివాన్‌జీ ఎదుటపడలేదు, గాని ఈనాడు ఆమెకు సిగ్గుఏమీ లేకపోయింది. ఆయన రాగానే, "మహారాజావారిని తిరిగి వచ్చేయమని గుర్రంమీద ఎవరినైనా పంపండి," అని అన్నది.

దివాన్‌జీ అన్నారు, "మేము చాలాదూరం చెప్పాము; ఆయన తిరిగిరాగు మహారాణీ."

"రెండో రాణికి కలరా వచ్చింది చచ్చిపోతున్నది అని కబురుపంపండి," అన్నది తోటికోడలు.

దివాన్‌జీ వెళిపోయినారు. ఆమె నావైపు తిరిగి తిట్లు తిట్టడం ప్రారంభించింది—నోటికివచ్చిన మాటలన్నీ అన్నది—"రాక్షసి, పిశాచి, మరిడి," అన్నది. "నువ్వు చచ్చావు కావు, మా అబ్బాయిని మృత్యుముఖాన వేసేశావు."

సాయంకాలం అయిపోతూ ఉన్నది, వెలుతురు తగ్గుతు-న్నది. పశ్చిమంవైపు ఉన్న కిటికీలోనుంచి ధూరావడున్న ఆకాశం కనబడుతున్నది. గొల్లపల్లెలోని మునగచెట్టువెనక

సూర్యుడు మునిగి పోయినాడు. ఆ అస్తమిస్తున్న సూర్యుని-కిరణాలు నాకు కళ్లకుకట్టినట్టు ఇప్పటికీ కనబడుతున్నవి. మునిగి పోతున్న సూర్యునిఎర్రబింబాన్ని మధ్యపెట్టి, రెండు పెద్ద మేఘాలు ఉత్తరదక్షిణాలకు వ్యాపించి, ఆ పశ్చిమాకాశమంతా నింపేశాయి. ఇప్పుడు ముగిసిపోయిన దినమే ఒకపక్షిఅయి తన అగ్నిరెక్కలతో ఆకాశాన్ని నింపుతూ రాత్రి అనే సముద్రాన్ని దాటి పారిపోడానికి ప్రయత్నంచేస్తున్నదా అనిపించింది.

చీకటిపడ్డది. దూరాన్న ఏదైనా ఊరు తగలబడుతుంటే ఉండుండి అగ్నిజ్వాలలు లేచి ఆకాశాన్ని నింపుతున్నట్టుగా ఆ అంధకారంలో బహు దూరంనుంచి ఉండుండి ఒక కలరవం వస్తున్నది.

దేవాలయంలో శంఖనాదము వినబడుతున్నది, జేగంట వాగుతున్నది—సంధ్యహారతివేళ. తోటికోడలు ఇప్పుడు దేవాలయంలో చేతులుజోడించుకొని కూర్చున్నది, నాకు తెలుసును. రోడ్డువైపునఉన్న కిటికీ వదిలి ఒక్క అడుగు వేయలేకుండా ఉన్నాను. ముందుకు కనబడేరోడ్డూ, ఎదుటనున్నపల్లే, ఆ పైనున్న బయలూ, దాని పక్కనున్న వృక్షరేఖా, అన్నీ క్రమక్రమంగా అదృశ్యం అయిపోయినవి. మా నగరులోని పెద్ద చెరువు గుడ్డివానికళ్లలాగు నిస్తేజంగా ఆకాశంవైపు చూస్తున్నది. ఎడమపక్కను సింహద్వారంమీదనున్న బురుజు మెడచాచి దూరాన జరుగుతున్న దేదో చూస్తున్నట్టు కనబడుతున్నది.

రాత్రివేళ అనేక విధాల వేషాలతో శబ్దం వస్తూ ఉంటుంది. దగ్గిరఉండే చెట్టుకొమ్మ విరిగి పడేసరికి దూరాన ఎవరో గబగబ పరుగెత్తి పారిపోతున్నా కనిపిస్తుంది. గాలికి తలుపు దబ్ దబ్ మని కొట్టుకుంటుంటే ఏమిటి ఈ భయంకరమైన శబ్దం, పృథ్వీమధ్యనుండు గుండె కొట్టుకుంటున్నదా అనిపిస్తుంది.

దూరాన నల్లని చెట్ల వరసలకింద రోడ్డుమీద దీపాలు ఒక్కమారు మిణుకు మని అదృశ్యం అయిపోతున్నవి. మధ్య మధ్య గుర్రపుడెక్కల శబ్దం వినబడుతున్నది—నగరునుంచి గుర్రపురౌతులు అప్పుడప్పుడు బయటికి వెళుతున్నారు.

నేను చచ్చిపోగలిగితే అన్నివిపత్తులూ అంతం అయి-పోతాయి అని మాటిమాటికీ మనస్సుకు తడుతుండేది. నేను బ్రతికి ఉన్నన్నాళ్లూ నా పాపం అన్నివైపులా వ్యాపిస్తూ అందరినీ నాశనం చేస్తుంటుంది. నా పెట్టెలోనున్న పిస్తోలీమాట జ్ఞప్తికి వచ్చింది, గాని ఆ దారిపక్కనున్న కిటికీ వదిలి కాలుకదపలేక పోయినాను... నా అదృష్టం ఏమవుతుందో అని కదా నేను అక్కడ కనిపెట్టుకున్నది!

దేవిడీలో డంగ్, డంగ్, మని పది ఘంటలు కొట్టారు.

మరి కొంచెంసేపటికి రోడ్డుమీద దీపాలూ, గొప్పజన సమూహమూ, కనబడ్డవి. ఆ చీకటిలో ఆ జన సమూహం అంతా ఒక్కటయి, రాజద్వారంలో ప్రవేశించడానికి వస్తున్న ఒక భయంకరమైన నల్లతాచా అనిపించింది.

మనుష్యులు వస్తూఉన్న శబ్దం విని దివాన్‌జీ సింహ-ద్వారందగ్గిరికి పరుగెత్తి వెళ్లారు. అప్పుడే ఒక గుర్రపురౌతు వచ్చాడు. "జటాధర్, ఏమిటి సమాచారం?" అని దివాన్‌జీ అడిగారు.

"ఏమని చెప్పమన్నారు! అంతా అశుభమే!"

మీదినుంచి ప్రతిమాటా వినబడ్డది.

తరువాత గుసగుసలాడుతూ ఏదో మాట్లాడారు, ఏమీ వినబడలేదు.

పల్లకీ ఒకటీ, డోలీ ఒకటీ, ద్వారంలోకి వచ్చాయి. పల్లకీ పక్కనే డాక్టరుగారు నడుస్తున్నారు. "ఏలాగు ఉన్నదండీ డాక్టరుగారూ?" అని దివాన్‌జీ అడిగారు.

"చెప్పడం కష్టం. తలకు తగిలిన దెబ్బ చాలా ప్రమాద-మైనది."

"అమూల్య బాబు?"

"ఇంకేమి అమూల్యబాబు! గుండెలోనుంచి గుండు వెళిపోయింది!"

సమాప్తము

చిన్నపురి: 'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.

# విశ్వభారతి గ్రంథమాల

(తెలుగు)

రవీంద్రనాథ ఠాకూర్ గారి గ్రంథాలకూ, మనదేశంలో

ఉండే ఇతర సుప్రసిద్ధ కవుల గ్రంథాలకూ,

జగద్విఖ్యాతులైన ఇతరదేశ కవుల

గ్రంథాలకూ అనువాదములు.

విశ్వభారతి ఏజన్సీ

3-83 తిరువత్తూరు హైరోడ్

తండయార్‌పేట మద్రాసు

# విశ్వభారతి గ్రంథమాల

1 రవీంద్రనాథ ఠాకూర్ గారి

"గృహప్రవేశం" (నాటకం)

(ఇందులో ఠాకూర్ గారి పటమూ, వేరే

మరిఒక పటమూ ఉన్నవి.) ౦-౧౨-౦

2 రవీంద్రనాథ ఠాకూర్ గారి

"పోస్టాఫీస్" (నాటకం)

(ఇందులో ఒక పటము ఉన్నది.) ౦-౧౦-౦

3 మేతర్ లింక్ గారి

"స్తిల్ మాంద్ మేజస్ట్రేట్" (నాటకం)

(మేతర్ లింక్ గారి పటము ఉన్నది.) ౧-౦-౦

4 రవీంద్రనాథ ఠాకూర్ గారి

"ఇంటా బయటా" (నవల) 3-౦-౦

క్రౌన్ ౧౬ సైజు; మంచి కాగితముపైని చక్కనిఅచ్చు;

మంచి బైండు.

# గృహప్రవేశం

ప్రేమతో నిండిఉన్న పూర్ణజీవనాన్వేషణము మనలో పురికొల్పడానికీ, దానికి తగిన ఉత్సాహము మనలో పుట్టించడానికీ, విశ్వహృదయం, ఠాకూర్ గారు వ్రాసిన ఈ నాటకంలో, అక్కబిడ్డలకు తన సర్వమునూ అర్పించి తనజీవనం సార్థక పరుచుకొన కోరుతున్న పిన్ని హృదయంద్వారా వ్యక్తమవుతున్నది. బాహ్యచక్షువుకు కనబడని సంపదకోసమూ సహవాసలాభంకోసమూ మనుష్యుడు తన యావదాస్తీ ధారపోసి ప్రయత్నం చేస్తున్నప్పుడు, అటువంటి పిన్ని హృదయం, పూర్తిగా స్వార్థరహితమైనది కావడంచేత, వివేకం బోధపరచడానికి బయలుదేరదు; తన చేతనైనంతవరకు ఆ ప్రయత్నంలో తోడ్పడుతుంది.

అక్కకొడుకు తన డబ్బంతా ఖర్చుపెట్టి ఊర్వసివంటి తనభార్య, మణి, యెడల తనకుగల అనురాగము ఎల్లకాలమూ లోకానికి చాటించగలిగే "తాజ్‌మహాల్"ను కట్టించబోయినప్పుడు, అది కేవలం వృథాప్రయాస అని తెలిసినా, మనస్ఫూర్తిగాచేసే ఏప్రయత్నమూ వృథాకానేరదు అని నమ్మి పిన్ని చేసిన హెచ్చరిక అతి మనోహరమైనది.

పూర్తికాని ఆ తాజ్‌మహాల్‌లో గృహప్రవేశం చేయిం-చబోయిన పిన్ని హృదయాన్ని మన హృదయాలలో గృహప్రవేశం చేయించి,షాజహాన్‌చక్రవర్తి కట్టించిన తాజ్‌మహాళ్లు ఎన్నైనా ఇవ్వలేని శాశ్వతపదవిని ఆ పిన్ని హృదయానికి ఈ నాటకం ద్వారా ఠాకూర్ గారు ఇచ్చారు.

# పోస్టాఫీస్

మనుష్యుడు ప్రయోగిస్తూఉన్న శిశువల్ల లోపునఉన్న జీవనావేగం పూర్తిగా చల్లారని చిన్నపిల్లడు చేసే పనులవల్లా, కోరే కోరికలవల్లా, కనపరిచే అనురాగంవల్లా, పూర్ణవికాసం పొందిన జీవనం ఏరీతిగా ఉంటుందో సూచించే నాటకం.

ఇంపైన కథ చెపుతూ మన మనస్సులను వేదనతో నింపి, ఆవేదనద్వారా ముక్తజీవనం సంపాదించడానికి చేయ-...న ప్రయత్నం మనలో పురికొల్పేశక్తి రవీంద్రునిలో చాలా ...ది. ఆ శక్తి ఈ నాటకంలో అతి మనోహరంగా వెల్లడి వుతున్నది.

